## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరవిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120002355

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# వ్యాస పీఠం

ఆరుద్ర వ్యాఖ్య




న్యూస్టూడెంట్స్ బుక్ సెంటర్
ఏలూరురోడ్, విజయవాడ-2
ఫోన్స్: 74677 * 62222

# విషయసూచిక

—o—

# అశోకుడూ - ఆడవాళ్ళూ

అశోకుని సువిశాల సామ్రాజ్యంలో ఆంధ్రదేశం ఒక భాగం. రాజు దేవానం ప్రియుడు. ప్రియదర్శి అశోకుని రాజ్య కాలం క్రీస్తు పూర్వం 273 నుంచి 236 అని చరిత్రకారులు నిర్ణయించారు. క్రీస్తు పూర్వం మూడవ దశాబ్దం నుంచి ఆంధ్రుల చరిత్రను మనం నిక్షేపంగా చెప్పుకోవచ్చు.

అశోకుడు తన సామ్రాజ్యాన్ని నాలుగు రాష్ట్రాలుగావిభజించాడు. ఒక్కొక్క రాష్ట్రానికి ఒక ముఖ్యపట్నం వుంది. పశ్చిమోత్తరంలో గాంధార రాష్ట్రానికి తక్షశిల రాజధాని. కళింగ రాష్ట్రానికి తోసలి ముఖ్య పట్నం. పశ్చిమభారతానికి ఉజ్జయిని ప్రధాన నగరం. దక్షిణ భారతం లోని ఆంధ్ర రాష్ట్రానికి సువర్ణ గిరి రాజధాని.

ఇప్పటికీ మన రాష్ట్రంలో ఆ నగరం లేకపోలేదు. అయితే ఇప్పుడు అది నగరం కాదు, గ్రామం. సువర్ణగిరి అనేపేరు సొర్ణగిరి, సొన్నగిరిగా మారి నేటికి జొన్నగిరి అనే పేరుతో పాత ప్రసిద్ధ నామా నికి ప్రతి ధ్వనిగా మిగిలింది. ఈ జొన్నగిరి దగ్గర ఎర్రగుడి అనే మరో గ్రామం వుంది. ఇక్కడే జొన్నగిరి ప్రాచీన రాజధాని నగరమని రుజువు చేసే సాక్ష్యాలు దొరికాయి.

...: ఎర్రగుడి శాసనాలు :...

కర్నూలు జిల్లా పత్తికొండ తాలూకాలో గుత్తికి వాయువ్య దిశను ఎనిమిది మైళ్ళ దూరంలో ఎర్రగుడి గ్రామం వుంది. గ్రామ సమీపంలో పెద్ద రాతిబండలున్నాయి. ఈ బండలమీద అలనాడు అశోక చక్రవర్తి తన ధర్మ లిపులను చెక్కించాడు. సుమారు రెండువేల రెండు వందల సంవత్సరాలు ఈశిలాశాసనాలు వెలుగులోకిరాలేదు. 1928లో భూగర్భ

శాఖకు చెందిన ఎ. ఘోష్ అనే శాస్త్రజ్ఞుడు ఖనిజాలకోసం ఎర్రగుడి ప్రాంతాలను పరిశోధిస్తూ వుంటే ఈ శిలాక్షరాలు ఆయన కళ్ళపడ్డాయి. ఆయన పురాతత్వశాఖవారికి ఈ సమాచారం అందచేశారు. పురాతత్వ శాఖకు చెందిన దయారాం సహానీగారూ, హరప్రసాద్‌శాస్త్రి గారు ఎర్ర గుడికి వెళ్ళి శాసనాలను పరిశీలించారు. అశోకుని ధర్మలిపులని గుర్తు పట్టారు. భూగర్భ శాఖవారు ఖనిజాలకోసం వెదుకుతూ వుంటే పురా తత్వశాఖ వారికి బంగారం కన్నా విలువైన చారిత్రక ప్రమాణాలు దొరి కాయి. 1929 జూన్ 11వ తేదీనాడు ఆంధ్ర జిల్లాలో అశోకుని శాస నాలు దొరికినట్లు పత్రికా ముఖాన ప్రకటించారు.

ఈ వార్త ఆంధ్ర చారిత్రక పరిశోధకుల వీనులకు విందయింది. కాళ్ళకు కదలికను తెచ్చింది. చరిత్ర పరిశోధనకే జీవితాన్ని అంకితం చేసిన మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, పరిశోధనా పద్ధతులను పకడ్బం దీగా తీర్చిదిద్దిన నేలటూరు వెంకటరమణయ్యగారు వెనువెంటనే ఎర్ర గుడికి వెళ్లారు. ధర్మలిపులను చూశారు. చాలా రహస్యంగా శాసనాలకు నకళ్ళు కాగితాలమీదకు ఎక్కించారు. ఈ ఎస్టాంపేజ్ పత్రాలను గుట్టు చప్పుడు కాకుండా చెన్నపట్నం తీసుకువెళ్ళారు.

ప్రభుత్వం వారిని నమ్ముకొంటే ఈ శాసనాలు వెలుగుచూడ్డానికీ అందులోని విషయాలు లోకానికి తెలియడానికీ ఏళ్ళూ పూళ్ళూ పడతా యని ఈ తెలుగు చరిత్రకారులకు తెలుసు. అందుకే శాసనాలను చదివి పరిష్కరించి, 1929 సెప్టెంబరు మాసం భారతి పత్రికలో ప్రచురిం చారు.

మల్లంపల్లి వారూ, వేలటూరివారూ భయపడినట్లే 1928లో బయట పడిన శాసనాలను 1958లో అంటే ముప్పై సంవత్సరాలకుగాని ప్రభు త్వము వారు ఎపిగ్రాఫిక్ ఇండికాలో అధికారరీత్యా ప్రకటించలేదు. ఇందుకు బోలెడన్ని కారణాలు ఉన్నాయి.

ఎర్రగుడి దగ్గర అశోకుడు వేయించిన రెండు లఘుశిలానుశాస నాలూ, పద్నాలుగు పెద్ద శిలానుశాసనాలూ దొరికాయి. అశోకుడు తన సువిశాల సామ్రాజ్యంలో ఇతరచోట్ల వేయించిన శాసనాలపాఠాలే వీటిలో

కూడా వున్నాయి. ఇవి ఆంధ్రజిల్లాలో దొరకడం వల్ల అశోకుడు తన శిలాను శాసనాలలో చెప్పిన సువర్ణ ఉనికిని నిర్ణయించటానికిఅవకాశాలు లభించాయి.

....: రాజకీయ వ్యవస్థ :....

అశోకుని కాలంలో జొన్నగిరి ఎలా వుండేదో వూహించుకోవడం ఏమంత కష్టంకాదు. అశోకుని ఇతర ప్రాదేశిక రాజధానులంటే గొప్పగా జొన్నగిరి వుండేదన్నమాట. పాటలీపుత్రం సామ్రాజ్యానికి రాజధాని అయితే మిగతావి ఉపరాజధానులు. రాజధానిలో రాజూ, ఉపరాజధానిలో ఉపరాజూ వుంటారు. ఉపరాజు అంటే సామ్రాట్టుకు సోదరుడూ తోడ పుట్టినవాడై వుంటాడు. ఉపరాజులే కాక యువరాజులు, రాజకుమారులూ, ఆర్యపుత్రులూ కూడా ఉపరాజధానిలో వుంటారు. ఈ ఉపరాజులను రాష్ట్రీయులంటారు

ఇక పరిపాలనా వ్యవస్థలో న్యాయాధికారులైన రజ్జుకులూ, మహామాత్రలూ, అంత మహామాత్రలూ, ధర్మమహామాత్రలూ ఉపరాజధానిలో కూడా వుండేవారు. అంతేకాదు. స్త్రీ అధ్యక్షమహా మాత్రలు కూడా వుండేవారు. ఇది ఈనాటి మహిళా సంక్షేమశాఖ లాంటిది.

అశోకుని కాలంలో స్త్రీల స్థితిగతులు ఎలా వుండేవి? సామాన్య స్త్రీల జీవన విధానం ఎలా వుండేది? ఈ సంగతులు అశోకుని శిలాను శాసనాలవల్ల తెలుస్తాయా? తెలుగు గడ్డమీద కూడా ఈ ధర్మలిపులు లభించడం వల్ల సుమారు రెండువేల రెండు వందల సంవత్సరాల క్రిందట తెలుగు ఆడబడుచుల ఆచార వ్యవహారాలేమిటి? వారే మతం అనుసరించేవారు? ఈ ప్రశ్నలకు కొన్ని సమాధానాలు ఈ ధర్మలిపుల వల్ల తెలుస్తాయి.

పదమూడవ శిలానుశాసనంలో అశోకుడు చెప్పినట్టు "ఏదో ఒక మతమును అనుసరించని జనముండు దేశమే లేదు." అశోకుడు తన మొట్టమొదటి శిలాను శాసనంలో ఇలా చెప్పాడు.

"ఇచ్చట ఏ సజీవ ప్రాణిని బలి యివ్వకూడదు."

"ఇచ్చట ఏ విధమయిన వేడుక సమూహము కూడా నిషేధిద్ధము".

"అట్టి సమావేశము వలన హాని కలుగునని దేవానం ప్రియుని అభిప్రాయం.

...: జాతరలు :...

పై మూడు అనుశాసనాల వలన అశోకుని కాలంలో జాతరలు జరిగేవని వాటిలో జంతుబలులు ఇచ్చేవారని స్పష్టం అవుతున్నది. ఈ జాతరలలో తెలుగు స్త్రీలు ఎలా పాల్గొనేవారో తెలుగు సాహిత్యంవలన తెలుసుకోవచ్చు.

ప్రతి గ్రామానికి ఒక దేవత వుంటుంది. ఆ గ్రామ దేవతకు జాతర చేసే దినాన్ని గ్రామాధికారి నిర్ణయిస్తాడు. జనులు కల్లుబాగా తాగి చిందులాడుతారు. పామర స్త్రీలు గోర్వెచ్చని చమురంటుకొని, తలకు నీళ్ళుపోసుకుని, కొత్త బట్టలు కట్టుకొని కంటుకాటుక, నొసట సింధూరము దిద్దుకొని, కొప్పులో పూలు తురుముకొని, తాంబూలం వేసుకొని వేపాకు మండలు పట్టుకొని బయలుదేరుతారు.

గంగ జాతరలో పాల్గొనే సామాన్య స్త్రీలను తెనాలి రామకృష్ణుడు తన పాండురంగ మహాత్మ్యంలో ఇలా వర్ణించాడు.

అంభోధరము క్రింద
నసియాడు సైరావతియు బోలె
సిడిప్రేలె దెరవయోర్తు
చెందమ్మి కొలన రంజిల్లు
నంచయుబోలె
నిప్పుకుటల నటించె నెలతయోర్తు
తొలుసంజె యెండ పర్తిలు
జక్కవయు బోలె
నీగి బందిరి గుండమించెయోర్తు
జలపీలపై నిక్కు
కలువ మొగ్గయు బోలె
పనాటాకు నర్తించె నతివయోర్తు
కాంత యొక్కర్తు

మూపుగంజినిచ్చె
హోరుగాలిచ్చెనూక
సుధామధురణవారి
లలనయొక్కర్తునోరి
తాళంబునిచ్చె
శక్తి జాతర తమభక్తి
శక్తులెసగ

విజయనగర సామ్రాజ్య కాలంలోని ఈ ఆచారాలను రామకృష్ణుడు యథాతథంగా వర్ణించాడు. సమకాలికులయిన విదేశీ చరిత్రకారులు ఈ సంగతులను ధృవీకరించారు. "ఈ దేశములోని స్త్రీలు అతి సాహసికురాండ్రు. తమ మొక్కులను చెల్లించుకొనుటలో భయంకరమగు పనులను చేయుదురు" అని బార్బోసా తన కళ్ళారా చూసి రాశాడు.

...: జంతు బలుల నిషేధం :...

జాతరలలో జంతుబలి. ఆత్మ హింసాత్మక చర్యలూ వుంటాయనే అశోకుడు తన మొట్టమొదటి శిలా శాసనంలో జంతుబలులను, జాతరలను నిషేధించాడు. అయితే ప్రజలు తరతరాలుగా వస్తున్న తమ ఆచార వ్యవహారాలను మానలేరు. ఇంట్లో నోములూ, వ్రతాలూ చేసుకొనక మానరు. అనారోగ్యం వస్తే మొక్కుకుంటారు. కోరినకోర్కెలు తీరిన మొక్కిన మొక్కులు చెల్లించుకుంటారు. వీటిని ఏ రాజూ నిషేధించలేడు. అందుకే అశోకుడు తన తొమ్మిదవ శిలాను శాసనంలో ఇలా చెప్పాడు.

"1. దేవానం ప్రియుడు ఈ విధముగ దెల్పెను.

2. జనులు అనారోగ్యముగ నున్నప్పుడు గృహమందు వివాహాది శుభకార్యములు జరుగునప్పుడు మంగళ ప్రధానమయిన క్రతువులు చేయుచుందురు.

3. ఆయా సందర్భములలో శుభాకాంక్షులై పుణ్యకార్యములు చేయుట కూడా కలదు.

4. అందు ముఖ్యముగా స్త్రీలు నిరుపయోగమైనట్టి, అర్థరహితములైనట్టి పనులెన్నో చేయుట కలదు.

5. శుభప్రదమయిన కార్యములను తప్పక చేయవలసినదే.

6. కాని సాధారణముగ మనుష్యులు చేయు కార్యములు తగినంత ప్రయోజనకరములు కావు"

...: ఈ నాటికీ నిజం :...

అశోకుడు అలనాడు చెప్పిన ఆ మాటలు అక్షరాలా ఈనాటికీ నిజం. అశోకుని కాలంలోనే కాదు అథర్వవేద కాలంలోనూ వున్నాయి. ఆ వేదానికి అనుబంధమయిన సర్పవేదం, పిశాచవేదం, అసురవేదం, తొలినాటి భయాలను, ప్రమాదాలనూ, విరుగుళ్ళనూ తెలియచేస్తాయి. జ్వరం, పరుష జ్వరం, సపరికలు, అజీర్ణం, జలోదరం, కుష్ఠు, వ్రణాలు, పురుగులు పడడం, పశురోగాలు, విషప్రయోగాలు మొదలయినవాటిని నివారించడానికి అథర్వవేదంలో మంత్రాలు వున్నాయి.

ఆరోగ్యం కోసం సర్వప్రయత్నాలూ చేయవలసినదే ఔషధం చికిత్స అవసరమే. పెళ్ళి పురుడు మొదలైన శుభకార్యాలలో వేడుకలు జరుపుకోవలసినదే. అయితే సంవత్సరంలోని మూడువందల అరవై రోజులూ ఏదో ఒక వ్రతం చేయడానికి వీలుగా తిథికో పండుగ మనకు లేకపోలేదు. ఈ వ్రతాలు కాక ఆడవారు నోచే నోములకు లెక్కలేదు. స్త్రీలలో ఇంకా మూఢనమ్మకాలు వుంటున్నాయి.

వీరేశలింగంగారు తమ స్వీయ చరిత్రలో ఇలా రాశారు." ఆ కాలమునందెల్ల వారికిని దయ్యములయందలి విశ్వాస మత్యధికముగా నుండెను. స్త్రీలలో నొకప్పుడును దయ్యము పట్టని వారెక్కడనోగాని లేక యుండిరి. ఎవ్వరికే వ్యాధివచ్చినను వైద్యుని యింటికి మారుగా ముందుగా భూతవైద్యుని యింటికో, సోదె చెప్పువాని యింటికో పరుగెత్తుచుండిరి."

అథర్వవేద కాలంలో, అశోకుని కాలంలో, తెనాలి రామకృష్ణుని కాలంలో, వీరేశలింగంగారి కాలంలో ఆడవాళ్ళు ఒక్కలాగే వున్నారా?

ఇప్పుడు మాత్రం అందరూ మారారా? కనీసం కొందరైనా నూటికినూరు పాళ్ళు మారుతారా?

తెలుగు నగరం దగ్గర రెండువేల రెండు వందల సంవత్సరాలు క్రిందట అశోకుడు చెక్కించిన అనుశాసనంలోని మాటలు ముఖ్యముగా "స్త్రీలు నిరుపయోగమైనట్టి అపహాస్యములైనట్టి పనులెన్నో చేయుట కలదు." ఈ లక్షణాలే శాశ్వతంగా నిలిచిపోతాయా?

వ్యవస్థ మారితేనే గాని ఈ దురవస్థ మారదు.



# వెండి రూపాయలూ : కొండ గుర్తులూ

ఒకనాడు భారత ఉపఖండమంతటా ద్రవ్యమానంలో రూపాయి ఒక్కటే గరిష్ఠ ప్రమాణం గల నాణెం. రూపాయి రూప్యం అన్నమాట నుంచి పుట్టింది. రూపాయి రూక, ఒకటికావు. రూక రుక్మంనుండి వచ్చిన మాట. రూపాయి అంటే వెండినాణెం మాత్రమే, బంగారు నాణాలను వరహాలు, దీనారాలు మొదలైన పేర్లతో పిలుస్తారు. భారత ఉపఖండంలో వెండి రూపాయలను ప్రవేశపెట్టిన ఘనత మన ఆంధ్రులదే.

మనదేశంలో మొట్టమొదటిసారిగా వెండి నాణాలను తమ రూపాలతో ముద్రించిన ఏలికలు శాతవాహనులు. క్షహరాట క్షత్రపులనూ కార్దమక క్షత్రపులను చూసి ఈ పద్ధతిని శాతవాహనులు తమరాజ్యంలో ప్రవేశపెట్టారు. బొమ్మవున్న పైవు బ్రాహ్మీలిపిలో ప్రాకృత భాషలో తమ పేరునూ, బొరుసువైపు దక్షిణ బ్రాహ్మీలిపిలో తెలుగు భాషలో తమ పేరును శాతవాహనులు ప్రకటించే వారు. ద్విభాషా నాణాలను ముద్రించడం క్షత్రపుల నుండే శాతవాహనులు నేర్చుకొన్నారు. మాతృనామాలను తమ పేరు ముందు చెప్పుకొనే ఏలికలు మాతృభాషను మన్నించి దానిని కూడా తమ నాణాలలో వాడడం ఆశ్చర్యం కాదు.

"శాతవాహనులు తెలుగు వాళ్ళేనా?" అన్న సందేహం చాలా కాలంగా చరిత్రకారులను వేదిస్తూ వుండేది. నిస్సందేహంగా వాళ్లు తెలుగు వాళ్ళేనని ఢంకామీద దెబ్బకొట్టి చాటవచ్చు. ఈ విషయాన్ని రుజువు చేయడానికి తగిన నాణాలు ఇటీవల దొరికాయి. వాటిని పరిశీలించి, ఆ మాటలను చదివి శాతవాహనుల మాతృభాష తెలుగేనని మొట్టమొదట చాటిన ఘనత డాక్టర్ పురాణం రాధాకృష్ణ ప్రసాద్‌గారికి చెందుతుంది. 1970 లో జరిగిన ఒక పురాతత్వ సదస్సులో ఆయన శాతవాహనుల వెండి రూప నాణాలపై ఒక పేపరు సమర్పించారు. తర్వాత

రెండేళ్ళకు అది అజయ మిత్ర శాస్త్రిగారి సంపాదకత్వాన వెలువడ్డ ఒక గ్రంథంలో అచ్చుపడింది.

డాక్టర్ ప్రసాద్‌గారు రెండు నాణాల బొరుసువైపు వున్న దక్షిణ బ్రాహ్మి లిపి లోని పదాలను ఇలాగ చదివారు.

1. అరహణకు–వాహిట్టి–మాకణకు– తిరుహాత్ కణకు
2. అరహణకు–గోతమీ పుత్రకు–హిరుయఞ హాతకణకు.

ఈ పదాలు ప్రాచెనుగులో వున్నాయి. పైగా మాత్రా ఛ్ఛంద స్సులో వున్నాయి. పదాలన్నీ షష్ఠ్యంతాలు. ప్రాకృతంలోని "రాజ్ఞో" అనే పేరు తెలుగులో 'అరహణ' అయ్యింది. ఇది శాస్త్ర సమ్మతం. ద్రావిడ భాషలలో పదాది 'ర' కారం ఉండదు. అందుకే రథం అన్న పదాన్ని మన ప్రాచీనులు 'అరదము' అనే వికృతి పదం చేసుకున్నారు. ప్రాకృతం లోని 'సుతస' అనే మాటను ఛందస్సుకోసం ఒకసారి 'మాకణకు' లనీ మరోసారి యథాతథంగా 'సుతకు' అని వ్రాశారు. "మాకణకు" అనే షష్ఠ్యంతానికి "మా కణ్ణు" అనేది ప్రథమా విభక్తి గల రూపం అవుతుంది. సాతవాహనుల కాలం నాటి తెలుగులో 'మాకండు' అంటే కొడుకని అర్థం. ఈ మూల ద్రావిడ పదం రాను రాను తెలుగులో "మగండు". "మగడుగా" మారింది. తమిళంలో మగన్ అయింది. తెలుగులో అర్థం మారింది గాని తమిళంలో మగన్ అంటే కొడుకనే అర్థం.

డాక్టరు ప్రసాద్ గారు తమ వాదాన్ని ప్రతిపాదించాక ఈ పన్నెండేళ్ళలో పురాతత్వ కోవిదులు ఈ విషయమై తర్జన భర్జనలు జరిపారు. వాదోపవాదాలు చెలరేగాయి. ఇంకా రేగుతూనే వున్నాయి. డాక్టర్ ఆర్. నాగసామి, శ్రీ యన్. రామయ్య ఈ నాణాలలోని భాష తమిళం అని మొండిగా వాదించసాగారు. ఈ ఇద్దరి వాదాన్ని ఖండిస్తూ డాక్టర్ ప్రసాద్‌గారి వాదాన్ని సమర్థిస్తూ డాక్టర్ ఇంగువ కార్తికేయశర్మగారు నిస్సందేహంగా శాతవాహనుల నాణాలపై బొరుసుపక్క వున్న మాటలు తెలుగు మాటలే అని నిరూపించారు. తమ "కాయినేజ్ ఆఫ్ శాతవా

హన ఎంపైర్" అనే గ్రంథంలోని అయిదవ అధ్యాయంలో చాలా విపులంగా ఈ విషయాన్ని చర్చించారు. డాక్టరు ప్రసాద్‌గారు ఇద్దరు శాతవాహన రాజుల నాణాలనే ఆదిలో చదివితే డాక్టరు శర్మగారు మరో నలుగురు రాజుల నాణాలను ఉదహరించి శాతవాహనుల మాతృభాష తెలుగే అని ఉద్ఘాటించారు.

ఈ నాణాలలోని తెలుగు షష్ఠ్యంతాలు దేశీఛందస్సులయిన రగడభేదాలలో వున్నాయి. ప్రాసయతిని పాటించారు. సాతవాహనులకాలంలో తెలుగు ఛందస్సులు ప్రాచుర్యం పొందిన దాఖలాలు ఇందువల్ల కన్పిస్తాయి. ప్రాకృతంలోనికి తెలుగు మాటలేకాక తెలుగు ఛందస్సులు కూడా వెళ్ళాయన్న సంగతి విదితం అవుతుంది.

సాతవాహనుల అన్ని నాణాలమీద బొరుసువైపు కొండగుర్తులు కూడా వుంటాయి. కొన్నిటిపై మూడు కొండల దొంతర, కొన్నిటిపై ఆరుకొండల దొంతర, మరి కొన్నిటిపై పది కొండల దొంతర కనబడుతుంది. కొన్ని నాణాలలో మిట్టమీదన వున్న కొండమీద ఒక నెలవంక గుర్తులాంటి గిన్నెకూడా కనిపిస్తుంది. ఈ కొండ గుర్తులూ, మీదనున్న వెండి గిన్నె బాలగేయాలలోని "కొండామీద వెండీ గిన్నె" అనే పాటను జ్ఞాపకం చేస్తున్నాయి. సాతవాహనుల కాలంలోనే ఈ పాట పుట్టిందా?

కొండ గుర్తులన్న మాట మట్టుకూ చాలా ప్రాచీనం అని చెప్పవచ్చు. 'నీ బండబడ' అనే తిట్టు చాలా ప్రాచీన ఆచారాన్ని సూచిస్తుందని ఒక సభలో ఆచార్య బిరుదురాజు రామరాజు గారు విశద పరిచారు. ప్రోటో- హిస్టరీ దశలో దహనానికి బదులు శవ ఖననం ఆచారమైనప్పుడు ఒక గొయ్యి తొల్చి దానిలో శవాన్ని ఉంచి పైన బండవేసి సమాధి చుట్టూ రాళ్లు పేర్చేవారు. ఇటువంటి సమాధులను కెయిరన్స్ అంటారు. దానినే "బండబడ" అనే తిట్టు సూచిస్తుందని రామరాజుగారి అంచనా. కొండగుర్తు అన్నది కూడా అంత ప్రాచీనం.

నాణాలపై వుండే కొండ గుర్తుల అర్థాన్ని డాక్టర్ కార్తికేయ శర్మగారు తమ పుస్తకంలో విశదం చేశారు. సాతవాహనులు మొదటి మూడు రాష్ట్రాలపై ఏలికలుగా వుండేవారు. అప్పుడు మూడు కొండ

గుర్తుల నాణెం వేశారు. తరువాత ఆరు రాష్ట్రాలపై అధికారులయ్యారు. ఆ సంగతి ఆరు కొండలు చెప్తాయి. ఉత్తరోత్తరా పది రాష్ట్రాలపై ప్రభువులై సామ్రాజ్యాధికారులయ్యారు, ఆ విషయాన్ని పది కొండ గుర్తుల నాణాలు చాటుతాయి. రఘువంశములోని "ఆరూఢమద్రిన్ ఉదధింవితీర్ణం" అనే శ్లోకాలను ఈ గుర్తులు చిత్రిస్తున్నట్లు కొండ గుర్తులతోపాటు చతుస్సాగర చిహ్నాలు నదీ చిహ్నాలుకూడా బొరుసు ప్రక్క కనబడతాయి. చతుస్సముద్ర చిహ్నాన్ని పురాతత్వ పండితులు ప్రస్తుతం ఉజ్జయిని చిహ్నమంటున్నారు.

కొండగుర్తులు అన్ని నాణాల పైనా ఉంటాయి గానీ ఆరు గుర్తులున్న నాణాలు మాత్రమే వెండి రూపాయలు. మూడు కొండ గుర్తులూ పది కొండ గుర్తులున్నవి మాత్రం ఇతర లోహపు నాణాలు. ఈ కొండ గుర్తులను ఈ వ్యాసంతోపాటు ప్రచురిస్తున్న బొమ్మల్లో చూడవచ్చు. (బొమ్మలు వేసింది శ్రీ పురాణం రాధాకృష్ణ ప్రసాద్‌గారే.)







సాతవాహనులు క్రమంగా ఆధిపత్యం వహించినది పది రాష్ట్రాలనూ అందులో వుండే ముఖ్యమైన కొండలను ఈ క్రింది విధంగా పట్టికలో చూడవచ్చు.

1. అసిక రాష్ట్రం—వింధ్యా ఋక్షవత్ పర్వతాలు.
2. అశ్మక రాష్ట్రం—పారియాత్ర పర్వతం.
3. ములక రాష్ట్రం—సహ్యాద్రులు.
4. విదర్భరాష్ట్రం—కృష్ణగిరి.

5. అకర రాష్ట్రం—మచ పర్వతం.
6. అవంతి రాష్ట్రం—సిరితన పర్వతం.
7. అపరాంత రాష్ట్రం—చకోర పర్వతం.
8. అనుప రాష్ట్రం—శతగిరి.
9. సురాష్ట్రం—మలయ పర్వతం.
10. కచ్ఛ రాష్ట్రం—మహేంద్ర పర్వతం.

ఈ పైన పేర్కొన్న పదిరాష్ట్రాలలోనూ శాతవాహనుల నాణాలు లభ్యమవుతున్నాయి. శాతవాహనుల జన్మ రాష్ట్రాలయిన తెలంగాణా రాయలసీమలలో నాణాలే కాక కోటలుకూడా వుండేవన్న దాఖలాలు కనబడుతున్నాయి. ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ ప్రాంతానికీ సాతవాహనులకు మొట్టమొదటి నుంచీ సంబంధముందని అజయమిత్ర శాస్త్రిగారి వంటి పెద్దలు అంగీకరించిన విషయమే. సాతవాహనులు దక్షిణబ్రాహ్మీలిపిలో వేసిన భాష అజంతమని. తెలుగని డాక్టర్ డి. పి. సర్కార్ ఆమోదించారు. ఈ మధ్య కరీంనగర్ జిల్లాలోని కోటలింగాలవద్ద డాక్టర్ పుచ్చా వెంకట పరబ్రహ్మశాస్త్రిగారు అత్యంత ప్రాచీనమైన సాతవాహన నాణాలు సేకరించారు. సాతవాహన వంశంలోని ప్రథముడు ఛిముకుని రాణి నాణాలు ఇందులో వున్నాయి. చరిత్రకారులు సంస్కృతీకరించినట్టు ఈ రాజా పేరు శిముఖుడు. శ్రీముఖుడు కాదు. ఉత్త తెలుగు ఛిముకుడు.

తవ్వుతున్న కొద్దీ బయటపడుతున్న కొత్త సాక్ష్యాలవల్ల పురాణాల కెక్కిన శాతవాహనులు కేవలం పురాణ పురుషులూ కల్పిత వ్యక్తులే కాక చారిత్రక పురుషులూ సామ్రాజ్యాధికారులూ తెలుగువాళ్లు అనే సంగతులు వెల్లడి అవుతున్నాయి. వాయుపురాణం. బ్రహ్మ పురాణం. విష్ణుపురాణం భాగవత, మత్స్యపురాణాలు శాతవాహనులను ఆంధ్రులుగా. ఆంధ్రభృత్యులుగా పేర్కొంటాయి. మొత్తం ముప్పైమంది రాజులు మూడు వందల పైచిలుకు సంవత్సరాలు పాలించినట్లు పురాణాలు చెప్పాయి. పురాణాలు పేర్కొనని సాతవాహనుల నాణాలు కూడా దొరకడం ఒక విశేషం.

సాతవాహనుల రాజ్యారంభ కాలం ఇతిమిత్థంగా చెప్పలేం. చరిత్ర కారులలో ఏకీభావం లేదు. కొందరు క్రీస్తుపూర్వం 271 సంవత్సర మంటారు. కొందరు క్రీస్తుపూర్వం 30 వ సంవత్సరమంటారు. ఏమ యినా సాతవాహనులు రెండువేల సంవత్సరాల ముందు రాజ్యాన్ని ప్రారంభించినవాళ్ళు. అంటే ప్రాచీన కాలంనుండి తెలుగు నాణాలూ, దేశీయ ఛందస్సులూ, కొండగుర్తులూ ఉన్నాయని రుజువుచేసిన డాక్టర్ పురాణం రాధాకృష్ణ ప్రసాద్‌గారూ, డాక్టరు ఇంగువ కార్తికేయశర్మ గారు ఆంధ్రులంతా అభిమానించదగ్గ పురాతత్వ పండితులు.



# శ్రీకృష్ణుడు అసలు సిసలు ఆంధ్రుడా?!

రామాయణంలోని కైకమ్మ రష్యన్ల ఆడబడుచు అని ఇటీవల ఒక ఆంధ్ర మంత్రి చాలా ఉదారంగా సెలవిచ్చారు. మనమంత్రులనోళ్ళ పెదళ్ళలో దున్నపోతులు ఈనగానే దూడలను కట్టేసే ప్రయత్నాలు నిమిషాలమీద జరిగిపోతూ వుంటాయి. కైకేయి పుట్టినిల్లు యేది? అనే సమస్యమీద మద్రాసునుంచి వెలువడె ఒక ఆంగ్ల దినపత్రికలో భూగోళ పటాలతో సహా వాదోపవాదాలు జరుగుతున్నాయి. ఆ సంపాదక లేఖలలో వెలిబుచ్చిన అభిప్రాయాలనుబట్టి కైకమ్మ ఇంతియాకు వెలుపల, ఇండియా లోపల ఒక అరడజను ప్రాంతాలలో పుట్టివుండాలి.

వాస్తవానికి కేకయ రాజ్యం ఎక్కడో భారత వర్షానికి వెలుపల లేదు. పంజాబ్‌లో జీలం, చీనాబ్ నదుల మధ్యప్రదేశమే కేకయరాజ్యం మన పురాణాలలో కేకయులను మద్రులు, త్రిగర్తులు. సాల్వులు మొదలయిన వారితో కలిపి పేర్కొంటారు. వీరందరూ పంజాబులోని జానపదాలకు చెందిన వాళ్ళే. కేకయ రాజ్యం గురించి ఒక్క రామాయణంలోనే కాక వాయు, మత్స్య, బ్రహ్మాండ, మార్కండేయ. వామన పురాణాల్లో కూడా వుంది. మన పౌరాణిక భూగోళం పైన పరమ ప్రామాణికుడు శ్రీ యస్. ముజఫర్ ఆలీ, ఆయన "ది జ్యాగ్రఫీ ఆఫ్ ది పురాణాస్" అనే చక్కని పరిశోధక గ్రంథం రాశాడు. (ప్రచురణ కర్తలు పీపుల్స్ పబ్లిషింగ్ హౌస్) ఈ గ్రంథంలో కేకయరాజ్యాన్ని స్పష్టంగా పంజాబులోని భాగంగా విశదపరిచారు.

—: కైకేయి పంజాబీ ? :—

కైకమ్మ పుట్టిల్లు రష్యా కాదు. ఆమె నిస్సందేహంగా పంజాబీ మహిళ. బహుశా సప్తసింధుక్షత్రియాణి కైకమ్మ రష్యన్ల ఆడబడుచు

కాకపోయినా ఒక రష్యన్ ఆడబడుచు "శ్రీకృష్ణుడు అచ్చంగా అసలు సిసలు ఆంధ్రుడు" అని తెలుగు మాట్లాడే ప్రజలకు చెందినవాడని రాసింది. ఈమె విదుషీమణి. మన మంత్రులలాగ పదవివల్ల పాండిత్యం ఆపాదించబడిన పడతికాదు. సోవియెట్ యూనియన్‌లోని అకాడమీ ఆఫ్ సైన్సెస్ పరిశోధక సంస్థలో యత్నోగ్రఫీ మీద సీనియర్ శాస్త్రీయ విదుషి. చారిత్రక శాస్త్రాలకు కాండిడేట్. జవహర్‌లాల్ నెహ్రూ ప్రెయిజ్ విజేత. ఈమె పేరు శ్రీమతి ఎన్. ఆర్. గుసేవా. ఈమె "జైనమతం" మీద రష్యన్ భాషలో ఒక గ్రంథం రాసింది. దీనిని ఆంగ్లానువాదంగా "జైనిజమ్" అనే పుస్తకం మొదటిసారి 1971 లో ప్రకటితమైంది. (సింధు పబ్లికేషన్ లిమిటెడ్, బొంబాయి-1) శ్రీమతి గుసేవా తన ఈ గ్రంథంలోనే శ్రీకృష్ణుడు ఆంధ్రుడని నిర్ధారణ చేసింది.

మనదేశంలో అన్ని మతాల కన్నా చాలా పాత మతం భాగవత మతం. ఇది వైదిక మతానికి విభిన్నమైన అనార్యుల మతం. దీనికి శ్రీకృష్ణుడు మూలావలంబనం. కృష్ణుడు నిస్సందేహంగా అనార్యుడే. ఋగ్వేదంలో ఒక కృష్ణుని ప్రసక్తి వుంది. (8-85-3-4) ఇతడు కృష్ణ అంగీరసుడు. కౌశీతకి బ్రాహ్మణంలో కూడా ఇతని ప్రసక్తే ఉంది. ఈ కృష్ణుడు సాయన భాష్యం ప్రకారం అసురుడు.

—; ఎందరో కృష్ణులు :—

ఈ ప్రపథమ ఋగ్వేద కృష్ణుడు మొదలుకొని ఎందరో కృష్ణులు మన ప్రాచీన గ్రంథాలలో కనబడతారు. ఛాందోగ్యోపనిషత్‌లో దేవకీ పుత్రుడైన కృష్ణుడు కనబడతాడు. (3-17-6). ఇతడు ఘోర అంగీర సుని శిష్యుడు వైదిక ఋషి. "అంగీరస" సంబంధం వల్ల ఋగ్వేద కృష్ణునికి ఛాందోగ్య కృష్ణునికి కేవలం బాదరాయణ సంబంధం కాక గట్టి సంబంధమే వుంటి వుండాలి.

ఎటొచ్చీ ఋగ్వేద కృష్ణుడు అసురుడు (అనార్యుడు) ఛాందోగ్య కృష్ణుడు వైదిక ఋషి. అంటే ఛాందోగ్య రచనా కాలానికి కృష్ణుడికి పెద్ద పీటవేసి గౌరవించటం ప్రారంభమైన దన్నమాట. ఛాందోగ్య

కృష్ణుడు దేవకీ పుత్రుడు కావడం గమనించవలసిన విషయం. మాతృ నామాన్ని స్వంతపేరుతో కలిపి చెప్పుకోవడం మాతృస్వామ్యాన్ని సూచిస్తుంది. (ఆంధ్రులయిన శాతవాహనులూ ఇక్ష్వాకులు తమ తల్లులపేర్లను మొదట చెప్పుకొనేవారు)

... అంధకులు. ఆంధ్రులు ...

కృష్ణునికి ఇంకా కొన్ని పేర్లున్నాయి. అతడు సాత్వతుడు, శౌరి వార్ష్ణేయుడు, దాశార్హుడు మాధవుడు ఈ పేర్లలో సాత్వతుడు వార్ష్ణేయుడు అనే మాటలు కృష్ణుని జాతిని సూచిస్తాయి. యదు వంశంలో శాశ్వతశాఖ ముఖ్యశాఖ. ఇందులో మళ్ళీ మూడు ముఖ్యమైన శాఖలు వున్నాయి. అవి : అంధక–వృష్ణి, మహాభోజ దైవ వృధ శాఖలు. వీరంతా అనార్యులు. వింధ్యపర్వత ప్రాంత వాసులు. అంధక వృష్ణులది మ్లేచ్ఛభాష. అంధక భాషే ఆంధ్ర భాష. అంధకులు ఆంధ్రులే.

ఐతరేయ బ్రాహ్మణం ఆంధ్రులను ఇతర మ్లేచ్ఛులతో కలిపి చెప్పింది. ఆంధ్రులు పుండ్రులు శబరులు పుళిందులు మూతిబులు ఒక కోవలోని వాళ్ళు. ఐతరేయ బ్రాహ్మణం సాత్వతులను కూడా దాక్షిణాత్యులుగానే పేర్కొంటుంది. వాళ్ళని నిషాదులతో చేర్చింది. ఈ సంగతులలో కొన్ని శ్రీ వి. సిహెచ్. లాగారు రాసిన ఒక పుస్తకం ఆధారంగా శ్రీమతి గునేవా కథనం చేసి కృష్ణుకు ఆంధ్రుడని తేల్చింది. ఈ రష్యన్ మహిళ చేసిన ప్రతిపాదనను బలపర్చే ఇతర సాక్ష్యాలున్నాయేమో చూడాలి. అయితే అంతకు ముందు అసలు శ్రీకృష్ణుడు చారిత్రిక వ్యక్తో కాదో తేల్చుకోవాలి.

ఇంతకీ కృష్ణుడు ఒక్కడా? పలువురా? భారత కృష్ణుడు భాగవత కృష్ణుడూ వేర్వేరు వ్యక్తులా? ఋగ్వేద కృష్ణునికీ ఇతిహాసాల కృష్ణునికీ సంబంధముందా? ఇటువంటి ప్రశ్నలు కోకొల్లలు. కృష్ణుని చరిత్ర గురించి పరిశోధనలు చెయ్యని భారతీయ, పాశ్చాత్య పండితుడెవ్వడూ కవిపించడు. ఆర్. జి భండార్కారు యన్. యం. రాయ్‌చౌదురి, సీతానాథ్ తత్వభూషణ్, పి. వి. వైద్య, వింటర్‌నిట్జ్, కీన్, గ్రియర్‌సన్, యాకోబీ పార్జిటర్ ఇటువంటి విద్వాంసులెందరో కృష్ణ సమస్యమీద పరిశోధనలు చేశారు.

—: కృష్ణుని కాలం :—

ఆర్. జి. భండార్కరు గారు కృష్ణుడూ వాసుదేవుడూ విభిన్న వ్యక్తులంటారు. ఈ వాదాన్ని గార్బె, గ్రియర్‌సన్, జాకోబీ వింటర్‌నిట్జ్ ఆమోదించారు. హాప్‌కిన్స్, కీత్, రాయ్‌చౌదరి మొదలయినవారు ప్రతిఘటించారు. వింటర్‌నిట్జ్ వాదన ప్రకారం ముగ్గురు విభిన్న వ్యక్తుల చుట్టూ వున్న గాథల ఏకీకరణ కృష్ణుని విషయంలో జరిగింది. పార్జిటర్ లెక్కల ప్రకారం మహాభారత యుద్ధం క్రీస్తుపూర్వం 950లో జరిగింది. కృష్ణుని జీవిత కాలం ఆ ప్రాంతాలలోనే వుంటుంది.

మన భారతీయ పరిశోధకులలో చాలామందికి ఆదిలో కృష్ణుడు అసురుడు, అనార్యుడు అనే సత్యాన్ని అంగీకరించడానికి మనసొప్పదు. కృష్ణుడు ఆర్యుడు కాకపోతే ద్రావిడుడై వుంటాడు. ద్వారక కృష్ణుని నగరం. ఇప్పుడు గుజరాత్ దగ్గర వున్న వూరును ద్వారకగా గుర్తిస్తున్నారు. కృష్ణుని ఘూర్జరులు కూడా ద్రావిడులే. ఆంధ్రులు, మహారాష్ట్రులు, తమిళులు, కర్ణాటకులు, ఘూర్జరులు, పంచ ద్రావిడుల క్రింద లెక్క. అయినా ప్రాచీన ద్వారక సౌరాష్ట్రం లోనిది కాదని డి. డి. కోశాంబీ గారు స్పష్టం చేశారు.

కృష్ణుని చారిత్రకతగురించి, చిన్నదయినా ఎంతోమిన్నగా మన్ననచేయవలసిన ఒక వ్యాసాన్ని డి.డి. కోశాంబిగారు 1965లోనే రాశారు. (టైమ్స్ ఆఫ్ ఇండియా వార్షిక సంచిక) అందులో వివిధ కృష్ణ గాథలను సమన్వయం చేసి చెప్పించారు. కృష్ణుడు మాతృస్వామ్యం వున్న అనార్య గణాలకు చెందినవాడు. కంసుని ఉదంతం ఇదే ధ్రువ పరుస్తుంది. మాతృస్వామ్య వ్యవస్థలోనే వారసత్వం తండ్రినుంచి కుమారునికికాక మేనమామనుంచి మేనల్లుడికి సంక్రమిస్తుంది. (అప్పుడు పుట్టిన బిడ్డ జాతకాన్ని రాస్తూన్నప్పుడు తెలుగు వాళ్ళు మేనమామ గండం వుందో లేదో ముందు చూసుకోవడం ఇటీవలదాకా పరిపాటి.

కొన్ని అనార్యగణ రాజ్యాలలో పాతరాజును పబ్లిక్‌గా సంహరించి

కొత్త రాజు పట్టం కట్టుకోవాలి. కంసుని విషయంలో కృష్ణుడు ఇదేచేశాడు. (కంస సభలోని మల్లులు చాణూర ముష్టికుల ఆంధ్ర సంబంధం గమనిం చాలి.) కృష్ణుని మరణం కూడా ఆదిమ జాతుల ఆచారాన్నే సూచిస్తోంది.

—: మాతృ దేవితారాధన :—

అనాదిగా ప్రపంచంలో మాతృదేవతలను ఆరాధించే ఆచారం ప్రచా రంలో వుంది. మనదేశంలో కూడా వివిధ ప్రాంతాలలో వివిధ నామాలతో మాతృదేవతలను ఆరాధిస్తూ వుండేవారు. పూతన అటువంటి మాతృదేవత. మధుర జిల్లాలలోని కొన్ని ప్రాంతాలను ఈమె పేరున పిలవడం చారిత్రక కాలంలో సైతం కనబడుతుంది. మాతృస్వామ్య వ్యవస్థలోంచి దేవకీ పుత్ర కృష్ణునిచేత ఈ మాతృ దేవతని చంపించి కృష్ణుణ్ణి వాసుదేవ కృష్ణు నిగా పితృస్వామ్య వ్యవస్థకు చెందిన వైదికార్య సంతతివారు మార్చేశారు. ఇదిచాలా ప్రాచీనకాలంలోనే జరిగింది. అయితే కృష్ణుని గాథలలో మాతృ స్వామ్య చిహ్నాలను తొలిగించలేకపోయారు.

కృష్ణార్జునులను ఉమ్మడిగా పాణిని కాలానికి ముందే ఆరాధించే వారు. అర్జునుడు సుభద్రను లేవదీసుకు పోవడం మేనత్త కూతురుపై మేన ల్లుడికి గల హక్కును చాటుతోంది. మేనరికం మాతృస్వామ్య వ్యవస్థకు అవశేషం. ఇప్పటికీ తెలుగువాళ్ళలో మేనరికం వాంఛనీయమైన సంబంధం.

మేనత్త దగ్గర మేనల్లుడికి చనువు వుండటం కూడా తెలుగువాళ్ళకు తెలిసిన సంగతి. ఇందుకే రాధామాధవ ప్రణయం తెలుగువాళ్ళకి ఎబ్బెట్టు అనిపించదు. రాధ ప్రాచ్య భారతంలోని మాతృదేవత. కృష్ణుని గాథలలో రాధను ఇరికించడం క్రీస్తుశకం 3వ శతాబ్దానికి గాని జరగలేదు. భారత-భాగవత—హరివంశ కృష్ణగాథలలో రాధ ఎక్కడా కనిపించదు.

—: అనేక గాథల ఏకీకరణ :—

కోశాంబీగారి అంచనా ప్రకారం కృష్ణుడు ఏ ఒక్క చారిత్రక వ్యక్తి కాడు. పలువురు ఇతిహాస నాయకుల గాథలను మిళితం చేసి ఒక వ్యక్తికి ఆపాదించి చేసిన రూపకల్పన ఫలితమే కృష్ణుడు. ఈ కల్పన క్రీస్తుకు

పూర్వం 800 సంవత్సరాలలో మొదలయింది. క్రీస్తుశకం 800 నాటికి గాని రాధ కృష్ణ చరిత్ర లోనికి ప్రవేశించలేదు అంటే పదహారు వందల సంవత్సరాలుగా కృష్ణ చరిత్ర చేర్పులతో మార్పులతో చిలువలా పలువలా కొమ్ములా రెమ్మలతో విస్తరించింది. సంచార జీవనం గడిపే పశుపాలన వ్యవస్థ నుండి వ్యవసాయ దశకు చేరుకొన్న రోజులలో కృష్ణుని ఇతిహాసాలు మొదలయ్యాయి.

అంధక వృష్ణి వంశీయులు సంచార జాతులలోని వారు. అలినాటి మధుర ప్రాంతాలలోని అంధక వృష్ణి వంశీయులు తమ సంచార జీవనంలో వింధ్య పర్వత ప్రాంతాలకూ, అశ్మక, ములక రాష్ట్రాలకూవచ్చి స్థిరపడితే ఆశ్చర్యం లేదు. నేటి ఆంధ్రుల ఆచార వ్యవహారాలకు చేరువగా వున్న అలవాటే అంధక వృష్ణి వంశీయుడైన కృష్ణుని గాథలలో కనబడుతు తున్నాయి. అందుచేత శ్రీకృష్ణుడు అసలు సిసలు ఆంధ్రుడే అని ఇంటి కప్పు నెక్కి సగర్వంగా చాటుకోవచ్చును గానీ ఇందువల్ల మనకి కొత్తగా ఒరిగేదేమిటో కొంచెం ఆలోచించుకోవాలి.

# ఏకలవ్యుని పుట్టుపూర్వోత్తరాలు

మహాభారతంలో "అయ్యోపాపం!" అనిపించి సానుభూతికి నోచు కునే కొన్ని పాత్రలలో ఏకలవ్యుడు ఒకడు. ఈ ఉదాత్త పాత్ర గురించి సామాన్య పాఠకులకూ సాధారణ సాహితీపరులకూ తెలుగు భారతం, ఆది పర్వంలో లభ్యమైనంత సమాచారం మాత్రమే తెలుసు. ఆదిపర్వం పంచ మాశ్వాసంలో 231వ వచనం నుంచి 245వ పద్యం దాకా పదిహేను గద్య, పద్యాలలో నన్నయ్యగారు ఏకలవ్యుని అస్త్ర విద్యాభ్యాసం, పాటవ ప్రదర్శ నం, గురుదక్షిణ సమర్పణం తెలియజేశారు. తన శిష్యులలో ఒకే ఒకణ్ణి అందరికన్నా మిన్నగా చేయాలన్నీ ఇంకొక అసమాన పరాక్రమశాలిని ఆచా ర్యుడు అంగవికలునిగా చేయడం అనుచితం. అడిగిన బొటనవ్రేలు కోసి ఇచ్చిన శిష్యుడు మహోన్నత వ్యక్తి. ఈ ఘట్టం తర్వాత ఏకలవ్యుడు ఏమయ్యాడు ?

ఈ ప్రశ్నకు తెలుగు భారతంలో జవాబు దొరకదు. భారత కథలో ఏంతో ప్రముఖ పాత్రను వహించకపోతే ఆదిపర్వంలో ఏకలవ్యుని కథను కథనం చేయడం అనవసరం. తెలుగు భారతంలో దొరకదు గానీ వ్యాస భారతంలో ఏకలవ్యుని అట్టు పుట్టు ఆనవాళ్ళన్నీ ఓపికతో గాలించితే చేతి నిండా చిక్కుతాయి. నన్నయ్యగారు గానీ, తిక్కనగారు గానీ వ్యాస భార తాన్ని యథామూలంగా అనువదించకపోవడం వల్ల ఈ పరిస్థితి ఏర్పడింది. భారతానికి హరివంశం ఖిలపర్వం, సంస్కృత భారతంలో మూల హరి వంశాన్ని జోడించి చదివితే ఏకలవ్యుని పుట్టు పూర్వోత్తరాలన్నీ పువ్వు ల్లాగ విచ్చుకొంటాయి.

సంస్కృత హరివంశంలోని 34వ అధ్యాయాన్ని చదివితే ఆశ్చర్య కరమైన విషయాలు తెలుస్తాయి. పాండవులకు గానీ కృష్ణునికిగాని ఏకల వ్యుడు పరాయివాడు కాడు. రక్తబంధువు. పాండవులు, ఏకలవ్యుడు పినతల్లి పెదతల్లి బిడ్డలు. కృష్ణుడూ ఏకలవ్యుడూ మేనత్త మేనమామ బిడ్డలు. ఈ బీరకాయ పీచు బంధుత్వాలు ఎఱ్ఱయ్యగారి తెలుగు హరివంశం వల్ల కూడా కొంత కొంత తెలుస్తాయి. ఏకలవ్యునికీ, కీచకునికి కూడా బంధుత్వం ఉంది. సుధేష్ణ పాండవులకు స్వయానా పినతల్లి కూతురు. ఉత్తరకుమారునికి పాండవులు మేనమామలు.

యాదవ కులంలో అంధక వంశశాఖ ఉంది. అందులో శూరుడను రాజుకు వసుదేవుడు మొదలయిన తొమ్మండుగురు కొడుకులూ, అయిదు గురు కుమార్తెలూ వున్నారు. ఆ పుత్రికల పేర్లను హరివంశం ఇలా చెబుతుంది.

పృథుకీర్తిః పృథాచైవ
శ్రుతదేవా శ్రుత శ్రవః
రాజాధిదేవీ చకదా
పంచైతా వీరమాతరః

(అధ్యాయం 34 శ్లో 19—23)

వసుదేవుని ఈ అయిదుగురు అక్క చెల్లెళ్ళు ఎవరెవరిని పెళ్ళా డారో, వాళ్ళ సంతానం పేరులేమిటో కూడా హరివంశం ఈ అధ్యాయం లోని ఇతర శ్లోకాలలో చెబుతుంది.

1. పృదకీర్తి
   భర్త : వృద్ధశర్మ కరూశాధిపతి
   కొడుకు : దంతవక్త్రుడు

2. శ్రుతదేవ
   భర్త : కేకయేశ్వరుడు హిరణ్య ధన్వుడు
   కొడుకు : ఏకలవ్యుడు
3. శ్రుతశ్రవ
   భర్త : చేదిరాజు దమఘోషుడు
   కొడుకు : శిశుపాలుడు
4. పృథ (కుంతి)
   భర్త : పాండురాజు
   కొడుకులు : పాండవులు
5. రాజాధిదేవి
   భర్త : అవంతిపతి
   కొడుకులు : విందాను విందులు

కేకయరాజుకూ శ్రుతదేవకూ పుట్టిన ఏకలవ్యుడు నిషాదు డెందుక య్యాడు ? హరి వంశంలోనే ఒక శ్లోకం అ సంగతిని చెబుతుంది.

దేవశ్రవాః ప్రజాతస్తు
నైషాదిర్యః ప్రతిశ్రుతః
ఏకలవ్యో మహారాజ
నిషాదైః పరివర్ధితః

(6-34 శ్లో 33)

ఈ శ్లోకార్థమేమిటంటే : దేవశ్రవునికి ఏకలవ్యుడు జన్మించి నిషాదులచే పెంచబడ్డాడని, దేవశ్రవుడు వసుదేవుని తమ్ముళ్ళలో ఒకడు. శ్రుతదేవ అనే పేరుకు బదులు దేవశ్రవ అనే పేరు ఈ శ్లోకంలో చోటు చేసుకుంది. ఎఱ్ఱయ్యగారి ఆంధ్ర హరివంశంలో : "శ్రుతదేవ కుంగేకయే శ్వరుని వలన నేకలవ్యుడు పుట్టి నిషాదులలోన బెరిగె" అని ఈ శ్లోకాన్నే

అనువదించారు. (పూర్వం 3-161) కేకయ రాజు సుక్షత్రియుడు కానందు వల్లనే విషాదుడయ్యాడు.

సంస్కృత భారతం-విరాటపర్వం-పదహారో అధ్యాయంలో కేకయ రాజుల ప్రసక్తి వుంది. "కీచకుని వివరాలను జనమేజయుడు చెప్ప మంటే వైశంపాయనుడు చెప్పాడు." క్షత్రియ పురుషునికి బ్రాహ్మణ స్త్రీ వలన పుట్టినవాడిని సూతుడంటారు.

ఈ విధమైన ప్రతిలోమ జాతులలో సూతునికి ద్విజత్వం ప్రాప్తి స్తుంది. వీళ్ళని రథకారులని పిలుస్తారు. పూర్వం రాజులకు సూతవంశా లతో వైవాహిక సంబంధాలు వుండేవి.

అయినా సూతుని రాజ శబ్దంలో వ్యవహరించరుగాని కొందరు సూతులు రాజులను ఆశ్రయించి రాజ్యాలు సంపాదించారు. వాళ్ళని సూత రాజులంటారు. వాళ్ళలో కేకయుడు కూడా ఒకడు. ఇతడు సూతులకు అధి పతి. క్షత్రియ స్త్రీకే పుట్టాడు. ఇతనికి ఇద్దరు భార్యలు. పెద్ద భార్య మాళవి. ఈమెకు బాణుడు అనే కొడుకు పుట్టి కీచకుడు అనే పేరుతో ప్రసిద్ధుడయ్యాడు. కేకయుని రెండో భార్యకు చిత్ర అనే కుమార్తె పుట్టి సుదేష్ణ అనే పేరులో పెరిగింది. ఈమె విరటుని రెండో భార్య. పెద్ద భార్య శ్వేత చనిపోయాక విరటుడు ఈమెను పెళ్ళాడాడు.

మూలంలోని ఈ శ్లోకాలను తిక్కనగారు తమ విరాటపర్వంలో తెలిగించలేదు. పైగా మూలంలో లేని విషయాన్ని మరొకచోట చెప్పారు. ఉత్తర కుమారుడు శమీవృక్షం దగ్గర బృహన్నలలో పాండవుల గురించి అడిగి "ఏతమ్మహానుభావుల మేనల్లుండ" అని చాటుకొన్నట్టు తిక్కనగారు రాశారు. (విరాట-4-120) సుదేష్ణ పాండవుల పినతల్లి కూతురే అన్న సంగతి ఇందువల్ల తేలుతుంది.

హరివంశంలో ఏకలవ్యుడి విద్యాభ్యాసం ప్రసక్తిగానీ, గురుదక్షిణ సంగతిగాని లేదు. ఏకలవ్యుడు జరాసంధుని అంతరంగికులలో ఒకడు. జరాసంధుని సైన్యాలకు ఏకలవ్యుడే సేనాధిపతి. మధురమీద పద్దెనిమిది

సార్లు జరాసంధుడు దండెత్తాడు. ప్రతీముట్టడి లోనూ ఏకలవ్యుడు సైన్యాధిపత్యం వహించాడు. సంస్కృత హరివంశంలో 93వ అధ్యాయంనుంచి 99వ అధ్యాయం దాకా ఏకలవ్యుని సంగర విక్రమం కనబడుతుంది ఒకటి కాదు రెండు కాదు ఏడధ్యాయాలలో చాలా ప్రముఖ వీరుడిగా పేర్కొని ఏకలవ్యుని ధనుర్యుద్ధాన్ని-గదా యుద్ధాన్నీ విస్తారంగా వర్ణించి బలరామునితో చేసిన భీషణ యుద్ధాన్ని కీర్తించినా హరివంశం ఏకలవ్యుని తరువాత జీవితాన్ని ఏమీ చెప్పదు. ఈ వివరాలకు మళ్ళీ భారతం చూడాలి.

వ్యాసభారతంలో ఏకలవ్యుని ప్రసక్తి సభాపర్వంలో నాలుగుసార్లు, ఉద్యోగ పర్వంలో రెండుసార్లు, ద్రోణపర్వంలో ఒకసారి మౌసలపర్వంలో ఒకసారీ కనబడుతుంది. రాజసూయ యాగం చేయడానికి ఎవరెవర్ని జయించాలో కృష్ణుడు ధర్మరాజుతో చెప్తాడు. ఆ పేర్లలో ఏకలవ్యుని పేరు కూడా వుంది. (అధ్యాయం 14, శ్లోకం 65) అయితే రాజులెవ్వరూ నీతో యుద్ధం చేయరు. నువ్వంటే గౌరవం ఉన్న వారని కూడా కృష్ణుడు చెప్తాడు. (అ-14-శ్లో 66). నిజానికి ఏకలవ్యుడు ధర్మరాజుకు మాతృవర్గంలోనివాడు. అందుకే రాజసూయానికి వచ్చి ప్రముఖ పాత్ర వహించాడు.

“ధర్మరాజును అభిషేకించడానికి అందరూ ఆనందంగా సువర్ణ కలశాలతో నిలబడి వుండగా, ఒక పెదతల్లి కొడుకైన శిశుపాలుడు రథానికి ధ్వజాన్ని కట్టాడు. మరొక పెదతల్లి కుమారుడు ఏకలవ్యుడు పాదరక్షలు తెచ్చి పాదాలు ముందు పెట్టాడు. పినతల్లి కుమారులైన అవంతినరేశులు విందాను విందులు నానాదేశాల రాజులు తెచ్చిన వివిధ నదీ జలాలను అందుకొని పెద్ద పెద్దపాత్రలలో పోశారు. ఈ పినతల్లి పెదతల్లి కుమారులందరిలోనూ పెద్దవాడు దంతవక్త్రుడు కూడా రాజసూయయాగంలో వున్నాడు.” ఈ సంగతులను యాగం తర్వాత ధృతరాష్ట్రునికి చెప్పుకొని ఏడ్చాడు, ([illegible]వ అధ్యాయంలో 4 నుంచి 8 దాకా గల అయిదు శ్లోకాలు).

రాజసూయ యాగంలో శ్రీకృష్ణునికి అగ్రపూజ తగదని ఆక్షే పిస్తూ శిశుపాలుడు దానికి అన్నివిధాలా అర్హులైన వాళ్ళలో ఏకలవ్యుణ్ణి ఒకడంటూ చెపుతాడు. (37వ అధ్యాయంలోనూ, 44వ అధ్యాయంలోనూ ఈ సంగతి వుంది.)

రాజసూయం తర్వాత ఏకలవ్యునికి శ్రీకృష్ణునిపై ద్వేషం పెరిగింది. ఏకలవ్యుడు ఎలా మరణించాడో హరివంశం చెప్పదు. అందుకే హరివంశం మీద విపుల పరిశోధన చేసిన డాక్టర్ పి. యశోదారెడ్డిగారు "ఏకలవ్యుడు శ్రీకృష్ణునితో ప్రత్యర్థిగా పోరాడి మృతినిగాని అపజయాన్నిగాని పొందలేదు." అని వ్రాశారు. (తెలుగులో హరి వంశములు... పుట... 380) అయితే ఏకలవ్యుడు నిజంగా కృష్ణుని చేతిలోనే చనిపోయాడు. ఉద్యోగ పర్వంలో సంజయ రాయబారానికి ముందు ఏకలవ్యుడు సజీవుడే. తమ పక్క పోరాడవలసినదని ఆహ్వానించవలసిన రాజులలో ఏకలవ్యునీ, అతని కుమారునీ కూడా ద్రుపదుడు చేర్చాడు. (ఉద్యోగ- అ_ 4 శ్లో 17) అయితే సంజయుని ద్వారా అర్జునుడు కురుసభకు పంపిన సందేశంలో కృష్ణుడు ఎవ్వరిని ఏవిధంగా వధించినదీ చెప్పాడు. ఈ హతులలో ఏకలవ్యుడు కూడా వున్నాడు.

అయాస్మ యుద్ధే మన్యతేరజేయం
తమేకలవ్యం నామ నిషాదరాజా
వేగే నైవశైల మభిహత్య జంభః
శేతేస కృష్ణేన హత పరాసుః

[ఉద్యోగ - అ 48 - శ్లో 77]

యీ శ్లోకాన్ని తిక్కనగారు అనువదించలేదు. దీన్నే అన్న అన్నమాటేమిటి. శ్రీకృష్ణ పరాక్రమాన్ని వర్ణించే ఎన్నో శ్లోకాలు ఈ ఘట్టంలో వుంటే వాటిని ఒక పద్యంలో సరిపెట్టి ఊరుకొన్నాడు. ఏమైనా ఏకలవ్యుడు కృష్ణుని చేతిలో మరణించాడు. యీసంగతి ద్రోణపర్వంలో కృష్ణుడు స్వయంగా అర్జునితో చెప్తాడు. "ఏకలవ్య శిశుపాల జరాసంధులను నీ కోసమే ఒక్కొక్క పద్ధతిలో చంపాను. వాళ్ళు ముగ్గురూబతికే

వుంటే దుర్యోధనుడు వాళ్ళను తెచ్చుకునేవాడు. అప్పుడు ఆ ముగ్గుర్నీ ఎదిరించడం ఎవరి వల్లాకాదు" అని కృష్ణుడు చెప్పిన మాటలను తిక్కన గారు సుదీర్ఘ వచనంలో తెనిగించారు. (ద్రో...)

కృష్ణుడు తన నాలుగో మేనత్తకుంతి కొడుకుల శ్రేయస్సు కోసం మొదటి ముగ్గురు పెద్ద మేనత్త కుమారులైన దంతవక్త్రి, శిశుపాల, ఏకలవ్యులను భారత యుద్ధానికి ముందే చంపివేశాడు. చివరి మేనత్త కుమారులు విందాను విందులు భారత యుద్ధంలో దుర్యోధనుని పక్షాన పోరాడి మరణించారు. పనిపెట్టుకొని పరిశోధిస్తే ఏకలవ్యుని గురించే కాక అతని కుమారుని గురించి కూడా వివరాలు దొరికాయి. ఇది ఏకలవ్యుని సంపూర్ణ జీవితం.

[శ్రీ దాసరి నారాయణరావు గారు దర్శకత్వంలో తీయాలను కొన్న "ఏకలవ్య" చలనచిత్రానికి నేను రచయితను. ఆ సందర్భంలో ఈ సమాచారాన్ని సేకరించాను. నా పరిశోధనలో ఉపయోగించుకొనడానికి హరి వంశంలోని మూల శ్లోకాలు ఎత్తి రాసి పంపమంటేమిత్రులు పండితులు అయల సోమయాజుల నరసింహశర్మగారు ఎన్నో శ్లోకాలను పంపారు. వారికి కృతజ్ఞతలు)

# కృష్ణుడూ కొట్టాడు మత్స్య యంత్రం

తొమ్మిదో ఏషియాడ్ సందర్భంగా మన తంతి తపాలాశాఖవారు ఒక స్టాంపును విడుదల చేశారు. ఇందులో శ్రీకృష్ణుడు మత్స్యయంత్రాన్ని కొడుతూవుంటే అర్జునుడు ప్రేక్షక మహాశయునిగాచూస్తూ నిలబడ్డట్టు చిత్రకారుడు చిత్రించాడు. ఈ బొమ్మ ఆక్షేపణల పాలైంది. గుట్టు చప్పుడుకాకుండా ఈస్టాంపును తపాలా శాఖవారు ఉపసంహరించుకో బోయారు. అయితే గుట్టుచాలా పెద్దచప్పుడుతో బట్టబయలు అయింది. ఉపసంహరణ అయ్యాక తపాలా శాఖవారిని ఎద్దేవచేస్తూ వ్యంగచిత్రాలు, ఉపసంపాదకీయాలు. సంపాదక లేఖలు వివిధభాషలలో వెలువడ్డాయి.

అర్జునుడు మత్స్యయంత్రాన్ని కొట్టాడు, ద్రౌపదినిచేపట్టాడు. ఇది సుప్రసిద్ధమైనకథే. అయితే సుప్రసిద్ధంకాని కథల్లో మత్స్యయంత్రాన్ని కొట్టగలిగినవాళ్లూ ఇంకా ఉన్నారు. ఉదాహరణకు ఆదిపర్వంలోని ద్రౌపదీ స్వయంవరం ఘట్టాన్నే తీసుకొందాం. ద్రుపదుడు ఒక్క అర్జునుడు మాత్రమే విలువంచి నారి తొడగగల ధనుస్సును చేయించాడు.

సో_అన్వేషమాణః కౌంతేయం
పాంచాల్యో జనమే జయ
దృఢం ధానురనానమ్యం
కాకారయామాస భారత (ఆది 184-9)

స్వయంవరానికి వచ్చిన వాళ్ళలో విల్లు వంచడానికి ప్రయత్నించిన వారు ఎంత శక్తితోవంచితే అంత శక్తితోనూ అది వాళ్ళను విసిరి కొట్టింది. మహాధనుర్ధరుడు కర్ణుడుమాత్రం అవలీలగా విల్లుతీసి, నారి తొడిగి బాణాలు సంధించాడు. ఆ సమయంలో ద్రౌపది అడ్డు చెప్పింది..

దృష్ట్వాకుతం ద్రౌపదీవాక్యముచ్చై
ర్జగాద నాహం వరయామి సూతం

సామర్షహాసం ప్రసమీక్ష సూర్యం
తత్యాజ కర్ణః స్ఫురితం ధనుస్తత్ (ఆది-186-23)

ద్రౌపది తీవ్రస్వరంతో నేను సూతకులజుణ్ణి వరించను అని గట్టిగా చెప్పింది, ఆ మాట వినగానే కర్ణుడి గుండె కొట్టుకుంది. ఆకాశంలోని సూర్యునివైపు చూస్తూ ధనుస్సును విడిచేశాడు.

ఈ శ్లోకాన్ని నన్నయ్యగారు అనువదించలేదు. దీనికి ముందున్న 21, 22 నెంబరు శ్లోకాల్లో ఈ శ్లోకమూ వావిళ్ళవారి దక్షిణ పాఠంలో లేవు. అయితే మధిర సుబ్బాశాస్త్రిగారి వర్తమాన తరగిణీ ముద్రాక్షర శాల ప్రతిలో వున్నాయి అంచేత దక్షిణ దేశంలో ఈ శ్లోకాలు ప్రచారంలో లేవని చెప్పలేం.

అర్జునుడిలాగ కర్ణుడు కూడా మత్స్యయంత్రాన్ని కొట్టగల మొనగాడె. పెళ్ళికూతురు కులం తక్కువవాడిని పెళ్ళాడను అని పేచీ పెట్టకపోతే మత్స్య యంత్రాన్ని కర్ణుడు కొట్టేసి షరతును నెరవేర్చ గలిగేవాడు, (తన కులం గురించి ఎవరయినా తక్కువ చేసి మాట్లాడి నప్పుడల్లా కర్ణుడు తన జన్మకు కారణ భూతుడైన సూర్యుణ్ణి చూపి స్తాడు కుమార అస్త్ర విద్య ప్రదర్శనలో ఇలాగే జరిగింది. ఈ సంగతిని నన్నయ్యగారు అనువదించారు.)

మన పురాణేతిహాసాలను అనువదిస్తున్నప్పుడు తెలుగు కవులు యథామూలంగా తెనిగించరు. కొన్ని దాటేస్తారు. అందువలన కొన్ని కథలు అప్రసిద్ధం అయిపోతాయి. ఆ కథలను ఎవరైనా ఒకవేళ ఆధారాలు చూపకుండా చెప్తే ఎద్దేవ పాలవుతారు. మన తంతి తపాల శాఖ వారు అదే అపార్థం పాలయ్యారు. వాస్తవానికి శ్రీకృష్ణుడు మత్స్య యంత్రాన్ని కొట్టాడు. కొట్టగలిగీ కొట్టలేకపోయినట్టు విఫలుడై అర్జు నుడు పక్కన నిలబడి చూస్తూ వూరుకొన్నాడు. ఇది భాగవతం దశమ స్కంధంలో వుంది. 83 వ అధ్యాయంలోని 24, 25, 26 శ్లోకాల్లో స్పష్టంగా వుంది. అయితే భాగవతాన్ని అనువదిస్తూ బమ్మెరపోతరాజు ఈ సంగతిని చెప్పలేదు.

శ్రీకృష్ణుడు ఎనమండుగురుభార్యలను చేసుకున్నాడు. ఒక్కొక్క

వధువును ఒక్కోరీతిన పెళ్ళాడాడు. ఎనిమిదవ పట్టమహిషి ఆయిన లక్షణను ఎలా పెళ్ళి చేసుకొన్నది పోతనగారు ఒక పద్యంలో ఇలా చెప్పారు.

అమరుల వారదోలి భుజ
గాంతకుడైన ఖగేశ్వరుండు ము
న్నమృతము దెచ్చుకైవడి
మదాంధుల రాజుల నుక్కడించి యా
కమల దళాయతేక్షణుడు
గైకొని తెచ్చెను మాద్రకన్యకన్
సమద మృగేక్షణన్
నయ విచక్షణ లక్షణ
బుణ్యలక్షణన్ [ఉత్తర భాగం - 147]

అనుప్రాసల మోజులో అసలు కథను మరచిపోయారు, అయితే కృష్ణుడు మత్స్యయంత్రాన్ని కొట్టి లక్షణను పెళ్ళిచేసుకున్నాడు. ఈ సంగతిని ఒక తెలుగు కవి చెప్పకపోలేదు. తాళ్ళపాక తిరువేంగళ నాథుడు "అష్టమహిషీ కళ్యాణం ఆనే ద్విపద కావ్యాన్ని రాశాడు, అందులో లక్షణా పరిణయాన్ని వర్ణించాడు. స్వయంవరానికి వచ్చిన రాజులు "విల్లువంచ లేక తల వంపులై కొందరు విన్ననైరి. భీమ విక్రములైన భీమరాధేయులు.

ఆ మహాధనువు సజ్యంబు గావించి
శరము సంధించి ఖేచరసీమ మీన
చరముపై బూని తజ్జలముల దాని
తిరుగుడు వడిగాంచి తెలియంగలేక
తిరుగుడు వడిరి. [పంచమ 70 78 నుండి]

లక్షణా స్వయం వరంలో భీముడూ, కర్ణుడూ కూడా మత్స్య యంత్రాన్ని కొట్టడానికి ప్రయత్నించి విఫలులయ్యారని పై ద్విపద పాదాలు చెపుతున్నాయి పీళ్ళ వైఫల్యం తరువాత-

అంత దేవేంద్ర తనయు

దేయు బాగెరిగి తానేయగా బోవ
నేయు నుపాయము గన కేటికిది తొల [గె]

అప్పుడు కృష్ణుడు క్రీగంట నవ్వుతూ అక్కడున్న వాళ్ళందర్నీ చూస్తూ -

అలవోక డాకేల నలధనువంటి
వలకేల మౌర్వీచువ్వన నెక్కుపెట్టి
యంబకంబలి వోసి యంబర మధ్య
శంబర పరచ్ఛాయ భూభాగ
శంబరంబున గాంచి సరగున మీను
శంబరాంతకు తండ్రి చక్కగా నిగిడి
ధరగూలనేసె

[పంచమ 7077 నుండి 7083 దాకా పంక్తులు]

యీ వర్ణన బట్టి కృష్ణుడు మత్స్యయంత్రాన్ని కొడుతూవుంటే అర్జునుడు చూస్తున్నాడని స్పష్టమవుతూ వుంది. లక్షణా పరిణయాన్ని చదువుకొన్న రాజస్థాన్ చిత్రకారుడెవరో ఒకబొమ్మను ఎప్పుడోగీశాడు. అది జయపూర్ మ్యూజియంలో మినియేచర్ చిత్రాల విభాగంలోవుంది. యీ బొమ్మలు సుప్రసిద్ధాలు, వీటిలో వున్న మత్స్యయంత్ర చిత్రాన్నే మేము అనుసరించామని తంతి తపాలశాఖ అధికారులలో అభిజ్ఞులు చెప్పారు, భారత భాగవత కథలలో తేడాలున్నాయని వారు పేర్కొన్నారు.

తంతి తపాల శాఖవారి సంజాయిషీ తాటికింద పాలుతాగిన చందమయింది. "ఏళ్ళ తరబడి వుత్తరాల నత్తనడక నుంచి, అవసరం తీరిపోయాక తర్వాత పెలిగ్రాముల బట్వాడా వరకూ ఎన్నో అవకతవకలకు నిలయమయిన తంతితపాల శాఖ" చెప్పిన సంజాయిషీ కనుకదాన్ని పట్టించుకొన్నవాళ్లు కూడా లేకపోయారు, యీ స్టాంపును అలవాట్లో పొరపాటుగా, పొరపాట్లలో అలవాటుగా అందరూ జమ కట్టుకున్నారు.

నిజానికి శ్రీకృష్ణుణ్నే ఆల్‌రౌండ్_ఎథిలెట్లకు ప్రతినిధిగాస్టాంపులో చిత్రించటం చాలా సముచితము. ఎనిమిదిమంది భార్యలను పెళ్ళిచేసుకోవటంలో ఎనిమిది రకాల ఫీట్లు చేశాడు. కృష్ణుడు పెద్ద బుల్‌ఫైటరు.

సత్యకీర్తి పెళ్ళిలో ఆంబోతులను అణచాడని అష్టమహిషీ కల్యాణం చెపుతూంది. యీ బుల్‌ఫైటు నాగ్నజితి పెళ్ళిలో జరిగిందని పోతరాజుగారి భాగవతం చెపుతూంది. కృష్ణుడు పెద్దబేర్ ఫైటర్. జాంబవంతుడ్ని ఓడించి జాంబవతిని పెళ్ళిచేసుకొన్నాడు. అర్చరీలో మొనగాడని మత్స్య యంత్రం కథ చెపుతూనే వుంది.

కృష్ణుడు స్విమ్మింగు ఛాంపియన్ అని కూడా చెప్పాలి. కాళీయ మర్దనం, కాళిందీ పరిణయం యీ సంగతినే చెపుతున్నాయనుకోవాలి. అండర్ వాటర్ అక్టోపస్ ఫైట్‌లాంటిదే కాళీయమర్దనం. కాళిందిని నీట్లో చూసి కృష్ణుడు పెళ్ళి చేసుకొన్నాడు.

రుక్మిణిని, మిత్రవిందను స్వయం వరం ముందూ, స్వయంవరం తరువాత ఎత్తుకుపోయి మిగతా పోటీదార్లతో పోరాడి గెలుచుకొన్నాడు. భద్ర, కేకయరాజు కూతురు కైకేయి. ఇది మేనరికం. మిత్రవింద కూడా మేనరికపు కూతురే. మిత్రవింద విషయంలో ఎత్తుకుపోవడం, దెబ్బలాట, బొమ్మి ఉన్నాయి కనుక భద్ర విషయంలో కూడా జరిగే వుంటుంది.

ఇకపోతే సత్యభామ పెళ్ళి అన్నిటికన్నా పెద్ద గోల్డుమెడల్. శ్యమంతకమణి కోసం జరిగిన పెద్ద ఎడ్వంచర్, కృష్ణుడు డిస్కస్‌త్రోలోనూ, ఛారియెట్ రేసులోనూ కూడా ఛాంపియన్ అనిచెప్పాలి. రాముడి బాణం కృష్ణుడి చక్రం బూమెరాంగ్ ఆయుధాలు. పగవాడ్నిచంపి వెంటనే చేతికి చేరుకొంటాయి. ఇంతటి ఆల్‌రౌండు క్రీడాకారుడ్ని ఏషియాడ్ స్టాంపుమీద చిరస్మరణీయునిగా చిత్రిస్తే తప్పులేదు. అర్జునుడే మహా క్రీడి అనుకొని అర్జున అవార్డులను మన ప్రభుత్వం నిర్వహిస్తున్నది కనుక అర్జునుడు మత్స్యయంత్రాన్ని కొట్టడమే వాంఛనీయమయిన స్టాంపుగా సామాన్య జనం అనుకొన్నా తంతిరపాలావారి ప్రాచీన పరిశోధనా శక్తి ప్రశంసనీయమే.

కర్ణుడూ, భీముడూ, అర్జునుడూ (ముగ్గురూ కుంతి కొడుకులే) కొటలేక ఓడిపోయిన మత్స్యయంత్రంఫీటులో మత్స్యాన్నికొట్టి మత్స్య

కంటిని కట్టుకొన్న ఘనుడు కృష్ణుడే అన్న కథను సుప్రసిద్ధంచేసి పళ్ళా ఆ స్టాంపును తంతితపాలా శాఖవారు విడుదల చేయడం మంచిదే.

ఇప్పుడు కాకపోతే ఇంకోసారి చెయ్యవచ్చు. 1992 ఒలింపిక్ ఎలాగూ మనదేశంలో జరిపే ఆలోచన వుంది కాబట్టి కనీసం అప్పటికి యీ స్టాంపును విడుదలచేస్తే, పొరపాట్లలో అలవాటుగా భావించి పదేళ్ళ తరువాత భావాన్ని బట్వాడా చేశారని భారతీయులంతా ఆస్టాంపును ఆమోదించవచ్చు. తంతి తపాల శాఖవారు తొందరలో ఏ మంచి పనిచేసినా అది తొందరపాటుతో చేసిన పొరపాటుగా దేశం భావించకపోతే అది పెద్దపొరపాటు

[కలం తాజా; యీ వ్యాసాన్ని చదివిన తంతి తపాలా శాఖ వాళ్లు కొందరు వుండవచ్చు. వాళ్ళకు మనవి: అయ్యా! మిమ్మల్ని, మీ శాఖనీ ఎనకేసుకొచ్చినందుకు దయచేసి నా "వ్యాసపీఠం" కవర్లు రవాణాలో పారెయ్యకండి, ఇప్పటికే నేదునూరి గంగాధరంగారి మీదా, బాలమురళి కృష్ణగారిమీదా రాసిన వ్యాసాలు గల్లంతుఅయ్యాయి, మృతలేఖా కార్యాలయంలో అవి మూలుగుతూ వుంటే ఒలింపిక్స్ నాటికయినా వాటిని వాపసు చేయండి.)

□ * □

# దీపావళికి నరకాసురుడా, బలిచక్రవర్తా ముఖ్యుడు?

ప్రతి పండుగకి ఒక ప్రయోజనం ఉంటుంది. సాంఘిక ప్రయోజనంలేని పండుగలు నిజంగా దండుగలు. పండుగలు జాతి జీవనానికి ప్రతీకలు. ఒకనాటి వుత్పత్తి విధానాలకు వ్యాఖ్యానాలు. ఆహారోత్పత్తి విధానాల పైన ఆర్థిక వ్యవస్థ ఆధారపడి వుంటుంది. ఆది నుంచి మనదేశం వ్యావసాయక దేశమే కనుక మన పండుగలన్నీ సేద్యానికి సంబంధించినవే. కొన్ని పండుగలు రోజుల తరబడి చేయవలసినవి.

ప్రస్తుతం మనం దీపావళిని రెండు రోజుల పండుగగా జరుపుకొంటున్నాం. ఆశ్వయుజ బహుళ చతుర్దశిని నరక చతుర్దశిగానూ, అమావాస్యను దీపావళి అమావాస్యగానూ పేర్కొని పర్వం గడుపుతున్నాం.

సత్యభామా సమేతుడైన కృష్ణుని చేతిలో నరకాసురుడు ఆశ్వయుజ బహుళ చతుర్దశినాటి రాత్రి రెండుజాముల తరువాత మరణించాడు. లోక కంటకుని పీడ వదిలిందన్న ఆనందంతో లోకులు ఆ శేషించిన రాత్రినీ, మర్నాటి రోజంతా పండగ చేసుకొన్నారు. అదే ఏటేటా మనం చేసుకొంటున్నాం. ఇది ప్రచారంలో వున్న దీపావళి కథ. అయితే, వాస్తవానికి నరకాసురుడికి, దీపావళికి సంబంధం లేదు. బలిచక్రవర్తితో కొంత సంబంధం వున్నది.

దక్షిణ భారతదేశంలో పూర్వం దీపావళిని మూడు రోజుల పండుగగా జరిపేవారు. ఆశ్వయుజ బహుళ చతుర్దశి నరక చతుర్దశిగా, అమావాస్యను దీపావళిగా, కార్తీక శుద్ధ పాడ్యమిని బలిపాడ్యమిగా నిర్ణయించి మూడు రోజులూ పండుగ చేసుకొనేవారు. బలిపాడ్యమినాడు జూదమాడాలి. ఆనాడు జూదంలో గెలిస్తే ఆ సంవత్సరమంతా గెలుపే.

తరువాత గోవర్ధన పూజ చేయాలి. గోవుల గవిసెలనూ, పాలు పితికే పాత్రలను పూజించాలి. ఆవులను అలంకరించి వాటి మానాన వాటిని వదిలి పెట్టాలి. బలిచక్రవర్తి వామన పాదం వల్ల పాతాళానికి పోతున్నప్పుడు ఈ మూడు దినాలు బలిరాజ్యమవ్వాలని, తన రాజ్యంలో దీపదానం చేసిన వారింట లక్ష్మి శాశ్వతంగా ఉండాలని వరం కోరుకున్నాడు. అందుకే ఆశ్వయుజ బహుళ చతుర్దశీ, అమావాస్య, కార్తీక శుద్ధ పాడ్యమి బలిరాజ్య దినాలు అయినాయి. ఈ మూడురోజులూ పండుగ చేస్తేనే అది సమగ్రమైన దీపావళి పండుగ అవుతుంది.

అయితే, బలి రాజ్యదినాలలో నరకుడు ఎలా చొరబడ్డాడు ? దీనికి ఒక కారణం ఉంది. బలి కోరుకున్న వరాలలో ఇంకొకటి ఉంది. చతుర్దశి నాడు నరకార్థం దీపదానం ముడివేస్తే అది ఇప్పటికి పీటముడిగా మారింది. దీపావళికీ, నరకాసురుడికీ ఏ విధమైన సంబంధం లేదని చెప్పిన వాళ్ళను అనుమానంగా చూస్తారు.

అయితే, అదృష్టవశాత్తు మన పండుగలకూ, పబ్బాలకూ ఒకరకం ప్రామాణికమైన వ్రతగ్రంథాలు ఉన్నాయి. ధర్మసింధువు, వ్రత చూడామణి, మదవ పారిజాతం, స్మృతికౌస్తుభం మొదలయిన గ్రంథాలు మన పండుగల పుట్టుపూర్వోత్తరాలను తెలియ జేస్తాయి.

ఈ గ్రంథాలన్నిటినీ శ్రద్ధగా పరిశీలించి, విస్తారంగా పరిశోధించి తిరుమల రామచంద్రగారు "హిందువుల పండుగలు - పర్వములు" అనే చక్కని గ్రంథం రాశారు. చేసేవారి పితృగణం నరకం నుండి స్వర్గానికి పోతుందనే హామీని బలి కోరాడు. ఈ వరంలోని నరక శబ్దానికి భాగవత, హరి వంశాలలోని నరకాసుర శబ్దాన్ని బాదరాయణ సంబంధం కల్పించి మన పురోహిత వర్గాలవాళ్ళు ఆదిలో ఒక జారు అందులో దీపావళి గురించి ఇలా రాశారు.

"....అన్ని గ్రంథముల లోను బలిచక్రవర్తి గాథయే వివరింపబడి వది.... ధర్మశాస్త్ర వ్రత గంథముల యందును పురాణముల యందును నర

కాసుర వధ దీపావళి పండుగకు కారణమని ప్రమాణము లేనందున నరకాసుర వధ కథ విశ్వసనీయము కాదనియే తోచుచున్నది."

## —: ఏ ఆర్థిక ప్రాతిపదిక :—

రామచంద్ర గారు వ్రత గ్రంథాలలో వివరాలన్నీ చెప్పారుగాని దీపావళి పండుగను ఏ ఆర్థిక ప్రాతిపదికమీద మొదలు పెట్టారో చెప్పలేదు. మన పండుగలనూ, పబ్బాలనూ మార్క్సిస్టు తత్వశాస్త్ర రీత్యా విశ్లేషణ చేసినప్పుడే పర్వదినాలలోని సామాజిక పరమార్థాన్ని అర్థం చేసుకో గలుగుతాము.

బలిపాడ్యమినాడు జూదమాడాలని మత గ్రంథాలు చెపుతున్నాయి. సమిష్టి సంపదను సంఘ సభ్యులు పంచుకొనడంలో జూదం ఒక సాధనం. యజ్ఞయాగాదులలో అక్షక్రీడకు చాలా ప్రాముఖ్య ముంది. బలిచక్రవర్తి తాను చేసిన యజ్ఞంలో ఎన్నో దానాలు చేశాడు. అది మన సమాజంలో ఆదిమ సమాజంలో దాన విధానంపై పరిశోధించిన పండితులు ఈ జూదం పద్ధతిని బాగా వివరించారు.

శ్రమ ఫలితాన్ని పంచుకునే రోజున సంఘ సభ్యులంతా పెద్దలను తలచుకొంటారు. పెద్దలు తృప్తి పడితేనే జీవితం బాగా సాగుతుంది. అందుకే అమావాస్యనాడు పితరులకు తర్పణాలు వుంటాయి.

దీపావళినాడు కొరువులు చేతపట్టుకొని పితరులకు దారి చూపాలి. ఒకప్పుడు దక్షిణాయణం తులా సంక్రమణం నుండి ప్రారంభమవుతుంది. ఆనాడే దీర్ఘ రాత్రి మొదలవుతుంది. ఈ ఆరు నెలల రాత్రిలో పితరులు సద్గతి పొందటానికి దీపావళినాడే కాక, కార్తీక మాసమంతా దీపాలు పెట్టాలి.

మా చిన్నప్పుడు దీపావళినాడు టపాకాయలు కాల్చటానికి ముందు దిబ్బు కొట్టేవాళ్ళం. వ్రత గ్రంథాలలో చెప్పిన "ఉల్కాహస్తాః నరాః కుర్యుః పితౄణాం మార్గదర్శనం" అన్నది ఈ దిబ్బుకొట్టడమే. దిబ్బు కొట్టి తీపి తిన్నాకనే టపాకాయలు కాల్చడం జరిగేది. దిబ్బు కొడుతున్నప్పుడు చిన్నా పెద్దా కలిసి ఒక చిన్న పాట పాడేవాళ్ళం.

"దిబ్బూ దిబ్బూ దీపావళి
మళ్ళీ వచ్చే నాగులచవితిని
ఎప్పుడు తిందుం చిమ్మిలిముద్దా
ఎప్పుడు తిందుం చలివిడిముద్దా"

దీపావళి రోజున నాగులచవితిని ఎందుకు తలుచుకొనడం? పాములు పంటలను పెంపొందిస్తాయని, సంతానాన్ని ప్రసాదిస్తాయని ఆదిమ కాలం నుండి లోక విశ్వాసం. దీపావళికూడా నాగులచవితిలాగే వ్యవసాయికమైన పండుగ అని చెప్పుకోవాలి. రెండు వందల ఏళ్ళ క్రితం మన దక్షిణ భారతీయులు దీపావళిని ఎలా జరుపుకొనేవారో గమనిస్తే దీని అర్థిక ప్రాతిపదిక బోధపడుతుంది.

అబేదుబాయ్ అనే పాదిరీ దక్షిణ భారతదేశంలో క్రీస్తు శకం 1792 నుండి 1823 దాకా పర్యాటనం చేస్తూ జీవించి, మన ఆచార వ్యవహారాలూ, పండుగలూ పర్వాలూ గమనించాడు. "హిందువుల ఆచారములు, పర్వములు" అనే గ్రంథం రాశాడు. అందులో దీపావళి గురించి యిలా రాశాడు:

"నవంబర్ చివరిలోగాని, డిశెంబర్ మొదటిలోగాని దీపావళిని దివ్వెల పండుగగా జరుపుకొంటారు. ఇది చానాళ్ళపాటు విస్తరించి వుంటుంది. ఇది జరుపుకొనేటంత కాలం సాయంకాలం దీపాలను వెలిగించి ఇంటి గడపల దగ్గర పెడతారు. లేదా వీధులలో రాటలకు ఎత్తుగా దీపాలు కడతారు. ఈ పండుగను పంట కోతలకొచ్చే సమయంలో

జరుపుతారు. సేద్యగాళ్ళు కలిసికట్టుగా గుంపులుగా పొలాలకు ఊరేగింపుతో వెళ్ళి చేలకు పూజలు చేస్తారు. మేకలను గొర్రెలను బలిచేస్తారు. పంట కొల్లలుగా పండాలని కోరుకొంటారు. వ్యవసాయదారుడు వరుసగా మూడు రోజులపాటు తనంతకుముందు పోగుచేసిన పేడ గుట్టముందు సాష్టాంగపడి ఆ గుట్టకు పువ్వులతో పూజ చేస్తారు. పేడగుట్టముందు దీపాలు పెట్టి పొంగళ్ళు పొంగించి ఎరువుగా భూసారాన్ని వృద్ధిచేయమని దీనంగా వేడుకొంటాడు. ఈ పూజలు రోమనులు ప్రాచీన కాలంలో తమ దేవత స్టెర్క్యులియస్‌కు పూజలను పోలి వుంటుంది ".

దుబాయ్ పాదరీ గ్రామీణ వర్గాల ఆచారాలను గమనించి రాశాడు కాబట్టి దీపావళికి గల ఆర్థిక ప్రాతిపదికను సూచించగలిగాడు. మన వ్రత గ్రంథాలలో ఉన్నత వర్గాల వాళ్ళకు సంబంధించినవే తడుముతారు, గాని శ్రమజీవుల ఆచారాలను నోములను చెప్పరు. ఒకవేళ చెప్పినా వాటి అంత రార్థాలు వ్యాఖ్యానించరు.

దుబాయ్ పాదరి అబద్ధాలేవి వ్రాయలేదనడానికి సాక్ష్యాలు వున్నాయి. ధర్మ సింధువులో దీపాళినాడు గోవర్ధన పూజ చేయుచున్నారు. గోవర్ధన పర్వత సాన్నిధ్యంలో ఆ పూజ చేయాలి. లేకపోతే " తదసాన్నిధ్యే గోమయే నాన్న కూటే నవాగోవర్ధనం కృత్యా తత్సహిత గోపాల పూజా కార్యా " అని చెప్పాడు. గోవర్ధన పర్వతం దగ్గర కాకపోతే పేడతో గాని అన్నపు రాశితోగాని గోవర్ధనం చేసి గోపాలునితోపాటు పూజించాలి.

అన్నపు రాశితో గోవర్ధనము చేసి పూజించగలిగేది మహారాజులకే గాని పేదలకు సాధ్యం కాదు. పేడతో గోవర్ధనం చేసి పూజించే పేదలనే దుబాయ్ పాదరీ చూశాడు. ఇవాళ దీపావళినాడు పేడ గుట్టకు పూజ చేసే ఆచారం పల్లెటూళ్ళలో మారుమూల యింకా బతికుందో లేదో తెలియదు. దీపావళికి ఆర్థిక విధాన ప్రాముఖ్యం పోయాక నరకాసురుడు కథలో జొర

బడ్డాడు. ఇది టపాకాయల వేడుకగా పరిణమించింది. లక్షలు పెట్టుబడి పెట్టి కోట్లు ఆర్జించే టపాకాయల పరిశ్రమ యజమానులకు లాభాలు తెస్తూందేగాని దీపావళి తన ఆశను సాంఘిక ప్రయోజనాన్ని కోల్పోయినట్టు కానబడుతోంది.

—:—

# వ్యాస పూజ - చతుర్మాస్యం

ఇటీవల మన తెనుగు గడ్డమీద కర్నూలులో కంచి కామకోటి పీఠానికి సంబంధించిన ముగ్గురు ఆచార్యులు వ్యాసపూజ చేసి చాతుర్మాస్య దీక్షను పూనారు. సన్యాసాశ్రమాన్ని స్వీకరించిన ప్రతి ఒక్కరూ చాతుర్మాస్య దీక్షను వహించక తప్పదు. అయితే ఒక పీఠానికి చెందిన ముగ్గురు ఆచార్యులు ఒకే పూటలో ఈ దీక్షా విధులను నిర్వహించడం చాలా అపురూపమైన విషయం.

చాతుర్మాస్యం అంటే ఏమిటి? ఇది ఎందుకు పాటించాలి ? ఎన్నాళ్ళు పాటించాలి ? అనే ప్రశ్నలు సామాన్యులకు సహజంగా కలుగుతాయి.

చాతుర్మాస్యం అంటే ఆదిలో నాలుగునెలలపాటు చేసే ఒక యజ్ఞం. ఫాల్గుణ పూర్ణిమ వెళ్ళిన పాడ్యమినాడు మొదలుపెట్టి ఆషాఢ పూర్ణిమ దాకా దీనిని చేసేవారు. దీనిని వైశ్య దేవ యజ్ఞం అంటారు. అయితే ప్రస్తుత చాతుర్మాస్యం అంటే ప్రతి సంవత్సరం ఆషాఢ శుద్ధం మొదలు కార్తీక శుద్ధం దాకా చేసే వ్రతమనే రూఢి అయింది. దీనిని వార్షిక చాతుర్మాస్యం అని అంటారు. దీనిని ఆషాఢ శుద్ధ ద్వాదశి నుంచిగాని పున్నమి నుంచిగాని ప్రారంభిస్తారు. కర్నూలులో కంచికామకోటి ఆచార్యత్రయం ఈ వార్షిక చాతుర్మాస్యాన్నే ఆచరిస్తున్నారు.

వార్షిక చాతుర్మాస్యం అంటే వర్షానికి సంబంధించినది. వర్షం అంటే సంవత్సరమనీ. వాన అనికూడా అర్థాలున్నాయి. ఈ రెండర్థాలు ఈ చాతుర్మాస్యానికి వర్తిస్తాయి. ఈరోజుల్లో మన సంవత్సరాది చైత్ర శుద్ధ పాడ్యమి నాడు మొదలవుతుంది. గాని వివిధ కాలమానాలను బట్టి వివిధ మాసాలలో వివిధ తిధులలో సంవత్సరాది ప్రారంభ మవుతుంది.

తెలుగువాళ్ళూ, కన్నడిగులూ, మహారాష్ట్రిలూ చాంద్రమానం ప్రకారం కాలాన్ని పరిగణిస్తారు కనుక చైత్ర శుద్ధ పాడ్యమిని సంవత్సరాదిగా పరిగణిస్తారు. సౌరమానం ప్రకారం కాలాన్ని కొందరు పరిగణిస్తారు. తమిళులూ, మళయాళీలు, వంగ దేశీయులూ. పంజాబీలూ, అస్సాం వాసులూ సౌరమానం పాటిస్తారు. మార్వాడీలూ, గుజరాతీలూ

బార్హస్పత్యమానాన్ని ఉపయోగిస్తారు. జైనులు దీపావళిని ఉగాదిగా భావిస్తారు. ఒకప్పుడు చాతుర్మాస్య ప్రారంభ దినం హిందువులకు ఉగాదిగా చెలామణీ అవుతూ వుండేది. ఇంపకు కారణాలు వున్నాయి.

సంవత్సరాన్ని కొలవడానికి మానవునికి ప్రకృతిలో తోడ్పడేవి సూర్య చంద్రులూ, నక్షత్రాలూ మాత్రమే. కొందరు సూర్యుని గమనాన్నిబట్టి, కొందరు చంద్రుని గమనాన్నిబట్టి కాలాన్ని కొలవడం ప్రారంభించారు. సూర్యుడు ద్వాదశ రాశులలో వుంటే కాలాన్నిబట్టి మాసాల పేర్లు, నక్షత్రాలలో వుండే కాలాన్నిబట్టి కార్తెలు పుట్టాయి. ఒకప్పుడు మన తెలుగుదేశంలో సౌరమాసం ప్రచారంలో వుండేది. మనవాళ్ళు సౌరమానాన్ని విడిచిపెట్టి చాంద్ర మానాన్ని అవలంబించినా నేటికి పంటలు పండించే రైతు మాత్రం కార్తెలనే నమ్ముకుంటాడు. ఒక్కొక్క కార్తెను బట్టి ఒక్కొక్క సామెతకూడా పుట్టింది. ఉదాహరణకు కొన్ని వ్యవసాయ సామెతలు చూడండి.

1. అనూరాధ కురుస్తే మనోరోగాలు పోతాయి.
2. అనూరాధలో అడిగినంత పంట.
3. అశ్వని కురిస్తే అంతా నష్టం.
4. ఆరుద్ర కురిస్తే దారిద్ర్యం లేదు.
5. ఉత్తర ఉరిమినా, పాము తరిమినా కురవక, కరవక మానవు.
6. ఉత్తర చూసి ఎత్తర గంప.
7. కృత్తిక. పునర్వసులు సత్తువ పంట.
8. చిత్త చిత్తగించి, స్వాతీ చల్లబడి, విశాఖ విసరకుంటే వీసానికి పుట్టెడు పండుతావన్నదట.
9. చిత్త, స్వాతులు కురవకపోతే చిగురుటాకులు మాడిపోతాయి.
10. జ్యేష్ఠ చెడు కురుస్తుంది. మూల మురిగి కురుస్తుంది.
11. తొలకరి వాన మొలకల తల్లి.
12. మఖలో మానెడు పుబ్బలో పుట్టెడు.
13. మృగశిర కురిస్తే ముసిలి ఎద్దు రంకెలేస్తుంది.
14. రోహిణీలో చల్లితే రోటికి పంటరాదు.
15. హస్త ఆదివారం వస్తే చచ్చినంత పంట.
16. హస్తలో ఆకు అల్లాడితే చిత్తలో చినుకు లేదు.

ఈ ఉదహరించిన సామెతలన్నీ వానలకు సంబంధించినవే. "వానవుంటే పంటలు లేకుంటే మంటలు" అనేది కూడా రైతు చెప్పు కొనే సామెతే। "కాలంలో విత్తనాలు కలలోనైనా జల్లాలి" అన్నది వ్యవసాయదారుని వ్యవహారోక్తి. సేద్యగాడికి మూడే కాలాలు వున్నాయి. అవి ఎండాకాలం, వానాకాలం శీతాకాలం. ఇవి ఒకప్పుడు నాలుగేసినెలలు వుండేవి. వానాకాలం నాలుగునెలలలోనూ చాతుర్మాస్య వ్రతాన్ని గృహిణీ గృహస్థులూ, ముఖ్యంగా యతులూ పాటించాలి.

పూర్వకాలంలో అనగా చాలా పూర్వకాలంలో మనకు వానా కాలంతోనే ఏడాది ప్రారంభమయ్యేది. వానను వర్షం అంటారు. అందుకే సంవత్సరాన్నికూడా వర్షం అని పిలుస్తాం. ఆ ప్రాచీన కాలంలో ఆషాఢ మాసం నుంచి కార్తీకందాకా వానలు కురిసేవి. బాగా ముసురు పట్టి నప్పుడు ఈ ఇంటిమీద కాకి ఆ ఇంటిమీద వాలదు. అటువంటప్పుడు ఒక వూరు నుంచి మరొక వూరుకు ప్రయాణం చాల ప్రమాదభరితం. సన్యా సులు నిత్యం ప్రయాణం చేయవలసినవాళ్లు. వానాకాలంలో అది సాధ్యం కాదు. కనుక ఆ నాలుగు నెలలు సన్యాసులకు చాతుర్మాస్య దీక్షను శాస్త్రం అనుమతించింది. ఇది ఒక్క హిందువులే కాక బౌద్ధులూ, జైనులూ కూడా పాటించేవారు. వానాకాలం ఏ మతం వారికైనా ఒకటే మరి.

శాస్త్రం నాలుగు వర్ణాలను ఏర్పరచినట్టే నాలుగు ఆశ్రమాలను కూడా నిర్దేశించింది. ద్విజులకు మాత్రమే ఆశ్రమాధికారం వుందని బ్రహ్మసూత్రాలు చెప్తాయి. మొదటి ఆశ్రమం బ్రహ్మచర్యం. ఇది విద్యార్థి దశ. గురుశుశ్రూషలో నిమగ్నుడైన విద్యార్థి రాజైనా సరే, రైతైనాసరే తిరిపిమెత్తుకుని తినాల్సిందే. తర్వాత ఆశ్రమం గృహస్థా శ్రమం. ఇందులో "పెళ్ళి చేసుకుని ఇల్లు చూసుకుని చల్లగ కాలం గడ పాలి" తన కుటుంబ పోషణకేకాక ఇతరవర్గాల పోషణకు గృహస్థాశ్ర

మంలో ద్రవ్యాన్ని ఆర్జించాలి. అన్ని ఆశ్రమాలలో గృహస్థాశ్రమమే గొప్పది. అందుకే అల్లసాని పెద్దనగారు ఇలా ప్రస్తుతించారు :

కెలకులనున్న తంగేటి జున్ను గృహమేధి
యజమానుడంక స్థితార్థ పేటి
పండిన పెరటి కల్పకము వాస్తవ్యుండు
దొడ్డికట్టిన వేల్పు గిడ్డికావు
కడలేని యమృతంపు బావి సంసారి
సవిధ మేరునగంబు, పవనభర్త
మరుదేశ మధ్యమ ప్రప కులపతి
యాకటి కొదవు సస్యము కుటుంబి
బధిర పకరాద భిక్షుక బ్రహ్మచారి
జటి పరివ్రాజ కాతిథి క్షపణికావ
ధూత కాపాలి కాద్యనాథుల కెల్ల
భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె

[మను చరిత్ర 1-66]

ఈ సీసపద్యం ఎత్తుగీతిలో చెవిటివాళ్ళమా, కుంటివాళ్ళనూ, గుడ్డివాళ్ళనూ, బిచ్చగాళ్ళనూ, బ్రహ్మచారులనూ. వానప్రస్తులనూ, సన్యాసులనూ, ఆంతరంగికులను, బౌద్ధబిక్షుకులనూ, దిగంబర సన్యాసులనూ, పుర్రెతో బిచ్చమెత్తుకొనే కాపాలికులనూ చెప్పి ఇటువంటి దిక్కులేని వాళ్ళందర్నీ ఆదుకొనే వాడే గృహస్థు అని పెద్దనగారు చెప్పారు.

వయస్సు ముదిరాక పెళ్ళాంతోగానీ, తానొక్కడే ఒకాని అడవుల్లోకి పోయి కాయా కసరూ ఏరుకొని తినే ఆశ్రమం వానప్రస్థం. ఇదిమూడోది ఇక నాలుగో ఆశ్రమం సన్యాసం. అన్నీ పరిత్యాగం చేసి గృహస్థుల ఇళ్ళలో తిరిపమెత్తుకొని తినవలసిన ఆశ్రమం ఇది. సన్యాసులకు మనువు చాలా నియమాలు విధించాడు.

సన్యాసాశ్రమాన్ని స్వీకరించినవాడు కమండలం,దండం,పవిత్రం మొదలైన వాటిని గ్రహించుకొని ఒకరి సహాయం లేకుండా ఏకాకియై ఒంటరిగా సంచరించాలి. తనవంట తాను వండుకోకూడదు. ఇల్లులేని వాడుగా వుండాలి. ఏ వస్తువుమీదా అపేక్ష వుండకూడదు. రోగం వస్తే ఔషధ సేవనం చేయకూడదు. మట్టిపాత్రలు ధరించాలి. చెట్టుక్రింద బతకాలి. మాసికలువేసిన గుడ్డలు కట్టుకోవాలి. నీళ్లు వడగట్టి తాగాలి. శకునాలు, వైద్యం, జ్యోతిష్యం మొదలయినవి చెప్పి బిక్షను సంపాదించకూడదు. ఒక్కపూటే బిచ్చమెత్తాలి. బిక్షదొరక్కపోతే బాధపడకూడదు. తినేదికూడా మితంగా తినాలి. ఒక్కచోటనే పాతుకుపోకుండా దేశసంచారం చేస్తూ వుండాలి. [ఈ ధర్మాలన్నీ మను ధర్మశాస్త్రం ఆరో అధ్యాయంలో వున్నాయి.]

మొదటి మూడు ఆశ్రమ ధర్మాలనూ అంచెలంచెలుగా పాటించి చిట్టచివర సన్యాసాన్ని స్వీకరించాలి. అయితే రాగాదులులేకపోతే బ్రహ్మచర్యం నుంచే తిన్నగా సన్యాసం స్వీకరించవచ్చని బ్రహ్మ సూత్రాలు చెపుతాయి. అందుచేతనే ఇటీవల ఒక తెలుగుబ్రహ్మచారిని భావి పీఠాధిపతిగా ఎన్నికచేసి సన్యాసాశ్రమ దీక్షను ఇచ్చారు. ఇతడే కామకోటి పీఠానికి చెందిన ఆచార్యత్రయంలో అతిచిన్నవాడు. పూర్వాశ్రమంలో ఏ పేరయినా ఇప్పుడు శంకరానందేంద్ర సరస్వతి. ఈ బాల స్వాములవారు పరమాచార్యులతోనూ ప్రస్తుత పీఠాధిపతితోనూ కలసి కర్నూలులో ఈమధ్య వ్యాసపూజ చేసి ఇప్పుడు రెండు నెలలపాటు చాతుర్మాస్యము ఆచరిస్తున్నారు.

చాతుర్మాస్యం అంటే నాలుగునెలల వ్రతం కదా? దీన్ని ఇప్పుడు రెండు నెలలపాటే ఎందుకు ఆచరిస్తున్నట్టు? అనే సందేహం కలగక మానదు. అతి ప్రాచీనకాలంలో నాలుగేసి నెలలపాటు మూడు ఋతువులే వున్నా ఉత్తరోత్తరా రెండేసి నెలలను జోడించి ఆరు ఋతువులను మనవాళ్ళు ఏర్పరిచారు.

చైత్ర వైశాఖాలు – వసంత ఋతువు

జ్యేష్ఠ ఆషాఢాలు — గ్రీష్మఋతువు
శ్రావణ భాద్రపదాలు — వర్ష ఋతువు
ఆశ్వయుజ కార్తీకాలు - శరదృతువు
మార్గశిర పుష్యాలు — హేమంత ఋతువు
మాఘ పాల్గుణాలు - శిశిర ఋతువు

(పెద్దబాలశిక్షను చదువుకొనే రోజులలో ఏ ప్రాథమిక విద్యార్థి యినా ఈ మాసాల పేర్లను, ఏయే మాసాలు ఏ ఋతువులలో వచ్చేవో ఇట్లే చెప్పేసేవారు. ఇప్పుడు ఏ కొద్దిమందికో మాత్రమే తెలుగు మాసాల పేర్లు అవసరం కనబడుతూంది.)

చాతుర్మాస్యాన్ని ప్రారంభించేటప్పుడు వ్యాసపూజ చేయాలి. దీన్ని గురుపూజ అంటారు. వ్యాసపూజనాడు ఒక కలశంలో జల నింపి వ్యాసుని ఆవాహన చేసి ఆరాధిస్తారు. షడ్విధ గురువులను అర్చిస్తారు.

1. ప్రేక్షకుడు 2. సూచకుడు 3. వాచకుడు 4. దర్శకుడు 5. బోధకుడు 6. శిక్షకుడు.

ఈ ఆరుగుర్నీ సాధారణంగా షడ్విధగురువులంటారు. వ్యాసపూజ నాడు వ్యాసునితోపాటు అతని కుమారుడు శుకమహర్షినీ నారదుణ్నీకూడ పూజిస్తారు. గురుపూజ అన్ని రకాల గురువులకూ వర్తించినా తల్లీ, దండ్రీ, ఆచార్యులూ ముగ్గుర్నీ గురువులంటారు.

యతులకు ఆశ్రమ స్వీకారంతో తల్లిముఖం చూసే అవకాశం వుండదు. ఇంకో మూడువిధాల గురువులున్నారు. వారు ఉపదేశగురువు, కులగురువు, జగద్గురువు, పీఠాధిపతులనే జగద్గురువులంటారు.

కంచి కామకోటి పీఠానికిచెందిన ప్రస్తుత ఆచార్యత్రయం ఎంతటి జగద్గురువులయినా చాతుర్మాస్యవ్రతం ప్రారంభించడానికి నాందిగా తామే గురుపూజ చేయడం గమనించతగ్గ విషయం.

జగద్గురువులూ, పరివ్రాజకులూ, ఇతర సన్యాసులూ ఏ రకం గురుపూజ చేసినా సామాన్యజనం చేయవలసిన గురుపూజ వేరే వుంది. గురువులేని విద్య గుడ్డి విద్య కనుక సరియైన గురువును ఎన్నుకొని సమ ధర్మ స్థాపనకోసం, సాంఘిక బాధ్యతలను చక్కగా నెరవేర్చటమే నిజమైన గురుపూజ. ఇది చాతుర్మాస్య వ్రతం కాదు. ద్వాదశమాస్య దీక్ష.

# పుత్రిక ఎలాంటి కూతురు?

ఇటీవల నాకు తెలిసిన వాళ్ళింట్లో ఒక శుభలేఖ చూశాను. ఎవరో ఒకాయన కూతురి పెళ్ళి చేస్తున్నారు. శుభలేఖ సంపూర్ణంగా సంప్రదాయబద్ధమైన చక్కని తెలుగుభాషలో వుంది. "శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు" అనే మాటలు మొదలుకొని "మంగళం మహత్" దాకా పాతరోజులను జ్ఞాపకం చేస్తోంది. కార్డు అంచులకు పసుపుబొట్లు కూడా వున్నాయి.

పెళ్ళికూతురి తాతగారు ఆ "శుభలేఖార్థములు" వ్రాశారు. "నా మనుమరాలు (ఫలానావారి పుత్రిక) చి॥సౌ॥ (ఫలానాకన్య) అనే వివరాలు చదివాక "పాపం? ఆ పిల్లకు అన్నదమ్ము లెవరూ లేరా?" అని అడిగాను.

"అయ్యో అదేమిటి? ఒక అన్న, ఒక తమ్ముడు లక్షణంగా వున్నారు" అన్నాడు నా స్నేహితుడు.

"ఐయామ్ సారీ!" అని నా ప్రశ్నకు క్షమాపణ చెప్పుకున్నాను.

నా స్నేహితుడు ఊరుకోలేదు. "శుభలేఖలో పేరుచదివాక ఎందుకలా అడిగారు? మీలాంటివారు ఊరికే ప్రశ్నించరు. ఏదో కారణం వుండి వుంటుంది...దయచేసి చెప్పండి" అని అడిగాడు

"శుభలేఖార్థములు వ్రాసినది ఒక పండిత సోమయాజులుగారు. వైదిక సాంప్రదాయం తెలిసిన వారై వుంటారు. అత్యంత ప్రాచీన కాలంలో ఋషులు అన్నదమ్ములు లేని ఆడపిల్లనే పుత్రికఅని పేర్కొనేవారు. "ఈ శుభలేఖలో "పుత్రిక" అనే మాట చూశాక సోమయాజులుగారు పండితులు కనుకా, విద్వాంసులు కనుకా అర్ష పరిభాషనే వాడారనుకున్నాను" అని వివరణ చేశాను.

నా స్నేహితుడు ఆశ్చర్యపోయాడు. నమ్మలేకపోయాడు, "నిజమేనా!" అని ప్రశ్నించాడు. "పుత్రిక అంటే సాధారణంగా కుమార్తె

అనే అనుకొంటాం కాని ఇలాంటి కూతురని ఎవ్వరంఅనుకోం. ఈ వివ రాలు విశదపరుస్తూ మీరు వ్యాసపీఠంలో వ్రాయకూడదూ?" అనిఅడిగాడు.

రకరకాల సంతానాలు

కడుపున పుట్టిన ఆడబిడ్డను తెలుగు వాళ్ళు అమ్మాయి, కూతురు పిల్లా, బొట్టి అని పిలుస్తారు. కావ్యభాషలో సంబంధమున్నవాళ్లు "ఆత్మజ కన్య, కుమారి, తనయ, తనుజ, నందన, పుత్రిక. సుత" అని కూడా సందర్భాన్నిబట్టి పేర్కొంటారు. ఆదిమ వైదిక సమాజంలో రకరకాల సంతానాలు వుండేవారు. ఋషులు తమ భార్యలకు తమవల్లకాక ఇతరుల వల్ల పుట్టిన అమ్మాయిని క్షేత్రజ అని పిలిచేవారు. అనులోమ విలోమ వివాహాలు ఆ రోజుల్లో పరిపాటి. మనువు తన ధర్మశాస్త్రంతో పన్నెండు రకాల పుత్రులను పేర్కొన్నారు. పుత్రిక అనే మాటకు నిర్వచనం కూడా నవమాధ్యాయంలో ఇచ్చాడు.

అపుత్రోనేన విధినా
సుతాం కుర్వీత పుత్రికాం
యదపత్యం భవేదస్యాం
తన్మమస్యాన్ స్వదారకం." [మను-9-137]

—"ఒకడికి పుత్రుడు లేక కూతురు మాత్రమున్నట్టయితే ఆ కన్యను పెళ్ళికొడుకుకు ఇస్తున్నప్పుడు ఈ పిల్లకు సోదరుడు లేనందు వల్ల దీనికి పుట్టే పుత్రుడు నా వంశమునకు శ్రాద్ధం పెట్టేవాడుగా వుం డాలి" అని ఈ శ్లోకాని కర్థం.

సర్ మోనియర్ విలియమ్స్ తన సంస్కృత - ఇంగ్లీషు నిఘం టువులో ఇలా అర్థం ఇచ్చాడు.

'Putrika of a daughter (E.S.P. A.D.' appointed to rise male issue to be adopted by a father who has no sons).

ఈ అర్థ వివరణకు మోనియర్ విలియమ్ మనుస్మృతినీ, మహా భారతాన్నీ ప్రమాణాలుగా చూపించాడు.

పుత్రిక అనే శబ్దానికి పుత్రిక అని పదమధ్య అకారంతో ఒక

పర్యాయపదం ఉన్నట్టుంది. (హౌనియర్ విలియమ్స్‌లో కాదు) సూర్య రాయాంధ్ర నిఘంటువు నిర్మాతలు ఈ పర్యాయ పదానికి ఇలాగ అర్థ వివరణ చేశాడు.

—"పుత్రిక సం. వి. అ. స్త్రీ. 1 కూతురు, కన్య 2 పుత్తళి, బొమ్మ, 3 యానక తూలము, లక్క దూది, 4 పుత్రులు లేనివాడు ఎవ తెని బుత్రికగా బెంచుకుని దానికడుపున బుట్టిన కొడుకును దనవంశ కరు నిగా స్వీకరింపదలచునో యట్టి కన్య, 5 స్వల్పార్థకము."

నిఘంటువులో అవ్యాప్తి, అతివ్యాప్తి దోషాలు వుండకూడదు. సూర్యరాయాంధ్ర నిఘంటువులో చేసిన ఈ అర్థవివరణ వివిధ ధర్మ విశద పరచని సూక్ష్మాంశాలను కాకపోతే పోయే, ముఖ్య విషయాన్ని కూడా విస్మరించడం శోచనీయం. దత్త పుత్రికను కన్యాదానం చేయడం అన్న ప్రసక్తి నేను చూసిన ధర్మసూత్రాలలో లేదు.

## గౌతమ ధర్మ సూత్రాలు

గౌతమ ధర్మసూత్రాలు చాలాముఖ్యమైనవి. వాటికి హరదత్త మితాక్షరి చక్కనివ్యాఖ్యానం. గౌతముని మతంతోపాటు ఇతర స్మృతి కర్తల సూత్రకారుల అభిమతాలను కూడా అందులో పొందుపరచి అను మానానికి తావులేకుండా చేశాడు. నవ్యాఖ్యానంగా. ఆంధ్ర వివరణలలో గౌతమ ధర్మసూత్రాలను పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు 1937వ సూత్రానికి ఇచ్చిన ఆంధ్ర వివరణ చూస్తే "దత్తపుత్రిక" ప్రసక్తి కన బడదు. చూడండి :

"ఇటుపైని అపుత్రకుడు (అనగా మగబిడలు లేనివాడు) నాయ మును ఏమి చేయించవగునని శంకరాగా చెప్పుచున్నాడు: తండ్రి అన పత్యుడుగా అనగా మగబిడలు లేనివాడై యున్నచో అప్పుడతడు అడు సంతానమున్న యెడల అదికూడా వాక్కుచే కూతురై యున్నచో... వరుని యుద్దేశించి "ఈ కన్యకయందు నీకు కలుగగల పుత్రుడు నేను సంతానము లేనివాడను కాబట్టి ఈ కన్యయందు నీకు కలుగగల సంతా నము నా నిమిత్తమగు గాక యని ప్రతిన చేయించి వర సంగమమునకై కన్యకను వదిలిపెట్టవలయుననీ సూత్రార్థము."

ఈ విధంగా పుత్రికకు పెళ్ళిచేశాక ఆమె గోత్రం సైతం మారదు. తండ్రి గోత్రమే కొనసాగుతుంది. "ఇక నీవిడకు భర్తృ సంబంధ కొంతవరకనగా ధర్మ కార్య నిర్వహణమున సహచారిణిగా నుండుటకును, రతిననుభవించుటకును మాత్రమే" (పంచాస్నన వారి గౌతమ ధర్మ సూత్రములు- పుట 469)

ధర్మసూత్రాల కాలంలో చెప్పిన ఈ పుత్రికా వివాహ ప్రయోజనాన్ని ఇప్పటిదాకా చాలామంది పాటిస్తున్నారు. సంగీత సంప్రదాయ ప్రదర్శినిని రచించిన సుబ్బరామదీక్షితుల వారిని వారి మతామహులు బాల స్వామి దీక్షితులు గారు దత్తత చేసుకున్నారు. ప్రఖ్యాత నర్తకి డాక్టర్ పద్మా సుబ్రహ్మణ్యం అన్నగారైన బాలకృష్ణన్ గారిని వారి మాతామహుడు దత్తత చేసుకున్నారు. ఇలాంటి ఉదాహరణలను ఎన్నయినా ఇవ్వవచ్చు.

సదాచారవంతులైన హిందువులకు ఇహలోకంలోని స్థితి ఎలా వున్నాగానీ, పరలోకంలో గతికోసం ప్రాకులాడడం పుట్టుకతో వచ్చే మూఢవిశ్వాసం. "అపుత్రస్యగతిర్నాస్తి"అని ఆదినుంచీ నమ్ముతూ, పుత్రులు లేనివారికి ఊర్ధ్వలోకగతులు లేవని గట్టిగా విశ్వసించి కొందరు దౌహిత్యుణ్ణే దత్తత చేసుకొంటారు. ఇవన్నీ తద్దినాల కోసమే.

విశ్వనాథవారి దృష్టిలో...

విశ్వనాథ సత్యనారాయణగారి దృష్టిలో పై లోకాలకు గతులే పరమ ముఖ్యమైనవి. ఆ గతులు అంత్యక్రియల వల్లా, ఆబ్దీకాల వల్ల, పిండప్రధానాలవల్లా లభిస్తాయి. తద్దినం గొప్పదికనుక దబ్బిచ్చి తద్దినం కొనుక్కున్నా తప్పులేదు. విశ్వనాథవారు రాసిన "చెలియల కట్ట"నవల లోని కథానాయిక చెడిపోయిన మనిషి. కట్టుకున్న మొగుణ్ణి వదిలేసి మరదితో లేచిపోతుంది.

చివరలో "జ్ఞానోదయం" కలుగుతుంది. తాను లేచిపోయాక తన భర్త ఇంకో పెళ్ళి చేసుకొని పుత్రసంతుడయ్యాడు, ఆ బిడ్డ తనకు కూడా కొడుకు వరసవాడే కనుక తాను ఆర్జించిన సొమ్మంతా ఆ బిడ్డ పేరపెట్టి తనకు తద్దినాలు పెట్టాలనే షరతు విధించి ఉప్పెనలో కొట్టుకుపోతుంది. ఇహంలో చెడ్డా ఫరవాలేదు. పరంలో గతిబాగుంటే చాలని, అందు నిమిత్తం డబ్బిచ్చి తద్దినాలు కొనుక్కున్నా మంచిదే అన్నదే "చెలియలికట్ట" చెప్పే నీతి.

వేదాలనే ఇప్పటికీ ప్రమాణంగాభావించే సనాతనులువేదకాలంలో స్త్రీలకున్న హక్కులను నేటికాలపు స్త్రీలకు ఇవ్వడానికి మాత్రం ఒప్పుకోరు. ఋగ్వేదంలో రెండుచోట్ల అన్నదమ్ముల్లేని అమ్మాయి ప్రసక్తి వస్తుంది. [1-124-7-111-31-1] యాస్కుడు ఒక ఋక్కును ఉదహరించి తన నిరుక్తంలో వ్యాఖ్యానించాడు. [11-5]. ఇందువల్ల ఋగ్వేద కాలంలో మొగతోబుట్టువులు లేని ఆడకూతురు పెళ్ళి చేసుకొన్నాక సైతం తన తండ్రికి అంత్యక్రియలు చేసేహక్కున్న వ్యక్తి. తండ్రి ఆస్తికి ఆమె సంపూర్ణంగా వారసురాలు. అంటే కొడుకులతోపాటు కూతురికీ ఆస్తిహక్కులున్నాయన్నమాట యాస్కుని కాలంలో ఇది ఆచారం లాగా కనిపిస్తుంది. అందుకే దానిని అతడు పేర్కొన్నాడు. వ్యాఖ్యాత దుర్గాచార్యుడు కూడా దీనిని ఉటంకించాడు.

సమాజంలో పురుషాధిక్యత పెచ్చుపెరిగిన తర్వాత అన్నదమ్ముల్లేని ఆడపిల్లలను పుత్రిక అనిచెప్పి, ఆమె వివాహానికి అర్హురాలు కాదన్నారు. వేద భాష్యాన్ని రచించిన సాయణాచార్యులవారు క్రీస్తుశకం పధ్నాలుగో శతాబ్దపు ఆలోచనా పద్ధతులను వేదకాలంనాటి సమాజానికి అంటగట్టారని శ్రీమతి శకుంతలారావు శాస్త్రి నిర్మొహమాటంగా చెప్పారు.(చూ॥ "ఉమెన్ ఇన్ ది వేదిక్ ఏజ్" పుట 5)

యుగాలనుబట్టి ధర్మం మారుతూ వుంటుంది. మారుతున్న ధర్మాలనుబట్టి మాటల అర్థాలూ మారుతూ వుంటాయి. 1954లో "పత్రిక" అన్న మాటను చూసి వేదకాలం నాటి అర్థాన్ని జ్ఞప్తికి తెచ్చుకొనడం బహుశా నా అవివేకమే అనుకుంటాను, పెద్దల పేరులో వేసే ఆహ్వాన పత్రాలలో ప్రతి అక్షరం వాళ్ళు చూస్తారన్న నమ్మకం ఏమిటి?

—o—

# భగవద్గీత - పుట్టుపూర్వోత్తరాలు

శ్రీకాకుళం నుంచి, ఈ మధ్య నాకో కరపత్రం పంపించారు. 'గీతాజయంతి-శుభాకాంక్షలు' అని దాని మీద శీర్షిక వుంది. కరపత్రాన్ని వేసినవారు: "గీతా హరిజన-గిరిజన- పేదప్రజా సంఘం అనే సంస్థ. "నేడు భారతావనిలో ప్రబలుతున్న కుల, మత:వర్గ, వర్ణ విభేదాలు_తరతమ భేదాల నరికట్టించుట ప్రతి భారతీయుని ప్రథమ కర్తవ్యం కావలెను" అని వీరు ప్రబోధిస్తున్నారు. చాలా సంతోషం అసమానతలు పోగొట్టాలి. సమానతలు సాధించాలి. బాగుంది. అయితే ఈ ఆశయ సాధనకు వీరు "గీతను నిత్యము, నిరంతరము అధ్యయనం చేయుచు దైనందిన జీవితంలో, గీతనందలి ధర్మములు, సూత్రములు ప్రయోగించుతూ రావలెను" అని ఉపదేశం చేస్తున్నారు. ఇక్కడే అభిప్రాయభేదాలకు ఆస్కారం వుంది. గీతను "నిత్యం, నిరంతరం" పారాయణచేస్తే అనేక సందేహాలు సాధకులకు వస్తాయి.

"గీతా హరిజన- గిరిజన- పేద ప్రజా సంఘం" వారు గీతలో మహోన్నత ధర్మసూత్రాలూ సమతా ధర్మములు, కుల, మత వర్గ విభేదాలకు అతీతమైన సామాజిక న్యాయసూత్రాలు ఉన్నట్టు భావిస్తున్నారు. నిజంగా అవి వున్నాయా? వర్ణ వ్యవస్థను సంరక్షించే మతాన్ని గీత ప్రబోధంచేయడం లేదా? గీతాకారుడే స్వయంగా తాను నాలుగు వర్ణాలను సృష్టించేనని చెప్పుకోలేదా?

చాతుర్వర్ణ్యం మయాసృష్టం
గుణకర్మ విభాగశః।

తస్య కర్తారం మపిమాం
విద్ధ్యకరారమవ్యయం ॥ [4-13]

గుణకర్మ విభాగాలనుబట్టి బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులచే నాలుగు వర్ణాలు నాచేత సృష్టించబడ్డాయి. ఆ సృష్టికి నేనే కర్తనైనా వాటికి కర్తకానివానిగా నాశరహితునిగా నన్ను తెలుసుకో" అని ఈ శ్లోకంలో గీతాకారుడు చెప్పడం గమనించాలి.

కులాలు తనచేత సృష్టించబడ్డాయంటూనే వాటికర్తృత్వం రెండో పాదంలోనే ఎందుకు ఉత్తమ పురుషలో గీతాకారుడు ప్రకటిస్తున్నాడు?

నాలుగవ అధ్యాయంలో ఇలా చెప్పి పద్దెనిమిదో అధ్యాయంలో ఇదే భావాన్ని ఇంకోలా ఎందుకు ఈ కింది శ్లోకంలో చెప్పాడు?

యతః ప్రవృత్తి ర్భూతానాం
యేన సర్వమిదం తతం;
స్వకర్మణాతమభ్యర్చ్య
సిద్ధిం విందతి మానవః ॥ [18-46]

"ఎవని వలన భూములకు ఉత్పత్తి కలుగుతూవుందో ఎవనిచేత ఈ సమస్త ప్రపంచం వ్యాపించబడి యున్నదో ఆ ఈశ్వరుణ్ణి మానవుడు తన కులోచిత కర్మము చేత పూజించి సిద్ధిని పొందుతున్నాడు" అని ఈ శ్లోకంలో గీతా కారుడు ప్రథమ పురుషలో ఈశ్వరుని ఎందుకు పేర్కొన్నాడు? "సర్వకర్మణా" అనగా కులోచిత కర్మచేతనే ఎందుకు పూజించమన్నాడు? పరధర్మాల కంటె స్వధర్మం శ్రేయస్కరం అని (3;25)లో చెప్పాడు కనుక అని ; రిపెట్టుకొంటే సర్వ ధర్మాలలో ఒకటైన స్వధర్మాన్ని విడిచిపెట్టి తన నెందుకు శరణు వేడమంటున్నాడు? పరధర్మం ఇప్పుడు భయావహం కాదా?

## అనేక ప్రశ్నలు

గీతలో కొన్ని శ్లోకాలు ఉత్తమ పురుషలోనూ, కొన్ని ప్రథమ

పురుషలోనూ ఎందుకున్నాయి? పద్దెనిమిది అధ్యాయాలలో వున్న తత్వం ఒక్కటేనా? పరస్పర విరుద్ధమైన భావాలు ఎందుకు గోచరిస్తాయి? గీతను ఒకే కాలంలో చెప్పలేదా? వేరు వేరు వ్యక్తులు వేరు వేరు కాలాలలో దీనిని విరచించారా? ఇందులో యేయే దర్శనాల ప్రభావాలున్నాయి? ఏ ఏ ధర్మాల ప్రబోధాలు ఉన్నాయి?

ఈ ప్రశ్నలన్నీ గీతను "నిత్యం నిరంతరం" పారాయణ చేసే వారికే వస్తాయి. శ్రీ గజానన్ శ్రీ సత్‌కైర్ అనే మహారాష్ట్రి పండితుడు 1920లో గీతాపారాయణ ప్రారంభించారు. గీతలో చాలా శ్లోకాలు సరళంగా, అర్థవంతంగా ఉన్నా కొన్నిచోట్ల సందర్భశుద్ధి లేనట్లు వారికి తోచింది. చాలా పరిశోధనలు చేశాక 1962లో మరాటీ భాషలో "గీతె ముఖ్య నిచార్" అనే గ్రంథం ఒకటి ప్రకటించారు. అంటే నలభై మూడు సంవత్సరాలు పారాయణ చేసి పరిశోధించి కొన్ని నిర్ణయాలకు వచ్చారన్నమాట. ఇప్పుడున్న భగవద్గీత నిజమయిన గీత కాదు. వివిధ వ్యక్తులు తమ కిష్టమైన విషయాలు గీతలో చొప్పించుతూ వచ్చారు. అయితే నిజమయిన గీత ఏది? దానిని కనుక్కోవడం సాధ్యమా? సాధ్యమే అని డాక్టర్ ఖైర్ గారు సాగిపోయారు. క్వెస్ట్ ఫర్ రియల్ గీత" అనే గ్రంథాన్ని ఇంగ్లీషులో రచించి 1969లో ప్రచురించారు. సోమైయా పబ్లికేషన్స్ బొంబాయి_14 వారు దీని ప్రచురణ కర్తలు.

గీతలోని పరభాష ఏమిటి? ఏ ఏ అధ్యాయాలలోపరిభాషమార్పులు చెందింది? ఏ ఏవి ఉత్తమపురుషలో ఉన్నాయి. ఏవి ప్రథమపురుషలో వున్నాయి. శైలిలో ఎందుకు మార్పులు వచ్చాయి? వ్యాకరణంలో ఎందుకు మార్పులు కనబడుతున్నాయి. ప్రక్షిప్తాలు ఎన్ని వున్నాయి? ఎందుకు వున్నాయి? ఎవరు చేర్చారు? ఏ చారిత్రక కారణాలవలన చేర్చారు? యేయే దర్శనాలను చర్చించారు? ఇలాంటి యెన్నో మౌలిక మయిన సమస్యలపై కూలంకషంగా పరిశోధనలు జరిపాక డాక్టర్ ఖైర్ గారు నిగ్గు తేల్చారు

ముగ్గురి రచన

గీతను ముగ్గురు వ్యక్తులు మూడు వేరు వేరు కాలాలలో రచిం

హారు. గీతను ప్రథమాచార్యుడు రచించిన సూరేక్ళ తరువాత ద్వితీయా చార్యుడు దానికి కొన్ని అధ్యాయాలు చేర్చాడు. తర్వాత 300 సం॥లకు తృతీయాచార్యుడు ఈ రెండు రచనల మధ్య తన అధ్యాయాలుచేర్చాడు. తొలి ఇద్దరి శ్లోకాల మధ్య కూడా తన శ్లోకాలను ఇరికించాడు. ఈ సంగతిని క్రైర్ గారు సోదాహరణంగా నిరూపించారు. వారి నిర్ణయం ప్రకారం ఏయే ఆచార్యులు ఏ అధ్యాయాలు రచించారో సూక్ష్మంగా చెప్పవచ్చు.

ప్రథమాచార్యుడు మొదటి ఆరుఅధ్యాయాలు రచించాడు,ఇందులో తృతీయా చార్యుని ప్రక్షిప్తాలు వున్నాయి.

ద్వితీయాచార్యుడు ఇతడు ఏనిమిదవ అధ్యాయం పదమూడుపథ్నాలుగు పదిహేను సంఖ్యలు గల అధ్యాయాలు, పదిహేడు పద్ధెనిమిది సంఖ్యలు గల అధ్యాయాలు వెరసి ఆరు అధ్యాయాలు రచించాడు.

వీటిలో కూడా తృతీయాచార్యుని ప్రక్షిప్త శ్లోకాలు వున్నాయి.

తృతీయాచార్యుడు : ఇతడు యేడవనంబరు అధ్యాయాన్ని. తొమ్మిది మంచి పన్నెడో నంబరు దాకా గల అధ్యాయాలనూ పదహారో నెంబరు అధ్యాయాన్ని రచించాడు.

## ఎవరికోసం రచన ?

నాలుగు వందల సంవత్సరాల మధ్య కాలంలో ముగ్గురు రచయితలు చేసిన రచన కాబట్టి గీతలో అనేక వైరుధ్యాలు కనబడతాయి. ఈ ముగ్గురు ఆచార్యులు ఎవరికోసం ఈ రచన చేశారో కూడా ఆయా అధ్యాయాలు పరిశీలిస్తే స్పష్టంగా తెలుస్తుంది. ప్రథమాచార్యుడు తన రచనను ముఖ్యంగా ఉన్నత వర్గాల వారి కోసమే ఉద్దేశించాడు. మేధావులకోసమే రాశాడు. ధీరులు, పండితులు, తత్వదర్శినులు, విపశ్చితులు, మనీషులు, మునులు యోగులు, యతులు. బుధులు. జితాత్ములు మొదలయినవారు ఇతర పాఠకులు వీరి దృక్పథంలో మార్పు తీసుకు రావడమే ప్రథమాచార్యుని లక్ష్యం. ద్వితీయాచార్యుడు తాను ఎవరికోసం రాస్తున్నదీ చాలా

తక్కువ పదాలతో సూచించాడు. ఇతడు కూడా తాత్త్వికుల కోసమే తన రచన చేశాడని చెప్పవచ్చు.

తృతీయాచార్యుడు మాత్రం ఆర్తులకోసం, జిజ్ఞాసుల కోసం రాశాడు. అన్యదేవతా భక్తులను తన దైవానికి భక్తులను చేయదలిచాడు. స్త్రీలు, వైశ్యులు, శూద్రులు, పాపులు మొదలయిన వారిని దృష్టిలో పెట్టుకొన్నాడు. సామాన్య జనాన్ని విస్మరించకుండా వాళ్ళ మోక్షం కోసం తన మతాన్ని మహోన్నతమైన ఉద్దేశంతో, మహోద్రేకంతో తృతీయాచార్యుడు తన రచనను చేశాడు. తన ప్రతిపక్షులను నిర్దాక్షిణ్యంగా మూఢులు నరాధముల అచేతనులు అల్పబుద్ధులు అజ్ఞాన మోహితులు మొదలయిన తిట్టుతిట్టాడు. ప్రథమాచార్యుడు మాత్రం ప్రతిపక్షులను మందులు. బాలురు, అజ్ఞులు, అవిద్వాంసులు అని మాత్రమే పేర్కొన్నాడు. ద్వితీయాచార్యుడు చాలా అరుదుగా అచేతనుడు అనే పదం వాడాడు. ప్రథమాచార్యుడు. ప్రతిపక్షులపట్ల మర్యాద చూపెట్టాడు. ద్వితీయాచార్యుడు వాళ్ళను నిర్లక్ష్యం చేశాడు. తృతీయాచార్యుడు తిట్టిపోశాడు. వారి వారి కాలాలకు అనుగుణమయిన బోధనలు చేశారు.

ప్రథమాచార్యుడు క్రీస్తుపూర్వం 600 కు పూర్వుడు. ద్వితీయాచార్యుడు : క్రీస్తుపూర్వం 600_500 మధ్య. తృతీయాచార్యుడు। క్రీస్తుపూర్వం 300-200 మధ్య.

### గీత మారాలి

గీతపై ఈవిధమైన పరిశోధనలు చేస్తేనే తప్ప అందులోఏముందో తెలియదు. గీతపై, భండార్కర్, తిలక్ దాస్ గుప్తా రాధాకృష్ణన్ మొదలయినవారు విరివిగా వ్యాఖ్యానించారు. ఎస్. పి. రాయ్‌గారు ప్రక్షిప్తాల గురించి ప్రగాఢంగా చర్చలు చేశారు. ఇక పాశ్చాత్య విద్వాంసులు సరే సరి. 1784 లోనే గీతకు ఆంగ్లానువాదం వారన్ హేస్టింగ్స్ అజ్ఞానుసారంగా రూపొందింది. 1826లో హంబోల్డు ప్రక్షిప్తాల గురించి వాదనలు లేవదీశారు. భగవద్గీతపై వచ్చిన వాఙ్మయం అపారం. ప్రస్థానత్రయంలో ఒకటైనగీతపై ఇంతవిరివిగా జిజ్ఞాసులు పరిశోధనలుచేయడం సహజమే.

అయితే భగవద్గీత ఇప్పుడున్న రూపంలో యదాతథంగా 'నిత్యం నిరంతరం' పారాయణం చేసినందువల్ల గానీ. ఆచరించినందువల్ల గానీ లాభం లేదు. "గీతను సామాజిక దృక్పథంతో, సామాజిక శ్రేయస్సు కొరకై ఉద్దేశించిన గ్రంథరాజంగా ఎలుగెత్తి చెప్పుటకుగాను యువతను ముందుకు రమ్మనీ "గీతా హరిజన-గిరిజన-పేద ప్రజాసంఘం వారు పిలుస్తున్నారు. "దురభిమాన వైఖరులు, ప్రాంతీయ అభిమానాలు, కుల కట్టుబాట్లు, మత మౌఢ్యాలనుండి విముక్తి పొందడానికి జాతీయ సమైక్యతకు, నవసమాజ నిర్మాణానికి" గీతను ఎన్నుకోమంటున్నారు,

నిజానికి 'నవసమాజ నిర్మాణం' ప్రాచీన కులవ్యవస్థను ప్రబోధించే గీతవల్ల జరగదు. దానికి శాస్త్రీయ సామ్యవాదమే సాధనం' హరిజనులు, గిరిజనులు, పేదప్రజలు గీతను మార్చుకోవడం చాలా అవసరం.

# ధర్మవడ్డీ - చక్రవడ్డీ - కాలవడ్డీ వగైరా

కీ. శే. త్రిపురనేని గోపీచంద్‌గారు ఎప్పుడూ ఉత్తమ కథకులే, సాంఘిక ప్రయోజనం, సామాజిక స్పృహ, సోషలిస్టు దృక్పథం గల కథకులుగా కొడవటిగంటి కుటుంబరావుగారూ, త్రిపురనేని గోపీచంద్‌గారూ ఈ శతాబ్దపు మూడో దశాబ్దిలోనే ముఖ్యులయ్యారు. గుడిపాటి వెంకటచలం తెచ్చిపెట్టిన అస్తవ్యస్తాన్నీ, అరాచకత్వాన్నీ తెలుగు కథ లోంచి వెళ్ళగొట్టి శాసన చేయడానికి గోపీచంద్‌గారు చాలా కృషి చేశారు.

గోపీచంద్‌గారు ఉత్తమ కథకులని కిందటివారం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు ప్రకటించారు. ఇన్నాళ్ళకు ఈ సంగతిని సర్కారువారు సమ్మతించడానికి ఒక కారణం, ఒక అవకాశం ఇటీవలనే సందర్భించాయి.

గోపీచంద్‌గారు రాసిన "ధర్మవడ్డీ" అనే కథను ఆధారం చేసుకొని మిత్రుడు తిలక్ ఒక చలనచిత్రం తీశాడు. ఆ చిత్రం ఈ సంవత్సరం నంది అవార్డుల పోటీలలో పాల్గొన్నట్టుంది. చిత్రానికి ఏ పెద్ద అవార్డూ వచ్చినట్టు కనబడదుగానీ, చిత్రకథకు ఆధారమైన ఒరిజనల్ కథకుణ్ణి ఉత్తమ కథకులుగా అవార్డుల కమిటీ గుర్తించింది. ఆ మేరకు ప్రభుత్వం ప్రకటించింది.

## "క్రయిం అండ్ పనిష్మెంట్"లో

వడ్డీవ్యాపారుల ఇనుప గుప్పిట్లో ఎన్ని పేదాకుటుంబాలో నలిగిపోయి, నాశనం కావడం సంఘంలో కనబడుతున్న విషయమే. అందుకే ప్రపంచాన్ని మరామత్తు చేయాలంటే ముందు వడ్డీ వ్యాపారస్తులను చంపడమే సూటిబాట అని డొస్టవస్కీ నవల "క్రయిమ్ అండ్ పనిష్మెంట్"లో హీరో వాస్కాల్ని కాప్ ఖావిస్తాడు. ఆడ వడ్డీ వ్యాపారిని చంపుతాడు, ఇప్పుడు నగ్జలైట్లు చేస్తున్న దుస్సాహసం కూడా ఇదే.

వాస్తవాన్నే వర్ణించడం కథ కావచ్చునుగానీ కళ కాదు, కళ వాస్తవాన్ని చెప్తూనే పరిష్కారాన్ని సూచించాలి, ధ్వనించాలి. అందుకే గోపీచంద్‌గారు తమ "ధర్మవడ్డీ" కథలో మానవత్వం మంటగలిసిన వడ్డీ వ్యాపారం చివరకు వ్యాపారినే ఎలా నాశనం చేస్తుందో కథనం చేశారు. ఈ కథలో సూరయ్య అనే షావుకారు ఒక్కడే సకుటుంబంగా సర్వనాశనం కావడం చిత్రించినా, ఆ వూళ్ళలో ఇంకా కొందరు షావుకార్లు వుండడమూ వాళ్లు "సజావు"గా వ్యాపారం సాగిస్తూ సామాన్యులను పీడిస్తూ బతకడం గోపీచంద్ చెప్పకుండా చెప్పారు.

వడ్డీ వ్యాపారికి సామాన్యజనం భయపడేదల్లా అతని దగ్గరున్న ధనాన్ని. దానికుండే బలాన్నీ చూసి మాత్రమే. ఆ ధనబలం అక్కరకు రాకపోతే పులిలాంటి వ్యాపారి పిల్లిలాగ, గోడమీది బల్లిలాగా, గోటికింది నల్లిలాగ మారిపోతాడు. ఈ సంగతినే ధర్మవడ్డీ కథలో గోపీచంద్‌గారు శక్తివంతంగా చాటారు. అంతగా బాధించని వడ్డీరేటు వల్ల వ్యాపారం సజావుగా సాగుతుంది.

రాజు ప్రజలదగ్గర పన్నులు ఏలా వసూలు చేసుకోవాలో వడ్డీ వ్యాపారికూడా అలాగే ప్రవర్తించి, రావలసినది రాబట్టుకోవాలి. పరాశర స్మృతిలో పన్నుల గురించి ఇలా వుంది.

పుష్పమాత్రం విచిమయా
త్మూల చ్ఛేదం నకారయేత్
మాలాకార ఇవారాజ్ఞో
నయథాంగార కారకః

పూలదండ లమ్ముకొని బతికేవాడు తోటలోని పువ్వులనుమాత్రమే కోసికొని తోటను ఏలా కాపాడుకున్నాడో రాజు అలాగ ప్రజలనుంచి కొద్దిగా తీసుకోవాలిగాని బొగ్గులమ్ముకునేవాడిలాగ మొదళ్లు నరికి తగుల బెట్టకూడదు. ఈ భావాన్ని శాంతిపర్వంలో భీష్మడిచేత ధర్మరాజుకు చెప్పించాడు.

కోరితోటవాడు కుసుమ ఫలంబులు
గోయునట్లు రాజు గొనగవలయు
యప్పనములు నరికియంగారములు సేయు
భంగియైన భూమి పాడుగాదె

(శాంతి-2-300)

ఏమీ బాధించని రీతిగా, న్యాయంగా తీసుకొనే వడ్డీనే ధర్మవడ్డీ అంటారు. గోపీచంద్‌గారు తమ కథలో నెలకు నూటికి రూపాయన్నర రేటును ధర్మవడ్డీగా ఒక పాత్రచేత చెప్పించారు. అంటే సాలుసరి నూటికి పద్దెనిమిది రూపాయలన్నమాట. రెండువందల ఏళ్ళకింద వున్న రేటుతో పోలిస్తే ఇది జాస్తే. దుబాయ్ పాదిరి మన దక్షిణభారతదేశంలో క్రీ.శ. 1792 నుండి 1823 దాకా పర్యటిస్తూ సర్వత్రా పన్నెండుశాతమే ధర్మవడ్డీగా పుచ్చుకొంటున్నారని చెప్పాడు. బ్రౌను దొరగారు తమ నిఘంటువులో సాలీనా 12 శాతమే ధర్మవడ్డీ అని రాశారు. మనహిందూ న్యాయ వ్యవస్థకు పరమ ప్రామాణికమైన మితాక్షరీ వ్యాఖ్యానం సహిత

మైన గౌతమ ధర్మసూత్రాలలో వడ్డీ ప్రకారాలను చాలా వివరంగా విశదీక రించారు.

రకరకాల వడ్డీలు

ఋణాన్ని కుత్సితం అంటారు, వడ్డీ వ్యాపారాన్ని కుసీదం అని వ్యవహరిస్తున్నారు. మూలధనాన్నికూడా కుసీదం అంటారు, వడ్డీని వృద్ధి అంటారు. వృద్ధులు శాస్త్రంలో అయిదు రకాలు. పాంచమాషిక, చక్ర, కాల, కారిత, కాయిక వృద్ధులని వాటికి పేరు. పాంచమాషిక వృద్ధినే ధర్మవడ్డీగా భావిస్తారు. దానికి కారణాలు ఉన్నాయి. తక్కిన నాలుగూ శ్రేష్ఠమైనవీ కావు, శిష్టులు స్వీకరించేవీ కావు. వడ్డీకికూడా వడ్డీని కట్టడం చక్రవడ్డీ అంటారు. రోజువారీ వడ్డీని కాయికం అనీ నెలవారీ వడ్డీని కాలికం అనీ, అడిగినప్పుడు ఇచ్చే వడ్డీని కారితం అనీ తెలుగు నిఘంటువులలో పేర్నదగిన ఆంధ్ర వాచస్పత్యం చెప్తూంది. కానీ గౌతమ ధర్మసూత్రాలలో వేరేవిధంగా వుంది.

సూత్రరచనా కాలంలో నెలవడ్డీ ఒక్కటే శాస్త్ర సమ్మతం. ఏడాది దాటాక అసలు ఫాయిదాలను కలిపి పుచ్చుకోనడాన్ని ధర్మ సూత్రాలు నిషేధిస్తున్నాయి. వడ్డీకికూడా వడ్డీ పుచ్చుకోనడం చక్రవడ్డీ అనడంలో వాదం లేదు. కాలవడ్డీ అంటే ఇంతకాలానికి ఇంత వడ్డీ అని ముందే ఒప్పందం చేసుకొంటూ, ఒకవేళ ఆ గడువు తీరేనాటికి అసలు ఫాయిదాలు చెల్లించకపోతే ఇంతవడ్డీని అధికంగా ఈయాలని నిర్ణయం చేసుకొంటే, దానిని కాలవృద్ధి అంటారు. ఈ చక్ర, కాలవృద్ధులు నింద్యాలయినా, ఆపత్కాలాలలో ధర్మసహితాలనే సూత్రాలు చెప్తున్నాయి. దేశ కాలపరిస్థితులను బట్టి ఇచ్చేవాడూ పుచ్చుకొనేవాడూ నిర్ణయించుకున్న వడ్డీరేటును కారితవృద్ధి అంటారు. మొదట అనుకొన్న వడ్డీ రేటుకన్నా ఎక్కువగా మధ్యలో పెంచితే దాన్ని కాయికవృద్ధి అంటారు.

రోజువారీ వడ్డీని శిఖావృద్ధి అంటారు. జుట్టులాగా దినదినం పెరిగే వడ్డీ కాబట్టి దీనికా పేరు వచ్చింది. శిరస్సును ఛేదించిన తర్వాత తలవెంట్రుకలు ఎలా పెరగవో అప్పు తీర్చేసిన తర్వాత ఈ వడ్డీ పెరగదు. ఏరోజు అసలు చెల్లి పెట్టేస్తే ఆ రోజునుండి శిఖావడ్డీ ప్రమేయమే వుండదు,

గతి లేకపోతే ఈ వడ్డీలకు ఒప్పుకొని అప్పు పుచ్చుకోవాలిగానీ, ధర్మసమ్మతమైన పాంచమాషికి వృద్ధి ఒక్కటే శాస్త్ర సమ్మతమైనది. ద్రవ్యమానంతో ఒకనాడు కార్షాపణం అన్నది గరిష్ఠ ప్రమాణం కల ఒక యూనిట్‌గా ఉండేది. ఈ కార్షాపణంలో ఇరవయ్యో భాగాన్ని మాషం అంటారు. ఇరవై కార్షాపణాలు అప్పు తీసుకొంటే నెలకి అయిదు రూపాయల వడ్డీనే ధర్మవడ్డీ అంటారు. పంచమాషకి అని పిలుస్తారు. ఈ వడ్డీరేటు పూర్తిగా ఒక శాతంకూడా కాదు, నూటికి ఒకటీ ఎనభై (1/80) మాత్రమే అవుతుంది. ఈ ధర్మవడ్డీ తాకట్టు వస్తువుల మీద ఇచ్చిన అప్పులకే చెల్లుతుంది. తాకట్టు వస్తువును బంధకం అంటారు. తాకట్టు లేకుండా కేవలం నమ్మకంమీద అప్పు ఇచ్చినప్పుడు మాత్రం నెలకు నూటికి రెండు పణాలు చొప్పున వడ్డీ పుచ్చుకోవచ్చు. ఈ రేటుకూడా ఎంతో న్యాయంగా వున్నట్టే కనబడుతుంది. అయితే. కొన్ని మినహాయింపులు వున్నాయి.

హిందూ ధర్మశాస్త్రం దృష్టిలో మానవులందరూ సమానులుకారు. [illegible]ను బట్టే అధిక్యతగాని, న్యూనతగాని వస్తాయి. ఒక నేరం బ్రాహ్మణుడు చేస్తే ఒక శిక్ష శూద్రుడు చేస్తే మరొక శిక్ష విధించమంటాయి, వడ్డీ విషయంలో కూడా ఈ భేదాలు వర్తిస్తాయి. తాకట్టు లేకుండా అప్పు ఇచ్చేటప్పుడు బ్రాహ్మణుడు నూటికి రెండూ, క్షత్రియుడు నూటికి మూడు, వైశ్యుడు నాల్గు శాతం, శూద్రుడు అయిదుశాతం ఇచ్చుకోవాలి.

వడ్డీకి బదులుగా పొలాలూ, పశువులు వడ్డీ భోగ్యంగా కుదువ

పెడితే, వాటిని అనుభవించుతూ వడ్డీని లెక్క కట్టుకోవచ్చు. అసలు కన్న అయిమురెట్లు పెరిగేదాకానే వడ్డీని లెక్కకట్టుకోవాలి. ఆ తరవాత వడ్డీ రాదు. ఈ నియమం కూడా ధర్మవడ్డీ కిందనే లెక్క. ఇరవై సంవత్స రాల దాకా చెల్లించకపోతే తాకట్టుశాస్త్రీలు అనుభవిస్తున్న వాడి సొత్తు అయిపోతాయి. అయితే, ఈ సూత్రం శ్రోత్రియ బ్రాహ్మణుల విషయం లోనూ, రాజపురుషుల పట్లా వర్తించదు. ఇతర కులాల విషయంలో తాకట్టు వాకట్టు అయిపోతుంది.

## అప్పుల వారసత్వం

ధనరూపంలో తాత తండ్రులు చేసిన అప్పుల్ని కొడుకూ, మనుమడూ తీర్చితీరాలి. శాస్త్రం ప్రకారం ముత్తాత చేసిన అప్పుల్ని ముని మనుమడు తీర్చక్కర్లేదు గానీ, ఆరుతరాలదాకా అప్పు తీర్చవలసిన కట్టుబాటు వాడుకలో ఉండబట్టే కష్టజీవులు కట్టుబానిసలయిపోతున్నారు.

మన కళ్ళముందు జరుగుతున్న భీభత్స నాటకంలో పెట్టుబడి దారీ రంగాలలో అప్పులు వడ్డీల అంశాలలో ప్రతిఒక్కటీ విషాదాం తమే. ఈ సామాజిక సత్యాన్ని ఉత్తమ కథకులందరూ చూస్తారు, పరిశీలిస్తారు. దాన్ని ఆధారం చేసుకుని కథలు రాస్తారు, కళ్లు తెరి పిస్తారు.

ఉత్తమోత్తమ కథకుడు ఒక్క కథలోనే పద్దెనిమిది పర్వాల నవీన భారతచరిత్రను కళ్ళకు కట్టిస్తాడు. కాళీపట్నం రామారావుగారు యజ్ఞం కథలో అదే చేశారు. అందులోనూ అప్పు ఇచ్చినవాడూ చితికి పోయినవాడే. తీసుకున్న వాడు నాశనమవబోతున్న వాడె. గవర్నమెంటు రేటు ధర్మవడ్డీనే మధ్యవర్తులు లెక్కకట్టారు.

రైతు, రైతు కొడుకులూ, మనుమలూ బానిసలు కాబోతున్న వాళ్ళే. ఆయితే ఇది ఒకరిద్దరి వ్యక్తుల కథకాదు. ఊరందరి కథా అని

చెప్పాలి. ఒకఊరి కథమాత్రమే కాదు. పెట్టుబడిదారీ సమాజకథం. అది చంపుతున్న మనుష్యుల చేతుల్లోనే అది చావబోయె కథ.

ఉత్తమ కథలూ, ఉత్తమోత్తమ కథలూ సమస్యను చర్చిస్తాయి. పరిష్కారాన్ని ధ్వనిస్తాయి. ఆ పరిష్కారాన్ని సాధించగలవాళ్లు ప్రజలే. ధర్మవడ్డీలు చక్రవడ్డీలు, కాలవడీలు వ్యక్తుల్ని పీల్చి పిప్పి చేయని సమాజం ఒకటే వుంది—అది సోషలిస్టు వ్యవస్థ.

—o—

# "కోహినూరు నీ జడలో పూవట !"

జాతీయోద్యమం చాలా ముమ్మరంగా సాగే రోజుల్లో తెలుగు జిల్లాలలో జరిగే ఏ రాజకీయ సాంఘిక, వైజ్ఞానికసభలోనైనా ఈ వందిగీతం ప్రార్థనగా తరుచు వినబడుతూ వుండేది.

నమో హిందూమాతా! సుజాతా!
నమో జగన్మాతా!
అమోఘ దివ్యమహిమా సమేతా
అఖండ పరిభరిత ఖండ మాతా! నమో!!

ఈ ప్రార్థనలో ఒక చరణం మట్టుకు నాకు చాలా జ్ఞాపకం—

గోలకొండ నీ రత్నకోశమట
కోహినూరు నీ జడలో పూవట
తాజమహాలు నీ దివ్య భవనమట
అహాహా! నీ భాగ్యము మాతా !నమో।

ఈ చరణంలోని గోలకొండా, కోహినూరూ మన తెలుగువాళ్ళవని నా చిన్నతనంలో విన్నప్పుడు గోలకొండ కథలూ, కోహినూరు కథలూ ఎవరు చెప్పినా వినేవాడిని. ఏ పుస్తకంలో కనపడ్డా చదివేవాడిని. భారతదేశం రత్నగర్భ అయితే గోలకొండ నిజంగా రత్నకోశమే. గోల్కొండ అనే మాటకు ఛాంబర్స్ ఇంగ్లీషు నిఘంటువులో "ఏ రిచ్ సోర్స్ ఆఫ్ వెల్త్" అనే అర్థం కనపడుతుంది. గోల్కొండ హైదరాబాద్ దగ్గర వున్న శిధిల నగరమనీ ఒకప్పుడు వజ్రాలు సానపట్టే చోటుగా ప్రసిద్ధమైనదనీకూడా ఆ నిఘంటువు చెప్తుంది. ఆంగ్ల భాష

లోనే కాక ప్రపంచభాషలు కొన్నింట్లో "గోల్కొండ" అన్నది మహదైశ్వర్యానికి పర్యాయపదం. [illegible]ని వజ్రాలసంగతి చెప్పకొనేటప్పుడు మొట్టమొదట కోహినూరు గురించే ఎవరైనా చెప్పకోక తప్పదు.

క్రీస్తుశకం 1583-91 సంవత్సరాల మధ్య భారతదేశంలో కూడా పర్యటించిన ఇంగ్లీషు యాత్రికుడు రాల్ఫ్‌పిట్జ్ తన యాత్రలలో గోలకొండను సందర్శించాడు. వజ్రాల సంగతి ప్రస్తావించాడు. స్వచ్ఛమైనవని ప్రస్తుతించాడు. ఇంతకుముందే గోవాలో వుండే పోర్చుగీసు వైస్రాయికీ స్వంత వైద్యుడయిన గార్సియా డఓర్టా అనే అతడు మనదేశంలో వజ్రాల గనులను చాలా విపులంగా క్రీస్తుశకం 1665లో వర్ణించాడు.

## వజ్రాల సీమ

తెలుగుగడ్డ వజ్రాలసీమ మన కృష్ణానది ప్రవహించినంత మేర వజ్రాలు దొరికే చోటే. గుంటూరు జిల్లా చేజర్ల దగ్గర. సత్తెనపల్లి తాలూకా కొల్లూరు దగ్గర, నూజివీడు తాలూకా మలవల్లి, గొల్లపల్లెల దగ్గర, కర్నూలుజిల్లా బంనపల్లె, మునిమడుగు, రామళ్ళకోట ఇలాకాల దగ్గిరా, అనంతపురం జిల్లా వజ్రకరూరు దగ్గిరా వజ్రాలు దొరుకుతూ వుండెవి. కొల్లూరు దగ్గిరే కోహినూరు వజ్రం దొరికిందని కథలుగా చెప్పుకుంటారు. టవర్నియర్ అనే వజ్రాల వర్తకుని కథనం ఇందుకు కొంత కారణం.

అరేబియన్ నైట్స్ కథలలో సింద్‌బాద్ అనే నావికుడు ఏడు సార్లు ఓడ వ్యాపారాలు చేస్తాడు. అని కట్టు కథలు. జీన్ బాప్టిస్ట్ టవర్నియర్ (1605-1689) అనే ఫ్రెంచి వర్తకుడు ఆరుసార్లు విస్తృత పర్యటనలు జరిపాడు. చివరి అయిదుసార్లూ భారతదేశంలో రత్నాల వ్యాపారం చేశాడు. టవర్నియర్ తన రెండవ ప్రయాణం (1638-43) లో గోలకొండకు వచ్చారు. ఆంధ్రభూమిలోని వజ్రాల గనులను పరిశీలవగా చూచి సవిస్తరంగావాటిగురించి రాశాడు. టవర్నియర్ తన పర్య

టనలలో బాగ్దాద్, పెర్షియా మొదలైన ప్రాంతాలలో మకాములు చేశాడు.

టవర్నియర్ మధ్యప్రాచ్యంలో మధ్య మధ్య మకాములు చేస్తున్నప్పుడు ఆంధ్రదేశపు వజ్రాల గనుల గురించి చాలాకథలు చెప్పేవుంటాడు. ఆ కథలే సింద్‌బాద్ ఏడు సబురులలో ఒక సబురు కథకు ఆధారమైనాయి. కొత్తగనిలో పని ప్రారంభించేటప్పుడు జంతుబలి చేయడం సర్వసామాన్యం. ఆ బలిపశువు కళేబరం గనిలో అగాధంలో పడివుంటె దానిని చాలా పెద్ద గద్దలు తన్నుకుపోవడం కూడా సర్వ సాధారణమే. ఆ మాంసం ముద్దలకు వజ్రాలు అంటుకొనివుంటే ఆశ్చర్యపడనక్కర్లేదు. ఇటువంటి సంఘటన నొకదాన్ని ప్రయాణీకుడు కథనం చేస్తే అరబ్బీరాత్రుల కథకుడు చిలవలూ పలవలూ చేర్చి "రాక్కు" పక్షుల కథను అల్లివుంటాడు. ఈ వైనాన్ని సాక్షిస్తూ "ఎన్‌సైక్లోపీడియా ఆన్ బ్రిటానికా" గ్రంథస్థం చేసింది. (7వ సంపుటి-319 పుట)

## వా దో ప వా దా లు

కొల్లూరు దగ్గర దొరికినది నిజంగా కోహినూరు వజ్రం కాదని "గ్రేట్ మొగల్" అని ప్రపంచప్రఖ్యాతి చెందిన మరొక గొప్ప వజ్రమని కూడా చెప్పుకొంటారు. మొగలు సామ్రాజ్య స్యస్థాపకుడు బాబర్ తన స్వీయ చరిత్ర (1526)లో ఆగ్రా దగ్గర తానొక ఎనిమిదిమిష్కాల బరువుగల వజ్రాన్ని కొల్లగొట్టినట్టు రాసుకొన్నాడు. (8 మిష్కాలు అంటే 320 రతులు లేక రమారమి 187 కారట్లు). బాబర్ తన స్వీయ చరిత్రలో చెప్పుకొన్న ఈ వజ్రాన్నే కోహినూరు వజ్రంగా కొందరు భావిస్తున్నారు.

ఈ విషయమై వజ్రాల చరిత్రకారులు 19 వ శతాబ్దిలోనే వాదోపవాదాలు చాలా జరిపారు.

మరొక కథనం ప్రకారం దక్షిణ హిందూదేశంలోకి ఒకానొక దేవాలయంలోని విగ్రహం కళ్ళకు రెండు గొప్ప వజ్రాలు పొదిగి

వుండేవి. ఒక ఫ్రెంచి సైనికుడు ఒక కంటినున్న వజ్రాన్ని పెకిలించి, దొంగిలించి పారిపోయాడు. ఆ సైనికుడు ఓడలో స్వదేశానికి వెళుతున్న ప్పుడు అతని దగ్గరున్న వజ్రాన్ని ఓడ కెప్టెను అపహరించాడు. ఆ వజ్రాన్ని ఆ కెప్టెన్ ఆర్లాఫ్ (1737-1808) అనే రష్యన్ రాజపురుషు డికి తొంభైవేల పౌండ్లకు అమ్మాడు. అప్పట్నుంచీ దీనికి ఆర్లాఫ్ వజ్ర మనే పేరు వచ్చింది. రష్యన్ రాణి రెండవ కేథరీన్‌కు తన వజ్రాన్ని ఆర్లాఫ్ కానుకగా ఇచ్చాడు. అప్పుడు దాని తూకం రమారమి 199 కారట్లు. ఈ ఆర్లాఫ్ వజ్రం రష్యన్ మకుటంలో ఆభరణంగా పొదగ బడింది.

దేవాలయంలోని విగ్రహం ఒక కంటివజ్రం ఆర్లాఫ్ వజ్రమైతే రెండోకంటి వజ్రమే కోహినూర్ వజ్రమనే కట్టుకథ కూడా చలా మణిలో వుంది. ఈ రెండో గ్రేట్ మొగల్ వజ్రంలోని తునకలని కూడా చెప్పుకుంటారు. ఏది ఏమైనా ఆర్లాఫ్‌వజ్రం రష్యన్‌రాణి మకుటా భరణమైతే, కోహినూరు వజ్రం బ్రిటిష్‌రాణి కిరీటంలోనూ, రాజదండం లోనూ ముక్కలై పొదగబడింది.

## బ్రిటిష్‌వారి రాక

బ్రిటిష్ వర్తకులు మనదేశంలో వర్తకంచేసుకునేందుకు తూరు ఇండియా కంపెనీగా ఏర్పడి 1612లో పశ్చిమ తీరాన సూరత్‌లో గిడ్డంగి కట్టుకున్నారు. తూర్పుతీరాన మొదట మచిలీపట్నంలో వ్యాపారం మొదలు పెట్టారు. తూర్పు కోస్తాలోని విశాఖపట్నం బెండమూర్లంక, ఇంజరం, మాధవాయిపాలెం, బందరు, విశాఖపట్నం, దుగరాజుపట్నం. మద్రాసు రేవులలో వరుసగా గిడ్డంగులు కట్టుకున్నారు. మద్రాసు కాల క్రమాన 1640 తర్వాత తూర్పుకోస్తా గిడ్డంగు లన్నింటిమీదా అజమా యిషి చేసే ముఖ్య పట్టణమైంది.

ఈ గిడ్డంగులలో కుంపిణి తరపున వ్యాపారంచేసే ఏజంట్లు తమ స్వంత వ్యాపారాన్ని కూడా చూసుకొనేవారు. భారతదేశంలో వరహాల చెట్లు వున్నాయని, వాటిని దులుపుకుని జేబులు, సంచులు, పెట్టెలు నింపుకోవచ్చుననీ ఈ తెల్లవాళ్లు భావించేవారు. నిజానికి అలా నింపుకున్నారు కూడా.

1679లో చెన్నపట్నంలో స్ట్రెయిన్‌షాం మాస్టర్స్ అనే ఇంగ్లీషు వర్తకుడు కుంపిణీవారి ఏజెంటుగా వుండేవాడు. అతడు 1679 మార్చి 19వ తారీకునాడు చెన్నపట్నం నుండి బయలుదేరి బందరు, మాధవాయిపాలెం మొదలయిన గిడ్డంగులు తనిఖీ చేసి దారిపొడుగునా తెలుగు నేతగాళ్ళతో వ్యాపారం చేస్తూ ఆ సంవత్సరం ఏప్రిల్ 20 తేదీనాడు ఏలూరు దగ్గర నున్న వజ్రాల గనిని సందర్శించాడు.

## వజ్రాల గనులు

ఏలూరు దగ్గర గొల్లపల్లి గ్రామం వుంది. అక్కడ మిస్టర్ ఖాల్సలే అనే ఆయన గనిలో కొంత గుత్తకు తీసుకొన్నాడు. గనుల మీద ఒక అమిందార్ వుంటాడు. ఈ గనులమీద సాలీనా సర్కారు వారికి అరవైవేల వరహాల కౌలు పైకం వస్తుంది. ఆంధ్రదేశపు గనులలో ముప్ఫయి, నలభై వేల మంది తమపనులలో, ఇతర పనులలో వుంటారని మాస్టర్స్ తన డైరీలో వ్రాశాడు,

నూజివీడు ఇలాకాలోని మలపల్లి, గొల్లపల్లి. రాజుపేట ప్రాంతాలలోని వజ్రాల వ్యాపారాన్ని చక్కగా విశదపర్చాడు. కొన్ని గనులు 10–12 అడుగుల లోతులో వుంటాయి. కొన్నివేల వరహాలు ఖరీదుచేసే వజ్రాలను తవ్వే కష్టజీవికి నెలసరి ఒకటింబావు వరహా కూలి ఇచ్చేవారట. ఒక్కొక్కనాడు ముప్ఫయి నుంచి యాభైవేలరూపాయలు

విలువచేసే వజ్రాలను పనివాళ్ళు తవ్వి గుత్తదార్లకు అప్పజెప్పే వారు. గొల్లపల్లి దగ్గర ఎందరెందరో సగం వర్తకులు గుమికూడేవారు. మంచి వజ్రాలను నగదు ఇచ్చి కొనేవారు.

## క్షీణదశ

స్ట్రెయిన్ షాం మాస్టర్స్ కళ్ళారా చూసి ఆంధ్ర వజ్రాలగురించి రాసిన వైనాలు గార్డన్ మెకంజీ 1883లో రాయించిన కృష్ణాజిల్లామాన్యువల్‌లో 130 పుట దగ్గర్నుంచీ పొందుపరచిన అనుబంధంలో వున్నాయి. 17వ శతాబ్దంలోనే కాదు 18, 19 వ శతాబ్దాలలో కూడా తెలుగు గడ్డ మీద వజ్రాల తవ్వకం నిరివిగానే సాగుతూవుండేది.

అయితే 1725 లో బ్రెజిల్ దేశంలో వజ్రాల గనులు బయట పడ్డాక భారతదేశంలోనూ, ముఖ్యంగా ఆంధ్రసీమలో వజ్రాల వ్యాపారం క్షీణిస్తూ క్రమంగా అడుగంటింది? లండన్‌లోని పెట్టుబడిదారులు ఇంకొక రకంగా మన వజ్రపరిశ్రమపై దెబ్బతీశారు.

అనంతపురంజిల్లా గుత్తి తాలూకా దగ్గిరున్న వజ్ర కరూర్‌లో వర్షం కురిసి వెలిసిన తర్వాత వజ్రాలు బయటపడుతూ వుండేవి. సాధారణ గ్రామీణులు అన్నం మూటలు కట్టుకొని వజ్రాలు వెదకటానికి వెళ్లే వారు. వాళ్ళవాళ్ళ అదృష్టాన్నిబట్టి వజ్రాలు దొరుకుతూ వుండేవి. ఒక సారి కోర్టుకు అవతలనున్న పొలంలో ఒక వజ్రం లభించింది. దానిని పి. ఆర్. అర్. అండ్ సన్స్ వారు కొని సాన పట్టించి అమ్మారు. దానికి లక్ష యాభై వేలు కిమ్మత్తు గిట్టుబాటయింది.

వజ్రకరూరులో శాస్త్రీయ పద్ధతులలో ఆధునిక యంత్రాలతో వజ్రాల త్రవ్వకం కొనసాగించడానికి 1884వ సంవత్సరంలో ప్రయత్నాలు జరిగాయి, "మద్రాసు ప్రెసిడెన్సీ డైమండ్ ఫీల్డ్సు అండ్ కంపెనీ లిమిటెడ్" అనే సంస్థను స్థాపించారు. అయితే ఆఫ్రికాలోని కింబర్లేను గనులకు మదుపుపెట్టిన లండన్‌లోని పెట్టుబడిదారులు ఈ కంపెనీకి వ్యతిరేకంగా పనిచేశారు. అయినా మద్రాసు కంపెనీ 250 ఎకరాల ఇనాం భూమిని కొని మరి నాలుగు వందల ఎకరాలలో గనులు త్వ్వే హక్కును పొందారు. శ్రద్ధగా పనులు ప్రారంభించారు. అయితే ఈ మద్రాసు కంపెనీ యావదాస్థిని "ఇండియన్ ఎక్స్‌ప్లోరేషన్ కంపెనీ లిమిటెడ్ వారు" కొనేశారు. గని పనులు నిలుపుచేశారు. కంపెనీకి తాళం వేశారు. ఆంధ్రసీమలోని పరిశ్రమను ఆంగ్లేయులుపొట్టనపెట్టుకొన్నారు. తవ్వితే ఇంకెన్ని కోహినూరు వజ్రాలు దొరికేవో.

జాతీయోద్యమపు రోజులలో ఎంతో ఉత్సాహాన్నికలిగించిన గీతంలోని ఈ క్రింది చరణం తర్వాత అంత ఉత్సాహాన్ని ఇవ్వలేదు.

గోలకొండ నీ రత్నకోశమట
కోహినూరు నీ జడలో పూవట
తాజమహలు నీ దివ్య భవనమట
ఆహాహా? నీ భాగ్యము మాతా ॥నమో॥

ఈ చరణానికి మరీ అంతగా తర్వాత పొంగిపోవటానికి మూడో పాదమే. కారణం. తాజమహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవరోయ్ అని ప్రపంచ ప్రజాకవి ప్రశ్నించాక దృక్పథమే మారిపోయింది. గోల

కొండలకూ, కోహినూర్లకూ, తాజమహాళ్ళకూ కారణభూతుల గురించి ఆలోచించడం మొదలయింది.

నిజమే కోహినూర్ తవ్విన కూలీ ఎవరు?

—o—

# స్థలనామ పరిశోధక సంఘాల ఆవశ్యకత

తెలుగు ప్రజల సమగ్ర చరిత్ర రాసుకోవాలంటే ముందుగా స్థలనామ పరిశోధనలు మొదలు పెట్టాలి. ఒక బాష మాట్లాడే జాతి తొలు తొలుత ఎక్కడ నివసించింది. ఎయే ఇతర జాతులతో కలసింది ఎలా విస్తరించింది. మొదలైన విషయాలన్నీ ఆరా తీయాలి జాతి జనుల ఊరూ నాడూ కులగోత్రాలూ, ఆచార వ్యవహారాలు, వర్తక వాణిజ్యాలు మొదలైనవి తెలుసుకోవాలి. ఆంధ్రప్రదేశ్ ఇవాళ ఇన్ని జిల్లాలతో వున్నదంటే ఒక్కొక్క జిల్లాకొక ప్రత్యేకమైన చరిత్ర వుందన్నమాట. ప్రతి జిల్లాలోనూ ఎంత లేదన్నా మూడు వేలదాకా రివెన్యూ గ్రామాలూ మజరా గ్రామాలూ వుంటాయి వాటి ఇప్పటి పేర్లేమిటి? పాత పేర్లేమిటి? పాత పేర్లే ఎందుకు మారాయి? కొత్త పేర్లు ఎలా వచ్చాయి ? ఇటువంటి ప్రశ్నలు చాలా తలెత్తుతాయి.

స్థలనామ పరిశోధన పూర్వం కాలినడకను సాగేది. ఇప్పుడు ఆ శాఖలో తారు రోడ్డులు ఎర్పడ్డాయి ఆచార్య జి. యన్ రెడ్డిగారి మార్గదర్శకత్వంలో డాక్టర్ కేతు విశ్వనాధరెడ్డి చాలా మౌలిక పరిశోధనలు చేసి "కడప ఊరు పేర్లు" అనే సిద్ధాంత గ్రంథం రాసి ఒక చక్కని హైరోడ్డు వేశారు. విశ్వనాథరెడ్డి చెప్పినట్లు "గ్రామ నామాలు జీవద్భాషా సామగ్రి గ్రామనామాలు శాస్త్రీయ పరిశీలనకు వర్ణనాత్మక. చారిత్రకతులనాత్మక పద్ధతులు అవసరమూ అనుసరణీయమూ కూడా" దీనికి భాషాశాస్త్ర శిక్షణా చారిత్రక, భూగోళ పరిజ్ఞానం కావాలి రెండవ అఖిల భారత ద్రావిడ భాషా శాస్త్రజ్ఞుల సమావేశంలో 1972లో ద్రావిడ స్థలనామ పరిశోధక సంఘ స్థాపనకు బీజరోపణ జరిగింది కడప జిల్లా పేర్ల గురించి

కృషిజరిగినా ఇతర జిల్లాలలో ఈ తరహా పరిశోధనలు జరగలేదు. జరిగితే బయటపడలేదు.

....రా జ మ హేం ద్రి....

ఇటీవల రాజమండ్రిలో కొందరు యువకులు ఔత్సాహిక పరిశోధనలు జరిపి తమ ఊరిపేరు వాస్తవానికి "రాజమహేంద్రి" అన్న చారిత్రిక సత్యాన్ని తెలుసుకొన్నారు. ఈ విషయమై స్థానికంగా చర్చలు జరిపి ఎన్నో ప్రమాణాలను చూపెట్టి చాలా మందిని ఈ వాదంవైపు మళ్ళించారు. ఆంధ్ర కేసరి యువజన సమితి అనే స్థానిక సంస్థ పురపాలక సంఘానికి ఒక ఉత్తరం రాసి ఊరిపేరును 'రాజమహేంద్రి'గా మార్చవలసిందని కోరింది. 12-8-81 నాడు పురపాలక సంఘం ఆ ఉత్తరాన్ని చదివి. అందులోని అభ్యర్థన మేరకు తీర్మానం చేయమని కౌన్సిల్‌ను ప్రార్థించారు. కౌన్సిలు దానిని ఆమోదించి 275 నెంబరు తీర్మానంలో ప్రభుత్వంవారికి సిఫార్సు చేశారు.

ఇంతలో కొందరు స్థానిక పండితులు 'రాజమండ్రి నామచర్చ చేస్తూ "రాజమండ్రి ప్రాచీనతమ నామము రాజమహేంద్రపురము మాత్రమేగాని రాజమహేంద్రి కాదు. రాజమహేంద్రి భ్రష్టరూపము" అనే వాదన స్థానిక పత్రికలో ఒక దానిలో లేవనెత్తారు. నిజంగా రాజమహేంద్రపురం అన్నదే ప్రాచీనతమ నామమా? రాజమహేంద్రి భ్రష్ట రూపమా? ఈ ప్రశ్నలు పరిశీలించవలసినవే.

సారస్వతాధారాలనుబట్టి పండితులు రాజమహేంద్రపురమనే రూపాన్ని సమర్థిస్తున్నారు. నన్నయగారి ఆంధ్రమహాభారతంలో రెండు సార్లు ఈ పురప్రసక్తి కనబడుతుంది. "వేంగీ దేశంబునకు నాయక రత్నంబుభంబోని రాజమహేంద్రపురంబునందు....(ఆది-1-8)" అని ఒకసారి, "రాజమహేంద్ర కవీంద్ర సమాజ సురక్ష్మజ....(ఆది-2-23)" అని మరొక సారి ప్రయోగాలు కనబడుతాయి. నన్నయగారి ప్రయోగాలవల్ల

ఊరిపేరులో "రాజమహేంద్ర" అన్న శబ్దం వుందని చెప్పగలమేగాని అది వరము అనే ద్వితీయావయవయుతమైన పేరు అని చెప్పలేము.

.... ప్రాచీన శాసనాలు ....

డాక్టర్ బూదరాజు రాధాకృష్ణగారు క్రి. శ. 1100 వరకు "ప్రాచీనాంధ్ర శాసనాలు కూలంకషంగా పరిశోధించి నన్నయకు ముందున్న తెలుగు భాష స్వరూపాన్ని శాస్త్రీయంగా చర్చించారు. వారి పరిశోధనలో స్థలనామశాఖ కొంచెం వుంది. "శాసనాలలో దొరికిన భిన్న స్థల నామాలను మాత్రమే పోల్చినప్పుడు ముఖ్యంగా 45 స్థలనామ ప్రత్యయాలు లభిస్తున్నాయి. అని డాక్టర్ రాధాకృష్ణగారు చెప్పారు. ఆ ప్రత్యయాల ప్రాథమిక సందాంశాలను పేర్కొన్నారు. వీటిలో "వరము" అనే ప్రత్యయమేలేదు (ప్రాచీనాంధ్ర శాసనాలు డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ 1971_ పుట LXIX). ఇందువల్ల నన్నయగారి కాలానికి వరము అనే ద్వితీయాంశం ఈ ఊరి పేరులో లేదని శాసన ప్రమాణాలవల్ల స్పష్టమవుతూంది.

ఇతర సారస్వతాధారాల బట్టి కూడా "వరము" అనే ద్వితీయాంశం ఈ పదంలో కనబడదు, శ్రీనాథుడు అయిదుసార్లు ఈ ఊరు పేరును పేర్కొన్నాడు. వాటి వివరాలు ఇవి ;

| | |
|---|---|
| రాజమహేంద్రపురము | భీమఖండం 1_43 |
| రాజమహేంద్రదుర్గము | భీమఖండం 1-75 |
| రాజమహేంద్రపట్టణము | చాటువు (హంసీయానమ్....) |
| రాజమహేంద్ర వీథి | చాటువు (హా జలజాక్షి....) |
| రాజమహేంద్రంబు | కాశీఖండం 1_32 |

.... అప్పకవీయం ....

శ్రీనాథుడి ప్రయోగాలవల్ల కూడా ఈ ఊరి పేరుల "వరం" అన్న

ద్వితీయాంశం లేదు నిశ్శంక కొమ్మన్న శివలీలా విలాసంలో రాజ మహేంద్రనామ నగరంబున్... అని ప్రయోగించాడు. (అవతారిక 58వ పద్యం. విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణిలో రాజమహేంద్ర పురస్థాత్ అనే ప్రయోగంచేశాడు (1-4). ఎటొచ్చీ ఒక అప్పకవి ప్రాస స్థానంలో రాజమహేంద్రవరము అనే ప్రయోగం చేశాడు అప్పకవిది ప్రాచీన తమ ప్రయోగంకాదు అప్పకవియ రచన క్రీ. శ. 1656 అప్పటికి దేశం తురకాణ్యంలో వుంది.

ఒకసారి దుర్గం ఒకసారి పట్టణము ఒక సారి పురం అని గణాల లెక్క-కోసం వాడిన ఉత్త రాజమహేంద్రము అనే ప్రయోగం శ్రీనాథుడూ నిశ్శంకకొమ్మనా వాడారు. వీటిని ప్రాచీన ప్రయోగాలుగా స్వీకరించాలిక రాజమహేంద్రం అనే ప్రాచీన రూపంలోంచి రాజమంద్రం అనే లో. వ్యవహార నామం ఏర్పడింది. ఇది ఇప్పటికీ సజీవ రూపమే.

## —వో మ గి రి—

రాజమండ్రి ప్రాచీనతమ నామం 'వోమగిరి' అను స్థానిక చరిత్ర వల్ల తెలుస్తుంది. మెకంజీ గుమస్తాలు సేకరించిన కైఫియత్తులలో 'వోమగిరి' అనే మాట చాలాసార్లు రాజమండ్రికి ప్రాచీన రూపంగా కనబడుతుంది. మెకంజీ రికార్డులకు బ్రౌను దొర పత్రికలు రాయించాడు. బ్రౌను పండితులు "యోమగిరి" అన్న భ్రష్టరూపం అనుకొని దానిని "వ్యోమగిరి" అని దిద్దేశారు. (ఈ సంగతి యమ్. 7 అనే సంపుటినీ ఎల్.ఆర్. 60 అనే సంపుటిని మెకాబిళా చేసి చూస్తే తెలుస్తుంది.

ఆంధ్రదేశమందు అఖండ గౌతమీ తీరమందు యోమగిరి దుర్గానికి పుత్తరభాగమందు దట్టమైన అరణ్యము కలదు. యోమగిరి దుర్గమైనది. వసువుకొండ తూర్పు పడమరలు క్రొశెడన్నూ ఉత్తర దక్షిణములు మ ప్పావు క్రోశెడన్నూ మిక్కిలి అడవితో కూడుకోని వుండేది. కలి విష్ణు వర్థనుని కుమారుడు విజయాదిత్య మహేంద్రుడనేరాజు ఆంధ్రదేశం రాజ్యరక్షం చేస్తువుండి ఒకనాటి కాలమందున వేట సరదాచేసి సమస్త

సైన్యముతో తట్టున్నపైయిన్న చెప్పిన యోమగిరి పర్వతానికి సమస్త సాధనములతోను వెళ్ళి కొంతసేపు వేటలాకి ఆ కొండపైన నెత్తంపరుపు విశాలం వుండి వున్నది. గనుక అక్కడ పట్నం కట్టిస్తే బహుజాగ్రత్తగా వుండునని ఆలోచనచేసి...." దుర్గం కట్టించాడు.లోకల్ రికార్డ్సు (బ్రౌను) సంపుటి 60 పుటలు 26-27) రాజరాజు కూడా ఈ "యోమగిరి" దుర్గంలో రాజ్యం చేశాడని స్థానిక చరిత్రలు చెప్తున్నట్లు మెకంజీ కైఫీయత్తులు సాక్ష్యం ఇస్తున్నాయి.

రాజమండ్రికి రాజమహేంద్రవరము అన్నది ప్రాచీనతనామం కాదని తేలుతూంది.అయితే రాజమహేంద్రి అనే పేరు ఎప్పుడు వచ్చింది? ఎలా ప్రసిద్ధమైంది అనే ప్రశ్నలు సమాధానాన్ని కోరుతున్నాయి. మెకంజీకైఫీయత్తులలోనే తురకాణ్యం రోజులలో ఈ స్థలాన్ని "రాజమహేంద్రి అని పిలిచేవారని తెలుస్తూంది. "రాజమహేంద్రిహవేలి" అనే మాట కనబడుతుంది. రెవిన్యూ వ్యవహారాలలో ఈ పేరే బాగా నలుగుతూ వుండేది.

—మరికొన్ని ప్రమాణాలు—

మన దేశం తురకాణ్యం నుంచి కుంఫీణీవారికి దాఖలు పడింది. తమ పాలనలోకి వచ్చాక జనులు ఏ గ్రామాన్ని ఏ పేరుతో వ్యవహరించే వారో ఆ పేరునే తెల్లదొరలు స్వీకరించారు. అందుకే తెల్లదొరలు రాసిన స్థల చరిత్రలో భూగోళ పఠాలలో "రాజమహేంద్రి" అన్న పేరే స్పష్టంగా కనబడుతూంది. ఎన్ సైక్లొపీడియా బ్రిటానికా (పదకొండవ ముద్రణ 1911)లోనూ నెల్సన్స్ ఎన్ సైక్లొపీడియా (సంపుటి 19)లోనూ చాంబర్సు ఎన్ సైక్లోపీడియా (1879) పుట 99 లోనూ 'రాజమహేంద్రి' అన్న పేరును ప్రమాణంగా స్వీకరించారు.

భారతీయ చరిత్రకారులు కూడా ఇదే నామాన్ని గ్రహించారు. "ట్రైబ్స్ ఇన్ఎన్షెంట్ ఇండియా" అనే గ్రంథంలో భీమల్ చరన్ గ్రంథంలో భీమల్ చరన్‌లాగారు 'ఏన్షెంట్ జాగ్రఫీ ఆఫ్ ఇండియా'

అనే గ్రంథంలో సురేంద్రనాథ్ ముజుందార్ శాస్త్రిగారూ 'రాజమహేంద్రి' రూపాన్నే వాడారు.

## —ప్రజల వ్యవహారం—

రాజమహేంద్రి అన్నమాట చాలా ప్రచారంలో వుంది కాబట్టి జనుల వాడుకలో అది "రాజమంద్రిగా" నలిగి ఇప్పటికీ సజీవంగా వుంది ఈ పేరును ఇంగ్లీషులో రాసి తెలుగులో ఉచ్చరిస్తే అది 'రాజమండ్రి' అవుతుంది, తెల్లదొరల పాలన ఇంగ్లీషులో చదువులు ముదిరాక ఈ పేరుట వర్గ తృతీయాక్షరంతో విద్యాధికులు వాడసాగారు. "పామరులు" రాజమండ్రి అనే వాడుకుంటున్నారు. తెల్లదొరల పాలనలో కూడా తెలుగులో రాసేటప్పుడు రాజమంద్రి అనేరూపాన్నేరాసేవారు చెన్న రాజధానిలోని గ్రామ నామాల పట్టిక (1924) చూస్తే ఈ సంగతి విశదమవుతుంది. రాజమహేంద్రవరం అన్న పేరు పండితుల గ్రంథాలలోనేగాని ప్రజల వ్యవహారంలో లేదనిపిస్తూంది ఉంటే ఆ పేరు నలిగి నలిగి రాజమందారం అనె రూపం ఏర్పడి ఉండేది రాజమంద్రం రాజమంద్రి అనే రూపాలేగాని రాజమందారం అన్న రూపం ఎక్కడా కనబడదు.

సాధారణంగా వరం అన్న మాట ద్వితీయావయవంగా గల పేరుతో వరంలోని అది హల్లుపోయి అచ్చు మిగులుతుంది, ప్రథమావయవంలో తుది అచ్చుతో సంధి ఏర్పడుతుంది అన్నావరం-అన్నారం-పర్వవరం సర్వారం- సప్పారం రాజవరం రాజారం మొదలైన ఉదా॥ ఎన్నయినా ఇవ్వవచ్చు రాజమహేంద్రవరం అన్నది, ప్రాచీనతమ నామమూ కాదు లోకప్రచారంలోవున్న పేరూ కాదనితేలుతూంది

రెవెన్యూ వ్యవహారాలలో మధ్య యుగాలనాటినుంచీ ప్రచారంలో వుంది ప్రజల నిత్య పలుకుతూ ఉండడంవల్ల రజమహేంద్రి-రాజమంద్రి అనే రూపాలు భ్రష్టరూపాలు కావని కూడా నిశ్చయించవచ్చు.

.... బందరు పేరు ....

రాజమంద్రికోటలోని శాసనాల నకలు మెకంజీ సంపుటాలలో వున్నాయి. వీటిని పరిశీలిస్తే మరికొన్ని విషయాలు బైటపడవచ్చు రాజమంద్రి విషయంలోలాగె బందరు గురించి కూడా విపుల పరిశోధనలు చేయాలి. మచిలీపట్నానికి కాడలిపుం లనే ప్రాచీన నామం ఉన్నట్టు ఇటీవల దొరికిన శాసనాలవల్ల తెలుస్తూంది.

ఏమైనా జిల్లా కేంద్రాలలో స్థలనామ పరిశోధక సంఘాలు ఎర్పడి గతాన్ని త్రవ్వితే ఎన్నో పేర్లు తెలుస్తాయి దీనివల్ల ఆ స్థలాలకు మరుగు పడిన గత కీర్తిలబిస్తుంది ఆ స్థలాలు చరిత్రార్థక మవుతాయి ఈకార్యాన్ని ఔత్సాహిం పరిశోధకులైనా యువకులు చేపట్టాలి. వీరి కృషిని సానుభూతితో పరిశీలించి పండితులు చేయూతఇవ్వాలి కాని ఏ కొద్దిమంది కవులో గణాలకోసం యతిప్రాసల కోసం చేసినస్థలనామ ప్రయోగాలనే పట్టుకొని యువకులు ప్రతిపాదించిన చారిత్రక సత్యాలను భ్రష్ట రూపాలుగా కొట్టిపారవేయకూడదు. ఆర్య వ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు పెద్దలు వ్యవహరించిన మాట గ్రామ్యంబయిన గ్రహింపదగునని తాత్పర్యము అని వ్యాకర్తలే చెప్పారు.

ఇవాళ పెద్దలు ప్రజలు.

# మచిలీపట్నం మునుపు మచిలింద నగరమా ?

చరిత్ర పరిశోధనలో కొన్ని పేజీలు చిరకాలం మడత పేజీలు గానే ఉండి పోతాయి. ఈ వివాదగ్రస్తమైన విషయాలు రావణాసురుని కాష్టంలాగ కలకాలం రగులుతూనే ఉంటాయి. ఉదాహరణకు మైసోలియా ఎక్కడుంది? అది ఊరా? లేక నాడా?

దక్షిణ భారతంలో తూర్పుకోస్తా చాలా ప్రాచీన చరిత్ర గల భూభాగమే, కొన్నిరేవులలో నౌకా వ్యాపారం బాగా సాగేది. ప్లిని టోలెమీ అనే గ్రీకు యవన భూగోళ గ్రంథ రచయితలు ప్రాగాంధ్ర తీరంలో కొంటికసిల, కొడూర మైసోలియా అనే ప్రదేశాలను పేర్కొన్నారు. కొంటికసిల అంటే ఘంటశాల అనీ కొడూర అంటే బందరు దగ్గిర గూడూరు అని చరిత్రకారులు గుర్తించారు. మైసోలియా అన్నది. మచిలీపట్నమే అని కొందరు భావించారు టాలెమీ క్రీ. శ. 2వ శతాబ్దివాడు అప్పటికి మచిలీపట్నంలేదు కాబట్టి మైసోలియా బందరు కావడానికి వీల్లే దని మరి కొందరి వాదన.

బందరు ప్రాచీన నామ మేమిటో ఎవరికీ తెలియదు. ఒక ఊరికి ఆ పేరెందుకొచ్చిందో చెప్పే ఊరుడు కథలు కాకమ్మ కథలే.

బంధుడు అనే చేపలవాడు పట్టిన గొప్ప మత్స్యం వల్ల ఈ ఊరికి మచిలీ బందరు అనే పేరు వచ్చినట్లు ఓ కట్టు కథ చెప్పుకొంటారు. మత్స్యపురి, బృదావనం అనే పేర్లను కూడా మధ్యలో పుట్టించారు. మచిలీపట్నం పాశ్చాత్యులు పలకడంలో మసులిపటేమ్ అయింది కనుక ఈ ఉచ్చారణను బట్టి మైసోలియాను మసులాగా భావించారు. ఇది కేవలం ధ్వనిసామ్యమేగాని శాస్త్రీయంకాదు.

బందరుకు పడమటన 15 మైళ్ళదూరంలోవున్న ఘంటసాలా, బందరుకు నాలుగు మైళ్ళ దూరంలోఉన్న గూడూరు మాత్రమే ప్రాచీన పట్టణాలుగాని బందరు ఎంత మాత్రం ప్రాచీనం కాదని వాదించే వాళ్ళు న్నారు.

పధ్నాలుగో శతాబ్దానికి ముందు బందరు లేనేలేదనివాళ్లూఉన్నారు దీనికి కారణం ఏమిటంటే అప్పటికి దొరికిన చారిత్రకాధారాలతో గార్డెన్ మెకంజీ 1883లో కృష్ణాజిల్లా మాన్యువల్ రచిస్తూ మచిలీపట్నం గాథలను ఒక పూర్తి అధ్యాయంలో చెప్పాడు. మొటమొదటి సారిగా మచిలీపట్నం అనే పేరు ఆడుశ్శోకట్టిన ఒక మసీదులోని శాసనంలో కనబడుతున్నదని చెప్పాడు శాసనకాలం క్రీ. శ. 1425 అంతకు ముందు ఒక మూరేళ్ళక్రిందట అరబ్బు ఓడ వర్తకులు మచిలీపట్నాన్ని వలసగా నిర్మించుకొన్నారనికూడా గార్డెన్ మెకంజీ చెప్పాడు. అరబ్బు వర్తకులు రావడానికి ముందు ఆ గ్రామం చేపలరేవేగాని, వ్యాపారకేంద్రంకాదు. అయితే. 1397 నాటికే బందరులో దేవాలయాలు ఉన్నాయి. వాటి గోడలమీద శాసనాలు వున్నాయి. ఈ శాసనాలలో తెలియ వచ్చే పేరును ఎవరూ పట్టించుకోవడం లేదు.

ఈ శాసనాలు నిజంగా ఇక్కడివి కావు అని బుకాయించే వాళ్ళూ లేకపోలేదు. గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు తమ ఘంటసాల చరిత్ర అనే గ్రంథంలో బందరు శాసనాల గురించి చెబుతూ అవి బందరులో

వ్రాయబడినవిగావు అని చెప్పారు. ఎందువల్లనంటే బందరులోని రామలింగేశ్వరస్వామి ఆలయంలో దొరికేశాసనాలు ఘంటసాల జల దీశ్వరస్వామికి విశ్వేశ్వరస్వామికీ ఇచ్చిన దానాలగురించి చెప్తాయి. అందుచేత ఈ శాసన శిలలు బందరు ఎప్పుడు పోయేవో

తెలియదు.... ఈ శాసనములు ఏ కారణము చేత ఎందుకు ఎప్పుడు పోయేనో చెప్పజాలము అని వెంకటసుబ్బయ్యగారు అన్నారు.

ఇంకొక ఊళ్ళోని ప్రసిద్ధ దేవతలకు ఇచ్చిన శాసనాలు ఒక ఊళ్ళో కనబడితే. అంతమాత్రన అవి అక్కడివికావు అనడానికి వీలేదు. ఒక పుణ్యక్షేత్రంలో ఉంటూ మరొక పుణ్యక్షేత్రంలోని స్వామివారికి దానాలు చేయడం మన చరిత్రలో శాసన ధారాలవల్ల కనబడే సత్యమే క్రీశ. 1174లో శ్రీ మన్మహా మండలేశ్వరకు లోతుంగ రాజేంద్ర చోడయ రాజులు బెజవాడ కేశవదేవర నివేద్యమునకు ఇచ్చిన భూదాన శాసనం బందరు తాలుకా యెనికేపాడు గ్రామంలో కనబడుతుంది (సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్ వదవ సంపుటి నెం 492) అల్లసాని పెద్దనగారు ఘండి కోట సీమలోవున్న సకలేశ్వరదేవుని నైవేద్యానికి ఒక గ్రామాన్ని కృష్ణాతీరంలో బెజవాడ మల్లికార్జున దేవుని సన్నిధిని చంద్రగ్రహణ పుణ్యకాలంలో దానంచేశారు ఈ సాక్ష్యాలవల్ల ఒక ఊళ్ళో ఉంటూ ఇంకో ఊళ్లోని ఆలయానికి దానాలు ఇవ్వడం పరిపాటే బందరులో కనిపించే శాసనాలు బందరులో వేసినవికావని చెప్పనక్కరలేదు.

రామలింగేశ్వర స్వామి, రంగనాథస్వామి ఆలయంలో కాక బందరులో ఏకాంబరేశ్వరస్వామి ఆలయంలో కూడా శాసనాలు వున్నాయి గర్భాలయ ద్వారం గడపకు కుడి-ఎడమ ప్రక్కల రెండు శాసనాలు వున్నాయి. ఇవి సరిగా వ్రాయబడియుండలేదు అరిగిపోయి చదువుటకు వీలులేకుండావున్నది అని వెంకటసుబ్బయ్యగారురాశారు అయితే వీటిని చదవడంసాధ్యమే. నా మిత్రులు మద్దూరి వెంకటసుబ్బారావుగారు (శేషాచలం అది కపెంని) బందరు కోటలోని గుడిని స్కౌట్ కుర్రవాళ్ళచేత బాగుచేయిస్తున్నపుడు ఈ శాసనాలను చూశారు. శాసన ప్రతులను వ్రాసి పరిష్కరణకు నాకు పంపించారు (ఎస్టాంపేజ్‌కాదు కేవలం ఐ కాపీ మాత్రమే అయితే వీటిని ప్రభుత్వ శాసనశాఖ పరిశోధకులు ఎప్పుడో పరిష్కరించి ఉంటారని ఉపెక్షచేశాను.

ఇటీవల వేరే విషయం పరిశోధిస్తూ దక్షిణ భారత శాసన సంపుటాలు తిరగేశాను. వీటిలో పదో సంపుటిని జయంతి రామయ్యగారు పరిష్కరించారు. అందులో బందరు రామలింగేశ్వరస్వామి ఆలయంలోని శాశనాలు మాత్రమే పరిష్కరించి ప్రకటించారు. ఏకామ్రేశ్వరస్వామి ఆలయంలోని శాసనాలు లేవు. కొన్ని శాసనాలను ప్రభుత్వ పరిశోధకులు నమోదుచేసి వార్షిక నివేదికల్లో పేర్కొన్నా పరిష్కరించి ప్రకటించడం అంటూ ఉండదు. అందుచేత మద్దూరు సుబ్బారావుగారు పంపించిన "ఐ-కాపీ" ప్రతులను చదివి పరిష్కరించాను. చాలా ఆసక్తికరమైన విషయాలు బయటపడ్డాయి.

గర్భగుడి గడపకు కుడిప్రక్కన వున్న శాసనం క్రీ. శ. 1370 నాటిది. ధరణికోట ధనంజయ గోత్రీకుల ప్రసక్తివుంది. (కోట కేతరాజు వంశవృక్షం సూయెల్ దొరగారి హిస్టారికల్ ఇన్‌స్క్రిప్షన్స్ ఆఫ్ సదరన్ ఇండియాలో వుంది). ఇది పద్యశాసనం ఛందస్సు సీసంలిపి కాకతీయ లిపికి దగ్గరలో వుంది ఆరు సీసపాదాలే ఉన్నాయిగాని ఎత్తుగీత లేదు ఆరో పాదంలో ఒక మాత్రాధిక్యత ఉందిగాని మిగతా పాదాంలో ఛందోభంగం ఏదీలేదు శాసనపాఠం ఇలావుంది శ్రీదావ్యవాటీ పురాధీశుండై దనం.

జయ గోత్రుడగు భీమజనవరేణ్ణు
మనుమండు భైరవమనుజ నాయకు దక్షిం
డిత రాజ్యసంపద నతిశయిల్లి
ఆ రాజు తండ్రియై తా రాజయోగమై
పరగిన ప్రోలభూపాల తిలకు
పరమ భక్తికి మెచ్చి కరరాస క్షామవ
త్సర మార్గశిర సితద్వాదశియును

శుక్రవార నిశిని సురదుందుభులు మ్రోయు
చండ నాట్యమ్మాడె నొక్కజాము
నరులు వినుచునుండ నాగనాథుడు కడలి
పురమున మచిర గోపురమున....

[ధరణికోట పాలించిన కోట కేతరాజు వంశంలో భీమరాజు క్రీ.శ. 1265 ప్రాంతాలవాడు. ఈ భీమరాజు మనుమడి మనుమడు ఈ శాసనములో భీమరాజుకావచ్చు 1370 నాటికి ధరణికోట రాజులు అంత సుప్రసిద్ధులుకారు, సూయల్ దొరగారి వంశవృక్షంలో ప్రోలరాజు అన్న పేరు కనబడదు, ఈ శాసనంవల్ల కడలిపురం అన్నది ఒకటుందని తెలింది అగి చాలు.]

ఈ పద్య శాసనంలోనే కాక ఎడమ ప్రక్కనున్న గద్యశాసనములో కూడా "కడలు పురం" అనే గ్రామనామం కనబడుతుంది గద్య శాసనం క్రీ.శ. 1395 నాటిది (దీనినే గార్డెన్ మెకంజీ తన మాన్యువల్‌లో పేర్కొన్నాడు. అయితే శాసన కాలం 1397 అన్నాడు). ఈ రెండు శాసనాలలో కనబడే కడలిపురం బందరే కావచ్చు. కడలిపురి అనే మాటను కదళీపురి అని చదివి దానిని పెద్దకళ్ళేపల్లికి అంటగట్టవచ్చు. (కళ్ళేపల్లిని రంభాపురం అంటారు.) అయితే ఇటువంటి పొరపాటుకు ఆస్కారం లేకుండా గద్య శాసనంలో కడలిపురి అనే స్పెల్లింగు స్పష్టంగాఉంది. అదిలో చేపలరేవే కావచ్చునుగానీ బందరు కడలి గట్టున ఉన్న ఊరే కనుక కడలిపురి కావడానికి అభ్యంతరం లేదు.

అరబ్బులు కడలిపురిని అది చేపలరేవు కాబట్టి మచిలీబందరు అని పిలవడంవల్ల మచలీపట్నం అనే మాట ప్రచారంలోనికి వచ్చి వుండవచ్చు. అయితే మొన్న మార్చిలో ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్ ఆరవ సమావేశంలో మచలీపట్నం పేరు గురించి కొన్ని వివరాలు తెలియవచ్చాయి.

ఆ సమావేశం ప్రథమ విభాగం "ప్రాచీనాంధ్రం" సదస్సులో ఇంగువ కార్తికేయ శర్మగారు తమ అధ్యక్షోపన్యాసంలో బందరు పేరు ముచిలింద నగరం" అని నిర్ణయించారు. సింహళ బౌద్ధగ్రంథం మహావంశకలో ఈ ముచిలింద నగరం ప్రసక్తి ఉంది. ముచిలిందుడు బుద్ధుణ్ణి ఒక గాలివాన నుంచి కాపాడిన ఉదంతం బుద్ధ చరిత్రలోని ఒక ఘట్టం దీనిని ఆంధ్ర బౌద్ధశిల్పులు చాలా విస్తారంగా గండ లించారు ఇది వాళ్ళ అభిమాన ఘట్టం నాగముచిలిందుని పేర ఒక పట్టణం ఘంటసాలకూ గూడూరుకు చేరువలో వెలసిఉంటే ఆశ్చర్యపడవలసిన అవసరమాలేదు' దినికి ఇక శాసన ప్రమాణాలు వెదకాలి.

ముచిలింద నగరంలోని ముచిలీని అరబ్బులు ముచిలీగా ఉచ్చరించి కడలిపురిని మచిలీ బందరు చేసి వుంటారు. ముచిలింద నగరమే టాలెమీ పేర్కొన్న మైసోలియా అని కార్తికేయశర్మగారు భావిస్తున్నారు. "ముచిలిందను మైసోలియాగా పలకడానికి అస్కారంలేదు. ఇంతకీ మైసోలియా ఒక ఊరు కాదు నాడు మాత్రమే, గోదావరీ కృష్ణా నదుల మధ్యవున్న ప్రాంతాన్ని పూర్వం మహిష మండలం అని పిలిచేవారు. దీనినే టాలెమీ మైసోలియా అన్నాడు. మహిష శబ్దం నుంచి "మెసో" అనే ఉచ్చారణ రావడానికి అస్కారం ఎక్కువగా ఉంది. ఇదే సముచిత నిర్ణయ మనుకుంటాను.

- ( ० ) -

# ఇంటిపేర్ల నిఘంటువు నిర్మాణం వెంటనే ప్రారంభించాలి

ఈ నెల పదమూడు, పద్నాలుగు, పదిహేను తేదీల నడుమ భోపాల్‌లో "ప్లేస్ నేమ్స్ సొసైటీ ఆఫ్ ఇండియా"వారి తృతీయ వార్షిక సమావేశాలు జరిగాయి. ఈ స్థలనామ పరిశోధక సంఘంవారి సమావేశాలకు శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగుఅధ్యయనశాఖ ప్రధాన దేశికులు ఆచార్య జి. ఎన్. రెడ్డిగారు అధ్యక్షత వహించారు. మన దేశంలో స్థలనామ పరిశోధనలకు అంకురార్పణం ఇటీవల చేసిన ఆద్యులలో ఆచార్య జి. ఎన్. రెడ్డిగారు అగ్రగణ్యులు వారి పర్యవేక్షణలో 1975లో కేతు విశ్వనాథరెడ్డిగారు కడప ఊర్ల పేర్ల మీద చేసిన పరిశోధన మొట్ట మొదటి సిద్ధాంత వ్యాసం. దీనికి కేతువారికి డాక్టరేటు పట్టా లభించింది. నాటినుంచి స్థలనామ పరిశోధనములు చురుకుగా జరుగుతున్నాయి.

భోపాల్ సమావేశాలలో ఆచార్య జి ఎన్. రెడ్డిగారు అధ్యక్షోపన్యాసంలో చెప్పినట్లు స్థలనామాలంటే కేవలం ఊళ్ళ పేర్లేకావు. భౌగోళిక వివరాలను తెల్పే అన్ని వర్గాలనూ ఇది కీర్తిస్తుంది. గ్రామాలు పట్టణాలు నగరాలు, స్థలాలు, వీధులు, నదులు, కొండలు, చెరువులు, ఏర్లు, అడవులు, ఇంటిపేర్లు, తోటలు, వ్యవసాయ క్షేత్రాలు మొదలైనవన్నీ స్థలనామ పరిశోధన పరిధిలోనికి వస్తాయని ఆచార్య జి. ఎన్. రెడ్డిగారు చెప్పిన విషయం గుర్తుపెట్టుకోవలసిన అంశం.

ఇప్పటి వరకూ దక్షిణ భారతంలో జరిగిన స్థలనామ పరిశోధన ఊళ్ళ పేర్లకే పరిమితమైంది. శ్రీ ఎస్.ఎస్. రామచంద్రరావుగారు కూడా 1975లోనే "శాసనాల్లో స్థలనామాలు" అనే అంశంపై పరిశోధనలు చేసి

డాక్టరేటు పట్టాను అందుకొన్నారు నాగార్జున విశ్వవిద్యాలయంలో ఆచార్య తూమాటి దోణప్పగారి పర్యవేక్షణలో పై. బాలగంగాధరరావుగారు "అనంతపురం జిల్లా గ్రామీణులు" అనే పరిశోధనలు 1981లో చేశారు, "శ్రీ ఎస్. జయప్రకాశ్‌గారు చెంగల్పట్టు జిల్లా గ్రామనామాలు" అనే సిద్ధాంతవ్యాసం ఇంగ్లీషు వ్రాసి, మద్రాసు విశ్వవిద్యాలయానికి సమర్పించారు. కె. సరస్వతి అనేవారు ఇటీవల్ల "మద్రాసు పట్టణ స్థలనామాలు" అనే సిద్ధాంత వ్యాసం రాశారు. ఈ చివరి రెండు పరిశోధనాలకు డాక్టర్ ఎస్. అక్కిరెడ్డిగారు పర్యవేక్షకులు, అనంతపురం, కర్నూలు జిల్లా స్థలనామాలపై ఆచార్య జి. ఎస్. రెడ్డిగారి పర్యవేక్షణలో పరిశోధనలు జరుగుతున్నాయి. చిత్తూరు జిల్లా స్థలనామాలపై డాక్టర్ కేతు విశ్వనాథరెడ్డి గారి పర్యవేక్షణలో శ్రీ పి. చెంగారెడ్డి పరిశోధనలు చేస్తున్నారు.

ఈ వివరాలు చూశాక ఈ పరిశోధనలు కేవలం గ్రామానామాల పరిధిని దాటనట్టు కనబడుతుంది. ఇటీవల జరుగుతున్న ఒక గ్రామనామాల పరిశోధనలో వీథుల పేర్లను కూడా పరిగణనలోకి తీసుకోవడం ముదావహం తాటితోపువీధి. తోపులోని ఇళ్ళు. పోలీసు లైనువీథి మసీదువీథి, మరియమ్మ గుడి వీథి మొదలైన పేర్లన్నీ ఆ ప్రాంతీయ ప్రజల సంస్కృతిని తెలియచేస్తాయి.

"దేశమంటే మట్టికాదోయ్-దేశమంటే మనుషులోయ్" అని గురజాడ చేసిన హెచ్చరికను "స్థలాలంటే జనాలోయ్" అని కొంచెం విస్తృతం చేయాలి. ఏజానపదంలోనైనా జనం నివసిస్తారు. వాళ్ళకు పేర్లుంటాయి. ఇంటిపేర్లుంటాయి. ఈ ఇంటి పేరుకు చాలా చరిత్ర వుంటుంది. ఒక జాతి సమగ్ర చరిత్రను రూపొందించుకోవాలంటే వ్యక్తి నామ విజ్ఞానం గురించి చాలా కృషి చేయాలి. విదేశాలలో ఇంటిపేర్ల గురించి పరిశోనలు ఎన్నడో ప్రారంభమై ఇప్పుడు పరాకాష్ట నందుకొన్నాయి. ఇంగ్లండులో 1905 నాటికే ఇంటి పేర్ల మీద గ్రంథాలు వెలువడ్డాయి. పెంగ్విన్ పుస్తక

ప్రచురణ సంస్థవారు. 1967లో బేసిల్ కోట్లి 1964లో తయారు చేసిన ఇంటి పేర్ల నిఘంటువును అచ్చువేశారు.

బేసిల్ కోట్లీ ఇంటి పేర్లను నాలుగు వర్గాలుగా మాత్రమే విభజించారు. ఎఫ్. ఎల్. ఓ. ఎన్ అనే రోమన్ అక్షరాలలో (FOLN) ఈ వర్గాలను సూచించాడు. ఎఫ్ అంటే ఫస్టునేమ్ వంశకర్త తొలిపేరు ఇంటి పేరుగా వున్నవాళ్ళ వర్గందీనివల్ల సూచితమైంది, ఓ అంటే అక్యుపేషన్ వృత్తివల్ల వచ్చిన ఇంటిపేర్లు ఈ విభాగంలోనికి వస్తాయి. ఎల్ అంటే లోకాలిటీస్ పూర్వీకులు మొట్టమొదట ఏప్రాంతాల నుండి వచ్చారో ఆ విషయాన్ని తెలిపే ఇంటిపేర్లు ఈ కోవలో వంటాయి. ఎన్ అంటే నిక్ నేమ్. ఎగతాళి పేర్లు ఈ వర్గంలో వుంటాయి. ఈ నాలుగు పద్ధుల్లోనే అన్ని ఇంటిపేర్లూ ఉంటాయని కోట్లీ ఉద్దేశం. దీని వల్ల అతివ్యాప్తి దోషంరాదు.

మన తెలుగులో ఇంటిపేర్ల గురించి జిజ్ఞాస ఒక చిన్న వివరణతో 1939లో ప్రారంభమైంది. శ్రీ కందుకూరు బాల సూర్యప్రసాద్ భూపాలుడు (దేశిజీ జమీందారు)గారు ఒంటిచేతిమీదిగా సంకలనంచేసిన "ఆంధ్ర విజ్ఞానము" (ఏడు సంపుటాలు) గ్రంథంలో ఇంటిపేర్ల వివరణ గురించి నేను చూసినంతమట్టుకూ మొట్ట మొదటి ప్రస్తావన. తర్వాత భారతి పత్రికలో 1945 మార్చి నెలలో మేడు సోమయాజుల వరహాలు గారు "ఇంటి పేరంటే " అనే ప్రశ్నతో ఒక వ్యాసం రాశారు. ఏప్రిల్ నెలలో చిలుకూరి నారాయణరావు గారు "ఇంటి పేరు" మీద ఒక వ్యాసం రాశారు.

1946 ఆగస్టు నెలలో కీర్తి కామేశ్వరరావు గార్లు "ఇంటి పేర్ల పట్టుపూర్వోత్తరాలు" అనే వ్యాసం రాశారు. తర్వాత కేవలం ఔత్సాహిక స్థాయిలో మాత్రమే చెదురు చెదురుగా కొన్ని వ్యాసాలు వచ్చాయిగాని శాస్త్రీయ పద్ధతులలో ఇంటిపేర్లపై పరిశోధనలు జరగలేదు.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో స్థలనామాల పరిశోధనలకు పర్యవేక్షణ ప్రారంభించిన ఆచార్య జి. ఎన్. రెడ్డిగారే ఇంటిపేర్ల పరిశోధనకు శ్రీకారం చుట్టించారు. వారి పర్యవేక్షణలో 1978 ఏప్రిల్‌లో కంభం సిద్దారెడ్డి "పాకాలపౌరుల యింటి పేర్లు భాషా సామాజిక పరిశీలన "అనే సిద్ధాంత వ్యాసాన్ని యం. ఫిల్ పట్టంకోసం సమర్పించారు. అదే సంవత్సరం మే మాసంలో డాక్టర్ కేతు విశ్వనాథరెడ్డిగారి పర్యవేక్షణలో కుమారి కాటూరి శారద "చంద్రగిరిపౌరుల యింటిపేర్లు-భాషా సామాజిక పరిశీలన" అనేసిద్ధాంత వ్యాసాన్ని యం.ఫిల్ పట్టంకోసం సమర్పించింది. ఈ రంగంలో ఇది ప్రథమ పరిశోధన కనుక యం.ఫిల్ పరిధికే వీటిని పరిమితం చేశారు.

ఈ ఇద్దరు పరిశోధకులు నామ విజ్ఞాన నిర్వచనం. వ్యక్తినామ నిర్వచనం. ఇంటి పేరు నిర్వచనం. భిన్నభాషా సమాజాలలోని పేర్ల నిర్మాణం గురించి విపులంగా చర్చించారు. తమ పరిశోధనా క్షేత్రాలయిన ఆయా గ్రామాలలోని పౌరుల ఇంటి పేర్లలోకన్పించేభాషా విశేషాలను చర్చించారు. పౌరుల ఇంటిపేర్ల నిర్మాణ స్వరూపాన్ని వివరించారు. వివిధ కులాలోవున్న ఇంటిపేర్లను చర్చించారు. తర్వాత ఆ గ్రామా పౌరుల ఇంటి పేర్లను అకారాదిక్రమంలో ఒక నిఘంటువుగా తయారు చేశారు.

పాకాలపట్నం చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూకాలోని ఊరు దీని జనాభా 15,936 మంది. చంద్రగిరి చిత్తూరు జిల్లాలోని తాలూకా కేంద్రం దీని జనాభా 9.173. ఈ గ్రామాలలోని పౌరుల ఇంటి పేర్ల నిఘంటువుతో పాకాలలో 1203 ఆరోపాలూ. చంద్రగిరిలో 655 ఆరోపాలు వున్నాయి. ఈ రెండు నిఘంటులలోని విశేషాలు చాల ఆసక్తికరంగా వున్నాయి.

ఉదాహరణకు చంద్రగిరిలో "సోడావారు"అనే యింటిపేరు గలవారున్నారు గోలీసోడాలు వచ్చాక ఈ యింటి పేరు వచ్చినట్లు పొరపాటుగా చెప్పిన తప్పే అర్థం కావచ్చును గానీ, నిజమైన అర్థం ఏమిటంటే "సమర్థులు" అని చెప్పుకోవాలి. యిది సంస్కృత పదం, సోఢ అంటే ఓపువాడు, సహనము కలవాడు, సమర్థుడు అని నిఘంటువులలో అర్థం కనబడుతుంది.

శాస్త్రీయమైన పద్ధతులలో ఈ విధంగా యింటిపేర్ల నిఘంటు నిర్మాణం కనీసం ఒక్కొక్క జిల్లాలో రెండేసి తాలూకా పట్టణాలను కేంద్రంచేసుకొని ప్రారంభిస్తే తెలుగు ప్రజల సమగ్ర చరిత్రలో సామాన్య ప్రజల గురించి తెలియవలసిన ప్రాథమిక విషయాలు తెలుస్తాయి. మనరాష్ట్రంలో ఏడో, ఎనిమిదో విశ్వవిద్యాలయాలు వివిధప్రాంతాలలో ఉన్నాయి. అందులోని తెలుగు అధ్యయనశాఖల్లో ఈ రకం పరిశోధనలు చేపట్టాలి. ఉత్సాహం వెల్లివిరిసే పరిశోధక విద్యార్థులకు యిటువంటి ప్రయోజనాత్మకమైన పరిశోధనా విషయాలను కేటాయించి జాతి సంస్కృతికి పనికివచ్చే పనులు చేయించడం పెద్దల కర్తవ్యం.



# ఖడ్గతిక్కనా - కవితిక్కనా

సినీ నిర్మాత, నవతా సంస్థ అధినేత శ్రీ కృష్ణంరాజుగారు చక్కని సాహిత్యాభిమాని, అభ్యుదయ దృక్పథం ఆది నుంచి పెంచుకున్న వ్యక్తి. ఆయన ఇటీవల మద్రాసులో కళాసాగరువారిసభలో కార్యక్రమం ప్రారంభం కావడానికి కొంత వ్యవధి వుండగా నన్నో ప్రశ్న వేశారు. "ఖడ్గ తిక్కన గురించీ కవి తిక్కన గురించీ మీ దగ్గర ఏమైనా మెటీరియల్ ఉందా?" అని అడిగారు. చాలా వుందని చెప్పాను. మా ఇంటికి వస్తే చదువుకొందికి ఇస్తానన్నాను.

అసలు నా పరిశోధనా వ్యాసంగం తిక్కనగారిపై గల గాఢమైన ఆసక్తితో మొదలైంది. 1948లో నేను శ్రీ రాజరాజేశ్వరీ ఫిలింస్ కంపెనీవారి కథాశాఖలో పని చేస్తూ వుండేవాణ్ణి. కన్నాంబగారి మీదా, కె.బి. నాగభూషణంగారిమీద అభిమానంచేత ఆ కంపెనీకి అప్పుడప్పుడు ప్రఖ్యాత దర్శకుడు కె. వి. రెడ్డిగారు వచ్చిపోతూ వుండేవారు. ఒకసారి నాగభూషణంగారు గదిలోనికి వచ్చేదాకా కె. వి. రెడ్డిగారిని నేను ఎంగేజి చెయ్యవలసి వచ్చింది.

"మీరు భక్తపోతన, యోగివేమన తీశారు కదా? కవి తిక్కన తీయకూడదా? అని మాటవరసకి అడిగాను. ఆయన కొంత ఆలోచించి "ఇందులో ఆడవాళ్ళని కదిలించే ఘటాలు ఏమున్నాయబ్బా?" అని ప్రశ్నించారు. నేను జవాబు చెప్పలేక పోయాను. అప్పటికి నాకు సాహిత్యంతోనేగాని సాహిత్య చరిత్రలో పరిచయంలేదు.

కె.వి. రెడ్డిగారి కోసం కాకపోయినా నాకు నేను సమాధానం చెప్పు కొనడానికి చదవడం ప్రారంభించాను. కవి జీవితాలూ, చాటు పద్యాలూ తిక్కనగారికి సంబంధించిన గ్రంథాలు అశగా చదివాను. కేతన తన దశకుమార చరిత్రను తిక్కనగారికే అంకితమిచ్చాడు. అందులో కృతిపతి వంశ వర్ణన చాలా విపులంగా వుంది.దాన్ని చదివి వంశ వృక్షం తయారు చేశాను. సిద్ధేశ్వర చరిత్రలో తిక్కనగారు గణపతిదేవ చక్రవర్తి వద్దకు వెళ్ళి మనుమసిద్ధి రాజ్యాన్ని నిలబెట్టడం గురించి విన్నాను. అద్విపద కావ్యాన్ని చదివి కొన్ని వివరాలు సేకరించాను. నిర్వచనోత్తర రామాయ ణాన్ని తిక్కనగారు మనుమసిద్ధికి అంకితమిచ్చారు. దాన్ని అసాంతం చదివాను.

—కాటమరాజు కథ—

ఇంతలో 1953లో మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంవారు "కాటమరాజుకథ" ద్విపదకావ్యాన్ని ప్రచురించారు. దీనిని కీర్తిశేషులు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు పరిష్కరించారు. నెల్లూరి సిద్ధిరాజులకూ, కాటమ రాజుకూ ఘోర యుద్ధం జరిగింది. రణ తిక్కన ఇందులోనే అమరుడయ్యాడు. ఈ ద్విపద కావ్యాన్ని అసాంతం నాలుగైదుసార్లు చదివాను. కాటమరాజు ఫోక్ హీరో - నన్ను బాగా ఆకట్టుకొన్నాడు. కాటమరాజు పుట్టుపూర్వోత్తరాలు, తాత ముత్తాతల కథలు మొదలైనవన్నీ ఓపికగా సేకరించాను. కాటమరాజు అనే స్టేజి నాటకాన్ని మిత్రుడు జె.వి. రమణమూర్తి నడుపుతున్న నటరాజ కళాసమితివారి కోసం రాశాను. చాలా ప్రదర్శనలు ఇచ్చారు. "తర్వాత కొద్ది కాలానికి జి. రామినీడు దర్శకత్వంలో అక్కినేని నాగేశ్వరరావు ఖడ్గ తిక్కనగా, కొంగర

జగ్గయ్య కవి తిక్కనగా నటించే స్క్రీన్ ప్లే రాశాను. ప్రతి సంఘటనకూ చారిత్రక ఆధారాలు వున్నాయి. దురదృష్టవశాత్తూ ఆ చిత్రం ఆగిపోయింది.

కవి తిక్కన సినిమా తీయమని ఒక దర్శక నిర్మాతతో యధాపలంగా అన్నమాట నన్ను సమగ్ర ఆంధ్ర సాహిత్య రచనకు సంసిద్ధుణ్ణి చేసింది. పదహారు సంవత్సరాల నిరంతర పరిశోధనవల్ల నాకు తెలిసిన విషయాలు నా సాహిత్య సోదరులతో పంచుకోవాలనుకొన్నాను. జాతికి ఉపయోగించే రచనల ప్రకటన జాగు చేయకూడదు. ఉన్నవ లక్ష్మీనారాయణగారు తిక్కనగారి మీద ఒక నవల రచించినట్లుతెలుస్తుంది. దానిని ప్రచురిస్తున్నట్లు "మాలపల్లి"ఒక ముద్రణ అట్టమీద ప్రకటించారు. అది వెలుగు చూసినట్టు లేదు. ఉన్నవవారి "తిక్కన" ఆదిలో అచ్చుపడితే ఎంత బాగుండేది.

## —శ్రీ శ్రీ ఊహాగానం—

నవతా కృష్ణంరాజుగారి కోసం నా దగ్గరున్న మెటీరియల్‌ను తీస్తున్నప్పుడు ఇంకో మిత్రుడు మా ఇంటికి వచ్చాడు. ఏమిటా దస్త్రం అని అడిగాడు. 'కవి తిక్కన-ఖడ్గతిక్కన' భోగట్టాలు అన్నాను. వాళ్ళిద్దరు ఒకరే అని మీ మాంగారు ఎక్కడో రాసేదే?" అన్నాడు. పొరపాటు అయి వుంటుందన్నాను. ఆ మిత్రుడు వచ్చినపని చూసుకొని వెళ్ళిపోయాడు. అతడు మాట జారే మనిషి కాడు. అందుచేత మా మాంగారు శ్రీశ్రీ సాహిత్యంలో ఎక్కడో అది చదివే వుంటాడు. నేనూ చదివి అడ్డగీతలు, మార్జినల్ నోట్స్ వగైరాలు రాసుకున్నవాడినే. అందుచేత వచన విభాగాన్ని ఒకసారి తిరగేశాను. ఈ క్రింది మాటలు కనబడ్డాయి.

"—ఖడ్గతిక్కన, కవితిక్కనలిద్దరూ ఒకటేనా, కాదా అని నేను గతంలో విఖ్యాత చరిత్రకారులు కీ.శే. మల్లంపల్లి సోమశేఖర శర్మగారి నడిగినప్పుడు ఆయన ఎట్లయినా ఊహించుకోవచ్చునని, దేనికి నిర్దుష్టమైన అధారాలు లేవనీ చెప్పారు"— (శ్రీశ్రీ సాహిత్యం మూడు వచన విభాగం- పుట 239).

ఈ మాటలు మా మాంగారు 1969 ఫిబ్రవరిలో అన్నాడు. సోమశేకర శర్మగారిని ఎప్పుడడిగాడో తెలియదు. ఎప్పుడైనా సరే నిద్దర్లో లేపి అడిగినా సోమశేఖర శర్మగారు అలా అనడానికి అస్కారం లేదు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించగా మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంవారు ప్రచురించిన "కాటమరాజు కథ"కు మల్లంపల్లి సోమశేఖర శర్మగారే 27 పుటల పీఠికను ఇంగ్లీషులోనూ. తెలుగులోనూ రాశారు. నిర్దుష్టమైన ఆధారాలను చూపిస్తూ ఖడ్గతిక్కన కవి తిక్కనల సంబంధాలను చెప్పారు. రణ తిక్కన కాల నిర్ణయానికి దశకుమార చరిత్రలో చెప్పిన సేవణ దండయాత్రను పేర్కొన్నారు. కైఫీయత్తులు శాసనాలు పొందుపరిచారు. ఆయన తప్పులతడక శాసనమని కొట్టి పారేసిన ఒక శాసనాన్ని నేను కొంత పరిశోధనచేసి సేకరించి భారతిలో "తప్పుల తడక శాసనం" అనే పేరుతోనే ఒక వ్యాసం రాశాను. ఏది ఏమైనా మల్లంపల్లివారు ఖడ్గ తిక్కన కవి తిక్కన ఒక్కరే అని వూహించుకోమని ఎవరికి చెప్పడానికి వీలుండదు. మా మాంగారు అర చెవితో విని వుంటారు.

## —న మ గ్రా ం ధ్ర సా హి త్యం—

నేను నానమగ్రాంధ్ర సాహిత్యం రెండవ సంపుటలలో తిక్కన గారి వంశవృక్షాన్ని పూర్తిగా ఇచ్చాను. (ప్రచురణ తేదీ మే 1965) దాని ప్రకారం సార కవితాబ్ధి రాముడూ, గుంటూరు విభుడూ అయిన కొట్టరపు

భాస్కర మంత్రికి నలుగురు కుమారులు. మూడవ కుమారుడైన సిద్ధన మంత్రికి ఏడుగురు కొడుకులు వీళ్ళలో పెద్దవాడు ఖడ్గ తిక్కన. భాస్కర మంత్రి నాలుగో కుమారుడైన కొమ్మన దండనాదునికి ఒక్కడే కుమారుడు ఆతడే కవి తిక్కన, ఈ వంశ వృక్షాన్ని నేను కేతన దశకుమార చరిత్ర నుంచి తయారు చేశాను.

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 1917లోనే రెండవ కూర్పుగా ప్రకటించిన చాటు పద్యమణి మంజరిలో 'రణ తిక్కన నెల్లూరు పురము' అనే శీర్షికలలో చాల పద్యాలున్నాయి. అదిలోనే ప్రభాకరశాస్త్రి గారు 'విరాటపర్వము' దొట్టి తుదిముట్ట నాంధ్ర మహాభారతమును రచించిన తిక్కన సోమయాజి కీతడు పెద్ద తండ్రి కుమారుడు" అని రణ తిక్కన గురించి చెప్పారు. దీనిని కూడా చూడకుండా మా మాంగారు "ఇకపోతే తిక్కన జీవితం గూర్చి స్పష్టమైన చారిత్రక సమాచారమేమీ మనకు లభ్యం కాలేదు. అయినా ఆయన జీవితం గూర్చి నేను స్కీన్ ప్లే రూపంలో స్థూలంగా కొంత వూహించాను." అని చెప్తూ తన ఊహాగానాన్ని కథనంచేసి "నియోగి - వైదిక" గొడవలను కూడా ఎత్తాడు. పదమూడో శతాబ్దంలో ఈ గొడవ లేవనే చెప్పాలి. కేతన దశకుమార చరిత్రను అంకితం ఇస్తూ తిక్కన గారి వైదిక తత్పరతను ఇలా చెప్పాడు—

1. వేదాది సమస్త విద్యావ్యాఖ్యాన విభాషి (1-87)
2. సకలాకమార్థతత్త్వ విచారోదారుడు (2-119)
3. వేదత్రితయాత్మకుడు (1-4)

4. సతతస్వాహాస్వధాది శబ్ధధ్వయ సంస్కృత హవ్యకవ్య సంకల్పిత మఖశిఖివిలింప పితృవర్గుడు (1-96) అప్పటికి తిక్కనగారు యజ్ఞం చేసి సోమయాజి కాలేదు.

ఈ రాణీ ప్రేమ పురాణం, ఆ ముట్టడికైనా ఖర్చులు, తారీఖులు దస్త్రావేజులు ఇవి చరిత్రకు అర్థంకాకపోయినా ఒక చారిత్రక గాథను స్క్రీన్ ప్లేగా ఊహిస్తున్నపుడు అందులోను తిక్కనగారి గురించి రూపొందిస్తున్నపుడు మనుమసిద్ధి రాణి కన్నమదేవి ప్రేమ పురాణాన్ని, ఎర్రగడ్డపాడు కోట్లాటలో ముటడికైనా ఖర్చులూ, కవి తిక్కన, ఖడ్గ తిక్కనల తారీఖులూ, దస్త్రావేజులూ చదవందే చేసిన ఊహాగానం అపోహాగానంగానే వుంటుంది సాహిత్య పరిశోధన కూడా వడ్డించిన విస్తరికాదు.



# నెల్లూరి రాజులతో పోరాడిన కాటమరాజు

# విశాఖవాడా ?

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, 1923లో ప్రచురించిన శృంగార శ్రీనాధములో కాటమ రాజు కధగురించివ్రాస్తూ, ఇది పదమూడవ శతాబ్దిని నెల్లూరును బరిపాలించిన మనుమసిద్ధి రాజులకును, ఎరగడ్డపాటి ఏలికయగు కాటమరాజులకును, జరిగిన యుద్ధచరిత్రము" అని వ్రాశారు, ఆనాటి నుంచి అనేకులు శ్రీప్రభాకర శాస్త్రిగారు వ్రాసినదే వ్రాస్తున్నారు.

మదరాసు విశ్వవిద్యాలయంవారు ప్రచురించిన ఆంధ్రవాఙ్మయ చరిత్ర సర్వసము (పేజి 383) శ్రీ శిష్టా రామకృష్ణ శాస్త్రిగారు కాటమ రాజు గురించి "మనుమసిద్ధి రాజ్యకాలమున కనిగిరి సీమలో నెర్రగడ్డను పాలించు కాటమరాజునకును సీతనికిని పశువులమేపు బీళ్ళ విషయమై వైరి యేర్పడియుద్ధముగా పరిణమించినది,' అని వ్రాశారు. "ఆంధ్రులచరిత్ర" రచించిన గుంటూరు హిందూకళాశాల చరిత్రోపన్యాసకులు శ్రీభట్టిప్రోలు హనుమంతరావు గారు కూడా.... మనుమసిద్ధికిని కనిగిరి సీమలోని ఎర్ర గడ్డపాడు నధిపతియైయున కాటమరాజుకును యుద్ధము సంభవించినది. అని వ్రాశారు. ఆంధ్రదర్శిని (1959) ప్రచురించిన విశాలాంధ్ర ప్రచురణాలయం వారు నెల్లూరు జిల్లా చరిత్రలో కనిగిరి తాలూకా ఎర్రగడ్డ పాడును కాటమరాజు పాలించుచుండెవాడు. అని వ్రాశారు.

ఇందరితకచ్చితంగా వ్రాస్తున్నా-ఇదినిజంకాదు, కాటమరాజుకిల్లోనెప సిద్దిరాజుకి ఎర్రగడ్డిపాడువద్ద యుద్ధంజరిగిందిగాని ఆగ్రామం కాటమరాజు

ఏలుబడిలో లేదు. కాటమరాజు కథనీ దానిఅనుబంధ గాథలనీ శ్రద్ధగా చదివితే ఈ విషయం తెలుస్తుంది. కాటమరాజు కాశీనుంచి కంచి వరకు సంచారంచేస్తూ ఆవుల్ని మేపుకొంటున్నట్లు కనబడుతుంది గాని నిలకడగా ఒక గ్రామము పాలిస్తున్నట్టు గోచరించదు. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట అనే గ్రంథం ఇలావుంది.

వసుధపై బెద్దిరాజు వీరతనురాజుండు
అసమాన ధీరుండు సమిత విక్రముడు
పశుపతి వలెనున్న పట్టభద్రుండు
దిశదిశలను నెల్ల ధేనువులు మేపి
వడ్డెదేశమునేలు వసుధపాలకుని
దండించి కోవులాలుండి విడిపించి
మరలి దక్షిణభూమి మతివేగవచ్చి
బిరుదులు చేకొన్న భీకరోన్నతుడు
కరిమాధవుని యాజ్ఞగాట భూతియు
బరగ దక్షిణభూమి బశువుల మేపి
యెసగంగ జువవాతకతెంచి యచట
బొసగంగ గొచ్చిదేవుళ్ళకు బెట్టి
రంతకు నెల్లూర శాయివరకించి
పంతగించిన క్రియ పగమెరడెను.

అయితే ఇతని దాయదులు, పినతండ్రి, బిడ్డలూ తదితర బంధుమిత్రులూ పొనకొండలో రాజ్యం చేసేవారని "కోటిపాటితాటివృక్షం" తెచ్చే కథవల్లనూ, అగుమంచికథ భక్తిరమ్య చరిత్ర మొదలైన

గాధలవల్లనూ, నిస్సందేహముగా తెలుస్తుంది. నెల్లూరి సిద్ధిరాజుతో పగరాగానే సహాయంకోసం కాటమరాజు దొనకొండలోనున్న తనవారికి లేఖలు వ్రాయించాడు. అయినా కథ కాలంనాటికి అక్కడున్నారేగాని వాళ్ళు వంశపారంపర్యంగా ఈ దొనకొండ దొరలుకారు. కాటమరాజు పూర్వీకులు ఉత్తరాంధ్రంలోనివారని నికరంగా నిర్ధారణ చేయవచ్చును.

నెల్లూరును పాలించిన నల్లసిద్ధిరాజుతో పుల్లరివిషయమై పోరాడి అమరుడైన కాటమరాజు ఆంధ్ర జానపద సారస్వత విహాయసంలో సుస్థిరంగా నిలిచిపోయిన ధ్రువతార. ఈ యాదవరాజు కథకి పూర్తిగా కాకపోయినా, కొంత చారిత్రకగౌరవం లభించింది. ఆంధ్రదేశపు చరిత్ర రచించేవారు. కాటమరాజుని విస్మరింపలేరు.

"అగుమంచికథ"లో కాటమరాజు మేనత్త కొమరక్క అతాని పిన తండ్రి కుమార్తె అగుమంచికి తమ పూర్వీకుల కథల్ని వినిపిస్తుంది.

"ఎలమంచి మా తండ్రి యేలేటినాడు
నెలకొని శివరాత్రి నేనుంటినమ్మ"

అని కొమరక్క చెప్తుంది. ఈ "ఎలమంచి" విశాఖపట్నం జిల్లా సర్వసిద్ధి తాలూకాలో నున్న యలమంచిలి గ్రామమే అని నిర్ణయించడానికి చాలా ఆకారాలు కనబడతాయి. అగుమంచికథలో ఇంకా ఇలా వుంది.

"మా తండ్రి చెల్లిన మనసుపోలేక
అమరంగ మాయన్నలై దుగురపుడు
ఫలముల కేగిరి పంచకాండములు
శ్రీకూర్మ మేగెమ సింహాద్రిరాజు"

అగుమంచికథ వల్లనేకాక ఇతర అనుబంధ గాథవల్ల కూడా సింహాద్రిరాజు శ్రీ కూర్మం వెళ్ళినట్టు అక్కడ పోరాడి మరణించినట్లు తెలుస్తుంది. శ్రీకూర్మం నేటి శ్రీకాకుళం జిల్లాలో ఉంది. అసలు ప్రసిద్ధమైన సింహాచల క్షేత్రం తాను పాలించే ఎలమంచిలికి అనతి దూరంలోనే ఉంది కనుక, ఆ దేవుని పేరు "సింహాద్రి" అనేది కాటమరాజు తాత కలురాజు తన కుమారునికి పెట్టాడని ఊహించవచ్చు. ఫలురాజుకు 'వలనూకరాజు' 'ఎరనూకరాజు' అనే మరిద్దరు కుమారులున్నారు. ఎలమంచిలికి మరీ దగ్గరలోనున్న అనకాపల్లి గ్రామ దేవత నూకాలమ్మ. అందుకే తన కుమారులలో ఇద్దరికి 'కలురాజు, నూకరాజు' అనిపేర్లు పెట్టవచ్చును అందుచేత నలురాజు ఏలిన ఎలమంచిలి విశాఖపట్నం జిల్లాలోని దనే ఊహించి ఈ సంగతి ఇతర చారిత్రక నిదర్శనాలవల్ల నిలబడుతుందా, లేదా అని చర్చిద్దాం.

ఈ ఎలమంచిలి చారిత్రకంగా చాలా పురాతనమైనది. విశాఖపట్నం జిల్లా మాన్యుయల్ 74వ పేజీలో యలమంచిలి గురించి ఇలా రాశారు.

"YELLAMANCHILI : Close to this village is a rock with a temple on the on the top of it It in the temple is Virabhadra wami, a form of Siva. Yellamanchili was the seat of certain Shepherd kings who were of some note They built the above pagoda and Some others of which the remains are visible with those of a building called "NUKU PAPA MEDA"

దీనివల్ల "కొద్దిగా గణనకెక్కిన కొందరు గొల్లరాజులకు ఎలమంచిలి రాజధాని" అనీ, వాళ్ళు కట్టించినవాటి శిథిలాలు ప్రస్తుతం కనబడుతున్నాయనీ అందులో ఒక దానిని "నూకపాప మేడ" అని పిలుస్తారనీ

తెలుస్తోంది. జిల్లా మాన్యుయల్ ఈ విధంగా వ్రాస్తే జిల్లా గెజిటీరు ఈ విధంగా దానిని విపులీకరిస్తోంది.

YELI AMANCHILI— Dominating the whole place rises a hill on the top of which are many broken stones and bricks of the ancient pattern and a landmark for miles around, the two stone posts and lintle of a doorway These are locally declared to be remains of a palace and fort of the Golla Kings and the hill is called NUKI PAPA'S hillock after, it is said, the sister of one of the rulers

ఈ ఉటంకించిన భాగంవల్ల ప్రాచీన పద్ధతిలోనున్న ఇటుకలు గల ఈ శిధిలాలు గొల్లరాజుల భవనానికీ కోటకీ సంబంధించినవని స్థలజ్ఞులు చెప్తుంటున్నారనీ. ఈ కొండలు ఆ రోజులలో ఒకరి సోదరి పేట మీద నూకపాప కొండని పిలుస్తారనీ తెలుస్తోంది. కాటమరాజు చెల్లెలి పేరు పాప నూకమ్మ. ఈ మెను గురించి శ్రీ తిమ్మవజ్జుల కోదండ రామయ్యగారు ఇలా ఉదహరించారు.

"చిత్రభానున దాను చిట్టి పాపమ్మ
ఫాల్గుణ మాసాన పాప నూకమ్మ
బుధవారమున దాను పుట్టినాదమ్మ
మధ్యాహ్న వేళను పగువ జన్మించె
తల్లి గండానను తండ్రి గండాలన
ధనము గండాన ధాన్యగండాన
ఆవుల గండన.... .... .... ....
పుట్టినవారిల్లు బూడిదై పోవు
పుచ్చుకొనువారిల్లు భువియందు నిలుచు"

ఈ పాప నూకమ్మను ఇంట్లో ఉంచడం ప్రమాదమని ఒంటి స్తంభం మేడకట్టి అందులో ఉంచారట. యలమంచిలి వద్దనున్న కొండ మీది భవనాన్ని ప్రజలు ఒక గొల్లరాజు చెల్లెలిపేరు మీదుగా "నూకిపాప మేడ" అని పిలవడం, కాటమరాజుకథలోని నలురాజు యలమంచిలి ఏలడం మొదలైనవాటిని బట్టి చూస్తే విశాఖపట్నంలోని యలమంచిలి కాటమరాజు పూర్వీకులేలినదని నిర్ణయించవచ్చుననిపిస్తొంది.

అయితే చారిత్రక నిర్ణయాలు ఇంత సులభంగా చేయదగ్గవికావు. ఇంక ఇతర సాక్ష్యాలు శాసనాధారాలుగా ఉన్నాయేమో చూడాలి.

"కాటమరాజు కథకి చారిత్రక గౌరవానివ్వడానికి ఒకే ఒక శాసనం కొంత తోడ్పడుతుంది. నెల్లూరు జిల్లా కందుకూరు తాలూకా గుండ్లపాలెం గ్రామంలోని బ్రహ్మేశ్వరస్వామి ఆలయం వద్ద నున్న శిలశాసనం కాటమరాజు కథని కొంత చెప్తుంది. ఈ శాసనాన్ని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు "తప్పులతడికె" అని నిరాదరించారుగాని, 'పేదవాడికి పెళ్ళామే భార్య' అన్నట్టు కాటమిరాజు చరిత్ర నిర్ణయించడానికి తోడ్పడే శాసనం ఇదొక్కటే. ఇందులో ఇలా ఉంది. "శ్రీ కూమ్మర్ దే వెను అపుండలకోన అమరవతి సింహ్యాద్రి యెలమంచి యేలేను.

శాసనంలోని "అపంటలకోన, అమరవతి" అనేవి, విశాక జిల్లా యలమంచిలికి దగ్గరలోనున్న అరట్లకోట అమరపల్లి అని గుర్తించ వచ్చును. ఈ అరట్లకోట ఇటీవలిది కాదు. శ్రీకృష్ణదేవరాయల నిర్యాణం తరవాత గణపతి విజయనగరంపై దండెత్తివచ్చినట్లు అప్పుడు అల్లసాని పెద్దన్న చెప్పినట్లు పేర్కొనే ఈ క్రింది చాటువులో అరట్ల కోట ప్రసక్తి ఉంది.

"రాయరాపుతుగండ రాచయేనుగు వచ్చి
యారెకోట్ల గోరాడునాడు

సంపెట నాపాల సార్వభౌముడు వచ్చి
సింహాద్రి జయశిలజేర్చునాడు
పెలగోలు సింహంబుచేరి ధిక్కృతిగంచు
తల్పుల గచల డీకొల్పునాడు
ఘనతర నిర్భర గంత పెండెరమిచ్చి
కూతు రాయలకును గూర్చునాడు

ఒడలెరుంగవో గచ్చితో యుర్విలేవో
చేరజాలక తలచెడి జీర్ణమైతొ
కన్నడంబెట్లుజొచ్చెద గజపతీంద్ర
తెరచినిల కుక్కజొచ్చిన తెరగుతోవ?"

కళింగ సంచికలో కుందూరి ఈశ్వరదత్తుగారు ఉదహరించారు.

ప్రాచీనమైన అరట్లకోట, అంతకన్నా ప్రాచీనమైన యలమంచి వద్ద ఉన్నది కనుక, ఈ రెండింటినీ గుండ్లపాలెము శాసనంలో కాటమ రాజు పూర్వీకులు యేలిన ప్రదేశాలని చెప్పారు. కనుక అప్పుడే మనం ఒక నిర్ణయానికి వచ్చేయవచ్చునిపిస్తుందిగాని కొన్ని సాధకబాధకాలున్నవి.

విశాఖజిల్లాలోని ఎలమంచిలిని చరిత్ర కారులు "ఎలమంచి కళింగ విషయము" అనే పారిభాషిక పదంతో పిలుస్తారు. ఈ ప్రాంతాన్ని క్రీ. శ. 8వ శతాబ్దం నుంచీ తూర్పు చాళుక్యుల వంశజులు పాలించేవారని శాసన ప్రమాణాలున్నవి. కళింగ సంచిక సంపదకులూ ఆ చరిత్ర పై పరమ ప్రామాణికులూ అయిన శ్రీ రళ్ళబండి సుబ్బారావుగారు యిలా వ్రాశారు "రెండవ జయసింహుడు రాజ్యము చేసిన తరువాత సవతి తల్లి కొడుకగు కొక్కిలి రాజ్యమునకు వచ్చెను. కాని ఆరుమాసములు రాజ్యం చేసిన తరువాత మూడవ విష్ణువర్ధనునిచే తరుమగొట్టబడి, ఎలమంచి

కళింగ దేశమునకు పోయి అందు తన పరిపాలనము స్థాపించెను. ఇతని సంతతివారును పశ్చిమ చాళుక్యవర్మాభిధానులగు రాజును ఆ ప్రదేశము ననే క్రీ. శ. 8వ శతాబ్దమున రాజ్యమేలిరి. తర్వాతి రాజులు గూడ దక్షిణ కళింగముపై రాజ్యమేలిరి.

"....ఈ రాజులు ధర్మలింగేశ్వరున అనేక అగ్రహారములు దాన మొసంగిరి .... ఎలమంచి కళింగ విషయమున క్రీ. శ. 11, 12, 13, 14, 15 శతాబ్దములలో రాజ్యమేలిరి. కళింగ, గాంగ, గజపతిరాజులకు పేరునకు సామంతులగానున్నను నిజముగ సర్వాధికారము గల్గియుండిరి.

విశాఖ జిల్లాలోని ఎలమంచిలి మీద క్రీ. శ. 8వ శతాబ్దం నుంచి పదిహేనో శతాబ్దంగా బలసంపన్నులైన తూర్పు చాళుక్య వంశజులు సర్వాధికారం చెలాయిస్తూఉంటే అదే ఎలమంచిలీవద్ద కొండమీద కాటమ రాజు తాత వల్లురాజు ఎలా కోటకట్టుకొని ఉంటాడు? విశాఖజిల్లా గెజటీలో పేర్కొన్న గొల్లరాజులు ఏకాలంలోనివారు? ఈ గొల్లకొండపై నదొరికిన ప్రాచీన నాణెములు క్రీ. శ. 663—72 నాటి తూర్పు చాళుక్యరాజు రెండవ విష్ణువర్ధనుడివని. డాక్టర్ హుల్ష్ నిర్ధారణ చేశారు.

క్రీ. శ. 700—713 వరకు పాలించిన రెండవ జయసింహుడు తరుమకొట్టగా పారిపోయిన కొక్కిలి ఎలమంచి కళింగమునకొచ్చి అక్కడ తన పరిపాలన స్థాపించాడు. అందుచేత క్రీ. శ. 700కు పూర్వం ఎలమంచిలి తూర్పు చాళుక్యవంశంలోని వాళ్ళకు రాజధాని కాదనుకో వచ్చును. ఈ గొల్లరాజులు క్రీ. శ. 7వ శతాబ్దంవారా? అప్పుడే ఆ కొండపై కోటకట్టుకొని పాలిస్తూ ఉంటే కొక్కిలిచేత ఓడించబడ్డవాళ్ళా? లేక క్రీ. శ. 15వ శతాబ్దం తరువాత తూర్పు చాళుక్య వంశజుల ప్రాబల్యం తగ్గాక ఈ గొల్ల రాజులు యలమంచిలిపై అధికారం సంపాదించిచారా? ఇవి బాగా పరిశోధించితేనే గాని తేలే విషయం కాదు.

÷ × +

క్రీ. శ. 1428లో తూర్పు చాళుక్యవంశంలో నృసింహుండనే రాజొక రున్నాడు. ఇతని ప్రేయసి వీరాంబ. ఈమె 'గొల్లవాడ' వారి, ఆడబడుచు దక్షిణదేశపు శాసనసంచయం, ఆరవసంపుటిలోని 662 వ నెంబరు శాసనంలో "పంచధారపురే ఖ్యాతి గొల్లవార కులాంబుధౌ అభవద్వీరమాంబా యాసా నృసింహ విభో: ప్రియా" అని ఉంది. యలమంచిలి దగ్గర నున్న పంచధారల వద్ద ఆ కాలంనాడు చాలా మంది "గొల్లవాడ" వారున్నారని శాసనాధారాలున్నాయి. ఈ యింటి పేరు బహుశా యలమంచిలిని పాలించిన గొల్లరాజుల వల్ల వచ్చి ఉంటుంది. క్రీ. శ. 1428కి చాలా కాలం క్రితం నుంచీ యలమంచిలి వద్ద గొల్లరాజులుండేవారని తేల్చవచ్చును.

వలురాజు పాలించిన యలమంచి విశాఖపట్నంజిల్లాలోనిదేనని నిరూపించడానికిన్ని సాధకములున్నా కొన్ని "బాధకములు" లేకపోలేదు. ఈ సందర్భంలోనే పశ్చిమగోదావరిజిల్లా, పాలకొల్లు సబ్‌డివిజన్ నరసాపురం తాలూకాలో ఒక యల్లమంచిలి గ్రామం ఉంది. దీనికి అనతి దూరంలో అరవెల్లి ఉన్నది. కాటమరాజు కథలో అరవెల్లి గ్రామం కూడా ముఖ్యమైనదే. పాకనాటిలో ప్రవేశించడానికి ముందు కాటమరాజు తన బంధువర్గ మంతటితోను ఇక్కడ ఉండేవారు కాటమరాజు మేనల్లుడు పోచయ్య" మమయ్యతో చెప్పిన ఈ క్రింది మాటలవల్ల గోవులు దక్షిణా దిక్కు అరవెల్లికి వచ్చిరిట్లు తెలుస్తుంది.

"అలవాడు టిమామ అరవెల్లి వద్ద
గొవుల పిలువంగ తప్పిరావటంచు
పలుకన్న నాకప్పుడు పగుజాటుజేసి
పక్షపాతము సూపి పరిహాసమాడె
బంతమీదే త్రువని పలికినేనిప్పుడు
యావులు దక్షిణాది కరుదెంచినప్పుడు
అరవెల్లి గంగనప్పుడు ప్రార్థించి
యాకాట భూపాలు పంపితివికాక
.... .... .... .... ....

ఆలవాడు ఒకమాట ఆరవెల్లి కడ
బలికిన మాటకు బంపెమగాక
యసహాయుడే నమ్మ యావులన్నియును
బసుల చేతనే తవవగ గెల్వగలడు"

వీటన్నింటివల్లా ఆరవెల్లి వద్ద బంధువులు కూలిపోయి కాటమరాజు పాకనాటికి అయితవ.రాజాదులు దొనకొండకి వెళ్ళారని తెలుస్తోంది.కాటమ రాజు కథలో ఆరవెల్లికి ఇంత ప్రాముఖ్యం వుంది కనుక, ఆరవెల్లి, యలమంచిలి దగ్గర దగ్గరగా ఉండవచ్చునని భావించడానికి ఆస్కారం ఉంది. పశ్చిమ గోదావరిజిల్లాలో ఈ రెండు గ్రామాలు ఇరవై మైళ్ళ కైవారంలో ఉంటాయి, కాబట్టి విశాఖజిల్లా యలమంచిలి కాటమరాజు పాలించిన యల మంచిలి కాదని చెప్పడానికి కొంత అవకాశం ఉంది.

కానీ విశాఖజిల్లా యలమంచిలి దగ్గరలోనే తూర్పుగోదావరిజిల్లా తుని తాలూకాలో ఇప్పుడు "ఆలమల్లి" అనబడే గ్రామం ఒకనాడు ఆర వెల్లి అనే పేరను ఉండేదేమో! ఇది అసంభవం కాకపోతే నలురాజు పాలించిన యలమంచిలి విశాఖజిల్లాలోనిదని నిర్ణయించవచ్చును.

మొత్తంమీద, శిథరెమ్న, పుస్తకాలలోనూ, చరిత్ర సంగ్రహాల లోనూ పేర్కొంటున్న కాటమరాజు ఎర్రగడ్డపాడు పాలించేవాడు" అన్న సంగతి వాస్తవం కాదని చెప్పవచ్చు. కాటమరాజు ప్రకారం అతడు పాక నాటిలో ప్రవేశించి, జొన్నవాడవద్ద విడిచి, నెల్లూరిరాజులతో పుల్లరి విషయమై ఒడంబడిక చేసుకొని, కనిగిరి ప్రాంతాల్లో ఆవులను మేపి, నంగెం వద్ద నెల్లూరి రాజులతో వాగ్వాదం చేసి, చివరకు పాలేటి ఒడ్డున ఎర్రపాడు వద్దకుచేరి అక్కడే నెల్లూరి రాజులతో పోరాడి వీరస్వర్గం అలంకరించాడు.

కుంభాలు పోయించి కోర్కె వీడేర
నావుల పిలువంగ నానతియిచ్చె
నరలేక పిలిచితి మావుల మనము
ఆరవెల్లి వద్ద నా వేళ నన్ను
బోరాడి విను మెచ్చె బొందుగా మామ."

ఈ అరవెల్లి గ్రామం వద్ద నున్నప్పుడే కాటమరాజుని అతని పిన తల్లి సిరిదేవి పాకనాటికి వెళ్ళమని పంపించింది. ఈ సంగతినే కాటమరాజు యుద్ధం రాగానే దొనకొండకు వ్రాసిన ఉత్తరంలో ఇలా చెప్పాడు:

"దండు గడపినవాని తనయుఁడై కన్న
యండగల కంపటీ అందరు మాకు
జేతులో చేయివేయ చెప్పియొప్పితివి
యేతాపునను మీకు నేమిగల్గినను
నాతావు ఫలముమీ రందరుగూడి
యంచిత పుత్రమిత్రాదుల తోను
బంచుక భోంచేయ బద్దకి యదియు
నని యిట్లు దీవించి యప్పుడం పితివి
యని యేక విధముల నపుడు బోధించి
యలపాకనాటికి, నంపితిమమ్మ"

"కాటమరాజు అరవెల్లి నుంచే పాకనాటికి మందతో వెళ్ళాడని అనుమంచి మాటలవల్ల తెలుస్తుంది. కాటమరాజు వ్రాసిన ఉత్తరం చూసు కొని సిరిదేవి మూర్ఛపోతుంది. తన కుమారుడు అయితమ రాజుని కాటమ రాజుకి సహాయంగా పంపాలని బాధపడుతున్న సిరిదేవితో ఆమె కూతురు అనుమంచి ఇలా చెప్పింది.

"కటకటా యోయమ్మ కడుదైన్యపడుచు
నిటువలె మూర్ఛపో నేటికినీకు
బరగ దక్షిణమునకు బంపినీకిపుడు
పరికింపవలకున్న పగవాడునాయె
వేరాలి కొడుకును వేరుగజూచి
మారుభూమికి నంప మనసెట్లు నిలిచె
నీకన్న కొడుకైతె నీవు అంపుదవ

(పాకవ్యాసం)

## చిన్న సైజులో చెన్నపట్నం తెలుగు చరిత్ర

తెలుగు రాజులవయవల్ల తెల్లవాళ్ళు మైలాపురానికి ఉత్తరాన కట్టుకొన్న ఊరు వివిధ కాలలలో ఎన్నో పేర్లను ధరించింది. ఆదిలో చంపన్నంకుప్పం, చంన్నప్పపట్టణం, చెన్నపటణం, మదరాసపట్టణం, మదరాసు, మద్రాసు. మెడ్రాస్, మద్రపురి, చెన్నపురి ఇలాగ పేర్లు మారి మారి ఇప్పుడు తమిళ ఏలుబడిలో "చెన్నైగా చెలామణి అవుతూంది.

మన తెలుగుభాషలో అకారాంతాలైన కొన్ని కొన్ని శబ్దాలను తమిళంలో ఐకారాంతాలుగా ఉచ్చరిస్తారు. అలాగే రాస్తారు ఉదాహరణకు మనం తల అంటే వాళ్ళు తలై అంటారు. మనం మణిమేఖల అంటే వాళ్ళు మణిమేకలై అంటారు. ఇక్కడ తమిళం అధికార భాష కనుక రాజధానినగరంలోని అన్ని షాపుల సైన్ బోర్డులలో ముందు తమిళంలోనే పేరు వుండి తీరాలి. ఇతర భాషల వాళ్ళు స్థాపించుకొన్న ఏ సంస్థకైనా ప్రభుత్వం గ్రాంటు ఇవ్వాలంటే తమిళానికి పెద్ద పీట వేయాలి అనన్న ప్రామాణ్యమైన ఆంధ్ర మహిళ దుర్గాబాయిగారు సంస్థాపించిన ఆంధ్ర మహిళ నర్సింగ్‌హోంలో నర్సుల శిక్షణ చాలా చక్కగా సాగుతూ వుండేది. అయితే ఇక్కడ తమిళ మీడియంలో తరగతులు నడపనందు వల్ల ప్రభుత్వం గ్రాంటును ఇవ్వనంది. తరగతులను మూసెయ్యవలసి వచ్చింది. నేటి చెన్నైలో తెలుగు పరిస్థితి ఇలా వుంది.

### గురజాడ వారి లేఖ

నేటికి డెబ్బయి ఆరు సంవత్సరాల క్రిందట గురజాడ అప్పారావుగారు నాటి విజయనగరం మహారాజా విజయరామ గజపతిగారికి 1918 సెప్టెంబరు 26 వ తేదీనాడు ఒక లేఖరాస్తూ ఇలా చెప్పారు.

—"ఇప్పుడున్న చోటునుంచి ముప్పై మైళ్ళ ఉత్తరాల మదరాసు వెలసివుండెనా తెలుగుభాష బతుకు యింతకంటె బాగుండేది, ముప్పై మైళ్ళ

దక్షిణాన వెలసివుండెనా తమిళభాష బతుకు అంతకంటే బాగుండేది ప్రస్తుతమున్న మదరాసు తెలుగు భాషకు సవతి తల్లి" (గురజాడ రచనలు—౧వ సంపుటి—లేఖలు—పుట 14).

సత్కవి వాక్యము రిత్తమోవునే! ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో వుంటూ గురజాడ ఆనాడే చేదు సత్యాలను చెప్పారు.

వాస్తవానికి మన దేశంతో సముద్ర వ్యాపారం చేసే పాశ్చాత్యు లందరు తూర్పుకోస్తాలోవున్న మచిలీపట్నంలో కుతుబ్‌షాహి కాలంలోను మొదట విజాతీ కాలంలోనే గిడ్డంగులు కట్టుకున్నారు. ఒలందవారవి పేరువద్ద డచ్చివాళ్ళూ వరాహువాళ్ళవి పేరువద్ద ఫ్రెంచివాళ్ళతోపాటు ఇంగ్లీషువాళ్ళు అక్కడ గిడ్డంగులు కట్టుకొని వ్యాపారం చేసేవారు. సీమలో వున్న వర్తకులు చాలా గడుసువాళ్ళు "ఖర్చులు తక్కువ—లాభాలెక్కువ" అనే ఆదేశాలను ఇక్కడకు పంపేవారు, బందరు రేవులోవున్న సీమఓడల్ని చూడడానికి తాసీషా అడపా దడపా వచ్చేవాడు, వచ్చినపుడల్లా గొప్ప మర్యాదలుచేసి నజరానాలు ఇవ్వాలి. పైపెచ్చు అక్కన్న మాదన్న లంచాల ఆశకు అంతువుండేది. కాదు. ఈ బెడద నుంచి తప్పించుకోవడానికి ఇంగ్లీషు వాళ్ళు దక్షిణాదిని కొత్త గిడ్డంగిని కట్టుకొందామను కొన్నారు.

అప్పటికే ఒలందవారు ప్రళయ కావేరిలో ఒక గిడ్డంగి కట్టు కొన్నారు. (ఈ ప్రళయ కావేరి అసలు పేరు పలక్కాడ. దీనినే ఇప్పుడు పులికాట్ అని వ్యవహరిస్తున్నాం) ఇంగ్లీషువారు ప్రళయ కావేరికి ఇంకా ఉత్తరాన నేటి నెల్లూరుజిల్లా గూడూరు తాలూకాలోని దుగరాజ పట్టణంలో తమకు సౌకర్యాలు వుంటాయని భావించారు. ఏ పుస్తకం లోంచి చూసి రాసుకొన్నానో ఇప్పుడు జ్ఞాపకం లేదుగాని దుగరాజ పట్టణం గురించి కొన్ని ఆసక్తికరమైన విషయాలు ఇరవై సంవత్సరాల కిందటే నోట్ చేసుకొన్నాను.

### కుంఫిణీ వారి రాక

"దుగరాజపట్నం : మహారాజశ్రీ కుంఫిణీ వారి మనుష్యులు వాడల మీద ఈ రేవుకు వచ్చి లంగరు వేసి వాడలు దిగారు. దుగరాజ

పట్నాన్ని అప్పుడు గురువానాయుడు వారు ఏలుతూవుండేవారు. వారినిన్నీ నల్లప్పాముల ఆర్మగమొదలియార్ కరణం గారినిన్నీ పిలిపించి ఈ స్థలాన్ని బాగుపరచి కోట కట్టుకోదలిచామని చెప్పారు. ఆ ఇద్దరున్నూ అంగీకరించినమీద గ్రామానికి తూర్పున కోట కట్టి ఫిరంగులు నిలిపారు. ఒక ఫిరంగిని కాల్చితే గుండువెళ్ళి వెంకటగిరి జమీందారుల సీమలో పడింది. కుంఫిణీవారు అక్కడ కూడా కోట కట్టుకోవాలని అభిప్రాయ పడ్డారు.

అయితే బంగారు యాచమనాయనింవారు అందుకు అంగీకరించ లేదు. అప్పుడు గురవానాయుడుగారున్నూ ఆర్మగ మొదలియారువారున్నూ దామర్ల చెన్నప్పనాయనిం వారి వద్దకు వెళ్ళి మైలాపురానికి ఉత్తరాన ఉన్న చెన్నపట్నం ఇప్పించారు. తమ కోసం ఇంతపాటుపడిన గురువా నాయుడుగారిని మొదలియారుగారిని కుంఫిణీవారు మెచ్చుకున్నారు. దుగ రాజ పట్టణానికి అర్మగాలుగారి పేరుపెట్టారు. గురువానాయుడుగారిని దళ వాయిగానూ, అర్మగాలుగారిని స్థలకరణంగాను నియమించారు." (బహుశా దీనిని నేను "గెజిటీర్ ఆఫ్ నదరన్ ఇండియా" అనే గ్రంథం నుంచి తెనిగించి వుంటాను.)

వెంకటగిరి ప్రభువులు తమ విన్నపాన్ని మన్నించనందున కుంఫిణీ వారు దుగరాజ పట్నంలో స్థిరమైన కోటను కట్టుకొనలేదు. ఒకవేళ బంగారు యాచమనాయనింవారు సరే అని వుంటే నేటి మద్రాసున్నచోటుకి కాదు ప్రళయకావేరికి ముప్పయి అయిదుమైళ్ళ దూరంలో తెలుగు మరింత ప్రబ లంగా వున్నచోట్ల కుంఫిణీవారి దక్షిణ రాజధాని వెలసి వుండేది అలా జరగలేదు. అందుకే దుగరాజ పట్టణంలో వుండే ఫ్రాన్సిస్ డే అనే కుంఫిణీ చీఫ్ ఇంకా దక్షిణాన వున్న తెలుగు రాజుల వద్దకు వెళ్ళి విజ్ఞప్తి చేశాడు. ఆ ప్రాంతాలను పాలించే దామర్ల వారు దయదలిచారు. కుంఫిణీవారిని తమ ప్రళయకావేరికి, మైలాపూర్ కు మధ్య ఎక్కడైనా గిడ్డంగి కట్టుకోమన్నారు ఊరు కోట ఏర్పాట్లు చేసుకోమన్నారు. ఇది లిఖిత పూర్వకంగా ఇప్పించిన దానశాసనం దీని తారీఖు క్రీస్తు శకం 1639 ఆగష్టు 22వ తారీఖు.

వెంకటగిరివారు, దామర్ల వారు బంధువులే. పరస్పరం వియ్యాలవారే అయితే వెంకటగిరి వారికి విదేశీయులు వల్ల సమస్యలేం ఏర్పడలేదు. దామర్ల వారికి మాత్రం అవి తప్పలేదు. మైలాపూర్ వద్ద శాంతోనే అనే కోట కట్టుకుని బుడతకీచులు చాలాకాలం నుంచి వ్యాపారం చేస్తున్నారు. త్రళయ కావేరిలో ఒలందవారు గిడ్డంగి కట్టుకున్నారు ఈ రెండు దేశాల విదేశీయులకుపడేదికాదు. ఎప్పుడూ యుద్ధాలు చేస్తూ వుండేవారు. వీళ్ళ దామర్ల వారి రాజ్యంలోని ప్రాంతాలవారే.

విజయనగర సామ్రాజ్యానికి సామంతులుగా దామర్ల వెంకటాద్రి నాయనింవారు కంచి నుంచి కాళహస్తిదాకా పాలిస్తూ వుండేవారు. వారి సోదరుడు అయ్యప్ప నాయనింవారు పూనమల్లి ప్రాంతాలకు ఏలికగా వుండేవారు ఇంగ్లీషువారి కోటకు అనుమతి కోరగానే ఒక తలనొప్పి తప్పుతుందనుకొని అయ్యప్ప నాయనింవారు సరే అన్నారు. కట్టుకొనే వూరికి తమ తండ్రిగార యిన చెన్నప్పనాయనింవారి పేరు పెట్టమని కట్టడిచేశారు. ఈ సంగతినే వారి సోదరుడు అంకన్ననాయనింవారు ఉషాపరిణయం అనే కావ్యంలో చెప్పారు.

త్రళయ కావేరి మైలాపురంబు కపిని తీరమున బ్బోరనది మట్టుపెట్ట తండ్రి పేరదన్మాత్య భూమిని వృద్ధి విభూతి నలవరించె చెన్నపట్టణ మయ్యె నృపతి. [ఉషా : 1-9]

దామర్ల వారు దయదలిచాక కుంఫిణీవారు కోటకట్టుకొనడానికి అనువైన చోట్ల కోసం గాలించసాగారు. బేరి తిమ్మప్ప అనే స్థానికుని సహాయంతో ఒక ప్రదేశాన్ని ఎంచుకున్నారు. అది జాలారుల కుప్పం. ఆ జాలారుల పెద్ద ఒకాయన వున్నాడు. అతని పేరు మదరేశన్ (మదురేశన్?) అతగాడ్రి అరటి తోట కోట కట్టు కొండికి ఇమ్ముగా వుంటుం దని తెల్లదొరలు భావించారు. బేరం పెట్టారు. మదురేశన్‌కు బేరి తిమ్మప్ప నచ్చచెప్పాడు. "ఈ ఫరంగీలకు నీ అరటితోట జాగా అమ్మినట్లాయ్యానా అక్కడ ఊరు కట్టి దానికి నీ పేరే పెట్టబోతారు" అని తిమ్మప్ప అశ-

పెట్టాడు దుగరాజ పట్టణానికి ఆర్మగమొదవారి పేరు అప్పటికే పెట్టిన దృష్టాంతం ఒకటి వుంది. మదురేశన్ మెత్తపడ్డాడు. అరటితోటను అమ్మాడు.

కుంఫిణీవారు కోటకట్టుకొని దానికి సెంట్ జార్జి పేరు పెట్టుకొన్నారు. ఆ కోటను అనుకొని కట్టిన తెల్లవాళ్ళ వూరికి "మదరేశన్ పట్టణం" అని నామకరణం చేశారు. సీమలో వున్న తమ కామందులకు ఈ శుభవార్తను తెలియచేస్తూ ఉత్తరాలు రాస్తున్నప్పుడు ఆ ఊరిపేరును "మదరాసపటేమ్" అనే గుణింతంతో పేర్కొన్నారు.

అరటి తోట జాలారి పెద్దదే అయినా అది వున్న రాజ్యం దామర్ల వారిది కాబట్టి వారు అవూరికి (చెన్నప్ప పట్టణం) చెన్న పట్టణం అనే పేరు పెట్టి తీరాలని పట్టు పట్టడంతో, తెల్ల వాళ్ళ ఊరు పక్కనే నల్ల వాళ్ల కట్టుకొన్న పేటలకు చెన్న పట్టణం అనే పేరు పెట్టారు. (కొన్నేళ్ళ తర్వాత దామర్ల వారి ప్రతిష్ఠగ్గాక దీనిని జార్జి టౌన్ అని పిలువసాగేరు, (అది వేరే సంగతి). నేటికవులు చెన్న పట్టణం అని పిలుస్తున్నా సీమలో వున్న కుంపిణి కామందులు మద్రాస్ అనే పేరుకు బాగా అలవాటు పడ్డారు కనుక ఉత్తర ప్రత్యుత్తరాలలోనూ రికార్డులలోనూ ఆ పేరే వాడడం కొనసాగించారు. యథారాజా తథాప్రజా: అందుచేత నేటివు పెద్ద మనుష్యులు కూడా "మద్రాస్" ఆ మాటకొస్తే మెడ్రాస్ అనే వ్యవహరించ సాగారు. "అలగాజనం" మాత్రం ఉత్త "పట్నం" అనే పిలిచేవారు.

## 'జెంటూ' — 'కమలబారి'

ఆ నాటి చెన్న పట్టణపు ప్రజానీకంలో తెలుగు మాట్లాడే వాళ్ళ జనాభా ఎక్కువగా వుండేది. తర్వాత చెప్పుకో దగ్గ భాష తమిళం; కుంపిణి వారు తెలుగును "జెంటూ" అనీ తమిళాన్ని "కమలబారి" అని పిలిచే వాళ్ళు (ఈ మాటలు బుడత కీచులవల్ల సంక్రమించినవి) ఈ మాటలు సుమారు మూటయాభై సంవత్సరాల క్రిందటి దాకా ప్రచారంలో వుండేవి. సీమ నుంచి వచ్చిన సివిల్ సేవకులు కోటలోని కాలేజీలో మన భాషలను అభ్యసించిన తర్వాత అసలు పేర్లను వాడసాగారు.

అనాటి జనాభాలో అష్టాదశవర్ణాల వాళ్ళూ వుండే వారు. ఏడు రకాల నాయుడులూ ఆరు రకాల సెట్లూ పంచాణం వారూ. తెలకలవారూ, సాలెలు వుండేవారు. ఈ వివిధ వర్ణాల వారు కుడి పైట కులాలుగా, ఎడమపైట కులాలుగా, రెండు పార్టీలయ్యారు. వీళ్ళనే కుడిచేతి కులాలవారు. ఎడమ చేతి కులాలవారు అని పిలుస్తారు. ఆర్థిక వ్యవస్థలో వర్గ విబేధాలవల్ల ఈ పార్టీలు ఏర్పడ్డాయి. కుడిచేతి కులాలలో భూకామందులూ స్థలకరణాలు ఈ బాపతువారు ఉండేవారు వామహస్తకులాలలో వ్యాపారవర్గం, వస్తూ త్పత్తిచేసే నంచాణం వారూ ఇతర శ్రామికులు వుండేవారు.

ఈ రెండు పార్టీలవారూ చిన్న విషయాలకు పెద్దపోట్లాటలు పెట్టు కునేవారు. (వాళ్ళ దృష్టిలో అది చిన్న విషయం కాక పోవచ్చు) క్రీస్తుశకం 1652లో పెద్దదొమ్మి జరిగాక కుడిచేతి కులాల వారికీ "పెద్ద నాయకుని పేట"ను ఎడమచేతి కులాలకు ముత్యాలపేటను కుంపిణీవారు కేటాయిం చారు పడవలవాళ్ళూ అస్కార్లూ జాలర్లూ తమ జీవనోపాధికి చేరువలో సముద్రతీరంలోనే గుడిసెలు, వేసుకొనేవారు.

ఇక కుంపిణీవారి కొలువులో కుదురుకున్న నౌకర్లకూ చాకర్లకూ లెక్కలేదు. ఏ తెలవాడైనా ఓడ దిగీదిగకముందే అతని కొక నల్లవాడు దుబాషీగా తన్ను తాను నియమించుకొనేవాడు. ఆ తెల్లదొరకు మదుపు పెట్టేవాడు కుంపిణీవారు దుబాషులూ, వకీళ్లూ ఏజెంట్లూ రాయసాలూ మున షీలూ అయ వార్లూ చాలా మంది వుండేవారు తెల్లదొర ఇల్లూ వాకిలీ ఏర్పరచుకుని దొరసానిని రప్పించాక బోలెడంత బలగం అవసరం అయ్యేది. (ఉత్తరోత్తరా రాజమండ్రిలో కలెక్టర్‌గా పని చేసిన) ఒక దొరగారి భార్య సీమకు రాసిన ఒక ఉత్తరంలో ఇలా చెప్పింది.

"నాకొక ఆయా, దర్జీ: నా భర్తకు సొంతానికి ఇద్దరు పనివాళ్ళ

(ఒకరు గది తుడవడానికి, ఇంకొకరు నీళ్లు తేవడానికి) భోజనాలప్పుడు కంచాలు సర్దేవాడొకడూ, కుశినీ కోసం పదార్థాలు తెచ్చే వాడొకడు. కొవ్వొత్తులు వెలిగించడానికి ఒకడూ. వంటకాలువడ్డించేవాడొకడు, ప్రతి గుర్రానికి ఒక సైసూదానికి గడ్డికోసే ఒక దాసీ, ప్రతికుక్కకూ ఒక సేవకుడూ వుండి తీరాలి. పిల్లికి కూడా నౌకరు ఉండాలా అని వాకలు చేశాను. అక్కరలేదట. దాని పనులు అదే చేసుకోవాలి. నిజానికి మాలొగిట్లో అదొక్కటే అందుకు సమర్థురాలు. అందుచేత దానిని శానా గౌరవిస్తున్నాను. (LETTERS FROM MADRAS BY A LADY NEW EDITION 1846 P 19)

నగరం పెరుగుతూన్న కొద్దీ నానా రకాల వృత్తుల వాళ్ళు చేరుతారు. కుంపిణీవారు వల్లవారిని సిపాయిలుగా చేర్చుకోవడం మొదలు పెట్టాక తెలుగు జిల్లాల నుంచి చాలా మంది వచ్చి చేరారు. (తెల్లవాళ్ళ తెలుగువాళ్ళనే (పిఫర్ చేసేవాళ్ళు) కోర్టులు వచ్చాక ప్లీడర్లూ వాళ్ళ గుమస్తాలూ, టౌటులు పెరిగారు. యూనివర్శిటీ పెట్టాక పెద్ద చదువులకు ప్రతి తెలుగుజిల్లా నుంచి చాలా మంది వచ్చి ఇక్కడే చదువుకొనేవారు. ఇంగ్లీషు విద్యావంతులు కచ్చేరి ఉద్యోగాల కోసం తత్తుల్యమైన వాటి కోసం ఎగబడేవారు.

## తెలుగు భాష వ్యాప్తి

జమిదార్లతాం చెన్నపట్నంలో బంగళాలు కట్టుకొన్నారు. అచ్చు కూటాలు పత్రికలూ వెలిశాయి. నగరం దినదినాభివృద్ధి చెందింది. జనాభాలో రమారమీ అందరూ ఉభయ భాషలలో వ్యవహరించగల వాళ్ళే అయినా ఈ శతాబ్దితొలి దశాబ్దం నాటికి ముల్లు తమిళం వైపే మొగ్గు చూపింది. అందుకే గురజాడ అప్పారావుగారు నేటి మద్రాసు తెలుగు భాషకు సవితితల్లి అని రాయవలసి వచ్చింది.

మద్రాసులో తెలుగు మాట్లాడే మహారాజాలూ రాజాలు, బారిస్టర్లు

లాయర్లు పత్రికాధిపతులు వ్యాపారస్తులు, విద్యార్థులు, ఎందరున్నా, ఈ భాష ఎందుకు వృద్ధి చెందలేదు? వీరంతా అగ్రవర్ణాలవాళ్ళు ధనికులవల్లా, ఉన్నత మధ్య తరగతి, మధ్య తరగతి మర్యాదస్తుల వల్లా ఒక భాష కాగితాల మీద అభ్యుదయం చెందినా వ్యాప్తి పొందలేదు. ఈ బాపతు పెద్ద మనుష్యులు నిజానికి తమలో తాము జరుపుకునే సభలలోనూ ఉత్తర ప్రత్యుత్తరాలలో ఇంగ్లీషేవాడే వారు, (గురజాడ అప్పారావుగారు తమ డైరీలను ఇంగ్లీషులోనే రాసుకొన్నారు) రాజ భాష ఉన్నత వర్గాల వాళ్ళ వల్లనే వృద్ధి చెందుతుంది. శ్రామికులవల్లనే మాతృభాష పెంపొందుతుంది. గురజాడ అప్పారావుగారే ఒకచోట ఇలా రాశారు.

"తెలుగుకు పారిశ్రామిక నగరములో వ్యవహరింపబడే అవకాశం లేదు. అందువల్ల దాని అభివృద్ధికి ఆటంకము కలిగింది. అట్టి అవకాశము బెంగాలీ మరాఠీ భాషలకు లభించి అభివృద్ధిపొందాయి. రాజధాని. నగరము లలో ప్రాముఖ్యము సంపాదించడము వల్ల బెంగాలీలు మహారాష్ట్రులు కొంతవరకు తమిళులు బాగా లాభించినారు" (గురజాడ రచనలు-4 వ సంపుటి మాటా ? మంతి పుట 41)

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో పానుగంటి రామారాయణిగారూ, బొబ్బిలి రాజా రామకృష్ణరంగారావుగారూ. సర్ కూర్మా వెంకటరెడ్డి నాయుడు, టంగుటూరి ప్రకాశం, ఓమండూరు రామస్వామిరెడ్డి పూసపాటి కుమారస్వామిరాజా మొదలైనవారు "ప్రధాన మంత్రులు"గా పని చేశారు. మనం పదవులతో మురిసిపోయాం. తమిళులు పారిశ్రామికంగా ముందంజ వేశారు. వాళ్ళ రాష్ట్రానికి "తమిళనాడు అని పేరు పెట్టుకొన్నారు. రాళ్ళ

గడ్డ మీద కేంద్ర సంస్థలై ఆకాశవాణి దూరదర్శన్ మొదలైన వాటిని" "తొరై కాట్చినిలైయం" అనే తమిళ పదాలతోనే పిలవాలని పట్టుపట్టారు· నెగ్గుకొస్తున్నారు.

చెన్నపట్నంలో వున్న తెలుగు వాళ్ళంతా ఒక కట్టు మీద ఒక పట్టు మీద కలసిరాకపోతే ఉన్న తెలుగు ఊడ్చుకుపోతుంది. అలా జరిగిననాడు ఇంకెవరినీ మనం నిందించక్కర్లేదు

* — *

## ఎందరో మహానుభావులు

ప్రతి దేశంలోనూ, ప్రతి కాలంలోనూ, ప్రతి ప్రాంతంలోనూ ఎందరెందరో మరుగుపడిన మాణిక్యాలూ, చరిత్రకెక్కని చరితార్థులూ వుంటారు. ప్రతిఫలాపేక్ష లేకుండా మాతృభాషకూ, మతృదేశానికీ సేవ చేయడం తమ పవిత్ర కర్తవ్యంగా భావించి అటువంటి మహనీయులు చెప్పుకోదగ్గ సేవలను చేస్తూ వుంటారు. వారి వారి కాలాలలో, వారి ప్రాంతాలలో ఆ స్వార్థరహితుల సంసేవను కొందరు చెప్పుకొంటారు. అయితే ఇతర ప్రాంతాల వారికి వారి గురించి ఎవరు తెలియచెప్పాలి? ఎలా తెలియ చెప్పాలి.

## తెలుగు చరిత్ర

శతాబ్దం తెలుగుచరిత్రతో తెలుగువాళ్ళు జీవించిన ప్రాంతాలూ, తెలుగురాజులు పాలించిన రాజ్యాలూ, తెలుగుభాష రాణించిన ప్రదేశాలు చాలా వున్నాయి. విజయనగర సామ్రాజ్యయుగంలో తమిళదేశం తెలుగు నాయక రాజుల ఏలుబడిలో వుండేది. జెంజి, మధుర, తంజావూరు రాజ్యాలలో తెలుగుదేవిడీ భాషగా వుండేది. ఆయా రాజాశ్రయాలకోసం పలు ప్రాంతాల తెలుగువాళ్ళు దక్షిణ భారతానికి వలస వెళ్ళి అక్కడ స్థిరపడి పోయారు. తెలుగు రాజభాషగా వున్నంతకాలం వాళ్ళనే బాగానే జరుగు బాటు వుండేది. రాజాశ్రయం అపేక్షించిన ఇతర భాషల వాళ్ళు సైతం తెలుగు నేర్చుకొని ఆ భాషలలో సంగీత సాహిత్య రచనలు చేసేవారు. తెలుగు నాయక రాజుల తర్వాత తంజావూరులో అధికారానికి వచ్చిన మహారాష్ట్ర రాజులు కూడా తెలుగులోనే రచనలు చేసేవారు.

రాజ్యాలు పోయాక, రాజులు అంతరించాక వివిధ ప్రాంతాలలో స్థిరపడిన తెలుగువాళ్ళు అవసరం కొద్ది స్థానిక భాషలు నేర్చుకొనక తప్ప లేదు. ఇళ్ళలో మాతృభాషను మాట్లాడుకొంటున్నా బయట స్థానిక భాష లోనే దైవిక వ్యవహారాలు సాగేవి. కొన్నాళ్ళకు ఇళ్ళలో కూడా కల గాపులగపు మాతృభాషనే మాట్లాడేవారు. మరి కొన్నాళ్ళకు మడికట్టుకొన్న ప్పుడు మాతృభాషను మాట్లాడుతూ ఇతర సమయాలలో స్థానిక భాషనే వుపయోగిస్తూ వుండేవారు. తరతరాలుగా ఈ పరిణామాలు జరుగుతూ వస్తున్నాయి.

భాషలో మాండలికాలు తప్పనిసరిగా వుంటాయి. ఉచ్చారణ విధా నాలు మారుతూ, వుంటాయి. కాకిపిల్ల కాకికి ముద్దు. ఎవరి యాసవాళ్ళకి ప్రమాణం, మిగతా ప్రాంతాల వారి యాసను ఎద్దేవా చేయడం కూడా కద్దు. కాకుస్వరకాకుకాలు వింతగా వినబడితే ఎగతాళి చేయడం కూడా లేక పోలేదు. పత్రికలు పూర్వం ఒకే మూస బాసలు వాడేవి కనుక ఎవరి యాసకు తగ్గట్టు వాటివి చదువుకొనేవారు. చాలాకాలం మన నాటకాల భాష కూడా రొటీను పడిగట్టు మాటల భాషే కనుక పౌరాణిక చారిత్రక నాటకాల విషయంలో, కమ్యూనికేషన్ విషయంలో కష్టాలు వుండేవికావు.

## యాసల పట్టింపులు

వివిధ ప్రాంతాల వ్యక్తులు కలుసుకున్నప్పుడే యాసల పట్టింపులు తలయెత్తేవి. బ్రిటిష్‌వాళ్ళ రోజుల్లో విద్యావంతులు ఇంగ్లీషులోనేమాట్లాడు కునేవారుకనుక ప్రాంతీయోచ్చారణప్రసక్తివచ్చేదికాదుపైగవేటుగా బెంగాలీ, తమిళ, మళయాళ వ్యక్తుల ఇంగ్లీషు ఉచ్చారణను కూడా తెలుగు—ఇంగ్లీషు వాళ్ళు విమర్శిస్తూ వుండడం జరిగేది.

చలన చిత్రాలలో టాకీలూ, వాటితో ముఖ్యంగా సాంఘికాలు పాంఘిక కాలంలో వాడుక భాషవచ్చాక స్టాండర్డుభాష ఒకటి అవసరమైంది. అదిలో మన నిర్మాతలు, పంపిణీ దారులు కృష్ణా, గుంటూరు జిల్లాల వాళ్ళు ఎక్కువగా వుండేవారు కనుక ఆ జిల్లాల శిష్టుల భాషనే సినిమా ప్రామాణిక భాషగా ధృవీకరించారు. తూర్పు భాషగా విశాల విశాఖ మండలం భాష విపిలిచేవారు గ్రామఫోన్ కంపెనీవారి జేసిక్ కామిక్ పాటలన్నీ ఈ ప్రాంతాల వాళ్ళు రాసి రికార్డు చేసినవే కనుక చలన చిత్రాలలో కామిక్ ఘట్టాలకు తూర్పు భాషనే వాడేవారు. నెల్లూరు, తెలంగాణా, అరవ తెలుగులకు కూడా హాస్య రస ఘట్టాలలోనే అవసరం ఏర్పడేది.

అరవ తెలుగును ఎద్దేవ చేసినంతగా మరే ప్రాంతీయ భాషను ఎవరూ చేయలేదు. విశాఖ మండలంలోని "వెళిపొచ్చీపేడు" ఎటువంటి ప్రయోగమో అరవ తెలుగులోని "పూడ్చినాడు" అటువంటి ప్రయోగమే. "వెడలిపోయివచ్చి వేసినాడు" అనే మాట ఉచ్చారణలో కుదింపువల్ల "వెళిపొచ్చీపేడు" అయింది. తమిళ కారకాన్ని అనుసరించి దక్షిణాది తెలుగు వాళ్లు ఎవరయినా నిష్క్రమించినపుడు "పూడ్చినాడు" అని వాడుతారు. తమిళంలో "పోయివిడు" అనే ప్రయోగం వుంది. "పోయివిడిచినాడు" అనే మాట త్వరితోచ్చారణ వల్ల "పూడ్చినాడు" అయింది. అయితే సాధారణ జనులు వ్యాకరణ విశ్లేషణ జోలికిపోరు. సంభాషణలో వాక్యం అర్థాన్ని వ్యక్తంచేయాలి. అవ్యాపారంలో సుపరిచిత ప్రయోగాలు అవగాహనకు దోహదకారులుగా వుంటాయి. అపరిచిత ప్రయోగాలు హాస్యాన్ని పుట్టిస్తాయి.

## గురజాడ వారి డైరీలు

బ్రిటిష్‌వారి హయాంలో చెన్నపట్టణం ఉమ్మడి రాజధానిగా వుండే రోజులలో ఉత్తర సర్కారులలోని తెలుగు విద్యావంతులు చెన్నపట్నానికి

వచ్చి అరవ తెలుగును వినసాగారు. విచక్షణ, విశ్లేషణ, జిజ్ఞాస గల వాళ్ళు సమస్యను అర్థం చేసుకొనడానికి ప్రయత్నించారు. గురజాడ అప్పారావుగారు. ఈ విషయమై గట్టిగా ఆలోచించారు. ఆయన డైరీలను అధ్యయనం చేస్తే ఈ విషయాలు బోధపడతాయి.

"భాషలు ఏ విధముగా మార్పు చెందుతున్నవి. దూరదూరముగా వున్న ప్రదేశములలో భాషలు యేకకాలమున మారుటకున్నూ, కొన్ని కొన్ని ప్రాంతాలలో ఒకే రీతిని మారుటకున్నూ, మరీ కొన్ని చోట్ల యీ మారుదల వేరునేరుగా వుండుటకున్నూ కారణం ఏమైవుండును!"

"భాషలు యెలాగున మారునను ప్రశ్నకు సమాధానము ఈవిధంగా తేలుతోంది. కొన్ని కొన్ని ప్రదేశాలలోని ప్రజలు కొన్ని కొన్ని ధ్వను లను పలికేటప్పుడు వారి ఉచ్చారణాంగాలైన తాల్వాద్యవయాలను బట్టి భాషా పదములు మారుతూవుంటాయి. ఇదే రీతిని ప్రజల అలవాట్లు, ఆచారవ్యవహారములు. మతము, పాత పాటలు, సంగీతము, సాహిత్యము మొదలైనవి. భాషలపై తమ ప్రభావాన్ని స్పష్టముగా నెరపుతున్నాయి. ఈలాగునే ఇరుగు పొరుగు ప్రదేశాలలో వున్న భాషలు....ఒక భాషా కుటుంబంలో అనేక రూపాంతరిత పదములు ఒకే జాతి భాషలో వలు రూపాంతరములు."

"తెలుగు మాట్లాడువప్పుడు తమిళుల ఉచ్చారణః పదాలలో మార్పు వుండాది. పూడుస్తాడు, బెపిఆయినది, వెధవ కొడుకు తేస్తిని (BOUGHT) అద (అదిగా) యెక్కడినో (కో) సామి (అయ్యా....) ఉచ్చరించేటప్పుడు పదములలోని మొదటి అక్షరం మీద ఊనిక హెచ్చు....రెండు మనిషి, విల్లుయెత్తు, చేస్తిని. నేమకుంటమూ యేమిదండగ, కత్తి దారిపోసినాడు (Lost, Mislaid) నేను చూసినాడు, లక్షణంగా...."

తన కాలం నాటి అరవ తెలుగులోని విలక్షణ ప్రయోగాలను గుర జాడ గుర్తించారు. ఏదైనా నాటకంలో ఆయన అరవ తెలుగు పాత్రను ప్రవేశపెట్టాలని అనుకున్నారో లేదో తెలియదు.

రావిశాస్త్రి కథలవల్ల విశాఖ మాండలికానికి, కాళీపట్నం రామా రావుగారివల్ల శ్రీకాకుళం ప్రయోగాలకూ, అల్లం రాజయ్య వల్ల తెలం గాణా భాషకు, చాలాకాలం కిందట మాధవపెద్ది గోఖలే పుణ్యమా అని కృష్ణా గుంటూరుజిల్లాలలోని గ్రామీణ భాషకూ. నెల్లూరుశివారెడ్డి పద్యాల వల్ల పాకనాటి ప్రజల నిత్యవ్యావహారిక ఉచ్చారణకూ తెలుగు సాహిత్యంలో స్థానం ఏర్పడింది. అరవ తెలుగులో రచనలు చేసి రాణించిన వారు చాలా అరుదు.

నాకు తెలిసినంత మట్టుకూ నీలం రాజా శేషయ్యగారి కుమారుడు ప్రసాద్ "ప్రసీల్" అనే పేరుతో అరవ తెలుగును. అందులోనూ మద రాసు తెలుగును చాలా చక్కగా చిత్రించాడు. "చైనా బజారు" అనే శీర్షికతో ఇద్దరు వ్యక్తుల సంభాషణ రూపంలో చాలా రచనలు చేశాడు. ఇవి పుస్తక రూపంలో రాలేదు. కనీసం అరవ తెలుగు ప్రయోగాలకు లక్ష్య గ్రంథంగా ఈ పుస్తకం వెలువడటం అవసరం.

వ ర ద రా జ ం వ ం తు ల కృ షి

తమ ప్రాంతాల తెలుగును ఈసడించినా తాము తెలుగు వాళ్ళమనీ. తమ భాషను పరిరక్షించుకొనడం తమ కర్తవ్యమనీ దక్షిణ భారతంలో ముఖ్యంగా తమిళనాడులోని తెలుగు వాళ్ళు అరవై సంవత్సరాల క్రిందటే భావించారు. సాధువరద రాజంపంతులు (1889–1972)గారి అకుంఠిత దీక్షవల్ల కొడి గట్టుతున్న తెలుగు దీపం తమిళజిల్లాలో స్నేహప్రాప్తిని పొంది మళ్ళా వెలుగసాగింది.

వరద రాజం పంతులుగారు తిరునల్వేలి జిల్లాలోని వీరరాఘవ పురంలో జన్మించారు. (జన్మదినం (20 అగస్టు 1889). వీరి తండ్రిగారు సాధు రామకృష్ణయ్య పంతులు వివిధ ప్రభుత్వోద్యోగాలలోను, ఎట్టయా పురం జమీందారీలో దివానుగానూ పని చేశారు. ఎట్టయాపురం రాజాలు తెలుగు సంగీత సాహిత్యాలను పోషించినవారు. ఆంధ్ర మహాభారతాన్ని తమిళభాషలో వచనరూపంగా అనువదింపచేసి ప్రకటించారు. సారధి వరదరాజాం పంతులుగారు తెలుగు కుటుంబంలో పుట్టినా తమిళాన్ని బాగా అభ్యసించారు. కాలేజీ చదువులు చదువుకొన్నాక మద్రాసు విశ్వవిద్యాల యం వారి తమిళ నిఘంటు కార్యాలయంలో ఒక చిన్న గుమస్తాగా చేరి ఆఫీసు మేనేజరుగా బాలాకాలం పని చేశారు. ఆ పోస్టులో వుంటూనే రిటైర్ అయ్యారు.

తమిళ నిఘంటు కార్యాలయంలో పని చేస్తున్నప్పుడు ఆయనకు తెలుగుమీద అభిమానం ఏర్పడింది. తెలుగు మాట్లాడడం వచ్చినా రాయడం రాదు. చదవడంరాదు. తెలుగు సాహిత్యంతో పరిచయంలేదు. ఈ లోపాలకు ఆయన సిగ్గుపడ్డారు. తెలుగులిపిని నేర్చుకొన్నారు.తెలుగు శతకాలు,భాస్కర రామాయణం,పోతరాజుగారి భాగవతం, వీరేశలింగంగారి రచనలు అన్నీ ఒక ఎత్తూ,దినదినం ఆంధ్రపత్రిక చదవడం ఒక ఎత్తూను, తాను తెలుగు నేర్చుకొన్నాక తన ఇంట్లో వారికి నేర్పడం మొదలుపెట్టారు.

వరదరాజం పంతులుగారి భార్య జయలక్ష్మమ్మ కుమారుడు శివ సుబ్రహ్మణ్యం తెలుగులో ప్రావీణ్యం సంపాదించాడు. వరదరాజాపంతులు గారి ఉద్యమానికి తోడ్పడ్డారు. ఆయన తమిళ జిల్లాలలోని తెలుగు కుటుంబా లలో క్షీణిస్తున్న తెలుగుకుప్రాణం పోశారు. పని కట్టుకొని స్వంత ఖర్చు లతో ఊరూరా వెళ్ళి ఏకైక గుమ్మం. దిగే గుమ్మంగా పర్యటించి తర తరాల తెలుగును ఎగసన త్రోశారు.

చాలా మంది తెలుగు వాళ్ళయిన సంస్కృత పండితులకు దేవనాగరి లిపి తెలియనట్టే, తమిళ జిల్లాలలోని తెలుగు వాళ్ళనేకులకు తెలుగు లిపి తెలియదు భాషా వ్యాప్తికి లిపి అడ్డం రాకూడదు. తంజావూరులో మహారాష్ట్రరాజులు తెలుగుకావ్యాలను నాగర లిపిలో రాయించుకొని చదివారు. పంజాబ్, వాయువ్య సరిహద్దు రాష్ట్రాలలో హిందువులు, సిక్కులు తదితరులు కూడా తమ ఉత్తర ప్రత్యుత్తరాలను ఉర్దూ లిపిలోనే సాగించేవారు వాళ్ళ పత్రికలు ఆ లిపిలోనే వుండేవి. గురుముఖి చాలాకాలం తర్వాత ప్రచారంలోనికి వచ్చింది. సాధు వరదరాజంపంతులుగారు తమిళజిల్లాలలో తెలుగును ప్రచారం చేయడానికి తమిళ లిపిలోనే తెలుగు గ్రంథాలను అచ్చువేయసాగారు. "దక్షిణాంధ్రపత్రిక"అనే ఒక పత్రికను పెట్టి ఉచితంగా సముచితంగా పంచిపెట్టేవారు.

వరదరాజం పంతులుగారి ధర్మమా అని అరవ తెలుగువాళ్ళు తమ భాషకూ, యాసకూ సిగ్గుపడడం మానేశారు. ఆయనకు "దక్షిణాంధ్ర పితామహ" అనే బిరుదును. "భాషోద్ధారక" అనే బిరుదును ఇచ్చి సత్కరించుకొన్నారు. "దయచేసి తెలుగును కాపాడుడు" అనే పెద్ద బ్యానరును భుజం నుంచి వేలాడదీసుకొని ఆయన కాలికి బలపంకట్టుకొని తమిళదేశమంతా తిరిగారు. ఆయన ఉద్యమం ఫలించింది.

తెలుగుకోసం ఇంతటి సేవను చేసిన వ్యక్తి మరుగుపడిన మాణిక్యమై చరిత్రకెక్కని చరితార్థుడుగా మిగిలిపోయాడు. అంతర్జాతీయ తెలుగు సంస్థవారు తమ పత్రికలో 1977లోనే వీరి గురించి ఒక వ్యాసం ప్రకటించినా ఆ పత్రికకు బహుళ ప్రచారం లేనందువ లోకానికి సాధువరదరాజం పంతులుగారి గురించి తెలియులేదు. మొన్న ఆ సంస్థ వారు మద్రాసులో జరిపిన రెండవ అఖిలభారత తెలుగుసభల వివేదికను "సాధువరదరాజం పంతులు వేదిక" అని పిలిచినా తగినంత ప్రచారం ఇవ్వనందువల్ల ఆయన

ఎవరో చాలా మందికి తెలియలేదు. ఒక సెమినార్‌నాలో శ్రీ కె. ఆర్. వేలాయుధరాజాగారి ఉపన్యాసం వల్ల నేను మొదటిసారిగా వరదరాజు పంతులుగారి గురించి తెలుసుకొన్నాను. ఈ తెలుగుసభల చివరి రోజున చివరి గంటలలో ఈ సంస్థ ప్రచురించిన ప్రత్యేక సంచికలో ఒరిజినల్ వ్యాసాన్ని పునర్ముద్రించారు. దానివల్ల మరికొన్ని సంగతులు తెలిశాయి.

ఎందరో మహానుభావులని త్యాగరాజ స్వామి చెప్పినమాట వాస్తవం. అందరికీ వందనాలు అర్పించడం మన డ్యూటీ. అయితే వాళ్ళ గురించి చెప్పేవాళ్ళుకావాలి. ఆచార్య బిరుదురాజు రామరాజుగారు తెలంగాణా సాహితీపరుల గురించి "మరుగుపడిన మాణిక్యాలు" "చరిత్రకెక్కని చరితార్థులు" అనే శీర్షికలతో వ్యాసాలు రాసి పుస్తక రూపంలో తెచ్చినట్టు వివిధ ప్రాంతాలలోని మరపురాకూడని మనీషుల గురించి చెప్పుకోవడం చాలా అవసరం.

* — *

# అన్నమయ్య ఆడినమాట అమృతకావ్యం,
# పాడినపాట పరమగానం

ఏ సాహిత్యంలోనైనా ముందు పాట పుడుతుంది. తరువాత పద్యం జనిస్తుంది. సాహిత్యం, వాఙ్మయం వంటిది ఏమీ లేని అనాగరిక జాతుల వాళ్లు సైతం పాటలు కట్టుకొంటారు. కలిసికట్టుగా పాడుకొంటారు. పాటలు కూడా అల్లుకోలేని జాతి అనేది ఉంటే అది పశుప్రాయమే అని చెప్పాలి.

క్రీస్తుకు పూర్వం నుంచి అంటే రమారమి రెండు వేల సంవత్సరాల క్రిందటి నుంచీ మన గడ్డ మీది మనుష్యులు తెలుగే మాట్లాడుతూ ఉండేవారని చెప్పడానికి తగినంత సాక్ష్యాని చరిత్రకారులు సేకరించారు. అయితే ఈ ఆదికాలపు తెలుగు వాళ్ళు వాడుకునే పొడిమాటలు కొన్ని దొరికాయేకాని ఆ నాటి వాక్యనిర్మాణం ఎలా ఉండేదో, పదవిన్యాసం ఎలా చేసేవారో, పాటలు ఎలా వ్రాసుకొనేవారో ఏమీ తెలియదు.

వెయ్యేళ్ళ క్రిందట నన్నయ్యభట్టుగారు భారతాన్ని ఆంధ్రీకరించే దాకా తెలుగులో కావ్యాలు లేవనినమ్మేవాళ్ళూ, అసలు ఆయనతోనే తెలుగు భాష పుట్టిందనే వాళ్లూ ఉన్నారు. కాని నన్నయ్యగారికి ముందు ఒక వెయ్యేళ్ళపాటు తెలుగులో ఎన్నో పాటలు, పద్యాలు కట్టుకొని పాడుకొన్నారని చెప్పవచ్చును. నన్నయ్యగారే ఒక చోట గీతాలను పేర్కొన్నారు. అర్జునుడి పరాక్రమాన్ని నాధులు పాటగా పాడితే ఉబ్బుచు విందట. నన్నయ్యగారి తర్వాత నన్నెచోడుడు గౌడు గీతాల గురించి చెప్పాడు.

మరొక సందర్భంలో తపస్సుకోసం అరణ్యానికి వెళ్తున్న పార్వతి ఈ పాట, అటవికులపాటలు విన్నదని నన్నెచోడుడు చెప్పాడు. తమ కాలానికి ముందు తరతరాల తెలుగువాళ్ళు పాడుకొనే పాటల గురించి ఈ ఆదికవు లిద్దరూ చెప్పారను కోవాలి.

ఆంధ్రదేశంలోని ప్రాచీన శిల్పాలలో చేతులు తట్టితాళాలు వేస్తున్న వాళ్లూ, వేళ్ళమీటి వీణలుమీటుతుండేవాళ్ళూ, నోరుతెరచి పాటలు పాడే వాళ్ళూ, ఎందరో కనబడతారు. వీళ్ల పాడే పాటలు కొన్ని కోట్లు ఉండి ఉండాలి. కాని దురదృష్టవశాత్తూ మనపూర్వులు వాటిని భద్రపరచలేదు. సంకలనాలుగా సేకరించలేదు. సంపుటీకరించలేదు. తమిళభాషలో అత్యంత ప్రాచీనమైన పాటలు నేటికిదక్కాయి. వాళ్ల జాగ్రత్తపడ్డారు. తమ గేయ సంపదను దాచుకున్నారు.

మనకీ రకరకాల పాటలుండేవని మాత్రం చెప్పుకోడానికి వీలుగా పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రలో బోలెడన్ని పాటల పేర్లు యేకరువుపెట్టాడు. ఆయన క్రీస్తుశకం 13వ శతాబ్దపు చివరిరోజు లలో పెరిగినవాడు. అంటే నేటికి ఏడువందల సంవత్సరాల క్రిందటి వాడు. ఆయన పేర్కొన్న పాటలు ఇన్నీ అన్నీ కావు. తుమ్మెద పదాలు ప్రభాకర పదాలు, పర్వత పదాలు, ఆనంద పదాలు, శంకరపదాలు, నివాళిపదాలు, నాగేశ పదాలు- గొబ్బిళ్ళు కిన్నెరపదాలు, సెజ్జవర్ణన, గణవర్ణన పదాలను తనకాలంలో పాడేవారని పాల్కురికి సోమనాథుడు చెప్పాడు. ఇప్పటికీ ఆయన చెప్పిన తుమ్మెదపదాలు ఉన్నాయి. "పాండవులు" పాండవులు తుమ్మెద పంచపాండవులే తుమ్మెదా!—అని సంక్రాంతి రోజులలో నల్లెడుగంధం పూసుకున్న మాలముత్తయిదువులు ఇంటింటికి వెళ్ళి పాడుతూ ఉంటారు. సోమనాథుడు చెప్పిన వెన్నెలపదాలు నేటికి

వినిపిస్తాయి. "వెన్నెలలో" అని సంబోధించిపాడే పాటలే ఇవి మంగళ హారతులు, గొబ్బిళ్ళు మొదలైనవి నాటికీ నేటికీ అలాగే ఉన్నాయి.

పాల్కురికి సోమనాథుడి తరువాత ఒక పాతిక ముప్ఫయ్యేళ్ళ లోపునవున్న ఇంకో సోమనాథుడు తన వసంత విలాసంలో ఒక పాట సంగతి చెప్పాడు.

> "వీణాగానము వెన్నెల తేట
> రాగమీరగా రమణుల పాట
> ప్రాణమైన పిన బ్రాహ్మణులీల
> జాణలు మెత్తురు జాజరపాట

ఈ సోమనాథుడి పేరు వాచస సోమనాథుడు. ఇతడు శ్రీనాథుడి కొంచెం పూర్వీకుడు. ఈయన లాగే శ్రీనాథుడు కూడా జాజర పాటల సంగతి చెప్పాడు. ఇతర కవులు కూడా అక్కడక్కడ పాటలను పేర్కొన్నారే గాని తెలుగు పాటలు ఆ రోజుల్లో ఎలా ఉండేవో ఒక్కడూ ఉదాహరించలేదు.

అయితే ఈ పూర్వకవులు చెప్పిన అన్నిరకాల పాటలూ మనకు క్రీ. శ, పదిహేను శతాబ్దపు ఉత్తరార్ధం నుంచీ దూరమవుతున్నాయి. అంటే ఆరువందల సంవత్సరాల నుంచి తెలుగువాళ్ళ గేయసంపద విశేషంలాగ దొరుకుతూంది. తాళ్ళపాక అన్నమాచార్యుల వారూ ఆతనిసంతతీ ప్రత్యేకం తోడు ఓల్లెకారులుగా వెలసి ఈ పాటలను వ్రాశారు. ఈ పద సంపద అక్షరాలా నిక్షేపమనే చెప్పాలి. భూమిలోంచి లంకెబిందెలు దొరికినట్టు మొన్న మొన్న ఈ పెన్నిధి మన కన్నులకు కానవచ్చింది.

తిరుపతి దేవాలయంలో బంగారు వాకిలి వద్ద నిలబడి చూస్తే కుడి చేతిపక్క భాష్య కారుల సన్నిధి ఉంటుంది. దాని ప్రక్కనే తాళ్ళ పాకవారి అర అనే పేరిట ఒక సంకీర్తన భండారముంది. అందులో చాలా కాలం పాటు తాళ్ళపాకవారి సంకీర్తనలు చెక్కిన రాగిరేకులు గుట్టలు గుట్టలుగా ఉండేవి. వాటిని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు త్రవ్వితీశారు. వారు త్రవ్వినది ఇవాళ ప్రతి ఆంధ్రుడూ తలన పెట్టుకుంటాడు. ఆ రాగి రేకులతో సాహిత్యరత్నాలు, మాటలమణులు, నీతుల నీలాలు ఎన్నెన్నో ఉన్నాయి.

పాటలు వ్రాయడం కోసమే పుట్టారా అన్నట్టు అన్నమాచార్యులు క్రీ. శ. 1424లో జన్మించారు. ఆయన స్వగ్రామం కడపజిల్లా రాజంపేట ప్రాంతాలలోని తాళ్ళపాక ఆయన చిన్నప్పుడే ఇంట్లోంచి పారిపోయి పాటలు పాడుకుంటూ తిరుపతిచేరుకున్నాడు. ఏ రోజు పాటలు ఆరోజే క్రొత్తగా వ్రాస్తూ ప్రతి దినం తెల్లారి లేవగానే మేలుకొలుపులుపాడడం మొదలు రాత్రి స్వామివారికి పవళింపుల సేవలు చేయించి పడుకోబెట్టే దాకా ఒక్కొక్క సేవకోసం కీర్తన చొప్పున ఒక్కొక్క జాము కో పాట చొప్పున రకరకాల కోరకాలుగా ఆయన.కట్టిన పాటలు ఇట్లున్నాయి:

విన్నపాలు వినవలె వింతవింతలు
పన్నగపు దోమ తెరపై కెత్తవయ్యా
అని దేవుణ్ణి నిద్రలేపాడు ఒకసారి
చందమామరావే!! జాబిల్లి రావే....మంచి
కుందనపు పైడికోర వెన్నపాలు తేవె!
అని దేవుడికి గోరుముద్దలు తినిపిస్తూ

గారముగ గుటకలు వేయించాడు
"జో" అచ్యుతానంద జో జో ముకుంద
రావె పరమానంద రామగోవింద !
అని లాలిపాటలు పాడారు.

అన్నమయ్యగారి కళ్ళకు దేవుడు ఒకసారి పాలపాపడి లాగ కనబడతాడు. ఒకప్పుడు పరమాత్మవిలాగ నిలబడతాడు. ఇంకోసారి చెంచితలతో చెలగాటమాడే ధూర్తవిటునిలాగ చూస్తాడు. మరొకసారి మంగతాయారమ్మ మక్కువను చక్కగా చేసేళ్ళంగారలాయిలలాగ సాక్షాత్కరిస్తాడు. ఏవూరు వెళ్ళినా, ఏదేవుణ్ణి చూసినా అన్నమయ్య దృష్టికి ఆ దేవుడు వేంకటేశ్వరుని లాగే గోచరిస్తాడు.

అన్నమయ్యగారు ఎన్నో క్షేత్రాలు దర్శించారు. కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం, చిత్తూరు, చెంగల్పట్టు, ఆర్కాడు, నెల్లూరు, గుంటూరు, తంజావూరు, తిరుచినాపల్లి మండలాలో సంచారం చేశారు. మాడుపూరి కేశవుడు, దాసరి పల్లెరాముడు, కదలి నరసింహుడు, కడప వేంకటేశ్వరుడు, కంచివరదుడు, గండవరం గోపాలుడు, ఉద్దగిరి కృష్ణుడు, పూటుకూరి చెన్నకేశవుడు, చెంచి నవనీతకృష్ణుడు, చెళ్ళపిళ్ళరాముడు, చేగల మరిచెన్నుడూ—మొదలైన దైవాలనెందరినో దర్శించారు. వాళ్ళందరినీ తిరుపతి వేంకటేశ్వరునితో అభేద వ్యక్తులుగా భావించి వాళ్ళపై ఆయన సంకీర్తనలు పాడారు. ఆ పాటలకు వేళాపాళా అక్కరలేదు. సేవ సేవకో వేళ, వేళ, వేళకోరాగం ఉంటుందని ఆయన ఉద్దేశం. "పాడేము నేడు పరమాత్మ నిన్నును వేడుక ముప్పదిరెండు వేల వేళల రాగాలను" అని ఒక పాటలో ఆయన చెప్పాడు. కనుకనే నిపుణులు ఊర్పులే తంత్రులు

ఈ జీవనవీణపై అన్నమయ్య పలికించినదల్లా పాట అయింది. తన సంకీర్తనల గురించి అన్నమయ్యే ఒకసారి ఇలా అన్నారు "దాచుకొని పాదాలకు తగనే చేసిన పూజలివి" అని అంటూ—

"ఒక్క సంకీర్తనేచాలు ఒద్దికై మమ్మురక్షించగ తక్కినవి భండారాన దాచి వుండనీ వెక్కసము నీనామము సులభము ఫలమధికము, నిక్కినన్నేలితి వింతనరులేరని వాదనమయ్యా అని అన్నమయ్య తనపద సంపద గురించి చెప్పారు. అవి తరగని వారి ధనమేకాదు. ఆంధ్రులకు తరగనిపాతర. కోకొల్లలుగా సామెతలు, గరిసెలకొద్దీ పలుకుబళ్ళు, ఎక్కడ చూసినా జాతీయాలు ఈ పదాలలో కనబడతాయి.

ఇవి శబ్దాల సంగతి భావాలా? వేలకొద్దీ పాటలు వ్రాసినా ఎప్పటికప్పుడు కొత్తదనక, కొత్త వూహ, నానార్థం, నూత్నవిషయం సాక్షాత్కరిస్తూనే ఉంటుంది. ఈ శబ్దార్థాల మేళవింపులో ఎన్నెన్నో శిల్ప సౌందర్యాలు గోచరిస్తాయి. యిక ప్రాసలకోసం తెచ్చి పెట్టి అతికించిన మాటల్లా కాకుండా విచ్చుకుంటున్న మొగ్గల్లాగ అపూర్వ ప్రయోగాలు, ఆహా అనిపించే మాటలు కనబడతాయి. అన్నమయ్య పాటలు తరచిన కొద్దీ వెన్న వచ్చే చల్లకుండ.

అన్నమయ్య తన 79 సంవత్సరాల నిండు జీవితంలో రెండు రకాల సంకీర్తనలు వ్రాశారు. వాటికి ఆధ్యాత్మిక సంకీర్తనలు, శృంగార సంకీర్తనలు—అని పేరు పెట్టారు. తెలుగువాళ్ళ గేయసాంప్రదాయం అన్నమయ్య కాలం నుంచే మనకు స్పష్టంగా తెలియవస్తోంది. అన్నమయ్య శృంగార సంకీర్తనల కొమ్మ క్షేత్రయ్యపదాల తోటలో ఎన్నో పూవులు పూచింది. అలాగే వారి ఆధ్యాత్మిక సంకీర్తనలశాఖ త్యాగరాజుగారి పెరట్లో కల్పకమైంది. అన్నమయ్య తన శృంగార సంకీర్తనలలో వాడిన ఎన్నో కొత్త పదాల మొగ్గలు క్షేత్రయ్య రచనలలో విప్పారాయి. ఉదాహరణకి-

అన్నమయ్య మఖక్షత్రాలను చందురు కూనలు అంటే క్షేత్రయ్య వాటిని విదియ చంద్రులు అంటాడు. ఒకచోట క్షేత్రయ్య "అందగాడి నపుడవులే ఆదివరాహ" అందుకైతే జాణవులే ఆదివరాహా పదం వ్రాశాడు. ఈ పదంలో ఆదినారాయణుని అందమేమిటో మనకు బోధపడదు. అది కళ్ళకుకట్టాలంటే అన్నమయ్య చంద్రుడు చదువుకోవాలి. వినండి— అన్నమయ్య తిరుపతి కొండపై దర్శించిన ఆదివరాహాని వర్ణన :

"వెండియు చూచె నవిస్మయుండగుచు
పుండరీకముల యొప్పు కనులయ్యె
మరగేంద్రుశిరసుపై నొకపాదమూని
చరణ మొక్కటి రసాస్థలి మోలజూచి
డాకేలు పుడమి పడంతుకు నలమి
యాకేలు కటినూది యమరక్తి జక్క
బంటరలంతి గుబ్బలతావి మోవి
పంటితేవి మరొక పరియానుతమిని
మోముదామరజూపి మొగసిరికేలి
తామరలను శ్రుతిద్వయము విక్కించి
సంకుచక్రముల హస్తముదెంట
పొంగుకించు కరుణ చూపుల లొజ్జిలంగ
నాగరి బెంపొందు నాది వరాహ
నాదరంబున గొనియాడి పేమిని...."

అన్నమయ్య తిరుపతిలో స్థిరపడ్డారట. ఈ వర్ణన చదివాకనే క్షేత్రయ్య అందగాడవపుడువులే ఆదివరాహ, అంటే మనం అపుమ నిజమే అనగలం. అన్నమాచార్యుని జీవిత చరిత్రను అతని మనుమడే రచించాడు. అన్నమయ్య కుటుంబంలో అందరూ చదువుల సరస్వతులే. ప్రతి ఒక్కరూ గేయాలు, పద్యవాక్యాలు వ్రాసిన వాళ్ళు. శతకాలు చెప్పిన వాళ్ళు అన్నమయ్య ఏడాకుల అరటిచెట్టు లాగవచ్చగా వుంటే తక్కిన

తాళ్ళపాక కవులందరూ చుట్టూ వున్న అరటి పిలుకల్లాగ కనబడతారు. ఈ కదళీ వనంలో గెలవేసిన పెద్ద చెట్టు కన్నులపండువుగ కనిపిస్తూ నోరూరిస్తుంది. అన్నమయ్యగారి భావాలు అక్షరాలా నేడు కదలీపాకంలో వున్నా వాటి రుచి ద్రాక్షా సవంలాగ ఆనాడుండేది.

ఇవాళ అన్నమయ్య పాటలన్నీ చప్పున బోధపడవు. ఆనాటి పలుకుబళ్ళు, పదాలు వేరు. ఆనాటి వ్రాత తీరు వేరు. ఆ పద్ధతిలో వ్రాసిన పాటలను అలాగే అచ్చువేస్తే కొంత అర్థం కాదు. ఆనాటి మాటలు నేడు అన్ని ప్రాంతాలలోనూ ప్రచారంలో లేవు. కొన్ని ప్రయోగాలు మరుగున పడ్డాయి. కొన్ని సంకీర్తనలలోని సంప్రదాయం ఇవాళ మనకు తెలియదు. "కొచ్చి కొచ్చి కొసరీనె గొల్లకూసమకుచ్చి యెత్తవే ఉరమీనాగొల్ల కూసమ...." అని ఒక పల్లవి ఉంది. ఈ పాటలో రెండేసి పదాలకోసారి "గొల్లకూసమ. అనే మాట వస్తుంది. ఇదేమిటో ప్రత్యేక పరిశోధకులుగాని చెప్పలేరు. అలాగే మరో పాటలో "కూగూగు" అనే ఊతపదం వస్తుంది. "గురుకు ఎరిగిన దొంగ కూడూగు—సీకుగుడిలోన దాగీసి కూగూగు" అని అన్నమయ్య పాడారు. ఈ పాటలో రెండేసి పాదాలకో ఒకపారి ఈ "కూగూగు" అనే పదం వినబడుతుంది. ఈ పద్ధతిలోనే మరొక పాటలో "చాంగు భళా" అని వాడారు.

"చక్కని తల్లికి చాంగు భళా—తన
చక్కెర మోవికి చాంగు భళా!
కులుకెడి మురిపెపు గుమ్మరింపు తన
నలుపు చూపులకు చాంగు భళా
పలుకుల సొలుపుల పతితో గసరెడి
చలిముల అలుకకు చాంగు భళా!
జందెపు ముత్యపు సరుల హారముల

చందనగంధికి చాంగు భళా!
విందయి వేంకట విభు పెనచి తన
నంది దండలకు చాంగు భళా !

చాంగు భళా అంటే హర్షింపు. అన్నమయ్య ప్రతిపాటను విన్నాక చాంగు భళా అనక తప్పదు. చాంగు భళా అని అన్నమయ్య అలవేలు మంగపై భవాన్ని మెచ్చుకొంటారు. చాంగు భళా అన్నమాట మాటకే మజ్జారే.... సేభాష్ అనే మెచ్చుకోలు మాట అని అర్థం చెప్పుకోవచ్చును గాని గణపవరపు వేంకటకవి అనే లాక్షణికకవి నమస్కారారం అనే మాటకు ఎన్ని పర్యాయపదాలున్నాయో వాటితో కనకవచనం వ్రాశాడు. ఆ వచనం లోనే గణపవరపు కవి అల్లోనే రేళ్ల అనే మాటను కూడా అంజలికి పర్యాయపదంగా వాడారు. అన్నమయ్య మాత్రం హర్షింపువదంలాగ వాడాడు.

వెయ్యములల్లో నేరోల్లే
వయ్యన వూరెడి వువ్విల్లో
చోట చోట గన్నుల దొరిగే సీళ్ళు
చిటిపాటి యలుకల చిరునగవే
వలపులంచుని వన్నెల మోవికి
గుటకల చోనా గుక్కిళ్లా
గరగరికల వేంకటపతి కౌగిట
పరిమళములలో పచ్చవలు
మరువిమింటి కమ్మని యంపవితుల
గులికకు వినువగుగ్గిళ్ళా"

ఈ పాటవల్లా అల్లోనేకేళ్ళు అంతా చమత్కారం అని చెప్పలేం. ఇది పాటలో వాడే సంప్రదాయం గణపవరపు వేంకటకవికి తెలుసు ఆతడు తన ప్రబంధ చావ వేంకటేశ్వర విజయ విలాసంలో ఇలా వ్రాశాడు,

"పల్లవపాణులు కొందరు
పళ్ళెరముల బూని రవల బంగారుగాజుల్
ఘల్లురనసుంకు చెరిగిలి
యల్లోనే రేడంటంచు వెయ్యందిరకున్"

ఈ వేంకటకవి తాళ్ళపాక వారికి రెండు వందల సంవత్సరాల తరువాతి వాడు. మధురనాయక రాజులవద్ద ఉన్నాడు. తాళ్ళపాకవారి గేయ సంప్రదాయం సజీవంగా ఉండేదని ఇటువంటి ప్రయోగాలు తెలియ జేస్తాయి. అన్నమయ్య పాటలపై ఎంతో పరిశోధనకావాలి. "బాణో చ్ఛిష్టం జగత్రయం"—అంటారు గాని, అన్నమయ్య ఆంధ్రభాషకు అగస్త్యుడు. ఆయన వాడని మాటా, పాడని పాటా లేదు. అయితే, దురదృష్టవశాత్తూ అన్నమయ్య పదాలన్నీ మన నిఘంటువుల కెక్కలేదు. మన సాహిత్య అకాడమీలు వివిధ కవుల దేశ్యపదాలకు పద ప్రయోగ సూచికలు తయారు చేస్తున్నారుగాని ముందు తాళ్ళపాకవారి రచనలకు సూచికలు చేయాలి. తాళ్ళపాకవారిని చదవకపోతే తెలుగు రాదని ఒకసారి వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అన్నారు. అది అక్షరాలా నిజం. తాళ్ళపాక కవుల పదాల పట్టికలను తయారుచేసి వాటిని పొందపర్చకపోతే మన అకాడమీల కృషిలో కొరతలు ఉండిపోతాయి. డాక్టరేటు బిరుదులకోసం మన పండితులు ఇతర విషయాలెన్నింటిపైనినో పరిశోధనలు చేస్తున్నారు. నిజానికి అన్నమయ్య సర్వతోముఖ ప్రతిభపై పరిశోధనలు జరపడం ముందు ముఖ్యం. ఇది పండితుల పని. సాధారణ ప్రజలు అన్నమయ్యను చదివి, ఆతని పాటలు విని, పాడుకుని ఆనందించడానికి ఎంతయినా అవ కాశం ఉంది. నీరుకొద్దీ తామర. ఎవరెవరు ఎంత సేకరించుకుంటే అంత వజ్రాలుగని. అన్నమయ్య పదసంపద, ఆయన ఆడినమాటెల్లా అమృత కావ్యం, పాడిన పాటెల్లా పరమగానం అందింపాడు. ఆయన ఆస్వాదించ డం మన వంతు.

(పాకవ్యానం)

## కచేరీ బాణీలో పాడవలసినవీ, కాపాడవలసినవీ

ఆదిమ సమాజంలో సంగీతం సాముదాయకం అందరూ కలిసి జీవించే విధానంలో అందరూ కలసి పాడే అవసరం ఉంటుంది. సంగీత సాహిత్య నృత్యాలు అప్పుడు కలసికట్టుగా ఒకే ప్రయోజనంతో ఉండేవి నాగరికత విస్తరించుకున్న కొలదీ ప్రదర్శకులూ ప్రేక్షకులూ అనే విభేదాలు ఏర్పడ్డాయి.

రాచరికం ముదిరాక ప్రభువుల ముందు ప్రదర్శించేవీ, ప్రజల కోసం ప్రదర్శించేవీ అనే విభేదాలు వచ్చాయి. నృత్యం నుండి విడిపోయిన సంగీతం ఒక ప్రత్యేక కళగా రూపొందింది ప్రభువును మెప్పించడంలో ప్రజ్ఞను చూపెట్టసాగింది. ప్రభువు దేవుడు కావచ్చు లేదా దేశ మేలవాడు కావచ్చును. ఆస్థాని కవుల కావ్యాలు ఎలాగైతే ప్రజలకు దూరమయ్యాయో ఆస్థాన విద్వాంసుల సంగీతం కూడా సామాన్యుల అందుబాటుకు దూరమయ్యే అవకాశాలు వచ్చాయి. అయితే సామాన్యులు తమకు కావలసిన సంగీతాన్ని పని పాటల్లో పండుగలలో భజన కూటాలలో పాడుకొంటూనే వున్నారు. సంస్థాన విద్వాంసుల గానానికీ సామాన్యుల పాటలకూ మధ్య మధ్య తరగతి సంగీతం కూడా ఒకటి లేకపోలేదు.

ఇవాళ దాక్షిణాత్య సంగీత మంతటినీ కర్ణాటక సంగీతమని పిలుస్తారు. దాన్లో కచేరీ సంప్రదాయాన్ని చాలా గౌరవిస్తారు. మనో ధర్మ సంగీత ప్రదర్శనకు ఇదే అనువైన పదవి భావిస్తారు. విద్వాంసులు తమ ఊహా శక్తిని బట్టి అప్పటికప్పుడు తమ గాత్రంద్వారాగాని, వాద్యంద్వారాగాని స్వయంగా సృష్టించగలిగిన సంగీతాన్ని మనోధర్మ సంగీతం అంటారు. ఇది అయిదు రకాలుగా వుంటుంది. (1) రాగాలాపన, (2) తానం, (3

పల్లవి, (4) సాహిత్య ప్రస్తారం లేక నిరవల్, (5) స్వరప్రస్తారం లేక కల్పనస్వరాలు.

మూల పురుషుడు

కచేరి బాణీ సంగీతానికి పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ (1845-1902) మూల పురుషుడని చెప్తుకుంటారు. ఈయన త్యాగరాజస్వామికి ప్రశిష్యుడు. అనేక వర్ణాలు, కృతులు, తెల్లినాలు జావళీలు రచించిన ఘనుడు. బేగడ రాగంలో నిధి, అందుచేత ఈయనను బేగడ సుబ్రహ్మణ్యయ్యర్ అని కూడా పిలిచేవారు. కథన కుతూహల రాగంలో ఇప్పుడు సుప్రసిద్ధమైన "రఘువంశ సుధాంబుధి చంద్రమా" అనే కీర్తన ఈయన రచనే. సుబ్రహ్మణ్యయ్యర్‌గారి శిష్యులైన రామ్నాడ్ శ్రీనివాసయ్యంగారూ ప్రశిష్యులైన అరియకుడి రామానుజయ్యంగారూ కచేరీ బాణికి స్థిరమైన రూపు రేఖలు కల్పించారు. ఇవాళ ఎవరు కచేరీ చేసినా రమారమి వీరి వరవళ్ళనే దిద్దుతారు. ఏకార్యక్రమంలోనైనా ఒకేక్రమంలో విద్వత్ప్రకర్షకనబడుతుంది.

కచేరీ బాణీలో "రాగం తానం పల్లవి" అనేది చాలా ముఖ్యమైన అంశం. ఇందులోనే విద్వాంసుల వైదుష్య ప్రకటన కనబడుతుంది. రాగాలాపనలో సంగ్రహాలాపనకు బదులు సంపూర్ణా లాపనకు అవకాశం ఉంటుంది. ఇందులో మూడు భాగాలుంటాయి. మొదటిది ఆక్షిప్తిక లేక ఉపోద్ఘాతం రెండవది రాగవర్ధిని లేక అలాపన యొక్క స్వరూపం మూడవది స్థాయి-మకరిణి ఇందులో ఆలాపన పరిసమాప్తం అవుతుంది. మకరిణినే కొందరు వర్తని అనే పేరుతో పిలుపిస్తారు. రాగవర్ధినిలో నాలుగైదు దశలు ఉంటాయి.

రాగం, తానం, పల్లవి

రాగాలాపన ఏ కచేరీలోనైనా వల్లబై అయిదు నిమిషాలకు తక్కువ అయితే రక్తికట్టదు. తరువాత మధ్యమ కాలతానం ఒక పదిహేను నిము షాలపేపు సాగుతుంది. ఆటుపిమ్మట పల్లవి. వ + ల + వి అనే మూడు ప్రథమాక్షరాలవల్ల ఈ పదం ఏర్పడింది. "ప" అంటే పదం అనగా సాహిత్యం "ల" అంటే లయ "వి" అంటే విన్యాసం. పల్లవిలో ప్రధ

మాంగం. ద్వితీయాంగం అని వుంటాయి. పచ్చిమిరియం అది అప్పయ్య గారు పల్లవి ఆలాపనను శాస్త్రయుక్తం చేశారు. ఈయన తంజావూరు మహారాష్ట్ర రాజుల ఆస్థాన విద్వాంసుడు, ఈయన శిష్యుడు గోపా లయ్యర్ పల్లవి పాడడంలో ఘనుడు. అందుకే అతణ్ణి పల్లవి గోపా లయ్యర్ అని పిలిచే వారు ఇలాగే శేషయ్యగారిని కూడా "పల్లవి శేషయ్య" అని పిలిచేవారు. ఈయన సావేరి రాగాన్ని ఒకసారి ఎనిమిది గంటల సేపు పాడారట.

ప్యూడలీ వ్యవస్థలోని తీరుబాటు తగ్గటం వల్ల ఈరోజులో కచేరీలు రెండున్నర లేక మూడున్నర గంటల కాలానికే పరిమితమైపోయాయి.

వా తా పి గ ణ ప తి ం ....

ఈ వ్యవధిలోనే పూర్వులు చేసిన విన్యాసాలన్నీ విద్వాంసులు చేయవలసివస్తోంది. ముందుగా ఒక వర్ణం తప్పనిసరి అనుకోనక్కర్లేదు. దైవప్రార్థనతోనే ప్రారంభం చేస్తున్నారు: సాధారణంగా హంసధ్వనిలో **వాతాపి గణపతిం భజే** లేదా సౌరాష్ట్రంలో **శ్రీ** గణపతిని సేవింపరారే వంటివే పాడుతారు (లేక వాయిస్తారు) తర్వాత రెండు అర్జెంట్ కృతులు పిమ్మట సంగ్రహాలాపనలో ఒక కృతులు సంపూర్ణాలాపనలో మరో కృతి చర్మవాద్యాలకు తని ఆవర్తం. ఒక అష్టపది తరంగం జావళి తిల్లాన-పవ మాన సుతుడు పట్టు మంగళం ఇవే ఈనాటి కచేరీ బాణీ కార్యక్రమంలో విశేషాలు.

సుప్రసిద్ధవాగ్గేయకారుల రచనలనె పూర్వం ప్రదర్శించేవారు. ఇటీవల చాలా కచేరీలలో అన్నమాచార్యుల వారి సంకీర్తనలు భద్రాచల రామదాసు కీర్తనలు. నారాయణ తీర్థులవారి తరంగాలు విరివిగా పాడుతున్నారు. ఇది సంతోషించదగ్గ విషయమే. అన్నమయ్య కర్ణాటక సంగీతానికి ప్రపితా మహుడు కనుక ఆయన పాటలను (కొన్నింటిని) కచేరి బాణీలో పాడితే

ఎబ్బెట్టుగా ఉండదు రామదాసు కీర్తనలను ఈ బాణీలో ఇటీవల కొందరు పాడగా విన్నాను. ఒళ్ళు కంపరమెత్తింది. "నను బ్రోవమని చెప్పవే సీతమ్మ తల్లీ" అనే కల్యాణి రాగంలోని పాటను విరవల్ తోనూ కల్పన స్వరాలతోనూ పాడితే రచనలో ఉన్న ఆర్తికన్నా విద్వాంసుడు కోరే కీర్తి ఎక్కువగా ధ్వనిస్తుంది. నారాయణ తీర్థులవారి తరంగాన్ని కూడా ఒక ప్రఖ్యాతి విద్వాంసురాలు కచేరీ బాణీలో పాడడం శోచనీయం.

## రామదాసు కీర్తనలు

భద్రాచల రామదాసు నారాయణ తీర్థులు త్యాగరాజస్వామి కన్న ప్రాచీనులు తమ కాలందాకా అమలులో వున్న సంగీత సంప్రదాయాలను అనుసరించి రచనలు చేశారు వీళ్ళ పాటలను పాడే పద్ధతి ఇప్పటికీ ఆంధ్ర దేశంలో సజీవంగా ఉంది రామదాసు త్యాగరాజస్వామినే ప్రభావితుణ్ణి చేసిన వాగ్గేయకారుడు ముఖ్యంగా భజనభిత్తు పాటలలో మేటి దివ్యనామ సంకీర్తనలూ, ఉత్సవ సంప్రదాయ కీర్తనలూ ఈ కోవలోనివే రామదాసు కీర్తనల లోని రమ్యతా. రక్తి వినాలంటే ఆంధ్రదేశంలోని కుగ్రామాలలోని రామ మందిరాలలో పామరులు పాడేటప్పుడు వినాలి భక్తి పారవశ్యంలో తికాలాలలో చిరతలు వాయిస్తూ, చిటిదళంవేస్తూ బృంతాగానం చేస్తున్నప్పుడు రామదాసు రచనలోని రసరూపం ప్రత్యక్షంకాగలదు. ఏ బాల మురళీకృష్ణో కచేరీ బాణీలో దీన్ని రక్తి కట్టించగలడేమోగానీ అందరివల్లా అయ్యేదికాదు. "కచేరిలో ఆ బాణీ అసి ఉన్నట్టుండి "ఏమి నేచురాలింగా అని బాలమురళీ పాడితే ఒళ్ళు జలదరించి కళ్ళు చెమ్మగిల్లి రసానందం పుట్టదూ? ఎం ఎస్. సుబ్బలక్ష్మి పక్కవాద్యాలు తగ్గించి "జాలరు" వేస్తూ పాడలేదూ.

## తెలుగువారి కీర్తనలు

అధ్యాత్మ రామాయణ కీర్తనలు గురు ముఖతః నేర్చుకోవలసినవి. మునిపల్లి సుబ్రహ్మణ్యంగారి రచనా వైదుష్యం సుశిక్షితులైనవారు గానం చేస్తున్నప్పుడే తెలుస్తుంది. యాగంటివారి రచనలూ వరాంకుశదాసు పాటలూ

తూము నరసింహదాసు కీర్తనలు గోగులపాటి కూర్మన్న పాటలూ దాసు శ్రీరాములుగారూ గబ్బిట యజ్ఞనారాయణశాస్త్రిగారూ రచించిన జావళీలూ ఎడ్ల రామదాసు కీర్తనలూ, ప్రయాగ రంగయ్యగారి రచనలూ నూటికి నూరుపాళ్ళు తెలుగు దనం ఉట్టిపడే సంగీత కృతులు.

ప్రయాగ రంగయ్య (1859-19 7) గారు మన డాక్టర్ బాల మురళీకృష్ణకు సాక్షాత్తూ మాతామహుడు ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు గీత గోవిందాష్టపదులు, తీర్థలవారి తరంగాలు, గోగులపాటి కూర్మన్న పాటలూ అన్నీ వారికి కొట్టినపిండి, స్వయంగా రామాయణ కీర్తనలు రాశారు. పెళ్ళి పాటలు, పిల్లల పాటలు రాశారు. వీరి పాటలు పామరు లలో సైతం ప్రచారంలో వున్నాయి. ఆడవాళ్ళలో మరేసరి.

తెలుగు వాళ్ళకి తమదీ అంటూ ఒక ప్రత్యేకమైన సంగీత జాతి ఉంది. అమరావతీ శిల్పాలలో వివిధ వాద్యాలను వాయించే మూర్తులను చూస్తాం. శాస్త్రాలలో "ఆంధ్రెలా" అనే పేల ప్రసక్తి చూస్తాం. తూర్పు చాళుక్యుల కాలంలోని ఒక సంగీత కుటుంబంలోని మూడు తరాల పేర్లు శాసనబద్ధం అయ్యాయి.

గాంధర్వ విశారద

ఏసుక్రీస్తు పుట్టిన ఎనిమిది వందల సంవత్సరాల నాటికీ తెలుగు దేశంలో తొండక్క అనే ఒక గాంధర్వ విద్యావిశారద ఉండేది. ఈమె అప్సరసలాంటిది ఈమె కొడుకు మల్లప్ప. గానంలో ఆనరతుబురుడు. ఇతని కూతురు చెల్లవ్వ. సమస్తగాంధర్వ విద్యావిశారద ఆత్రిలిగ్రామంలో పెయ్యిపోక చెట్లున్న భూమిని ఏభై పుట్లువండే పొలమూ నివేశం స్థలమూ ఈమెకు చాళుక్య భీముడు దానమిచ్చాడు. ఈ రాజు పాలించిన కాలం (క్రి.శ. 888-918)లో తెలుగు గాంధర్వ విద్య రాణించిన శాసనాలే చెప్తున్నాయి.

పాల్కురికి సోమనాథుడు తన కాలంలో ప్రచారంలో వున్న

ఎన్నో పాటలను ఒక పట్టిక లాగా చెప్పుకుపోయాడు. ఈయన పాటలన్నీ అన్నమయ్య తన సంకీర్తనలలో రాయనే రాశాడు. అన్నమయ్య పాడిన తెలుగు పాటల వరసలు కనీసం రెండు నేటికీ తెలుగు ఆడబడచుల నోట సజీవంగా వున్నాయి. ఒకటి "చందమామ రావె!" రెండోది "జో అచ్యుతానంద" అన్నమయ్య శృంగార సంకీర్తనలనే ఒజ్జ బంతులుగా తీసుకొని క్షేత్రయ్య ఎన్నో పదాలను రచించాడు వీటిని పాడే విధానం వీటిని ఆరే పద్ధతి ఇంకా ఉత్తరాంధ్రంలో బతికే ఉన్నాయి సారంగపాణి భక్తి శృంగార, వైరాగ్య పదాలు కూడా జీవిస్తూనే ఉన్నాయి ఉపేక్షచేస్తే ఇవన్నీ ఒక రెండు తరాలలో నశించవచ్చు.

## అకాడమీ విధి

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సంగీత అకాడమీని ప్రత్యేకంగా రూపొందించింది ఈ సంస్థ కేవలం కచేరీ బాణీని మాత్రమే కొనసాగించక సంప్రదాయ సిద్ధమైన తెలుగు సంగీతాన్ని భద్రపరుస్తుందని. ప్రచారం చేస్తుందనీ ఆశించాలి అది దాని విధి ఆదిభట్ల నారాయణదాసుగారు తెలుగు పాటలను కొందరు తమిళులు వెలివేసినప్పుడు కోపంతో "దెబ్బకు దెబ్బ" అంటూ 1942 లో ఇలా అన్నారు :

తెలుగు కీర్తని యరవల వెలియొనర్ప
వలయు నన్నిటన్ సిగ్గున్న తెలుగువారు
అద్దె ఇచ్చి యేడ్పించెదు-అరవ కొయ్య
త్రిప్పుదేజ్ పాటకు తెటతెమగు విజేదు ;
దాటితివి నీ వరవల కుక్క నోటిచోను
లగమ "కోరెనా" గాంబిజ్ కాల్వవిక
ఉండు మాయింట నీయడుతొ త్తవలయు
చెలగి నేదెల్లి మా తెలగువల కల్లి

దాసుగారిది ఒకనాటి ఉగ్రరూపం. వ్యంగ్య కోపం మనకా ఆవేశం అక్కర్లేదు "తన గీతపరవ జాతిని పాటకులనుగా దిద్ది వర్ధిల్లిన తెలుగువాడి" అని రాయప్రోలు సుబ్బారావు గారిలాగ కూడా మనం పొంగిపోకూడదు. మనగీతవి ఇన్నాళ్లూ తమ వైదుష్యంతో, పవిత్ర పూజాభావంతో సంప్రదాయ సంరక్షణదీక్షతో నిలబెట్టినందుకు తమిళులకు వినమ్రంగా కృతజ్ఞతలు చెప్పుకొంటూ తెలుగు సంగీత సంప్రదాయాన్ని మన యింటికి మనం తెచ్చుకోవాలి.

శ్యామశాస్త్రులవారినే గజగజ లాడించిన "భూలోకచాపచుట్టి" బొబ్బిలి కేశవయ్యగారి అసామాన్య పాండిత్యం మళ్ళీ ప్రభవించాలి. త్యాగరాజస్వామి గారితోనె విద్యా గోష్ఠి నలిపిన వీణ పెదగురవాచార్యులవారి సరస విద్వత్తు మళ్ళా వికసించాలి అలనాటి బొబ్బిలి విజయనగరం. పిఠాపురం మాడుగుల మొదలైన సంస్థానాలలోని దిగ్గంతుల వారసుల వంటి ప్రతిభావంతులు కార్యదీక్షను పూనాలి హరినాగభూషణంగారి గరిమ. పారుపల్లివారి ప్రజ్ఞా పాటవాలూ సుసర్లవారి ప్రశస్తి మళ్ళా మనలను ఆవహించాలి మనకు విద్వాంసుల కొరత లేదు.

డాక్టర్ బాలమురళీకృష్ణ ఈ మవిశంకర శాస్త్రిగారు. చిరంజీవి చిట్టిబాబు. ఓలేటి నూకల. నేదునూరి సౌభాగ్యవతి శ్రీరంగం గోపాలరత్నం మొదలైన ప్రథమ శ్రేణి విద్వాంసులంతా తెలుగు కచేరీ బాణీకి కొత్త రూపురేఖలు కల్పించవలసిన అవసరం ఎంతైనావుంది ఇంకెన్నాళ్ళు ఇమిటేషన్లు ?

* —— *

# తమిళ ఇశై — చెట్టినాడు సేవై

ఏనాడీ అంటూ మనకో ప్రత్యేక రాష్ట్రం లేనప్పుడు దాని కోసం మనం కలలుకన్నాం. కలిసికట్టుగా ఉద్యమం నడిపాం. "ఆంధ్రప్రశస్తి"ని తలచుకొన్నాం. "ఆంధ్ర పౌరుషా"న్ని కీర్తించాం. "రాష్ట్రగానా"న్ని ఆలపించాం. ఆత్మస్తుతి ఆ రోజుల్లో పరనింద దరిదాపులలోనికి కూడా వెళ్ళింది.

"చావలేదు! చావలేదు ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్ర, హృదయములు ఛీల్చి చదువుడో సదయులార!" అని ఉద్బోధించిన రాయప్రోలు సుబ్బారావుగారు ఈ సీ పద్యానికి ఇలాగ ఎత్తుగడ చేశారు.

"తన గీత అరవ జాతిని పాటకులనుగా
దిద్దివర్ధిల్లిన తెలుగువాణి"

ఇది సత్యమే. మనకు గర్వకారణమే. అయితే మనగీతి మటు మాయం కాకుండా తరతరాలుగా సంరక్షిస్తూ వచ్చిన అరవ గాయకులకు మనం చాలా ఋణపడి వున్నాం. వాళ్ళకు కృతజ్ఞతాభివందనాలు చెప్పవలసిన అవసరం ఎంతైనా వుంది.

"నేను ఆంధ్రుణ్ణి నా భాష తెలుగు భాష" అని మనం చెప్పుకొన్నప్పుడు ఉత్తర భారతంలో మనకు ఉప్పూ పత్రిలేని రోజుల్లో దక్షిణాదిని మాత్రం సంగీత సామ్రాజ్యరంగాలను తెలుగు భాషే ఏలుతూ వుండేది. సంప్రదాయాన్ని సంరక్షించుకొనదలచిన తమిళగాయకులంతా తెలుగు పాటలే సంగీత సభలలో, నాట్య ప్రదర్శనలలో వినియోగించే వారు.

శతాబ్దాల తరబడిచోళ, పాండ్యన, కుండీర మండలాలలో నాయక

రాజుల పాలన కొనసాగినప్పుడు తెలుగు సామ్రాజ్యాధికారం సాంస్కృతిక రంగాలలో కూడా విస్తరించింది. ఏ భాషకు చెందినవారైనాసరే వాగ్గేయ కారులు తెలుగులోనే ఎక్కువగా మక్కువపడి రచనలు చేసేవారు. వారి శిష్యపరంపర ఆ పాటలనే గానం చేసేవారు. సామ్రాజ్యం నమసిపోయినా సంప్రదాయం మిగిలిపోయింది. తెల్లవాళ్ళు వచ్చాక చిన్న రాజ్యాలు కూడా చితికిపోయాయి.

## చె ట్టి యా ర్లు

సంగీత విద్వాంసులను స్వదేశ సంస్థానాధిపతులూ, మహారాజులూ, జమిందారులూ, ఆగర్భ శ్రీమంతులూ పోషించే వారు. ఈ సంపన్నులు ఏర్పరిచే సంగీత సభల్లో సామాన్య రసికులకు ప్రవేశం వుండేదికాదు. ఐశ్వర్యం, అంతస్తూ గల ఉన్నత కుటుంబాలవారు వైభవోపేతంగా జరిపించే వివాహ మహోత్సవాలలో కూడా విధిగా పాట కచేరీలు వుండేవి. ఇవి కూడా ఆహ్వానితులకూ, ఆయినవాళ్ళకు మాత్రమే పరిమితం. వివిధ సంపన్న కులాలవారు సంగీత పోషణ వాషికంగా చేసేవారు. వీరిలో నాట్టు కోట్టై చెట్టియార్లు చెప్పుకోదగ్గవాళ్ళు.

తమిళనాడులోని మధుర మండలంలోని శివగంగ సీమలోని తిరుప్పత్తూరు-దేవకోట డివిజన్లలో నాటుకోట చెట్టియార్లకు ఉనికిపట్టువుంది. ఈ సెట్లు అనాదిగా వడ్డీ వ్యాపారస్తులు స్వదేశంలోనే కాక విదేశాల్లో కూడా విస్తరించారు. బర్మా, సింహళం, సైగాన్, మారిషస్, దక్షిణాఫ్రికా మొదలైన చోట్లలో వీళ్ళ వ్యాపారం సాగుతూవుంది. వృత్తిరీత్యా చాలా నిర్దాక్షిణ్యంగా వడ్డీని వసూలు చేస్తారు. లాభాలను కూడా వడ్డీ

కిచ్చి లాభాలపై లాభాలు ఆర్జిస్తారు. అయితే ఆర్జనలో ఒక నిర్ణీతమైన శాతాన్ని ధర్మకార్యాలకోసం కేటాయిస్తారు. దీన్ని "మగమై" అంటారు. అత్యల్ప శాతాన్ని కేటాయించినా అదే లక్షల స్థానంలో నిధులను పోగు చేస్తుంది.

నాటుకోట చెట్టియార్లు శైవులు. అందుచేత శివాలయాలకు దానాలు చేస్తారు. పడిపోయిన గుళ్లు బాగు చేయిస్తారు. అన్న సత్రాలు, వసతి సత్రాలు నెలకొల్పుతారు. వఖ వైద్యశాలలు ఏర్పాటు చేస్తారు. వేద విద్యాలయాలు, శాస్త్ర పాఠశాలలు సంస్థాపించి నడిపిస్తారు. సిలోన్, బర్మా, సింగపూర్ వంటి ప్రదేశాలలో సుబ్రహ్మణ్యస్వామి దేవాలయాలను నిర్మింపచేసి నిత్యపూజలు జరిగేటట్టు చూస్తారు. "కురుగళ్" అనే పురోహిత వర్గానికి విద్యా సౌకర్యాలను చూస్తారు.

నాటుకోట చెట్టియార్ల ఉనికిపట్టయిన చెట్టినాడులో అత్యంత ప్రముఖ వ్యక్తి అణ్ణామలై చెట్టిగారు. బ్రిటిష్ ప్రభుత్వం ఆయనకు "రాజా" అనే హోదాను గుర్తించి గౌరవించింది. సర్ బిరుదాన్ని ఇచ్చి సత్కరించింది.

ఈ ఉదారస్వభావుడు అపారమైన విద్యాదానాన్ని చేశాడు. తన కుల పెద్దలు పూర్వం మధుర, తిరువణ్ణామలై, చిదంబరం వంటి శైవ క్షేత్రాలలో దానధర్మాలు, దైవకార్యాలు చేస్తే ఈయన చిదంబరం దగ్గర తన పేరిట అణ్ణామలై విశ్వవిద్యాలయాన్ని సంస్థాపించాడు. ఆ విద్యా సంస్థగల ప్రదేశంలో అణ్ణామలై నగరాన్ని నిర్మింప చేశాడు. (భాషా శాస్త్రంపైన, ముఖ్యంగా ద్రావిడ భాషల మీద పరిశోధనలు చేయించి ప్రామాణిక గ్రంథాలను ఈ విశ్వవిద్యాలయం నేటికీ ప్రచురిస్తూనే వుంది.)

అణ్ణామలై చెట్టిగారికి శాస్త్రీయ కర్ణాటక సంగీతం పట్ల చాలా అభిమానం వుంది. త్యాగరాజస్వామిని మించగల వాగ్గేయ కారులు జన్మించలేరని వారి ఉద్దేశం. ఆ ధాతు కల్పనాదక్షుని దరిదాపులకు కూడా ఏ కొద్దిమంది మాత్రమే రాగలరని కూడా విశ్వసించేవారు. శాస్త్రీయ సంగీతం గురించి ఎంతశ్రద్ధవున్నా ఆనాటి పాట కచేరీలలో వర్ణాలు, కృతులు, పదాలు, జావళీలు తిల్లానాలు అన్నీ తెలుగులో. జాస్తిగా సంస్కృతంలో మస్తుగా వుండేవి. తమిళనాడులో తమిళ గాయకులు పాడే పాటలలో అరవ పాటలు లేనందుకు ఆయన చాలా నొచ్చుకొన్నారు.

తమిళ భాష చాలా ప్రాచీన భాషల్లో ఒకటి. ఈ సంస్కృతి ఎంతో గొప్ప సంస్కృతి. సంగం సాహిత్యంలో ముత్త మిళప్రశంసవుంది. ఇయల్ (సాహిత్యం). ఇశై (సంగీతం). నాదగం (నాటకం). అనే మూడు పేరులు కలిపిన తమిళాన్ని ముత్తమిళ అంటారు.

కడు ప్రాచీనమైన తమిళ ఇశై ఎమైపోయింది? కొద్దిపాటి ప్రవేశ రుసుం చెల్లించి సంగీత సభలకు వెళ్ళే సామాన్య తమిళ రసికుడు ఆ కచేరీలోని తెలుగు సాహిత్యాన్ని ఎంతవరకు అర్థం చేసుకొని ఆస్వాదిస్తున్నాడు, తన భాషలోనే ఆ సాహిత్యముంటే రసాస్వాదన ఎంత ఇనుమడిస్తుంది. ఈ ప్రశ్నలు అణ్ణామలై చెట్టిగారిని ఆలోచింప చేశాయి.

### తమిళ సంగీత ఉద్యమం

అంతకు ముందే జాతీయ సమైక్యతను ప్రబోధిస్తూ మహాకవి

సుబ్రహ్మణ్యభారతి సింధునది కెరటాల వెన్నెల వెలుగులో చేరదేశపు యువతులతో కలసి "సుందర తెలుంగు"లో పాటపాడుతూ నౌకా విహారం చేద్దామన్న "తమిళఇశై" అవసరం గురించి బీజాలు నాటారు. "రసిక శిఖామణి" బిరుదాంకితుడైన టి. కె. చిదంబరనాథ మొదలియార్‌గారు (టి. కె. సి.) ఈ పల్లవిని అందుకొన్నారు. అణ్ణామలై చెట్టిగారు తాము స్థాపించిన విశ్వవిద్యాలయంలో 1941లో తొలిసారిగా ఒక సదస్సును ఏర్పాటు చేశారు. ఇందులో చాలా తీర్మానాలను ఆమోదించారు. "తమిళ గాయకులు తమిళ పాటలచే పాడాలి· కచేరి ప్రారంభంలో, అంతంలో తమిళ ఇశై వుండి తీరాలి. సంగీత సభలను ఏర్పాటుచేసే కార్య కర్తలు తమిళ పాటలు విధిగా వుండాలని పట్టుపట్టాలి" మొదలైన నిబంధ నలను ఆ సదస్సు అంగీకరించింది.

అప్పుడప్పుడే వివిధ నగరాలలో సంగీత సభలు కాళ్ళు నిల దొక్కుకుంటున్నాయి. (మొట్టమొదటి సంగీత సభ క్రీ.శ. 1895లో సంస్థాపించారు.) చెన్నపట్టణంలో డిసెంబర్ మాసం సంగీత మాశంగా స్థిరపడింది. సంగీత సభలు సంప్రదాయ సంరక్షణకు కంకణం కట్టు కొన్నాయి. చిదంబరం సదస్సు తమిళపాటల ప్రచారాన్ని ప్రబోధించే సరికి నాతములకు గంగవెర్రులు చెంగలించాయి హిందూపత్రిక సంపాద కీయం వ్రాసింది. వాదోపవాదాలు చెలరేగాయి.

"నాదమయమైన సంగీతానికి భాషేమిటి ?

మీరు తమిళఇశై, తమిళఇశై అంటున్నారుగానీ కచేరీలలో

పిల్లవగ్రోవి తమిళనాదులు పలుకుతుందా? ఫిడేలు తమిళనదులు చేస్తుందా. మద్దెల తమిళ చప్పుళ్ళను వినిపిస్తుందా?....అంటూ సనాతనులు ఎద్దేవా చేశారు.

ముడికొండన్ వెంకట్రామయ్యర్ ఉత్తమోత్తమమైన సంగీతం దాని ఉన్నతదశలో సాహిత్య సహాయాన్ని అర్థించదన్నారు. టి. టి. కృష్ణమాచారిగారు "నాదంలోని ఆనందాన్వేషణలో సంగీతం భాషా శబ్దరహితం" అన్నారు. మద్రాసు మ్యూజిక్ అకాడమీ వారు కలికనిట్టుగా కూర్చొని విరోధించదలిచారు.

కేవలంస్వస్థాన వేష భాషల పట్లవున్న ప్రేమతో తమిళ సంగీత ఉద్యమాన్ని ప్రారంభిస్తే దీనికి రాజకీయపు రంగులను కూడా పులిమారు. దీనికి కారణం లేకపోలేదు. రాజా అణ్ణామలై చెట్టిగారి జ్యేష్ఠ కుమారుడు ముత్తయ్య చెట్టిగారు జస్టిస్ పార్టీకి చైర్మన్. శాసన సభలో ఆ పార్టీకి చైర్మన్. శాసన సభలో ఆ పార్టీ చీఫ్‌విప్. జస్టిస్‌పార్టీ బ్రాహ్మణేతరుల ఉద్యమం నుంచి ఉద్భవించింది. అందుచేత తమిళఇశైవాదం ఆ పార్టీ వినాదమని అపోహపడడానికీ ఆస్కారం లేకపోలేదు.. అయితే రాజాజీ వంటి కాంగ్రెసువాదులు కూడా తమిళఇశైను దీవించి ప్రోత్సహించారు.

సంగీత కళానిధి ద్వారంవెంకటస్వామి నాయుడుగారు సంగీతంలో సాహిత్యానికి స్థానంలేకన్న వాదాన్ని అసందర్భం అన్నారు. భాషకు

ప్రాముఖ్యం లేకపోతే కృతులలో మాటలు ఎందుకని మ్యూజిక్ అకాడమీ వేదిక మీద నుంచే ప్రశ్నించారు. ఎవరి మాతృభాషలో వాళ్ళు పాటలు విన్నప్పుడే రసానుభూతి ఇతోధికం అవుతుందన్నారు.

## తమిళ్ ఇశై సంఘం

ఆర్. కృష్ణమూర్తి ("కల్కి" సంపాదకుడు). ఎం.ఎస్. సుబ్బు లక్ష్మి. తమిళ సాహిత్య పితామహుడు డాక్టర్ యు.వి. స్వామినాథ అయ్యర్. ఆర్. కె. షణ్ముగ చెట్టియార్ వంటి వాళ్ళు ఈ ఉద్యమానికి చేయూత నిచ్చారు. 1943లో "తమిళ్ ఇశై సంఘం" ఏర్పడింది. దాని కోసం అణ్ణామలై చెట్టిగారు నిధులను కేటాయించారు. వారి కుమారుడు ముత్తయ్య చెట్టిగారు ఆనంతరం మొన్న కాలం చేసేదాకా ఉపాధ్యక్షునిగా వున్నారు.

గతమెంతో ఘనకీర్తి కలవాళ్ళయినా తమిళులు తమిళ ఇశై సంఘాన్ని ప్రారంభించాక చాలా సమస్యలను ఎదుర్కొన్నారు. తమిళ వాగ్గేయకారులు చాలా తక్కువ సంఖ్యలో వుండేవారు. వారి రచనలు కచేరీలకు అనువుగావుండేవికావు. అయినా పట్టుదలతో పాపనాశనం శివన్, టి. లక్ష్మణ పిళ్ళై, టి.ఆర్. విశ్వనాథశాస్త్రి, నీలకంఠ, శివన్, ఘనం కృష్ణయ్యర్ వంటి వాగ్గేయ కారులు తమిళ కృతులను రచించారు. "తమిళ్ ఇశై సంఘం" ప్రాచీన తమిళ సంగీతం గురించి పరిశోధనలు చేయించింది.

తమిళనాడులోని శివాలయాలలో "ఒడువార్లు" కేవారంగీతాలను

ఆలపిస్తూవుంటారు. వైష్ణవాలయాలలో ఆళ్వారుల పాసురాలను పఠిస్తూ వుంటారు. కొన్ని వైష్ణవాలయాలలో "అరైయార్" అనే పేరుగల అర్చకులు పాసురాలను పాడుతూ అభినయిస్తూ వుంటారు.

ఈ ప్రాచీన గాన పద్ధతులన్నింటిమీదా తమిళఇశై సంఘం పరిశోధనలు చేయించింది. వివిధ రంగాలలో విఖ్యాతులైన నిపుణులు ఎన్నో నిరూపణ వ్యాసాలను రాసి సమర్పించేవాడు, సలభై సంవత్సరాలుగా ఏటేటా వారు పదిరోజులపాటు తమిళ ఇశైసంఘం సంగీత సభలు జరుపుతూ, గ్రంథాలు ప్రచురిస్తూ విద్వాంసులను సత్కరిస్తూ తమిళ సంగీతానికి పాటిలేని "సేవై" చేస్తూ వస్తూంది.

రాజా అణ్ణామలై చెట్టిగారు పోయాక వారి పెద్దకొడుకు ముత్తయ్య చెట్టిగారు తమ ఇతర వృత్తి వ్యాపకాలతోపాటు తమిళ ఇశైను కంటికి రెప్పలాగ చూసుకొన్నారు. ఈయన ఈ నెల పన్నెండో తేదీనాడు కాలం చేశారు. బిరుదులతోపాటు ఈయన పేరు "పద్మభూషణ్ డాక్టర్ రాజా సర్ యం. ఎ. ముత్తయ్య చెట్టియార్ ఆఫ్ చెట్టినాడ్, నైట్ బేచిలర్, డి. లిట్. యం.యల్.సి. (1905-1984)" అర్ధశతాబ్దానికి పైగా ఈయనా వీరి కుటుంబ సభ్యులూ, ఒకవైపు పరిశ్రమలను సంరక్షిస్తూ ప్రజాహిత కార్యాలను చేపట్టారు.

తమిళనాడులో "తమిళ ఇశై" శతాబ్దాల తర్వాత మళ్ళా వివరించి తన పురాతన వైభవాన్ని సంతరించుకొన్నదంటే దానికి చెట్టినాడువారి సేవలే ముఖ్య కారణం. తమిళ ఇశై సంఘంతో పాడని తమిళ గాయనీ గాయకులుగానీ, ప్రదర్శన ఇవ్వని నర్తకీ నర్తకులుగాని ఎవరైనా వుంటే

వాళ్ళు పేరు ప్రఖ్యాతులు లేనివాళ్ళైనని చెప్పాలి. ఆదిలో అలియకుడి రామానుజ అయ్యంగార్ పట్టుదలకోసం తన షరతుల ప్రకారమే తమిళ ఇశ్తై సంఘంలో పాడుతానని అంగీకరించి తన కచేరీని : తెలుగు వర్ణంలో పెంకితనానికి ప్రారంభించినా తర్వాత అందరూ తమిళపాటలే పాడి వాటికి శాస్త్రీయతను సంతరింపచేశారు: మాతృభాషను గౌరవించేవారే మరోభాష ఘనతను అవగాహన చేసుకోగలరు. ఇవాళ తమిళ యువ గాయక లోకం తెలుగు ఉచ్చారణకూడా స్వచ్ఛంగా అప్పుడప్పుడు వినబడుతుంది.

ఇది చెట్టినాడు చలువ ?

* — *

# స్వాతి తిరునాళ్: ఖ్యాతి, అపఖ్యాతి

ఇటీవల దాక్షిణాత్య సంగీత ప్రపంచంలో ఒక వివాదం పెద్ద గాలి దుమారాన్ని రేపుతూంది. తిరువనంతపురం సంస్థానాన్ని పాలించిన స్వాతి తిరునాళ్ (1829-47) మహారాజా గొప్ప వాగ్గేయకారుడు బహు భాషావిశారదుడు. కర్ణాటక సంగీతంలో త్రిమూర్తులుగా త్యాగరాజు (1768—1847) ముద్దుస్వామి దీక్షితులు (1776-1835) శ్యామాశాస్త్రులు (1762-1827) ప్రసిద్ధి కెక్కారు.

స్వాతి తిరునాళ్ మహారాజా కొద్దిగా చిన్నవాడైనా వీరికి సమకాలికుడు. దాక్షిణాత్య సంగీత చరిత్రకారులు సంగీతమూర్తి త్రయం సరసన స్వాతి తిరునాళ్ మహారాజాని విలిపి గౌరవిస్తున్నారు. కొన్నేళ్ళ క్రిందట మద్రాసు మ్యూజిక్ అకాడమీలో సంగీత త్రిమూర్తుల చిత్రపటాల సరసన స్వాతి తిరునాళ్ చిత్రపటాన్ని పెట్టి ఆవిష్కరించారు. స్వాతి తిరునాళ్ మహారాజాకు ఆ అర్హత లేదని ఇటీవల కొందరు వాదిస్తున్నారు.

## ఎవరి కృతులు?

నిజానికి స్వాతి తిరునాళ్ రచించిన కొన్ని సంగీత కృతులు ఆయన రచనలు కావనీ ఆయన కొలువులో వున్న తంజావూరు సోదర చతుష్టయమైన పొన్నయ్య, చిన్నయ్య, వడివేలు, శివానందం విరచించిన కృతులనే పుకారు కొన్నాళ్ళ క్రిందట పుట్టింది. ఈ పుకారు వికార్పయిన ఆరోపణగా రూపొందింది. ఈ ఆరోపణను నిరూపించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఈ వివాదానికి మూలకారకుడు ఇంకెవరో కాదు. తంజావూరు

సోదర చతుష్టయం వంశంలోనివాడే. నేటి దాక్షిణాత్య సంగీత ప్రపంచంలో పేరుపొందిన విద్వాంసుడే. తంజావూరు సోదర చతుష్టయంలోని ఒకని పేరింటవాడు శివానందం. ఈయన తన పూర్వీకుల వ్రాతప్రతులిపల్ల స్వాతి తిరునాళ్ రచనలుగా చలామణి అవుతున్నవి నిజంగా తంజావూరు అన్నదమ్ముల రచనలని ప్రకటించాడు. "ఆ వ్రాతప్రతులను నేను కళ్ళారా చూశాను. ఆ రచనలు స్వాతి తిరునాళ్ కృతులు కావు. తంజావూరు సోదరుల రచనలే" అని వీణ విద్వాంసుడు శ్రీ ఎస్. బాలచందర్ కిందటి నెల 17 వ తేదీనాడు ఒక పత్రికా ప్రకటన చేశారు. (ఇండియన్ ఎక్స్ప్రెస్ 18-1-83 మద్రాసు ఎడిషన్) దీనిని ఖండిస్తూ తిరువానూరు శ్రీ స్వాతి తిరునాల్ సంగీత సభ ఉపాధ్యక్షుడు శ్రీ ఎన్. వెంకట సుబ్రహ్మణ్య అయ్యర్ ఒక ప్రతి ప్రకటన చేశారు. (ఇండియన్ ఎక్స్ప్రెస్ జూలై 6 వ తేదీ మద్రాసు ఎడిషన్.)

ఈ వివాదాన్ని అర్థం చేసుకొనడానికి స్వాతి తిరునాళ్ జీవిత చరిత్రా, తంజావూరు సోదర చతుష్టయం జీవిత చరిత్రలూ ముందుగా కొంచెం తెలుసుకోవలసిన అవసరం వుంది.

## ....: జీవిత చరిత్ర :...

స్వాతి తిరునాళ్ పూర్తి పేరు, బిరుదులతో సహా చెప్పాలంటే "శ్రీ పంకజనాభదాస్, వంచిపాల, రామవర్మ కులశేఖర కిరీటపతి, మహా రాజ రామరాజ బహదూర మన్నె సుల్తాన్, షంషేర్ జంగ్" ఈయన స్వాతి నక్షత్రంలో పుట్టారు. కనుక ఈయన్ను స్వాతి తిరునాళ్ అంటారు. తిరువాన్కూర్ రాజవంశంలోని వ్యక్తులను వాళ్ళ జన్మ నక్షత్రం శుభదినంతో వ్యవహరించుతారు. ఈయనకు ముందు పాలించిన రామవర్మ ధర్మ రాజాను కార్తీక తిరునాళ్ (1758-98) అని పిలిచేవారు. స్వాతి తిరునాళ్ తరువాత ఉత్తరం తిరునాళ్ మార్తాండవర్మ (1847-60) ఆలియం తిరునాళ్ (1860-80) విశాఖం తిరునాళ్ (1880-85), శ్రీ మూలం తిరునాళ్ రామవర్మ (1885-1924) పాలించారు.

తిరువాన్కూరు ప్రాంతాలను కులశేఖర మహీపతులు తొలి నుంచి పాలించారు. అందుచేత రాజవంశాలలో కొందరు రాజుల పేరు చివర 'కులశేఖర' అనే పదబంధం కనపడుతుంది (మన వెలమ జమీం దార్లలో బొబ్బిలి రాజవంశ పురుషులందరూ రంగారావులే. పిఠాపురం వారు రామారావులు, నూజివీడువారు అప్పారావులు, ఈ కుటుంబా లన్నింటికీ కుదురు అయిన వెంకటగిరి రాజవంశీ లందరూ యాచేంద్రులే) పేరునుబట్టి రాజవంశం ఏమిటో చెప్పుకోడానికి వీలుగా స్వాతి తిరునాళ్ మహారాజును 'కులశేఖర పెరుమాళ్' అని కూడా వ్యవహరిస్తారు. నిజానికి ఈ పేరుతోనే ఈయనను ప్రముఖ వాగ్గేయకారునిగా పేర్కొంటూ సుబ్బరామ దీక్షితులవారు తమ సంగీత సంప్రదాయ ప్రదర్శనిలో ఇలా రాశారు:

"ఈ కిరీటపతి తిరువనంతపురం సంస్థానమును పరిపాలించిన మహారాజు. ఈ కేరళ దేశాధిపతి సంస్కృత, ఆంధ్ర, హూణ, కేరళ హిందూస్తానాద్యనేక భాషల నేర్చిన సమర్థులు, సంగీతమందు విశేష

ప్రతిభ గలవారు. అనేక రక్తిరాగ, దేశీయ రాగములలో గేయ కల్పనా చాతుర్యములు విలసిల్లి, సంస్కృత సాహిత్య రూపములైన చౌక వర్ణములు, సంఖ్యలేని కీర్తనములు 'పద్మనాభ' ముద్రతో విరచించిన మహాత్ములు. సంస్కృతమందు చంపు మొదలయిన బహు కావ్యములు రచించియున్నారట. తెలుగున చౌక వర్ణ పదములు చేసియున్నారు. కేరళ భాష యందును బహుకృతులు జేసియున్నారు. ఈ పద్మనాభ దాసులు శ్రీ పద్మనాభ పాదారవిందైక్యమయి రమారమి యేబది యేండ్లగుచున్నది [సంగీత సంప్రదాయ ప్రదర్శిని-1వ భాగం పుట 31- ప్రథమ ముద్రణ కాలం 1904]

సుబ్బరామ దీక్షితులు (1839-1906, సంగీత త్రిమూర్తులలో ఒక రయిన ముద్దుస్వామి దీక్షితుల వారి వంశంలోనివారు వరుసకు ఒక రకంగా మనుమలు. మరొక రకంగా కుమారులు. ముద్దు స్వామి దీక్షితులవారి కడగొట్టు తమ్ముడు బాలస్వామి దీక్షితులు [1786-1858] తమ కుమార్తె కుమారుడైన సుబ్బరామ దీక్షితుల వారిని దత్తత చేసుకొన్నారు. ముద్దు స్వామి దీక్షితుల వారికి గాని, బాలస్వామి దీక్షితులవారికి గానీ పుత్ర సంతానం లేదు. అందుచేత ఈ వంశానికీ దాని గాన సంప్రదాయానికీ సుబ్బరామ దీక్షితులవారే ఏకైక వారసులు.

స్వాతి తిరునాళ్ మహారాజుకు సుబ్బరామ దీక్షితులవారు సమీప కాలం వారైనా తంజావూరు సోదర చతుష్టయానికి మాత్రం సమ కాలికులు. ఈ సోదరులలో యిద్దరు సాక్షాత్తూ ముద్దుస్వామి దీక్షితులవారి ప్రత్యక్ష శిష్యులు ఇతర శిష్యుల పేర్లను చెప్తూ "భరత శ్రేష్ఠుడైన తంజ పురి పొన్నయ్య, వడి వేలు" తమ తాతగారి శిష్యులని సుబ్బరామ దీక్షి తుల వారు రాశారు. (సం. సం ప్ర-1-పుట-28).

పొన్నయ్యను భరత శ్రేష్ఠుడని పేర్కొనడం గమనించదగ్గ విషయం, నిజానికి తంజావూరు సోదర చతుష్టయం నట్టువ దిట్టలు. ఈనాడు ఏ రంగస్థలం మీదనైనా జరిగే భరత నాట్య ప్రదర్శన కార్య

క్రమంలోని అంశాల క్రమానికి ఈ సోదరులే ఆనాడు ఒరవడి పెట్టారు. నాటి నుంచి నేటి దాకా భరత నాట్య ప్రదర్శకులందరూ తూచా తప్పకుండా ఆ క్రమాన్నే పాటిస్తున్నారు.

## ...: భ ర త నా ట్యం :....

ప్రస్తుత భరత నాట్య ప్రదర్శనలు మేళ ప్రాప్తి లేక అలరింపుతో ప్రారంభమవుతుంది. తరువాత జతిస్వరం, శబ్దం, వర్ణం, పదం, జావళి తిల్లానాలతో పూర్తవుతుంది. నర్తకుడు గాని నర్తకి గాని తన వైదుష్యాన్ని ప్రదర్శించడానికి వర్ణం చాలా పనికివస్తుంది. వర్ణాలు మూడు రకాలు, పద వర్ణం, తాన వర్ణం, చౌక వర్ణమని వాటిని పిలుస్తారు. తాన వర్ణం నాట్యానికంత ఉపయోగపడదు. పద వర్ణంలో పల్లవీ అను పల్లవీ చరణాలు వుంటాయి. ప్రతి వర్ణానికి పూర్వాంగం, ఉత్తరాంగం అని రెండు అంగాలుంటాయి. పూర్వాంగంలో పల్లవీ, అనుపల్లవీ ముక్తాయి స్వరాలు వుంటాయి. ఉత్తరాంగంలో చరణం ఎత్తుగడ స్వరాలు వుంటాయి. చౌక వర్ణాన్ని పెద్ద వర్ణమంటారు. ఇది పదవర్ణంకన్నా విలంబిత కాలంలో నడుస్తుంది.

స్వాతి తిరునాళ్ మహారాజు 18 పద వర్ణాలను రచించారు. వీటిలో నాలుగు తెలుగు భాషలో వున్నాయి. మిగతావి సంస్కృతంలో వున్నాయి. స్వాతి తిరునాళ్ పద వర్ణాలలో స్వరాక్షరాలూ, ముద్రాలంకారాలు తరచుగా వుంటాయి. ముద్రాలంకారం అంటే రాగం, మేళ-సాహిత్యంలో ప్రత్యక్షంగానో గోప్యంగానో వుంటుంది. ఉదాహరణకు స్వాతి తిరునాళ్ రచించిన "సాదువిచట" అనేది భూపాల రాగంలో వుంది. సాహిత్యంలో "భూపాల కనికర" అనే ప్రయోగం వల్ల రాగం పేరు తెలుస్తుంది. ఇది ప్రత్యక్ష ముద్రాలంకారం. "పాన్నామరుష" అనే వర్ణంలో 'తేమఖమాజనయ' అనే ప్రయోగం కనబడుతుంది ఇందులో "ఖమాజ" అనే రాగం పేరు గుప్తంగా వుంటుంది.

## ...: ఆ స్థా న వి ద్వాం సు లు :...

స్వాతి తిరునాళ్ ఆస్థానంలో చాలామంది విద్వాంసులు ఉండే వారు. ఔత్తరాహ, దాక్షిణాత్య సంగీతాల మేలు కలయికను ఆ మహా రాజు ఆకాంక్షించాడు పాశ్చాత్యవాద్యమైన ఫిడేలుపై కర్ణాటక సంగీతాన్ని పలికించే ప్రజ్ఞ చూపడం అప్పుడప్పుడే మొదలైంది. తంజావూరు సోదర చతుష్టయంలోని వడి వేలు ఫిడేలు వాద్యంలో అందె వేసిన చెయ్యి స్వాతి తిరునాళ్ ఆ విద్వాంసుణ్ణి తన ఆస్థానానికి రప్పించు కున్నాడు.

ఆ రోజుల్లో మునసబుకు నెలకు ముప్ఫయి రూపాయలు, తహ సీల్దారుకు నెలకు నలభై రూపాయలు జీతాలు ఇచ్చేవారు వడివేలుకు మహారాజా నెలకు నూటపది రూపాయల జీతం మంజూరు చేశారంటే ఆ విద్వాంసుని విద్య పట్ల స్వాతి తిరునాళ్‌కు ఆదరణ ఎంతో తెలుస్తుంది. 1834లో వడి వేలు కోసం ప్రత్యేకంగా దంతంతో ఫిడేలును మహారాజా చేయించి బహూకరించాడు. ఫిడేలుపై పీఠం, అడుగు పీఠం, పక్క చెక్కలు, బిరడాలు, మెడ చివరకు విల్లు యొక్క కర్రా అన్నీ దంతం తోనే చేయించాడు. ఈ ఫిడేలు మీద రాజలాంఛనం ఉంది. ఇప్పటికీ ఈ ఫిడేలు తంజావూరు సోదర చతుష్టం వారి వంశస్తుల ఇంట్లో వుంది.

ఒక్క ఫిడేలు వాద్యంలోనే కాక నట్టువాంగంలో కూడా వడి వేలు దిట్ట. అందువల్ల పద వర్ణ రచనలో ముక్తాయి స్వరాల కల్పన లోను, ఎత్తుగడ స్వరాల కల్పనలోనూ వడివేలు మహారాజాకు సలహాలు ఇచ్చి సహాయపడి ఉంటాడు. ఇది దాక్షిణాత్య సంగీత చరిత్రకారు లందరూ ఒప్పుకొన్న విషయమే. ఇప్పుడు స్వాతి తిరునాళ్ పదవర్ణ రచనలన్నీ వడి వేలు కృతులే అని వాదించడం చాలా విడ్డూరమైన విషయం. స్వాతి తిరునాళ్ రచనలు వడివేలు వ్రాతప్రతిలో ఉంటే వుండవచ్చు. అంత మాత్రాన కర్తృత్వం అతనిదే అని చెప్పడానికి వీల్లేదు.

"ది డాన్స్ కాంపోజిషన్స్ ఆఫ్ ది తంజోర్ క్వార్టెట్" అనే పుస్తకాన్ని శివానందం, కిట్టప్పగార్లు సంకలనం చేశారు. ఈ పుస్తకంలోని వివరాలవల్ల తంజావూరును పాలించిన తులజాతీ మహారాజా ఈ సోదర చతుష్టయాన్ని సెంగినర్ కోయిల్ గ్రామంలో కలుసుకుని తన ఆస్థానం లోనికి ఆహ్వానించారు. ఈ సోదర చతుష్టయం తంజావూరును పాలించిన ప్రతాపసింహుని మీద, తులజాజి మీద, అమరసింహుని మీద ఇమ్మడి శరభోజీ మీద, శివాజీ మీద సంగీత రచనలు చేశారని పై పుస్తకం చెప్తుంది. ఈ రాజుల పరిపాలనా సంవత్సరాలను కింద పొందుపరుస్తు న్నాను.

| | |
|---|---|
| ప్రతాపసింహుడు | 1739-1763 |
| తులజాజీ | 1763/1787 |
| అమరసింహుకు | 1787-1798 |
| శరభోజీ | 1798-1833 |
| శివాజీ | 1833-1855 |

తంజావూరు సోదర చతుష్టయంలోని చిన్నయ్య 1802 లో, పొన్నయ్య 1804లో, శివానందం 1808లో, వడివేలు 1810లో జన్మించా రని పై సంకలన గ్రంథమే చెప్తుంది. 1787లో మరణించిన తులజాజీ 1810లో పుట్టిన వడివేలును, అతని అన్నలనూ తన ఆస్థానానికి ఆహ్వా నించడం అసంభవం అందుచేత పై సంకలన గ్రంథంలోని వివరాలన్నీ చాలా మట్టుకు కట్టు కథలే; తారీఖులలో తప్పిదాలు, తకరారులు పరస్పర వైరుధ్య విషయాలు, వ్యవచ్ఛేదాలు చాలా వున్నాయని డాక్టర్ కుమారి పద్మా సుబ్రహ్మణ్యం తన 'భరతాస్ ఆర్ట్ దెన్ అండ్ నౌ' అనే అధ్యాయంలో సప్రమాణికంగా రుజువు చేసింది. 'హూ సేచి భాగంలో తంజావూరు సోదర చతుష్టయం రచించారని చెప్పబడే స్వరజతి విజాతి

కాశీ నాథయ్య ప్రతాపసింహునిపై చెప్పాడని పద్మా సుబ్రహ్మణ్యం తాళ పత్ర గ్రంథాల సాక్ష్యంతో నిరూపించింది.

దీనివల్ల తేలిన దేమిటంటే తంజావూర్ సోదర చతుష్టయం వ్రాసుకొన్న గ్రంథాలలోని రచనలన్నీ వారి కృతులేకావు. తమ పూర్వీకుల రచనలనూ, ఇతర ప్రాచీన విద్వాంసుల రచనలనూ అత్మార్థం కాపీ చేసుకొని వుంటారు. అలాగే సమకాలికుల రచనలను కొన్నింటిని కూడా నోట్ చేసుకొని వుంటారు.

వడివేలు సమకాలికులెవరూ అతడిని వాగ్గేయకారుడిగా గానీ, ధాతు కల్పనాదక్షుడిగా గాని గుర్తించలేదు. సుబ్బరామ దీక్షితులవారు తమ సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో భరత శ్రేష్ఠుడైన పొన్నయ్య కృతులను నాలుగింటిని తమ గ్రంథంలో ఉదహరించారు. రాగంగరాగం ధునిభిన్న షడ్జము లక్ష్యంగా పొన్నయ్య రచించిన "శ్రీ గురుగుహమూర్తి" అనే కీర్తనను పొందుపరుస్తూ సుబ్బరామ దీక్షితుల వారు ఇలాగ పరిచయ వాక్యం రాశారు "తంజాపురీ సంస్థానమున పరంపరగా వచ్చు నట్టువ యొజ్ఞయును, ముద్దు స్వామి దీక్షితులవారి శిష్యుడును, భరత లక్ష్య లక్షణ ప్రవీణుడును, నృత్యములకు ప్రయోగించునట్టి యనేక స్వరజతులు వర్ణములు జేసి ప్రసిద్ధి నొందిన వాడిగా నుండి పొన్నయ్య చేసిన కీర్తనము" (సం సం. ప్ర మొదటి భాగం-పుట 216) పొన్నయ్య ముద్దుస్వామి దీక్షితులవారి శిష్యుడు, గురువుగారి ముద్ర "గురు గుహ ముద్ర" శిష్యుడు తన రచనలో "గురుగుహ దాస" "గురు గుహ భక్త" అనే ముద్రను వాడుకొంటాడు. (చూ. సం సం ప్ర 1-275 4-367 4-398).

పొన్నయ్య రచనలను నాలుగింటిని తమ గ్రంథంలో పొందు పర్చిన సుబ్బరాయ దీక్షితుల వారు స్వాతి తిరునాళ్ ఆస్థాన విద్వాంసుడైన వడివేలు కృతిని మచ్చుకు ఒకటైనా ఉదహరించలేదంటే అందు

లోని ఇంగితం చెప్పకనే చెప్పినట్టు అనుకోవాలి. [దీక్షితులవారు స్వాతి తిరునాళ్ రచనను ఒక దానిని తమ గ్రంథంలో చేర్చారు. సం. సం ప్ర 3-483]

తంజావూరు సోదర చతుష్టయానికి ఖ్యాతిని పెంచడానికి స్వాతి తిరునాళ్ మహారాజుకు అపఖ్యాతి తెచ్చిపెట్టక్కర్లేదు.



# " సుందర తెలుంగినిల్ పాట్టిశైత్తు . . . "

ఇవాళ డిసెంబరు పన్నెండో తారీఖు. ఇది మహాకవి సుబ్రహ్మణ్య భారతిగారి జన్మ దినం. ఈనాడు ఆయన శత జయంతినాడు ఆయన తమిళ భాషలో రచనలు చేసిన భారతీయ కవి. ప్రాతికేయుడు, రాజ కీయ ప్రవాపి. స్వాతంత్ర్య యోధుడు. ఉగ్రవాది. సర్వమాన సమా నత్వం కాంక్షించిన విశ్వ మానవుడు.

సుబ్రహ్మణ్య భారతిగారికి తెలుగు భాషన్నా, తెలుగు వాళ్ళన్నా చాలా ఇష్టం. అందుకే మన భాషను "సుందర తెలుంగు" అని ఆయన ప్రశంసించారు. ఆయనకు తెలుగు వచ్చు. భారతిగారు పుట్టి పెరిగిన ఎట్టయపురం తమిళ దేశంలోని తిరునల్వేలి జిల్లాలోని ఒక పురమైనా, అది తెలుగుభాషనూ, కర్ణాటక సంగీతాన్ని పోషించిన స్వదేశ సంస్థానం ఎట్టయపురం రాజులు తెలుగు కవిత్రయ భారతాన్ని తమిళంలోనికి అను వాదం చేయించి అచ్చు వేసిన సాహిత్య పోషకులు.

భారతిగారు 1882లో జన్మించారు. అప్పుడు ఎట్టయపురంలో తెలుగు సంగీతం మారు మ్రోగుతూ వుండేది. కర్ణాటక సంగీత త్రయంలో ఒకరైన ముత్తుస్వామి దీక్షితుల వారిని ఈ సంస్థానం సత్కా రించింది. ఆయన అవసానదశ అక్కడే గడిచింది.

ముద్దుస్వామి దీక్షితులవారి సోదరులు చిన్న స్వామి దీక్షితులు అక్కడే నివసించారు. బాలస్వామి దీక్షితుల వారు పిడేలు వాద్యాన్ని భారతీయ సంగీతానికి అనువుగా అనాడే చేశారు. 'సంగీత సంప్రదాయ ప్రదర్శని' అనే ఉద్గ్రంధాన్ని నాలుగు భాషలలో రచించిన సుబ్బరామ దీక్షితుల వారు మహాకవి సుబ్రహ్మణ్య భారతిగారికి సమకాలికులు. తెలుగు సంగీతంలోని మాధుర్యాన్ని అస్వాదించడానికి ఇంతకన్నా వేరే అవకాశం వుండదు.

...: ఉద్యోగానికి రాజీనామా :..

1904లో భారతిగారు తమ ఇరవై మూడో యేట రాచరికపు కొలువుకు రాజీనామా చేసి ఎట్టయపురం వదిలిపెట్టి మద్రాసు చేరుకున్నారు. "స్వదేశమిత్రన్" అనే తమిళ దైనిక పత్రికలో ఉప సంపాదకునిగా చేరారు. ఆనాడు మద్రాసు మన ఉమ్మడి రాజధాని. తెలుగుతనం, తెలుగు సంస్కృతి కలకలలాడుతూ పట్టణంలో కనబడేవి. తెలుగు జమీందార్లందరికి మద్రాసులో బంగ్లాలు వుండేవి. తెలుగు సంస్కృతీ పరులలో చెప్పుకోదగ్గ వాళ్ళంతా చెన్న పట్టణానికి వస్తూపోతూ వుండే వాళ్ళే. తెలుగు విద్యావంతులలో ఎందరో మద్రాసులో, హాస్టళ్ళలో, ఇళ్ళలో వుంటూ చదువు సాగించిన వాళ్ళే. భారతిగారికి చాలా మంది తెలుగు వాళ్ళతో స్నేహంగా వుండేది.

భారతిగారు మద్రాసు ప్రవేశించిన రోజుల్లో చెన్నపట్నం తెలుగు వాళ్ళలో మహోన్నతులు వీరేశలింగంగారు అక్కడే పరశువాకంలో వుంటూ వుండేవారు. అప్పటికే వీరేశలింగంగారు ప్రెశిడెన్సీ కాలేజీలో ఆచార్యత్వం వదలుకొన్నారు. అయినా వారు లింగిచెట్టి వీధిలోని ఒక ఇంట్లో బ్రహ్మసమాజం ప్రార్థనలు జరుపుతూ వుండేవారు. భారతిగారు వీరేశలింగంగారివల్ల చాలా ప్రభావితులయ్యారు. ఉత్తరోత్తరా తాము వ్రాసిన "చంద్రిక కథ" అనే అసంపూర్ణ నవలలో వీరేశలింగంగారిని వాస్తవ పాత్రగా ధర్మపత్నీ సమేతంగా ప్రవేశపెట్టారు. ఈ నవలలో అక్కడక్కడ తెలుగు సంభాషణలను కూడా భారతిగారు రాశారు.

...: గా డి చ ర్ల వా రు :...

కందుకూరి వీరేశలింగంగారంటే ఎంత గౌరవమో గాడిచర్ల హరి సర్వోత్తమరావు గారంటే భారతిగారికి అంత ప్రగాఢమైత్రి. అప్పుడు గాడిచర్లవారు మద్రాసులో ఎమ్.ఏ. చదువుతూ వుండేవారు. అయ్యదేవర కాళేశ్వరరావు, గొల్లపూడి సీతారామశాస్త్రి, భోగరాజు పట్టాభి సీతా రామయ్య మొదలయిన వాళ్ళెందరో కాక, కొమర్రాజు లక్ష్మణరావుగారు

కూడా అప్పుడు చెన్నపట్నంలో విద్యార్థులే. "బెంగాలు విభజన" వ్యతిరే కోద్యమంలో చెన్నపట్నం తెలుగు విద్యార్థులు మెరీనా బీచ్‌లో సభ పెట్టాలని నిశ్చయించారు. అధ్యక్షుడిగా ఒక పెద్ద బుర్రను పెట్టుకుంటే గౌరవం అనుకున్నారు. బయ్యా నరసింహేశ్వరశర్మ, గోవిందరాఘ వయ్యార్, డాక్టర్ నాయర్, జి. ఎ. నటేశన్ మొదలయిన ప్రముఖులలో ఏ ఒక్కరూ అంగీకరించలేదు, పైగా చన్నీళ్ళు చల్లారు.

చివరకు ఒకే ఒక్కరు మిగిలారు. ఆయన "స్వదేశ మిత్రన్" సంపాదకులు జి. సుబ్రహ్మణ్యం అయ్యర్‌గారు. ఈయన గొప్పదేశాభి మాని. సంస్కర్త. కూతురుకు వితంతు వివాహం చేశారు. అందుచేత ఆయనను వెలివేశారు. అయినా, ఆయన చలించలేదు. కొన్నాళ్ళు 'హిందూ' పత్రికకు కూడా సంపాదకులు. వీరిని అధ్యక్షులుగా పెట్టుకోవాలని విద్యార్థులు ఆశించి ముందు భారతిగారిని కలుసుకొని మాటసాయం చేయ మన్నారు. భారతిగారు తప్పకుండా చేస్తానని చెప్పి అయ్యర్‌గారిని ఒప్పిం చారు.

అనుకొన్నట్టుగా మెరీనాబీచ్‌లో సభ జరిగింది. అయిదు వేలమంది ప్రేక్షకులు హాజరయ్యారు. జి. సుబ్రహ్మణ్యం అయ్యర్‌గారు అధ్యక్షులుగా వుండి సభకు నిండుదనం తెచ్చారు. భారతిగారు తమిళంలో "ఒక దేశాభి మాన పూరితమైన, యుద్రేకమైన గీతము"ను పాడారు. గొల్లపూడి సీతా రామశాస్త్రిగారు ఇంగ్లీషులో దేశభక్తి పద్యాలను రాసి చదివారు. అందరూ ఇంగ్లీషులోనే ఉపన్యసించారు. ఆ సభలోనే కార్యాచరణకు పథకం వేశారు.

....: బాల భారత సంఘం :...

మద్రాసులో భారతిగారు "బాలభారత సంఘం" స్థాపించారు. వీరికి యతిరాజులు నాయుడు అనే ఆంధ్రుడు కుడి భుజంగా తోడ్పడ్డారు. తెలుగు జిల్లాలలో బాలభారత సంఘం శాఖలను హరి సర్వోత్తమరావుగారు స్థాపించారు. బిపిన చంద్రపాల్‌గారు దక్షిణ పర్యటనలో కటకం, విజయ నగరం, విశాఖపట్నం, కాకినాడ, రాజమహేంద్రి, బెజవాడ నగరాలలో ఉపన్యసించారు. భారతిగారు బెజవాడకు వచ్చి పాల్‌గారిని మద్రాసు

తీసుకువెళ్ళారు. బెజవాడలో వున్నపుడు ఆంధ్ర నగరాలలో జరిగిన వివరాలన్నింటిని సేకరించి తమ సంపాదకత్వాన వెలువడుతున్న 'ఇండియా' అనే తమిళ పత్రికలో సవిస్తరంగా, సవ్యాఖ్యానంగా ప్రచురించారు.

కాకినాడలో, రాజమండ్రిలో చాలా అల్లర్లు జరిగాయి. హరి సర్వోత్తమరావుగారు ఎమ్. ఏ. పూర్తి చేయకూడదనీ, ట్రెయినింగ్ చదవ కూడదని ప్రభుత్వం నిషేధాజ్ఞలను జారీ చేసింది. ఇతర విద్యార్థులు కూడా తమ చదువులు కొనసాగించడానికి వీలు లేకుండా వాళ్ళను కాలేజిల నుంచి బహిష్కరించింది.

ఈ ఉదంతాలను పేర్కొంటూ 1907 జూలై 22వ తేదీ "ఇండియా" పత్రికలో భారతిగారు చాలా ఘాటుగా రాశారు. "ప్రభుత్వం చేసిన బహిష్కరణల వల్ల ప్రభుత్వ విద్యా విధానాన్నే బహిష్కరించే జాతీయాభిమానం బలపడాలి. స్వదేశీ కాలేజీలను స్థాపించుకునే నిర్ణయం రాజమహేంద్ర ప్రజలకు ఇనుమడించాలి. ఈ స్వదేశీ కాలేజీలకు ప్రభుత్వం గుర్తింపు ఎంత మాత్రం అక్కరలేదు" అని భారతిగారు స్పష్టంగా చాటారు. ఆనాటి 'ఇండియా' పత్రికలు తిరగవేస్తే తెలుగు దేశపు సంఘటనల గురించి, తెలుగువారి గురించి భారతిగారు రాసిన విషయాలు చాలా దొరుకుతాయి.

భారతిగారికి తెలుగు వాళ్ళంటే ఎంత స్నేహమో తెలుగువారికి ఆయన మీద అంత అభిమానం వుంది. గద్దె రంగయ్య నాయుడుగారు మద్రాసు కార్పోరేషన్‌లో వున్నప్పుడు భారతిగారి పాటలను కార్పొరేషన్ స్కూళ్ళలో బోధించాలి, పాడించాలి అన్న ప్రతిపాదనను గట్టిగా సమర్థించారు.

1928లో బర్మా ప్రభుత్వం భారతిగారి 'స్వదేశ గీతంగళ్' అనే రెండు భాగాల గ్రంథాలను నిషేధించింది. ఆ నిషేధాన్ని మద్రాసు ప్రభుత్వం గుడ్డిగా గెజిట్‌లో ప్రకటించింది. పోలీసులు ఆ పుస్తకాలను పట్టుకోవడం మొదలుపెట్టారు. ఈ చర్యను ఖండిస్తూ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో సత్యమూర్తిగారు నిరసన తీర్మానాన్ని ప్రవేశపెట్టారు.

హరిసర్వోత్తమరావుగారు అప్పుడు కౌన్సిల్ సభ్యులు. ఆయన ప్రభుత్వ చర్యను దుయ్యబట్టారు. ముప్ఫయి సంవత్సరాలుగా దేశంలో మారు మ్రోగుతున్న గీతాలను నిషేధించడంతో ప్రభుత్వ వర్గాల ఉడుకుమోతు తనం బయటపడుతున్నదని చెప్పారు. "ఒక జాతి సాహిత్యాన్ని నిషే ధించడంకన్నా వేరేదీ ఆ జాతి ఆత్మాభిమానాన్ని కించపరచలేదు" అన్నారు.

...: కట్టమంచి ఉపోద్ఘాతం :...

కట్టమంచి రామలింగారెడ్డిగారు ఒకంతట ఏ సాహిత్యాన్నీ మెచ్చు కోలేదు. అంతటి నిక్కచ్చి విమర్శకులు 1937లో భారతిగారి ఆంగ్ల రచనలను రెండు భాగాలుగా ప్రచురించిన సందర్భంలో మంచి ఉపో ద్ఘాతం రాశారు. భారతిగారు తమిళంలోనే కాక ఇంగ్లీషులో కూడా రచనలు చేశారు. తమిళ భాషలో మార్గగేయ కవిత్వాలే కాక వచన కవిత్వం కూడా రాశారు. ఆయన ఆధునిక తమిళ సాహిత్య జనకులు. ఆయన దేశీయ ఛందస్సులలో పాడుకొనడానికే కవితలు అల్లారు. వాటిని తమి ళంలో చదివినా, విన్నా వాటి ప్రాశస్త్యం తెలుస్తుంది. ఏ భాషా కవిత్వమైనా సరే, అనువాదంలో సగం అందాన్ని పోగొట్టుకొంటుంది. అయినా, తెలుగువారు భారతిగారిని తెలుగులోనే చదువుకోవాలి.

భారతిగారి రచనలు కొన్ని దుగ్గిరాల బలరామయ్యగారు అనువ దించారట. తర్వాత నెల్లూరు వాస్తవ్యులు కె. పార్థసారధి అయ్యంగారు కొన్ని గీతాలను అనువదించారట. తర్వాత ఈ సంగతులను "త్రివేణి ఆంగ్ల" పత్రిక ఈ సంవత్సరపు జనవరి మార్చి నెలల సంచికలో ఆర్. ఏ. పద్మనాభన్‌గారు చెప్పారు.

కేంద్ర సాహిత్య అకాడమీ పక్షాన విశాలాంధ్ర ప్రచురణాలయము వారు "భారతి" వారి మధుర కవితా సంహిత అనే పేరుతో ఒక సంకలనం ప్రచురించారు. ఇది పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారి అనువాదం "భారతీయ సాహిత్య నిర్మాతలు" అనే శీర్షికలో కేంద్ర సాహిత్య అకాడమీవారు ప్రచురించిన భారతి అనే అనువాద గ్రంథంలో ఆర్. ఎస్. సుదర్శనంగారు కొన్ని అనువదించారు.

శ్రీరాములురెడ్డిగారు తమిళ మాతృకల నుంచీ, సుదర్శనంగారు ఆంగ్లానువాదాల నుంచి తెనిగించారు ఒకదాన్లో అతివ్యాప్తి, ఇంకొకదాన్లో అవ్యాప్తీ వున్నా, ప్రస్తుతానికి భారతిగారి కవితలను తెలుసుకోవడానికి ఈ రెండే శరణ్యం. "సుందర తెలుగు"లో భారతిగారు రాస్తే ఎలా రాసేవారో ఊహించుకోవలసిందే. అయినా, ఆయన అచ్చంగా పదహారణాల భారతీయుడు. అందుకే ఒక గీతంలో ఇలా ఆలపించారు.

సింధు నది యిన్మిశై నిలవినిలే
చేరనన్నాటిళం పెణ్‌గళుడనే
సుందర తెలుంగునిల్ పాట్టిశెత్తు
తోణిగళ్ కొట్టి విళైయాడి వరువోం. దీని అనువాదం ఇలా

చేయవచ్చు :

సింధునదిలో వండు వెన్నెలలో
చేరదేశపు చిరుత పడతులతో
అందాల తెలుగులో ఆలపిస్తూ పాట
అంపరం పడవల్లో ఆడివద్దాము

"జాతీయ సమైక్యత" అనే పదం "పుట్టించబడి" ప్రచారంలోనికి రావడానికి అరవై సంవత్సరాల ముందే ఈ గీతంలో భారతిగారు సమైక్య భారతదేశాన్ని చూశారు.

ఈ పాటలోనే అది వ్యక్తం చేస్తూ వివిధ ప్రాంతాల్లోని సరకులను, సంస్కృతిని వినిమయ పద్ధతిలో పంచుకోవాలని సూచించారు. గంగా తీరంలోని గోధుమలను, కావేరి సీమ తాంబూల పత్రాలతో కొనుక్కోవాలన్నారు. తమిళ దేశపు ఏనుగు దంతాలనిచ్చి మరాఠీ కవితలను స్వీకరించాలన్నారు. కాశీ నగర పండితులకి కాంచీపురం అలంకారాలను ఇవ్వాలన్నారు. వంగ దేశంలో వరదలు రాకుండా ఆ జలాలను కరువు ప్రాంతాలకు మళ్ళించాలన్నారు

భారతిగారిది విశాల దృక్పథం. అందుకే ఆధునిక అద్భుతమైన తమిళ సాహిత్య జనకులయ్యారు.

# పురుష పుంగవులూ - స్త్రీ పాత్రలూ

ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంగారు స్టేజీమీద ఆడ వేషాలు వేసేవారు. అక్కినేని నాగేశ్వరరావు అంతే స్థానం నరసింహారావుగారు సరేసరి. జగమెరిగిన బాణ, వేదాంతం సత్యనారాయణశర్మగారి భామ వేషం ప్రపంచ స్థాయిలో ప్రశంసనీయం. మిక్కిలినేనివారి నట రత్నాలు తిరగేస్తే తెలుస్తుంది. ఎందరెందరు రంగు పూసుకొని ఆడ వేషాలు వేస్తూ తమ రంగస్థల జీవితం మొదలు పెట్టారో (నా మటుకు, నేను చిన్నప్పుడు ఆడ వేషాలు వేసే వాడిని).

పార్సీ నాటక కంపెనీ వాళ్ళ పుణ్యమా అని తెలుగు వాళ్ళకు నూరేళ్ళ స్టేజి నాటక చరిత్ర లభించిందని పండుగలు చేసుకుంటూ ఈ మధ్య పొంగిపోయాం. ఆ రోజుల్లో నూరేళ్ళ కిందట కుల స్త్రీలు వీధి లోనికే రాకూడదు కనుక విధిలేక మగవాళ్ళే ఆధునిక నాటకాల్లో ఆడ వేషాలు వెయ్యక తప్పలేదు అని చెప్పక తప్పదు. పురుష పుంగవులు ఈ విధంగా స్త్రీ పాత్రలు ధరించే సంప్రదాయం ఏర్పడిందని వకిలీ చరిత్ర గ్రంథాల్లో చోటు చేసుకొంది. ఇంతకన్న సత్య దూరమైన విషయం ఇంకొకటి లేదు.

భారతదేశంలో అత్యంత ప్రాచీన కాలం నుంచి పురుషులు స్త్రీ పాత్రలు వేయడం అనే ఆచారం వస్తూనే వుంది. భరతుడు తన నాట్య శాస్త్రంలో ఈ సంగతి చెప్పాడు. సంగీతంలోనూ సాహిత్యంలోనూ దేశి పద్ధతి, మార్గపద్ధతి అనే విభేదాలున్నట్టు నాట్యంలో లోక ధర్మి, నాట్య ధర్మి అనే రెండు ధర్మాలు వున్నాయి. నాట్యాలలో స్త్రీలు స్త్రీ పాత్రలూ, పురుషులు పురుష పాత్రలూ ధరించడం లోక ధర్మం. ఇది "నానా స్త్రీ పురుషాశ్రయం" అని భరతముని చెప్పాడు. నాట్యధర్మి ఇందుకు విభిన్నం. అది "అన్యస్థ పురుషాశ్రయం" అని భరతముని అన్నాడు. దీనికి వివరణ చాలా అవసరం.

...: పురుష పాత్రలలో స్త్రీలు :...

తన స్వ స్వరూపంలో లేని వ్యక్తిని "అన్యస్థ పురుషుడ"ని శాస్త్రం చెప్తోంది. ఇది ఒక్క మగవాళ్ళకే వర్తించదు మగవేషం వేసే ఆడదాన్ని కూడా 'అన్యస్థ పురుష' శబ్దంతో వ్యవహరించాలని ఆనందగుప్తుడు తన అభినవ భారతి వ్యాఖ్యానంలో చెప్పాడు. అంటే ఆదికాలంలో ఆడ వాళ్ళు మగ వేషాలు వేసేవారన్న మాట. ఇది ఇంకా అక్క-డక్కడ ఆచరణలో వుంది. కిరాయి కాంట్రాక్టు నాటకాల్లో ఇది కనబడు తుంది ఉద్యోగ విజయాల ప్రదర్శనలో ఒకటో కృష్ణుడు, రెండో కృష్ణుడు, మూడో కృష్ణుడు వేషాల్లో కొందరు స్త్రీలు కృష్ణవేషం వేయడం అందరికీ తెలిసిన విషయమే. తొలితరం టాకీలలో. ఆడవాళ్ళు పురుష పాత్రలు ధరించటం దక్షిణ భారతంలో చారిత్రక విషయమే అభినేత్రి ఎస్. డి. సుబ్బులక్ష్మి ఒక తమిళ చిత్రంలో కృష్ణపాత్ర ధరించింది. మన టంగుటూరి సూర్యకుమారి ఒక తెలుగు చిత్రంలో "నారద" పాత్ర

ధరించారు. ఈ వేషాలు అస్వస్థ పురుషాశ్రయాలు కాబట్టి శాస్త్ర సమ్మత మైన నాట్య ధర్మికి చెందినవి.

ఒకప్పుడు పాత్రలు ఎక్కువై పాత్రధారులు తక్కువ అయితే ఒకే నాటకంలో కొందరు పాత్రధారులు రెండు, మూడు వేషాలు వేయ వలసి వుంటుంది. ఇది భరతముని కాలంలో కూడా వుండిన చిక్కే. ఒకరు ఒక నాటకంలో రెండు మూడు వేషాలు వేయడాన్ని భరతుడు శాస్త్ర సమ్మతం చేశాడు. ఆడవాళ్లు రెండు, మూడు వేషాలు వేసినప్పుడు వారి వరసలకు విరుద్ధమైనా కేవలం నటనే కాబట్టి ఫరవాలేదన్నాడు. నిజ జీవితంలో చెల్లెలు నాటకంలో ప్రేయసి వేషం వేస్తే అది వారి వరసలకు విరుద్ధం అయినా నాటకంలో ఇది అడ్డంకి కాదు. ఇటువంటి పాత్రలను "అగమ్య" పాత్రలు అంటారు. వారి వరసలకు భిన్నం కాని వాటిని "గమ్య" అంటారు. ఈ గమ్యా గమ్య విభేదాలు కూడా "నాట్య ధర్మి" లక్షణాలే.

మన ఆంధ్ర సాహిత్యంలోని ప్రబంధాలను, ఇతర కావ్యాలనూ శ్రద్ధగా చదివి పరిశోధనలు చేస్తే తెలుగు నాటకాల ప్రాచీన చరిత్రను రాసుకోవచ్చు ఉదాహరణకు మలిరాయల యుగంలోనూ అరవీటి రాజుల యుగంలోనూ నాటకాలలో వార వనితలు వేషం వేసేవారు. పింగళి సూరనరాజుగారి "ప్రభావతీ ప్రద్యుమ్నం" ప్రబంధంలో ప్రద్యుమ్నుడు నాటకాల ట్రూపును ఏర్పాటు చేసుకొంటూ అందులో వార వనితలను చేర్చుకొన్నాడన్న సంగతి తెలుస్తూంది.

విజయనగర సామ్రాజ్యపు సంప్రదాయాలనే తంజావూరులో నాయకరాజులు పాటిస్తూ వచ్చినా తంజావూరు నాటకాలు కొన్నింటిలో మగవాళ్ళే ఆడవేషాలు వేసే వారని చెప్పుకొండికి లిఖిత ప్రమాణాలు

వున్నాయి. తంజావూరులో నాయకరాజులతో పాటు తెలుగు నాటకం పట్టం కట్టుకొంది. కళలన్నింటినీ అదే ఏలింది. విజయ రాఘవ నాయకుడు స్వయంగా ఎన్నో నాటకాలు రాశాడు. తన కాలందాకా యక్షగానం అన్న పేరుతో చెలామణీ అవుతున్న ప్రక్రియకు నాటకం అన్న పేరు పెట్టాడు. విజయ రాఘవుడి మీద మార్గ నాటక ప్రభావం పడితే, అతని ఆశ్రితులందరి మీద అతని ప్రభావం పడింది. ఆశ్రితులలో ఆడా, మగా అందరూ నాటకాలు రాసినవాళ్ళే.

తంజావూరులో రాసిన నాటకాలు కేవలం చదువుకొందికి రాసినవి కావు. ఆడడానికి రాసినవే. శాస్త్ర సమ్మతంగా వాటిని ప్రదర్శించేవారు. ఏ నాటకంలో ఎవరెవరు ఏ పాత్రలు వేసేవారో, గ్రంథానికి ఎక్కించారు తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయంలో "నాటక పాత్రలు" అనే తాళపత్ర గ్రంథం ఒకటి వుంది. ఇందులో 22 నాటకాలలో పాత్రలు-పాత్రధారుల వైనం వుంది. ఉషా కళ్యాణ నాటకంలో మగవాళ్ళే ఆడ పాత్రలను ధరించిన దాఖలాలు ఇలా కనబడుతున్నాయి.

| | |
|---|---|
| పార్వతి వేసం— | కుప్పడు గురువుడు |
| ఉషా వేషం— | అహోబిళం సుబ్బుకట్టి |
| కుభాండ కన్య— | వెంకట్రాయుడు, గుండు రంగడు |
| బాణరమణి— | కుప్పడు గురువుడు |
| చిత్రరేఖ— | పెద సుబ్బరాయుడు, చిన సుబ్బరాయుడు |
| సఖివేషం— | సామయ్య కృష్ణుడు. |

ఈ "నాటక పాత్రలు" వ్రాత ప్రతిని పరిశీలించి డాక్టర్ పోణంగి శ్రీరామ అప్పారావుగారు తమ "తెలుగు నాటక వికాసం" అనే గ్రంథంలో "ఇందులో.... ఒక్కొక్కరు రెండు మూడు వేషాలు ధరించెడివారు. ఒక వేషమునకు ఇరువురు కూడా వున్నట్టు కన్పట్టు

మన్నది. పురుషులే స్త్రీ వేషములు వేసెడివారు" అని చెప్పారు. ఇవన్నీ భరతుడు చెప్పిన నాట్యధర్మి లక్షణాలే.

తంజావూరు నాయక్ రాజుల కాలంలో నాట్యధర్మి నాటకాలే ఆడేవారని ఇందువల్ల భావించకూడదు, విజయ రాఘవ నాయకుడి కాలంలో 'బయటి నాటక శాలలు' అనేవి ఒక తరహా నాటకశాలలు వుండేవి. ఇందులో స్త్రీలు స్త్రీ ప్రాతలను ధరించేవారు. లీలావతి అనే "బైటి నాటకశాల వడుచు" రాసిన 'కమ్మ పక్కణ'ను ఆనాటి ఒక నాటక కర్త తన రచనలో పేర్కొన్నాడు. నగరిలో ప్రదర్శించే నాటకాలలో నాట్యధర్మి, బైటి నాటక శాలల్లో లోకధర్మి ప్రచారంలో ఉండేవేమో.

కూచిపూడివారు నాట్యధర్మిని అనుసరించి మగవాడే భామ వేషం వేసే పద్ధతి కొనసాగిస్తూ వుండే తూర్పు భాగవతులు మొదలైనవారు ఆడవారు ఆడ వేషాలు వేసే లోకధర్మిని అనుసరించి ఆవే నాటకాలను ఆడడం చారిత్రక సత్యమే. పెండ్యాల సత్యభామగారు, చిత్రజల్లు వైదేహిగారు భామ వేషానికి ప్రసిద్ధులు.

'స్త్రీలే స్త్రీ వేషాలు వేయాలి. మగవాళ్లు వేయకూడదు' అనే ఉద్యమాన్ని బళ్ళారి రాఘవ చేపట్టి విజయవంతం చేశారు. స్టేజి నాటకాలలో రామతిలకం, కన్నాంబ, శ్రీరంజని, దాసరి కోటిరత్నం, పూర్ణిమ, రాజేశ్వరి మొదలైనవారు లోకధర్మికి సుస్థిరత్వం తీసుకొచ్చారు, కుల స్త్రీలు స్టేజి మీద నటించవచ్చని కొమ్మూరి పద్మావతి దేవిగారు రుజువు చేశారు.

పురుషులు స్త్రీ పాత్రలను ధరించినా స్త్రీలు పురుష పాత్రలను ధరించినా వారి వారి ప్రతిభ వల్ల రాణించవచ్చు. అయితే, ఒకే నాటకంలో ఒక నటుడు స్త్రీ పాత్రనూ పురుష పాత్రనూ ధరించి ప్రేక్షకులను

మెప్పించడం చాలా అరుదు. 1890 ఏప్రిల్ నెలలో రాజమండ్రిలో గయోపాఖ్యానం నాటకం తొలిసారి ప్రదర్శించారు. అప్పుడు రెండో అంకంలో చిత్రరేఖ పాత్రను ధరించి 'మిక్కిలి యొప్పించి', మూడవ అంకం నుంచే అర్జున పాత్రను ఒక నటుడు కన్నుల వైకుంఠంగా ప్రదర్శించాడట. ఆ నటుడు మరెవరో కాదు-ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంగారు నాట్య ధర్మిలో ఇదీ నిజమైన నైపుణ్య ప్రదర్శన.



# జీర్ణ చలన చిత్రోద్ధరణ - తక్షణ కర్తవ్యం

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చలనచిత్ర పరిశ్రమాభివృద్ధికి చాలా తోడ్పడుతోంది. ఇందుకు సంతోషించాలి. మంత్రిమండలిలో సినిమటోగ్రఫీ కోసం ప్రత్యేకంగా ఒక మంత్రినే నియమించింది ఇందుకు మరీ సంతోషించాలి.

రాష్ట్రంలో నిర్మించే చిత్రాలకు సబ్సిడీలు ఇవ్వడం. ఏటా ఉత్తమ చిత్రాలకు వివిధ లోహం నందుల రూపంలోనేగాక నగదు రూపేణా బహుమతులు ఇవ్వడం, కొన్ని కొన్ని ప్రత్యేక చిత్రాలకు వాటి వాటి ప్రత్యేకతలను బట్టి లక్ష, అర లక్ష రూపాయలను నగదు సత్కారాలు చేయడం, రాజధానిలో పరిశ్రమ వేళ్ళూను కొనడానికి ఇతోధిక ప్రయత్నాలు చెయ్యడం మొదలైన పనులు ప్రశంశనీయాలే.

మరీ ముఖ్యంగా 'రఘుపతి వెంకయ్య అవార్డు' అనేది ఏటేటా ఒక అర్హతగల సినీ వ్యక్తికి ఇవ్వడం చాలా మంచిపని తెలుగు చలన చిత్ర పరిశ్రమకు ఆయన ఆద్య బ్రహ్మ. భారతదేశంలో చలనచిత్రాలు దిగుమతి అయిన తొలి దశాబ్దంలోనే వాటివల్ల ప్రభావితులైన చలన చిత్ర పరిశ్రమలోని వివిధ శాఖలలో గణనీయమైన కృషి చేశారు. రఘుపతి వెంకయ్యగారు నిస్సందేహంగా తెలుగు చలనచిత్ర పితామహుడు.

...: తెలుగు చలన చిత్ర పితామహుడు :...

తెయితే ఆంధ్ర చలనచిత్ర చరిత్ర కారులలో ఒక వృద్ధుడు వెంకయ్యగారు. దక్షిణ భారత చలనచిత్ర జనకుడని, ఆ మాట కొస్తే దాదా సాహెబ్ ఫాల్కే కన్నా ముందుగా కథా చిత్ర నిర్మాణం కావించిన వారని నాతో వాదనకు దిగారు. ఒక తెలుగువాడు ఇంత గొప్పవాడయితే నాకన్నా సంతోషించేవాడు ఇంకెవ్వరూ ఉండరు. నేనూ అంతో ఇంతో చలనచిత్ర చరిత్రను అధ్యయనం చేస్తున్న విద్యార్థిని. నా పరిశోధనం వల్ల ప్రస్తుతానికి 1905లో స్వామి కన్ను విన్సెంట్ అనే దాక్షిణాత్యుడు తొలిసారిగా చలనచిత్ర ప్రదర్శనలు సంచారం చేస్తూ ఇచ్చాడు. ఈయన తిరుచనాపల్లిలో రైల్వే డ్రాఫ్ట్సుమెన్‌గా వుండేవాడు. విజయవంతంగా ప్రదర్శనలు ఇచ్చి చెన్నపట్నంలో 'ఎలక్ట్రిక్ థియేటర్' అనే పేరుతో మొదటి చిత్ర ప్రదర్శనశాలను నెలకొల్పాడు. (ఈ సంగతులను శ్రీ ఎస్. టి. భాస్కరన్ "సైలెంట్ సినిమా ఇన్ ది సౌత్" అనే వ్యాసంలో వ్రాశారు.) రఘుపతి వెంకయ్యగారు చెన్నపట్నంలో చలన చిత్ర ప్రదర్శనలు ఇచ్చిన తేదీలు టూరింగ్ డేరాతో తిరిగిన తారీఖులు మన దగ్గర లేవు. ఆ నాటి వార్తా పత్రిక ప్రకటనలలో గానీ వార్తల కత్తి రింపులు గానీ మనం చూపెట్ట కలిగితేనే వెంకయ్యగారిని దక్షిణ భారత చలనచిత్ర జనకులని మనం క్లెయిమ్ చేయడానికి ఆస్కారం వుంటుంది.

చలన చిత్రాలు భారత దేశానికి 1896లో తొలిసారిగా దిగుమతి అయ్యాయి. ఫొటోగ్రఫీ అంతకు ముందే వచ్చింది భారతీయులు ఆ విద్యను చేపట్టి రాణించారు. 1892లో రచించిన మొదటి కన్యాశుల్కం లోనే "ఫొటోగ రావుల వంతులు" ప్రసక్తి మన తెలుగు సాహిత్యంలోనే ఉందంటే అంతకు ముందే ఫొటోగ్రఫీ ప్రచారంలో వుందని చెప్పు

కోవాలి. సైలెంటు చలన చిత్రాలు ఫొటోగ్రఫీ మీద వచ్చిన అభివృద్ధి కదిలే బొమ్మలంటే సర్వ సాధారణ ప్రజలలో సామాన్యమైన కుతూహలమే ఉంటుంది గానీ ఫొటోగ్రాఫరు వృత్తిలో ఉన్నవాళ్ళకు సాంకేతికమైన ఆసక్తి అభిలాషలు ఉంటాయి. సైలెంట్ సినిమాలవల్ల భారత దేశంలో ముగ్గురు ఫొటో గ్రాఫర్లు ప్రభావితులయ్యారు.

ఒకరు మహారాష్ట్రీయుడు. ఇంకొకరు ఆంధ్రుడు. మరొకరు బెంగాలీ.

హరిశ్చంద్ర సఖారాం భట్వాడ్కర్ (సవేదాదా) 1880లోనే బొంబాయిలో స్టూడియో పెట్టుకున్న మహారాష్ట్ర ఫోటో గ్రాఫర్. సైలెంట్ చిత్రాలు రాగానే ఆ ప్రభావంలో పడి పరికరాలు దిగుమతి చేయించుకొని చిన్న చిన్న కాలోచిత సంఘటనలు చిత్రించిన తొలి భారతీయుడు.

## ...: రఘుపతి వెంకయ్య :...

రఘుపతి వెంకయ్య పదహారణాల ఆంధ్రుడు. మన బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి సోదరుడు. మద్రాసులో స్టూడియో పెట్టుకొన్న ఫొటోగ్రాఫరు. సైలెంట్ చిత్రాలకు ముగ్ధుడై వాటిని ప్రదర్శించే యంత్రాలు కొని డేరా ప్రదర్శనలు ఇచ్చి దేశ దేశాల్లో తిరిగి చెన్నపట్నంలో ఒకటికి మూడు శాశ్వత ప్రదర్శనశాలలు నిర్మించిన ఘనుడు. ఆయన నిర్మించిన సినిమా థియేటర్లు ఆ పేర్లతో కాకపోయినా అన్నీ నేటికీ వున్నాయి. చలన చిత్ర నిర్మాణంలో శిక్షణకు తన కుమారుడిని విదేశాలకు పంపాలనే విచక్షణ గలవాడు.

....: ధీరేన్ గంగూలీ :...

ధీరేంద్రనాథ్ గంగోపాధ్యాయ శాంతి నికేతనం విద్యార్థి. అన్ని కళలలోను ప్రవేశం వున్నవాడు. ఈనాడు ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరమైన హైదరాబాదులో అలనాడు నిజాం స్థాపించిన "ఆర్ట్ కాలేజీకి పెద్ద అయ్యాడు. ట్రిక్ ఫొటోగ్రఫీలో విచిత్ర వేషధారణలో ప్రసిద్ధుడు కాని, వివిధ వేషాలు వేసుకొని ఒకే ఫొటోగ్రాఫులో అన్నీ ఎక్స్‌పోజ్ చేసి "భావేర్ అభివ్యక్తి" అనే అల్బం తయారుచేసి కలకత్తాలోని చిత్ర నిర్మాతల దృష్టికి వచ్చాడు. అక్కడ కొంతకాలం సైలెంట్ సినిమా నిర్మాణంలో వుండి హైదరాబాద్‌కు తిరిగివచ్చేడు. నిజాం ఆదరణలో "లోటస్" ఫిలింకంపెనీ అనే సంస్థ నెలకొల్పి 1922 నుంచి 1924 దాకా ఎన్నో సైలెంట్ చిత్రాలను నిర్మించాడు. హరగౌరి, ఇంద్రజిత్, లేడీ టీచర్, సాధు అవుర్ సైతాన్ (1922). చింతామణి, స్టెప్ మదర్, యయాతి, (1923) మొదలైన పౌరాణిక, జానపద, సాంఘిక గాథలు తెరమీదకు ఎక్కించాడు. తెలుగు గడ్డమీద ఒకనాటి తెలుగు రాజధాని నగరంలో మొదటి సైలెంట్ చిత్రాలను తీసిన ధీరేన్ గంగూలీకి జ్ఞాపకార్థంగా ఈనాటి రాజధాని అయిన అదే హైదరాబాద్ నగరంలో మనం ఏం ఘనకార్యం చేశాం? ఫ్యూడల్ అధరాభిమానాలకు నోచుకుని ఆంధ్ర భూమిలో తొలి చిత్ర నిర్మాణశాలను నిర్మించినవాడు. అదే ఫ్యూడల్ ఆగ్రహానికి గురై రాత్రికిరాత్రి హైదరాబాద్ సంస్థానం వదలి వెళ్ళిపోవలసి వచ్చింది. ఉత్తరోత్తరా ధీరేన్ బాబుకు ఫాల్కే అవార్డు ఇచ్చినప్పుడు మా తెలుగు గడ్డపై సైలెంట్ చిత్రాలు నిర్మించాడని కృతజ్ఞతా సూచకంగా మనం ఎన్ని దండాలు పెట్టాం?

...: పరిశోధన కేంద్రం :...

మన రాష్ట్ర ప్రభుత్వం సినిమాటోగ్రఫీ శాఖవారు ఒక చలనచిత్ర చరిత్ర పరిశోధనా కేంద్రాన్ని నెలకొల్పాలి. చరిత్ర గర్భంలో కలసిపోతున్న వాటిని పరిరక్షించాలి. పాత సైలెంట్ చిత్రాలు ఎలాగూ

దొరకవు వాటి స్టిల్స్‌నైనా భద్రపరచాలి. మంచి గతమున కొంచెమేగాని ఆ 'కొంచెము'ను కూడా బతికించుకోవాలి. ఇది తెలుగు టాకీ స్వర్ణోత్సవ సంవత్సరం. తొలి తెలుగు టాకీతో సంబంధమున్న వ్యక్తులు కొందరే నేడు సజీవులు. చరిత్ర కెక్కినవారు, చెప్పుకోతగ్గవారు తొలి టాకీ వ్యక్తులు కొందరు సజీవులు. వాళ్ళ అనుభవాలు, జ్ఞాపకాలు, ఫొటోలు మొదలైనవి జాగ్రత్తచేయాలి.

"యోగి వేమన" చిత్రాన్ని నిర్మించేవాళ్ళకు ధన సహాయం చేస్తామని ప్రభుత్వం ప్రకటించింది. మంచిదే ముగ్గురు కొత్త నిర్మాతల పేర్లు వినిపించాయి. చాలా మంచిది. అందరికి ప్రభుత్వ సహాయం చేస్తే అంతకన్నా మంచిది కొత్త చిత్రాలు వస్తాయి అయితే, పాతచిత్రం మాటేమిటి? కె. వి. రెడ్డిగారు మన సృజనాత్మక చిత్ర నిర్మాతలలో ప్రముఖులు. కమలాకర కామేశ్వరరావుగారితో కలిసి ఆయన "యోగి వేమన" కు రాసిన స్క్రీన్‌ప్లే చాలా ఉత్తమ మైనది. చిత్రనాటిక రచనా శిక్షణలో దానిని పాఠ్యచిత్రంగా ఎన్నుకోదగ్గ విశిష్టతగలది. కొత్త యోగివేమన చిత్రానికి సహాయం చేయడానికి ముందు పాత యోగి వేమన చిత్రం పాడైపోకుండా చూడటం ప్రభుత్వ ధర్మం కాదా?

....: సుప్త నిశ్శబ్ద సంపుటాలు : ...

మన పాత చిత్రాలు మనం సగర్వంగా మన విజయాలుగా చాటుకోదగ్గని మాలపిల్ల, రైతుబిడ్డ, భక్తపోతన, యోగివేమన, మళ్ళీపెళ్ళి, మల్లీశ్వరి మొదలైన వాటి నెగిటివ్‌లు లేబొరేటరీల విలువ ఇళ్ళచలువ గదులలో సుప్తనిశ్శబ్ద సంపుటాలుగా మూలుగుతున్నాయి. వీటి ప్రపంచ హక్కులు కొందరు ప్రయివేటు వ్యక్తులు దూ ర దృ ష్టి తో సంపాదించుకున్నారు డబ్బు తెచ్చేనాటికి పుష్కరానికోసారి ముద్రిస్తున్నారు. గురజాడ అప్పారావుగారు చెప్పినది కొంచెం మార్చితే "డబ్బు తేలేనటి ఫిల్ముకు కీర్తి సంపద లబ్బునోయ్" అని చెప్పవచ్చు. అయితే డబ్బు అంతగా తెచ్చేది కళాఖ డం కాకపోవచ్చు.

మన పరువును పదికాలాలపాటు నిలిపి మన కళా ప్రతిష్ఠను పెంచే మల్లీశ్వరి నెగెటివ్‌లు కొంచెం దెబ్బతినడం మొదలెట్టాయట. మొదటి రీలులో తొలి నాలుగు వందల అడుగులు చెడిపోయాయి. అందులోనే సాలూరు రాజేశ్వరరావుగారు శ్రవణపేయంగా పురందరదాసు రచన "శ్రీ గణనాథ సింధూరవర్ణ" అనే గీతాన్ని బృందగానంగా మలచారు. మల్లీశ్వరి హక్కులు అనుభవిస్తున్న వ్యాపార దక్షులు త్వరగా మేలుకొని ఆ నాలుగు వందల అడుగులకు డ్యూప్ నెగెటివ్ తయారుచేయించుకున్నారు కనుక సరిపోయింది.

ప్రయివేట్ వ్యక్తులు ఎంత కాలమని ఈ ప్రాచీన చలనచిత్ర కళా రూపాలను పరిరక్షించ గలరు? ప్రభుత్వమే ముందుకి వచ్చి వీటి హక్కులను వ్యక్తుల దగ్గర నుండి తగిన "ప్రతిఫలంగాని, పరిహారంగాని, లాభాలుగాని ఇచ్చి కొనుక్కోవాలి. రాజధాని నగరంలో రాష్ట్రీయ స్థాయిలో ఫిలిం ఆర్కైవ్స్ సృష్టించాలి. (పూనాలో వున్న సంస్థలో భద్ర పరచిన తెలుగు చిత్రాలను లెక్కపెట్టడానికి ఒక చేతికున్న అన్ని వేళ్ళూ కూడా అక్కర్లేదు) ఏ మాత్రం విశిష్టతను సంపాదించిన చిత్రం నెగెటివ్‌నైనా సంరక్షించి ప్రదర్శన యోగ్యమైన ఒక ప్రింటునైనా అందుబాటులో వుంచాలి. జీర్ణ దేవాలయాలను ఉద్ధరిస్తే ఎంత మంచిదో జీర్ణ చలన చిత్రాలను కూడా ఉద్ధరించడంలో అంతటి ఫలం వుంటుంది.

కాల కాలుష్యం వల్ల తాజ్‌మహల్‌కే కేన్సర్ వ్యాధి వస్తూన్నదట. మన పాత కళారూపాలు రుజాగ్రస్తం కాకుండా మనం జాగ్రత్త బడితేనే ప్రయోజకుల మవుతాము.

# రఘుపతి వెంకయ్యా అండ్ సన్

రఘుపతి వెంకయ్యగారు తెలుగు చలనచిత్ర పరిశ్రమకు ఆద్య బ్రహ్మ. వారి కుమారుడు ప్రకాశం (ప్రకాశం, ప్రకాశన్, ప్రకాష్ అనే పర్యాయ నామాలు కూడా ఉన్నవాడు) తెలుగు వాళ్ళలో మొట్ట మొదటి దర్శకుడు. ఈ తండ్రీ కొడుకులిద్దరూ మనకు చిరస్మరణీయులు. మన రాష్ట్ర ప్రభుత్వం వెంకయ్యగారి పేర ఒక అవార్డును నెలకొల్పి, చిత్ర పరిశ్రమకు ఎనలేని సేవజేసిన విశిష్ట వ్యక్తులలో ఏటా ఒకరిని ఆ అవార్డుతో సత్కరిస్తూంది. ఇప్పటిదాకా ఎల్. వి. ప్రసాద్‌గారికీ, పి. పుల్లయ్యగారికీ ఆ పురస్కారం జరిగింది. ఈ సంవత్సరం బి. ఎ. సుబ్బారావుగారికి ఆ ఘన సన్మానం దక్కింది.

మన ప్రభుత్వం "వెంకయ్య అవార్డు"ను నెలకొల్పిందే తప్ప వెంకయ్యగారి మీద కూలంకషమైన పరిశోధన జరిపించి ఆయన చరిత్రను రాయించ లేదు. కట్టుకథలూ, కల్పిత సంఘటనలూ, అతిశయోక్తులూ, అన్నీ కలగాపులగం చేసి వెంకయ్యగారి జీవిత చరిత్రగా చలామణి చేస్తున్నారు. తెలుగు భాషా సమితివారి విజ్ఞాన సర్వస్వం తెలుగు సంస్కృతి సంపుటంలో "వెంకయ్యగారు ఒక రకంగా దక్షిణదేశ చలనచిత్ర పరిశ్రమకే కాక భారతదేశ చలనచిత్ర పరిశ్రమకే పితామహులని చెప్పవచ్చు" అని రాశారు. (పుట 1132). దీనంత కల్ల ఇంకొకటి లేదు. చారిత్రక పరిజ్ఞానం లేని అమితోత్సాహ వంతులు ఆయా రంగాలలోని ప్రతిభావంతులకు సదరు రంగానికి జనకులనీ, పితామహులనీ ఆ పదవులను అంట గట్టడం పరిపాటి అయింది. కీర్తి కక్కుర్తిగల అల్పబుద్ధులు ఎగిరి గంతేసి

ఆ పట్టాన్ని పట్టుకు వెళ్ళాడడం కూడా ఇప్పుడు కనబడుతూంది. అయితే, అదృష్టవశాత్తు వెంకయ్యగారు చాలా గంభీరులు. తమకు చెందని పట్టం ఇస్తే పుచ్చుకోరు.

భారత చలనచిత్ర పితామహుడు దాదాసాహేబు ఫాల్కే కథా చిత్రాలు నిర్మించడానికి ముందే వెంకయ్యగారు చిన్న నిడివి కథా చిత్రాలు నిర్మించారనే కట్టుకథను పనిగట్టుకొని ప్రచారం చేయడం కూడా జరిగింది. మనవాళ్ళ గొప్పను చెప్పుకోవడానికి మనం చరిత్రను తారుమారు చెయ్యక్కర్లేదు. వెంకయ్యగారు దక్షిణ భారత చలనచిత్ర పరిశ్రమకు కూడా ఆద్యులు కాదు. ప్రారంభకులలోని ఆద్యులు మాత్రమే. నిస్సందేహంగా ఈ పరిశ్రమలోని వారు మొట్టమొదటి తెలుగువారు. ఆయన ఆంధ్రులలో ప్రప్రథమ ప్రదర్శకుడు. తొలి స్టూడియో యజమాని మొదటి చిత్ర నిర్మాత. ఈ 'ఫస్టులు' చాలు మనం ఆయనను ఎటూ తలుచుకోవడానికి.

•

రఘుపతి వెంకయ్యగారు 1869లో బందరులో జన్మించారు. వీరి తండ్రిగారు సుబేదారు అప్పయ్యనాయుడుగారు తల్లి శేషమ్మ. ఆంధ్ర దేశంలో బ్రహ్మ సమాజాన్ని ఆదర్శవంతంగా ప్రచారం చేసిన బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు వెంకయ్యగారి అన్నగారు. ఈ అన్నదమ్ములకు ఏడేళ్ళ వారది వుంది. సుబేదార్ అప్పయ్యనాయుడుగారి పటాలం తరచుగా వివిధ నగరాలకు బదిలీ అవుతూ వుండేది. అందుచేత వారి సంతానం కూడా భారతదేశంలోని వివిధ నగరాలలో విద్యాభ్యాసం చేయవలసి వచ్చింది. వెంకటరత్నంగారు విద్యా రంగాన్ని ఎన్నుకొంటే వెంకయ్యగారు ఛాయాగ్రహణాన్ని అభిమానించి ఫొటోగ్రాఫర్ వృత్తిని చేపట్టారు.

ఎప్పుడు వచ్చి స్థిరపడ్డారో భావి పరిశోధనల వల్ల తెలుస్తుందిగాని వెంకయ్యగారు మద్రాసులో ఫోటోగ్రాఫర్‌గా స్థిరపడ్డారు. మౌంటురోడ్డులో వారి స్టూడియో వుండేది. వ్యాపారం చాలా లాభసాటిగా సాగింది. ఇతర ఛాయాగ్రహకులలాగే వెంకయ్యగారు కూడా సైలెంట్ చిత్రాల ఆవిర్భావాన్ని, ఆకర్షణలనూ గమనించారు. 1896లో మొట్టమొదటిసారిగా మన దేశంలో సైలెంట్ చిత్రాల ప్రదర్శన ప్రారంభమైంది. ఆ మలి సంవత్సరం మద్రాసులో ప్రదర్శనలు జరిగాయి. 1900 సంవత్సరంలో మద్రాసులో మొదటి సినిమాహాలు నిర్మాణం జరిగింది. ఇప్పటి మౌంటు రోడ్డు పోస్టాఫీసు ఆవరణలో భాగమైన ఒక పాత కట్టడంలో మేజర్ వార్విక్ దీనిని నెలకొల్పి దిన దిన చిత్రాలను ప్రదర్శించేవారు. వెంకయ్య గారు వీటివల్ల ప్రభావితులయ్యారు.

వివిధ విదేశ చలనచిత్ర పారిశ్రామికులు ప్రొజెక్టర్లు మొదలైన పరికరాలను ఇచ్చి తమఏజెంట్లను ఇతర దేశాలకుపంపేవారు. ఫ్రాన్స్ దేశపు డ్యూపాంటు కంపెనీ వారు ఒక ఏజెంటును దక్షిణ భారతానికి పంపారు. తిరుచునాపల్లిలో 1904లో ప్రదర్శనలు ఇస్తున్న ఏజెంట్ జబ్బుపడ్డాడు. స్వదేశానికి తిరిగిపోదామనుకొన్నాడు. తన దగ్గరున్న సినిమా ప్రదర్శన పరికరాలను అమ్మజూపాడు. తిరుచునాపల్లి రైల్వే శాఖలో పనిచేస్తున్న స్వామికణ్ణ విన్సెంట్ అనే ఉత్సాహవంతుడు వాటిని కొన్నాడు. ప్రదర్శనలు మొదలు పెట్టాడు. 1909లో విన్సెంట్ తొలిసారిగా మద్రాసులో డేరా పాతి సైలెంట్ సినిమాలు ప్రదర్శించాడు.

## సినిమాహాలుల నిర్మాణం

సరిగ్గా ఆదేసమయానికి వెంకయ్యగారు కూడా ప్రొజక్టరున్న సైలెంట్ ఫిల్ములనుకొని ప్రదర్శనలు ప్రారంభించారు. మద్రాసులోని ఎస్ప్లనేడ్‌లో

డేరా వేశారు. దక్షిణ భారతంలో పర్యటనం చేసి సిలోన్, బర్మా దేశాలలో కూడా వెంకయ్యగారు తమ డేరా సినిమాను తిప్పారు. 1912 కి మద్రాసుకు తిరిగి వచ్చారు. డేరా సినిమాలకన్నా పక్కా సినిమాహాళ్ళ ఆవశ్యకతను గుర్తించారు. మద్రాసులో 1913 లో "గెయిటీ" థియేటర్‌నూ, 1914 లో "క్రౌన్" థియేటర్‌నూ, 1915 లో "గ్లోబ్" థియేటర్‌నూ నిర్మించారు. మొదటి రెండు హాళ్ళూ ఆ పేరుతోనే నేటికీ మద్రాసులో వున్నాయి. "గ్లోబ్" పేరు మాత్రం రాక్సీగా మారింది. ఈ సినిమా హాళ్ళ నిర్మాణానికి వెంకయ్యగారు చాలా ఖర్చు పెట్టారు.

అప్పటికే భారతదేశంలో చిత్ర నిర్మాణం ప్రారంభమైంది. "దాదా సాహెబ్ ఫాల్కే"గారి "హరిశ్చంద్ర" (1913) దేశంలో ఎందరినో ప్రభావితులను చేసింది. వెంకయ్యగారు కూడా చిత్ర నిర్మాణంలో దిగుదామను కొన్నారు. అందుకోసం పరిపూర్ణమైన శిక్షణ పొందిన వ్యక్తి కావాలి. విదేశాల స్థాయికి ఏ మాత్రం తీసిపోని సాంకేతిక నైపుణ్యం కావాలి. తమ అబ్బాయి ప్రకాశాన్ని విదేశాలకు పంపి ఆయనకు చిత్ర నిర్మాణ కౌశలాన్ని నేర్పించాలనుకొన్నారు. అందుకోసం ఎంత డబ్బు ఖర్చు అయినాసరే దానికి సిద్ధపడ్డారు. అయితే దురదృష్టవశాత్తు ప్రథమ ప్రపంచ సంగ్రామం అడ్డు వచ్చింది. యుద్ధం ముగిసిన వెంటనే ప్రకాశాన్ని ఇంగ్లండ్ పంపించారు.

ఇంగ్లండ్‌లోని 'బార్కర్స్ మోషన్ పిక్చర్ స్టుడియో'లో ప్రకాశం గారు విద్య నేర్చుకొందామకొనుకున్నారు. ప్రవేశం అంత సులభంగా దొరక లేదు. మొదట ఆ స్టుడియోలో ఆయన "సూపర్"గా పని చేయవలసి వచ్చింది. అంటే మాటావలుకూ ఏమీలేని నటుడిగా అన్నమాట. ఇవాళ అటువంటి నటుణ్ణి "ఎక్‌స్ట్రా" అంటాం. ప్రకాశంగారు ఎక్‌స్ట్రా నటుడిగా కొందరికి పరిచయం అయ్యాక నిర్మాతల దృష్టిలో పడ్డారు. ఫోటోగ్రఫీ,

డైరెక్షన్ సినేరియో రచన మొదలైన వాటిలో శిక్షణ కావాలన్నారు. నిరాశ తలు ముడుపు చెల్లించుకోమన్నారు. అయిదు వందల పౌండ్లు చెల్లించి ప్రకాశంగారు అవి నేర్చుకున్నారు. (నేటి మారకం రేటు ఆరువేల రూపాయలన్నమాట!)

ఇంగ్లండ్‌లో సాంకేతిక విద్యను ఒక ఏడాదిలో అభ్యసించి ప్రకాశంగారు ఫ్రాన్సు, ఇటలీ దేశాలకు వెళ్ళారు. పాథే స్టూడియోలో పని తీరును ఒక నెల రోజులపాటు గమనించారు. చిత్ర నిర్మాణశాఖలన్నింటిలోనూ కావలసిన పరిజ్ఞానాన్ని సాధించారు. 1920 లో స్వదేశానికి తిరిగి వచ్చారు.

## చిత్ర నిర్మాణం

కుమారుడు ప్రవీణుడై ఇంటికిరాగానే వెంకయ్యగారు చిత్రనిర్మాణానికి ఉద్యుక్తులయ్యారు. "స్టార్ ఆఫ్ ది ఈస్టు ఫిలిం కంపెనీ" ని స్థాపించారు. అన్ని హంగులతోనూ, విదేశాలలోని ఏ స్టూడియోకు తీసిపోని విధంగా లక్షరూపాయల వ్యయంతో గ్లోబ్ థియేటర్ ఆవరణలో ఒక స్టూడియోను నిర్మించారు. సూర్యకాంతిని వాడుకొనడానికి వీలుగా గాజుపైకప్పు ఏర్పాటు చేశారు. కెమెరా, లేబరేటరీ వగైరాలు సమకూర్చుకొన్నారు. కంపెనీ సిబ్బందిలో ఏభైమంది నటీనటులుండేవారు. చిత్రనిర్మాణశాఖలో నెలసరి రెండువేల ఐదువందల రూపాయలు చిల్లర ఖర్చులుండేవి. విదేశ చిత్రాలతో పోటీ చేయాలన్నసంకల్పంతో అన్నీభారీఎత్తున ప్లానుచేశారు.

పన్నెండు వేల రూపాయలవ్యయంతో "భీష్మ ప్రతిజ్ఞ" అనే ఒక చిత్రాన్ని ప్రారంభించారు. డబ్బు మంచినీళ్ళలా ఖర్చు పెట్టారు. నటీనటులకు ప్రకాశంగారు ట్రైనింగ్ ఇచ్చారు. స్టేజి నాటకాల నటనకూ, సినిమా నటనకూ చాలా తేడావుందని ప్రకాశంగారు తొలిరోజుల్లోనే గ్రహించారు.

ఎనిమిదివేల అడుగులలో భీష్మ ప్రతిజ్ఞను 1921 లో పూర్తి చేశారు. దీనికి పన్నెండువేల రూపాయలు ఖర్చు అయింది. ఒక్క ఏడాదిలో భీష్మ ప్రతిజ్ఞ ఆరవైవేల రూపాయలను ఆర్జించింది. ఇదే తెలుగువాడు మొదటిసారిగా నిర్మించిన చిత్రం. ఇదే తెలుగువాడు ప్రప్రథమంగా దర్శకత్వం వహించిన చిత్రం.

భీష్మ ప్రతిజ్ఞ సాధించిన విజయాల ఉత్సాహంతో వెంకయ్యగారు ఇతర చిత్రాలను నిర్మించారు. ప్రకాశంగారు వాటిని డైరెక్టుచేశారు. గజేంద్ర మోక్షం, భక్తనందనార్, సముద్రమథనం, మోహినీ అవతారం, దశావతారం, కోవలన్ అనే పౌరాణిక, ఐతిహాసిక చిత్రాలేకాక 'స్టేజిగర్ల్' అనే సాంఘిక చిత్రాన్ని కూడా ప్రకాశంగారు డైరెక్టు చేశారు. ప్రకాశంగారి శిక్షణలో సి. పుల్లయ్యగారూ, వై.వి. రావుగారు చిత్రనిర్మాణ రహస్యాలను నేర్చుకొన్నారు.

ఒక నాలుగేళ్ళపాటు స్టూడియో చురుకుగా సాగింది. అయితే తలకు మించిన అప్పులూ, నడ్డి విరిచిన వడ్డీలు, సరిగ్గాలేని నిర్వహణ, సిబ్బంది చేసిన దోపిడీలు అన్నీ కలసి వెంకయ్యగారిని దివాలా తీయించాయి. ఆయన కట్టిన మూడు థియేటర్లు పరుల చేతికిపోయాయి. స్టూడియో మూలబడింది. వెంకయ్యగారి వ్యాపారానికి కోర్టు ఒక రిసీవర్ని నియమించింది. పద్దెనిమిది వేలు విలువచేసే మిషన్లను మాత్రం రిసీవరు ఎఫ్. హెచ్. విల్సన్ కొన్నాళ్ళు అమ్మకుండా అద్దెకిస్తూ వచ్చాడు. చివరకు వాటినికూడా విడివిడిగా అమ్మివేయవలసి వచ్చింది.

1927-28లో ప్రభుత్వం "ఇండియన్ సినిమాటోగ్రఫీ" పైన ఒక కమిటీని నియమించింది. ఈ కమిటీ ముందు రఘుపతి ప్రకాశంగారు, రిసీవరు విల్సన్‌గారూ చివర్న వెంకయ్యగారు చాలా వివరంగా సాక్ష్యమిచ్చారు. తమ తండ్రిగారు దివాలా తీయడానికి బహుశ తమ ఆశయాలు అత్యాశలు కావడమే కారణమని ప్రకాశంగారుచెప్పారు. స్వంత స్టూడియోను కొంతకాలం నడిపి స్వతంత్రంగా చిత్ర నిర్మాణం చేసిన తనకు ఇంకొకరి

కింద పనిచేయడం నామోషీ అని ప్రకాశంగారు ఈ సాక్ష్యంలో చెప్పారు.

వెంకయ్యగారు తమ సాక్ష్యంలో చిత్ర నిర్మాణ వ్యయం గురించి తాము అంతగా పట్టించుకోలేదన్నారు. ఆ రోజుల్లో డిస్ట్రిబ్యూషన్ రంగంలో, ఎగ్జిబిషన్ రంగంలో మదన్ థియేటర్స్ వారికి గుత్తాధిపత్యం వుండేది. వివిధ నగరాలలోని థియేటర్ల వారికి తమ చిత్రాల ప్రదర్శన సౌకర్యాలు కలిగించకుండా వాళ్ళు నష్టపోతున్న తరుణంలో వారి థియేటర్లను మదన్‌వారు కబళించేవారని లోకులు అనుకొనేవారు. వెంకయ్యగారి థియేటర్లను కూడా మదన్ కైవశం చేసుకొన్నారు. అయినా వాళ్ళపట్ల వెంకయ్యగారికి ద్వేషంలేదు. సదభిప్రాయాన్నే తమ సాక్ష్యంలో తెలియజేశారు. తమ దివాలా లావాదేవీలలో ప్రకాశంగారిని ఇరికించలేదు. తామొక్కరే ఆ బాధ్యతను వహించారు.

తండ్రి దివాలా తీసినా ప్రకాశంగారు డీలా పడలేదు. తమిళ చలన చిత్ర పితామహుడు ఎ. నారాయణన్‌గారితో కలిసి కంపెనీ పెట్టారు. ఆ కంపెనీ వారి చిత్రాలకు ఛాయాగ్రాహకునిగానో, డైరెక్టరుగానో పనిచేశారు. టాకీ యుగంలో కూడా చిత్రాలు తీశారు. కన్నాంబ నటించిన 'చండిక' చిత్రానికి ప్రకాశంగారే దర్శకులు. అప్పటికి ఆయన తన పేరును ఆర్. ప్రకాష్‌గా మార్చుకొన్నారు.

వెంకయ్యగారు 1941లో చనిపోయారు. ప్రకాశంగారు 1956లో పోయారు. వారి కడపటి చిత్రం 'మాయపిల్ల'. మన తెలుగు పత్రికలూ, సినిమా సావనీర్లు మొదలైన వాటిని శ్రద్ధగా, ఓపికతో తిరగేస్తే ఎన్నెన్నో విశేషాలు ఈ తండ్రీ కొడుకుల గురించి తెలిసే అవకాశాలు వున్నాయి. తెలుగు సినిమా పరిశ్రమకు పునాదులు వేసిన ఈ తండ్రీ కొడుకుల చరిత్రను రాసుకొనే బాధ్యత తెలుగువాళ్ళకుంది.

వచ్చే 'నంది అవార్డు'ల నాటికైనా 'రఘుపతి వెంకయ్యగారి సంపూర్ణ చరిత్ర' అనే గ్రంథాన్ని రాష్ట్ర ప్రభుత్వం రాయించి దేశానికి అందజేస్తుందని భావిస్తున్నాను.

# పెద్దబాలశిక్ష: ఒక ప్రతీక్ష

ఈ మధ్య వార్తలలోకె ఎక్కిన పాతపుస్తకం పెద్దబాలశిక్ష. దాదాపు పధ్నాలుగు దశాబ్దాల చరిత్రగల ఈ గ్రంథం ఇన్నాళ్ళకు ప్రభుత్వం వారి దృష్టికెక్కడం సంతోషించదగ్గ విషయం. ఇది ఈ సుదీర్ఘకాలంలో కొన్ని లక్షల ప్రతులు అమ్ముడుపోయింది. ఎన్ని ముద్రణలు పొందిందో ఎన్ని మార్పులకూ, కూర్పులకూ, చేర్పులకూ లోనైందో టక్కున ఆలెక్క ఏ పరిశోధకుడూ చెప్పలేడు. అసలు ఈ గ్రంథంపైన గ్రంథకర్త పైనా కూలంకషంగా పరిశోధించిన పండితుడన్నవాడే లేడు.

1847 లో తొలిసారి పెద్దబాలశిక్ష అచ్చుపడింది. "ఆంధ్రభాషాభ్యాసము చేయదలిచిన బాలురకు ప్రథమ శిక్షకునుపయుక్తముగా నేర్పరుపబడిన "బాలశిక్ష" అని తొలి ముద్రణలో స్పష్టపరిచారు. ఈసంగతి వావిళ్ళ వెంకటేశ్వర శాస్త్రిగారు 1916 లో చెప్పారు. ప్రథమ ముద్రణకాలంలో ఇది ఉత్త 'బాలశిక్షే' గాని 'పెద్దబాలశిక్ష' కాదు. మొదటి ముద్రణ ప్రతిని ఇప్పుడు సంపాదించడం పులిపాలు తీసుకురావడమే. బ్రిటిష్ మ్యూజియంవారి గ్రంథాలయంలో కూడా ప్రథమ ముద్రణ ప్రతిలేదు.

1856వ సంవత్సరంలో అంటే మొదటి ముద్రణకు రమారమీ పదేళ్ళ తరువాత 'బాలశిక్ష' అనే పేరుతోనే ఒక ముద్రణ వేశారు. అప్పుడు దీని పుటల సంఖ్య 78 డెమ్మీ ఆక్టేవ్ సైజు. దీని ప్రతి ఒకటి బ్రిటిష్ మ్యూజియంలో వుంది. దీని ముఖపత్రం నష్టమైంది.

## పేరు ఎప్పుడువచ్చింది?

1847 నుండి 1856 దాకా "బాలశిక్ష" అనేపేరుతోనే ఈ గ్రంథం ప్రచారం చెందింది. అయితే "పెద్దబాలశిక్ష" అనే పేరు ఎప్పుడు వచ్చింది?

నికరంగా పలానా సంవత్సరంలో అని చెప్పలేంగాని 1865లో ''పెద్దబాలశిక్ష'' అనే పేరుకోనే ఒక ముద్ర జరిగింది. దాని పుటలసంఖ్య తొంబై అంటే మొదటి ముద్రణ కన్నా పన్నెండుపుటలు పెరిగాయన్నమాట. మొదటి ముద్రణలోలేని సాహిత్యవిషయాలూ, ఛందస్సూ సంస్కృత శ్లోకాలూ, భౌగోళిక వివరాలూ ఇందులో చేర్చారు. ఈ చేర్పులవల్లనే ఉత్త బాలశిక్ష పెద్దబాలశిక్షగా మారింది.

1866వ సంవత్సరంలోనే పెద్దబాలశిక్షను మరింత పెంచుతూ ''బాలవివేక కల్పతరువు'' అనే పేరుతో మరొక ఎడిషన్ కూడా వేశారు. దీని ప్రతికూడా బ్రిటిష్ మ్యూజియం గ్రంథాలయంలో వుంది.

కాశీనాథుని నాగేశ్వరరావుగారి ఆంధ్ర వాఙ్మయ సూచికలో 1868 నాటి ఒక బాలశిక్షను సూచించారు. అంటే 1865 తర్వాత మూడేళ్ళలో ఇది ఇంకో ముద్రణ పొందిందన్నమాట. బహుశా ఈ మూడేళ్ళ మధ్యకాలంలో మరొక ముద్రణ పొందినా ఆశ్చర్య పడక్కర్లేదు.

1885లో ''పెద్దబాలశిక్ష'' అన్నపేరుతో మరొక ముద్రణవేశారు. 1898లో పెద్దబాలశిక్షకు ఒక ముద్రణ వుంది. అయితే దీని రచయిత ఎవరో ''ఎం.యస్.బి.వి.యల్'' బహుశా ఇది ప్రచురణ కర్తల పొడి అక్షరాలు కావచ్చు. రచయిత పేరు వాఙ్మయ సూచికలో ఈ పొడి అక్షరాలతో సూచించారు.

## చిన్న బాలశిక్ష

పెద్దబాలశిక్ష అనే పేరుతో ఒక విస్తృత ముద్రణవుంటే దానికి ప్రత్యామ్నాయంగా 'చిన్న బాలశిక్ష' ఒకటి వుందని 1871వ సంవత్సరంలో ఒక చిన్నబాలశిక్ష ముద్రణ పొందినట్టు వాఙ్మయ సూచిక తెలియ చేస్తోంది.

ఇప్పటి వరకూ ఈ భోగట్టాలన్నీ పందొమ్మిదో శతాబ్దానికి చెంది నవే. తొలిసారి అచ్చయిననాటి నుంచి ఆ శతాబ్దిలోని 58వ సంవత్సరాలలో బాలశిక్ష ప్రాచుర్యాన్ని ఈ సమాచారాలు చెప్తాయి. ఇరవయ్యో శతాబ్దిలో ఎన్ని డజన్ల ముద్రణ పొందిందో చెప్పడం కష్టం. అయితే ఒక్క

సుగుణం.గ్రంథకర్త పేరును చెప్పకుండా దోపిడీ ప్రకాశకులు ఈగ్రంథాన్ని అచ్చు వేయనట్టు కనబడుతుంది. రచయిత పేరు ఈ సుదీర్ఘ కాలంలో తెలియక డబ్బు చేసుకొందామనుకొన్న గుజిరీ పుస్తక ప్రకాశకులు పుస్త కాన్ని ప్రచురించి వుండవచ్చు.

## గంథ కర్త

ఇంత సుదీర్ఘ చరిత్రగల గ్రంథాన్ని రచించిన చరితార్థుని పేరు పుదూరు సీతారామశాస్త్రిగారు నిజానికి పుదూరువారిఇంటిపేరు కాదు. అది వారి గ్రామ నామం. నెల్లూరు జిల్లాలోని పుదూరు గ్రామం కొంతమంది ద్రావిడ బ్రాహ్మణుల అగ్రహారం. ఆ ద్రావిడులకు ఆ వూరిపేరువల్ల పుదూరు ద్రావిడులనే పేరు వచ్చింది. వాళ్ళలో చాలా సుప్రసిద్ధమైన ఇంటిపేర్లువున్నాయి. వేదం, చదలవాడ, వావిళ్ళ, నేలటూరు మొదలైన ఇంటి పేర్లవారు వివిధ సాంస్కృతిక రంగాలలో ప్రఖ్యాతులు. పుదూరు (చదలవాడ) సీతారామశాస్త్రిగారు చెన్నపట్నంలో విద్యారంగంలో స్థిర పడ్డారు. ఈయన గురించి చదలవాడ సుందరరామశాస్త్రిగారు 1920లో జరిగిన పుదూరు ద్రావిడ బ్రాహ్మణ మహాసభలో ఇలా చెప్పారు.

''పుదూరు వాస్తవ్యులకు పుదూరు (చదలవాడ) సీతారామశాస్త్రుల వారు చెన్న పట్టణమున కొంతకాలము వాసముచేసి బ్రౌన్ దొరగారివద్ద ముఖ్య పండితులై సంస్కృతాంధ్ర గ్రంథములనేకము పరిశీలించిరి. అమ్మహా పండితులే యమరసింహ ప్రణీతంబైన నామలికంగాను శాసవ నిఘంటువునకు తెనుగుటీక వ్రాసినవారు. (వీరే పెద్దబాల శిక్షయను సద్భూత బాలశిక్షాత్మక గ్రంథమును వ్రాసినారు. ఆంధ్రదేశమునందు కొన్నికోట్ల ప్రతులు ముద్రితమైన పుస్తకమిది. దీని నెరుగని యాంధ్రుడులేడు. వారికి సంస్కృతాంధ్రముల యందు వ్యుత్పన్నమగుశబ్దము లేకుండెనని తత్పరిచయ భాగ్యముగల దుపూరు వెంకటసుబ్బశాస్త్రి ప్రభృతులు చెప్పుట మతిగాదని తదాయనిఘంటు టీకయే తెలుపుచున్నది. విక్రమ సింహాపురి మండలి సర్వ స్వములో ఉటంకించిన వాక్యాలు ఇవి.)

సీతారామశాస్త్రిగారు ఇందులో అక్కడక్కడ పొరబడ్డారు. బ్రౌన్ దొరగారి ముఖ్యపండితులు జూలూరు అప్పయ్య పంతులుగారు గాని, చదలవాడ సీతారామశాస్త్రిగారు కాదు. బ్రౌన్ దొరగారి పండితుల జాబితాలో సీతారామశాస్త్రిగారి పేరు ఎక్కడా నేను జరిపిన విస్తృత పరిశోధనలలో కనబడలేదు. సీతారామశాస్త్రిగారు బ్రౌన్ దొరకు సమకాలికులే గాని వారి ఆశ్రితులు కారు.నిజానికి సీతారామశాస్త్రిగారు మేస్తరు కుకులో దొరగారి ఆశ్రితులు.భావిపరిశోధనలవల్లగాని ఈకుకులో దొర ఎవరో తేలదు. ఈదొర గారి ఆనతి మేరకు సీతారామశాస్త్రిగారు 1830 లో ప్రశ్నోత్తర రత్నమాల అనే పేరుతో ఆంధ్ర వ్యాకరణాన్ని ప్రశ్నలు - జవాబుల రూపంలో రాశారు. దీని వ్రాత ప్రతి మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయంలో ఉంది: (డి 1247) దీనిని 1874 లో చర్చి మిషన్ ప్రెస్‌లో అచ్చువేశారు. తర్వాత వావిళ్ళవారు 1951 లో తిరిగి ప్రచురించారు.

## ర చ నా ప్ర ణా ళి క

సీతారామ శాస్త్రిగారు ఇతర గ్రంథాలు ఎన్ని రచించినా వారికి పెద్ద బాలశిక్షవల్లనే పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. దీని రచనా ప్రణాళిక చాలా జాగ్రత్తగా కుఱ్రవాళ్ళ గ్రహణ శక్తిని దృష్టిలో పెట్టుకొని రూపొందించారు.

సీతారామశాస్త్రిగారు చెన్నపట్టణంలోని హిందూ విద్యా సభలో సంస్కృత పండితులు. ఒక ప్రణాళిక ప్రకారం ఈయన రచించిన గ్రంథానికి వీరి తమ్ములు నారాయణశాస్త్రిగారనే పండితులు ఒక ప్రతిని సిద్ధం చేశారు. దాన్ని వెంకటకృష్ణ శాస్త్రులుగారు పరిష్కరించారు. 1847 లో ప్రభాకర ముద్రాక్షరశాలలో ఇది అచ్చుపడింది. చెన్నపట్టణంలో వివిధ భాషలున్నాయి. వాటిని తెలుగు కుఱ్రవాళ్ళు ఆఫీసుల్లో పనిచేయదలిస్తే నేర్చుకోవచ్చు. అందుకే ఒక్క తెలుగు అక్షరాలనేకాక, కన్నడ, తమిళ, ఇంగ్లీషు అక్షరాలనుకూడా తెలుగు పిల్లలు నేర్చుకొనడానికి ఆదిలో వాటిని కూడా చేర్చారు. గుణింతం లేకుండానే అచ్చులతో, హల్లులతో ఏర్పడే రెండక్షరాల మాటలను ఇచ్చారు. ఉదా : అల, ఆశ, ఇల-ఈల వగై

రాలు. తర్వాత గుణింతం చెప్పాక రెండక్షరాల మాటలు చెప్పారు. ఉదా : అక్క, ఉట్టి, కన్ను, కాలు వగైరాలు. తర్వాత మూడక్షరాల మాటలూ నాలుగక్షరాల మాటలు ఇచ్చారు. ఆ పిమ్మట నీతి వాక్యాలు చెప్పారు. ఉదా :

అలుక పూనరాదు
అతివల గొట్టరాదు
ఆన పెట్టవలదు
ఆజ్ఞ మీరజనదు
......................
జూటతనము తప్పు
జూదమాడ ముప్పు
......................
సఖుల కీడు బాపు
సాటిలేని మేపు

ఈ నీతి వాక్యాలలో అంత్యప్రాసలున్నా, వేరే ప్రాస వాక్యాలను కూడా ఇచ్చారు.

దేవ దేవ రమ్మ
కావుమమ్మ మమ్మ
సతిని బొంది మెలగు
సుతుల బొంది చెలగు
రాజులేని యూళ్ళు
పూజలేని గుళ్ళు

తర్వాత సద్బుద్ధి వాక్యాలు ప్రాసలు లేకుండా ఇచ్చారు. తర్వాత పురాణాలలోని స్త్రీ పురుషుల పేర్లు వాటి వివరణలూ చెప్పారు. తర్వాత దృష్టాంత వాక్యాలు చెప్పారు. ఉదా :

"విద్య వచ్చినవానికిని, విద్య రానివానికిని రూపమొకటిగా నున్నను

విద్య వచ్చినవాదే మేలు. హంసకును, కొంగకును రూపమొకటిగా నున్నను నీళ్ళతో కలిపిన పాలును వేరుపరుచు హంస మేలుగదా !"

## స మా చా ర వై వి ధ్యం

తర్వాత నీతి కథలు చెప్పారు. ఆ తర్వాత ఇంగ్లీషు తెనుగు సంఖ్యలు, ఎక్కాలు, అంశ సంఖ్యలు (పాతిక, అర, ముప్పాతిక, పరక, వీసం, మువ్వీసం వగైరాలు.) సంకలన వ్యవకలనాలూ, భాగహారం, ఉత్త రాది కొలతలు, ద్రవ్యమానం, మెట్రిక్ మానం మొదలైనవి చెప్పారు. తిథి, వార, నక్షత్రాలు, తెలుగు నెలలు, అరవ నెలలు, తురక నెలలు, ఇంగ్లీషు నెలలు కూడా పొందు పర్చారు. "లౌకిక వైదిక గ్రంథ ప్రసిద్ధము లుగా నుండు సంకేతిక సంఖ్యాత నిబంధిత శబ్దముల యనుక్రమణిక", ఛందస్సు, ఉత్తరాలు రాసే పద్ధతులు ఒకటేమిటి బాలురు నేర్చుకోవలసిన వన్నీ ఒక క్రమంలో పూస గుచ్చినట్టు రాశారు.

పెద్దబాలశిక్షతో చదువు మొదలుపెట్టినవారు అందులోని వాక్యాలను ముఖ్యంగా అంత్యప్రాసల వాక్యాలను మరచిపోలేరు. 'షికెలు రాగాలడజన్' రాసిన పఠాభి ఆతర్వాత "కయితనాదయిత" అనే సంకలనగ్రంథం రాశారు. వాటినిండా అంత్యప్రాసల గమ్మత్తులే. పెద్దబాలశిక్ష తమ అభిమాన గ్రంథ మని, దానివల్లనే తన కవితలలో అంత్యప్రాసలు కనబడతాయని పఠాభి తన షష్టిపూర్తి ఉత్సవంలో వేదికమీదనుంచి నెల్లూరులో చెప్పారు. నాకూ 'పెద్దబాలశిక్ష' అంటే ఇష్టం. ఒకప్పుడు దాని వివిధ ఎడిషన్లను సేకరించే వాడిని. నా స్నేహితుల పిల్లల అక్షరాభ్యాసంనాడు ఒక ప్రాచీన ప్రతిని బహూకరించేవాడిని. జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి కొడుకు "శివుడు" అక్ష రాభ్యాసానికి ఒక ప్రతి చాలా అరుదైనది ఇచ్చాను.

## ఎ డి ష న్లు

ఇప్పుడు ఎవరైనా పనిగట్టుకొని వివిధ ఎడిషన్లను సేకరిస్తే ఒక ముద్రణకూ, మరొక ముద్రణకుగల తేడాలూ, చేర్పులూ, కూర్పులూ ఎన్నో తెలియవస్తాయి. వావిళ్ళవారు 1916 లో ఒక విపులమైన ఎడిషన్ తయారు

చేసి ప్రచురించారు. "అక్కడక్కడ కావలసిన మార్పులుచేసి మొట్టమొదట ప్రతిలోనున్నట్టి పుస్తకమును మరల ముద్రించినారము. సంగ్రహముగా భూగోళ విషయములు చరిత్ర విషయములు కొన్ని చేర్చబడినవి" అని చెప్పారు. వావిళ్ళవారే మళ్ళీ 1949 లో మరింత విపులమైన ఎడిషన్ తెచ్చారు. అందులో ఇలా చెప్పారు.

"భారతదేశమునకు స్వరాజ్యము లభించినందున, ఇకముందు దేశ భాషలకు హిందీ అడ్డము తగలనిచో విశేషవ్యాప్తి ఏర్పడి ఇట్టి గ్రంథములు వేలకు వేలు ప్రచారమగునని తలచుచున్నాను — వావిళ్ళ వెంకటేశ్వర శాస్త్రిలు."

1949 నాటి ప్రతినికూడా సంస్కరించి మళ్ళీ ప్రకటించడం అవసరం. ఈ పని ఎవరు చేయాలి : విద్యారత్న నిడదవోలు వెంకటరావు గారు పెద్దబాలశిక్ష గురించి "ఆంధ్ర వచన వాఙ్మయము" అనే గ్రంథంలో రాస్తూ ఇలా చెప్పారు.

"ఇన్ని శతాబ్దముల తరబడిగా బడులలో పాఠ్య గ్రంథముగా అనగా బాలురచే నియతముగా వల్లె వేయించుటకు తగిన ఈ బాలశిక్ష లేక బాల విజ్ఞాన సర్వస్వము ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు తక్షణమే ప్రచురించి ప్రచారములోనికి తెత్తురు గాక."

నిడదవోలువారి ఆకాంక్ష ఇన్నేళ్ళ ప్రతీక్ష తర్వాత సఫలమయ్యే సూచనలు కనబడుతున్నాయి. "పెద్దబాలశిక్ష" వివిధ ముద్రణ ప్రతులను దగ్గర పెట్టుకొని నూతన ప్రతిని తయారు చేయాలి. ఇది చాలా పెద్ద పని. శ్రద్ధతో చేయవలసిన పని.

# సూటైన భావాలూ, తేటైన మాటలూ

యుగకర్త అయిన ప్రతి ప్రతిభావంతునికీ సాహిత్య ప్రయోజనాల గురించి స్పష్టమైన అభిప్రాయాలుంటాయి. అవి అంచంచల విశ్వాసాలు, మహా కవులందరూ మన ఆలోచనా విధానాలను మార్చలేరు. మామూలు మార్గం నుంచి మలుపు తిప్పలేరు. అది ఒక యుగ కర్తకే సాధ్యమవుతుంది.

భాష భావాన్ని ప్రకటించే సాధనం. భాషలో వృత్తి పదాలున్నట్టే ప్రవృత్తి పదాలు కూడా వుంటాయి. సమాజంలో అందరూ సమానులే అయిన కాలంలో సాహిత్య భాషకు, సామాన్యుల భాషకూ తేడా వుండదు. వర్గాలు ఏర్పడ్డాక, వ్యత్యాసాలు పెరిగాక సామాన్యుల భాషకూ, సాహితీపరుల భాషకూ దూరం ఎక్కువవుతుంది. సంకుచిత వర్గ ప్రయోజనాలను అధిగమించి సామాన్యులను దృష్టిలో పెట్టుకున్న ప్రతి సాహిత్య యుగకర్తా తన కాలంలో వున్న భాషా వ్యవస్థను ఒక్కసారి సమీక్షించుకుని ఎటువంటి మార్పును తీసుకురావాలో నిర్ణయించుకుంటాడు. ఆదిలో తిక్కనగారు అదే చేశారు. ఆయన కాలానికి ముందు సాహిత్య పరిస్థితి ఎలావుందో చూస్తే ఆయన పడ్డ ఆవేదన తెలుస్తుంది.

## పు లు ము డు

మన తెలుగు సాహిత్యానికి కన్నడ చంపూ కావ్యాలు ఒరవడి పెట్టాయి. తత్సమపద భూయిష్ఠమైన సమాన కల్పనా పద్య రచన తొలి కన్నడ కావ్యాలలో తెలుగువాళ్ళే ప్రవేశపెట్టారు. పంపడు ప్రతికృతి బంధం, అతిగా ఉదాత్త వస్తు విన్యాసం, లలితపదం, ప్రసన్న కవితాగుణం, మృదు పాచనాక్, శ్రీసుభగం, అలంకృతియుక్తం, అనేక లక్షణగుణ ప్రభావం, ఆ సకలార్థ సంయుతమై ఉండాలన్నాడు.

మన నన్నయ్యగారు కూడా ప్రసన్న కథా కలితార్థయుక్తి, అక్షర రమ్యత, నానా రుచిరార్థాలు వుండాలన్నారు. నన్నయ్యగారి తర్వాత అక్షర రమ్యతకు బదులు పులుముడు ఎక్కువైంది.

## కుకవులు

తిక్కనగారు తన తొలి రచన నిర్వచనోత్తర రామాయణంలో కుకవులను నిందిస్తూ తమ కాలంనాటి సాహిత్యంలో అవ్యవస్థను చక్కగా చెప్పారు. కుకవినీ, దుర్విటుణ్ణీ సరి పోలుస్తూ ఇలా చెప్పారు.

పలుకుల పొంపులేక
రసభంగము సేయుచు
ప్రాతబడ్డ మాటలు తన నేర్పు చూపి
యొకటన్ హృదయం బలరింపనేక
యే పొలపును గావియట్టి క్రమమున్
తమ మెచ్చుగ
లోకమెల్ల నవ్వుల బొరయం జరించు
కుకవుల దుర్విటులట్ల చూడగాన్

(నిర్వచననో 1-6)

తిక్కనగారి కాలంలో కుకవులూ, దుర్విటులూ పలుకు పొందులేక రసభంగం చేస్తూ పాతబడ్డ మాటలతో తమ నేర్పు చూపిస్తూ ఎక్కడా హృదయాన్ని వికసింపచేయలేక ఏదీకాని పద్ధతిలో పొంగిపోతూ లోకంలో నవ్వులపాలవుతారట. తమ కాలంనాటి పులుముడును తిక్కనగారు ఇలా చెప్పారు.

తెలుగు కవిత్వము
చెప్పదలచిన కవి
యర్థమునకు దగియుండెడు
మాటలను గొని
వళులుం బ్రాసలు విలువక
యొగివి బలిమి పుచ్చుట చదుదే !

(నిర్వచననో-1-7)

తెలుగులో కవిత్వం చెప్పదలచినా, కవితా వస్తువు మాత్రం సంస్కృతపురాణేతిహాసాల నుంచే ఎరువు తెచ్చుకోవాలి. సంస్కృతాన్ని తెనిగిస్తున్నప్పుడు అర్థానికి తగ్గ మాటా, మాటకు తగ్గ యతిప్రాసలూ ఎంచుకోవాలి. తెలుగు నుడికారం తెలిస్తేగాని సరైన మాట దొరకదు. కొందరు కవులు సంస్కృత పదాలను యథాతథంగా తెలుగు ఛందస్సులలోకి దిగుమతి చేసేయడం తిక్కనగారి కాలం తరువాత ప్రారంభించారు. ఇలాంటి వాళ్ళనే మొల్ల బాగా దెప్పిపొడిచింది.

మును సంస్కృతంబు దేటగ
తెనిగించెడిచోటనేమి తెలియకయుండున్
ఘనమగు సంస్కృతము చెప్పగా రుచియగునే
జాన్యా విద్య మెరయ గ్రమ్మర

(మొల్ల రామాయణం—పీఠిక 15)

## నా రి కే ళ పా కం

సంస్కృతం తెనిగించే చోట పూర్తిగా తత్సమ శబ్దాలతో బారెడు సమాసాలు కట్టి, చివర డుముపులు చేర్చడం రెడ్డిరాజుల యుగంలో ప్రారంభమైంది. ఈ రాజ కుటుంబాలలోని వ్యక్తులందరూ వారి మాతృభాష తెలుగైనా సంస్కృతంలో గొప్ప గ్రంథాలు రాశారు. ఇది రాచరికపు లక్షణం. స్వంత భాషలోనూ, ప్రజల భాషలోనూ పాలకులు సాధారణంగా సంభాషించరు. జారు చక్రవర్తి కొలువులోని సామంతులూ, శ్రీమంతులూ సర్వులూ రష్యన్ భాషలో కాక ఫ్రెంచి భాషలోనే మాట్లాడుతొనేవారు. అక్టోబర్ విప్లవం తర్వాత లెనిన్ ఫ్రెంచి భాషా పదాలను రష్యన్ భాష నుంచి తొలగించాలని "రష్యన్" పదాలనే ఉపయోగించాలని ఆదేశించవలసి వచ్చింది.

పవిగట్టుకొని నారికేళ పాకంబులో కవిత్వం చెప్పడం ఉన్నత వర్గ స్వభావం అయింది. సోమరిపోతులే దాన్ని అర్థం చేసుకొనలేరట. శ్రీనాథుడు ఒక పద్యంలో శ్రీ హర్షుణ్ణి ఇలా సమర్థించాడు.

పసవడి నారికేళ ఫల పాకమునం
జవిపైన భట్టుహర్షుని కవితాగుంభనములు
సోమరిపోతులు కొందరయ్యా
లేవని కొనియాడ నేరరవి యట్టిద
నడ వరాలు చెక్కు గీటన
లేవవల్బు బాలకుడు
రెండమునం గలగంగ నేర్పునే

(నైషధం 1-17)

మంచి పైలా వచ్చీసులో వున్న పడుచుపిల్ల చెక్కిలి మీద చిటికేస్తే యువకుల మనసులు ఉయ్యాలలూగుతాయిగాని నంటివాళ్ళకే చలనముంటుం దని ఈ వెటకారం. పని కట్టుకొని నారికేళ పాకంలో చెప్పడం ప్రౌఢికి పరాకాష్ఠ. పలుకు నుడికారం తెలిసినా పనికట్టుకొని సంస్కృత భూయిష్ఠ రచన చేస్తేనేగాని పాలకవర్గాలు మెచ్చుకోవు.

పాలకవర్గాలను పట్టించుకొనక భాగవతాన్ని చెప్పిన పోతరాజుగారు కూడా పైవాళ్ళని ఒప్పించడానికి తాపత్రయ పడ్డారే.

కొందరికి తెలుగు గుణమగు
కొందరికిని సంస్కృతంబు గుణమగు
రెండున్ గొందరికి గుణములగు
నేనందరి మెప్పింతు
గృతుల నమ్మెయెడలన్.

(భాగవతం 1-18)

## చిత్ర, బంధ కవిత్వం

అందరినీ మెప్పించడం అందరికీ సాధ్యంకాదు. డబ్బున్నవాణ్ణి డబ్బిచ్చేవాణ్ణి మెప్పించడమే ఉన్నతవర్గాల కవులకు ఉత్తమమనిపించింది. రెడ్డిరాజుల యుగంలో సంస్కృతాభిమానం విపరీతమైతే నవాబుల యుగంలో అచ్చ తెనుగుపై మోజు పెచ్చు పెరిగింది. ఆరవీటి రాజుల యుగంలో

భట్టుమూర్తి కట్టుకున్న పుణ్యం వల్ల శ్లేషలేని పద్యం భేష్ అనిపించు కోవడం తగ్గింది. కడపటి రాజుల యుగం వచ్చేసరికి చిత్ర కవిత్వాలు, బంధ కవిత్వాలు ఉధృతమయ్యాయి. సాహితీపరుల భాషకు, సామాన్యుల భాషకూ యోజనాల దూరం పెరిగింది. మామ్మూలు మనుష్యుల మాటలనే తామూ వాడడం కొందరికి నామోషీ అయింది. ఈ మనస్తత్వాన్ని వీరేశ లింగంగారు హాస్యసంజీవనిలో బాగా వెక్కిరించారు. దాని సారాంశం పొందుపరుస్తున్నాను.

ఒక కరణంగారింట్లో ఒక శాస్త్రుల్లవారు భోంచేస్తున్నారు. "పంతులు గారూ ? పెరుగు దివ్యంగా వున్నది. ఇది ఆవు పెరుగేనా ?" అని శాస్త్రుల్ల వారు అడిగితే "ఆవు పెరుగింత గట్టిగా వుండదు. ఇది బర్రె పెరుగు. శాస్త్రం చదువుకున్నవారు ఇంత మాత్రం తెలుసుకోలేక పోయినారుకదా!" అని పంతులుగారు అన్నారు. ఆ పంతులుగారిని తన పాండిత్యంతో పడ గొట్టాలని శాస్త్రుల్లగారు అటకవంక చూసి ఆలోచించి అమరకోశంలో బర్రె కున్న పర్యాయ పదాలలో ఒకటి ఎంచుకొని "కరణంగారూ మీవద్ద లులాయాలు చాలా వున్నట్టున్నాయే ?" అన్నారు. అటకమీద గుమ్మడికాయ లున్నాయి. వాటినే శాస్త్రుల్లవారు లులాయాలని అన్నారనుకొని "ఎన్నో లేవండి, ఈ వున్నవి సంవత్సరం పొడుగునా కూరలకే చాలవు" అన్నాడు. కరణం వెంకటరావు పంతులగారింట్లో బర్రెల్ని చంపి గొడ్డుమాంసం తింటా రని శంకరశాస్త్రి, బెంబేరు పడ్డాడు. ఊళ్ళో ఆ సంగతి చాటాడు. ఇద్దరూ కోర్టుకెక్కారు.

మేజిస్ట్రేటు :- ఆ మాట యేమిటిలులా-?

శంకర: లులాయమండీ నేను లులాయమంటే ఈ మహానుభావుడు గుమ్మడికాయ అని అర్థం చేసుకొన్నాడు.

మేజి: ఈ మాట యెప్పుడూ విన్నట్టులేదు .... ....

శంక: ఇది సంస్కృతపు మాటండీ ....

పేజి: ఇది సంస్కృతపు మాటా .... అంత పెద్దమాట సెందుకు వుపయోగించావయ్యా? మనం మాట్లాడుకోవడం ఒకరి మాటల అర్థం ఒకరికి తెలియడానికా? మరియెందుకైనానా?

శంక: మాది పండిత సంప్రదాయం గనుక పాండిత్యం కనపడడానికి కాస్త మారుమూల మాట ప్రయోగించినానండి, పామరులు ఉపయోగించే సామాన్యపు మాటలే ఉపయోగిస్తే మా పాండిత్యమూ, మా ఆధిక్యమూ యేమిటండీ?"

## ప్రజల భాష

ఇదీ ఒకనాటి మన పండితుల దోరణి. ఇప్పటికీ ఇదే దోరణిలో కొందరు తమ పాండిత్యాన్ని, ఆధిక్యతనూ ఒలికబోస్తున్నారు. ప్రజానీకంలో ఎక్కువ మంది వుపయోగించే మాటల్నే కవిత్వంలో వాడాలన్న ఇంగితం ఈ శతాబ్దపు తొలి దశాబ్దంలో ఇతోధికమైంది. మారుమూల మాటలకన్నా కవిత్వంలో తేటైన మాటలు వాడాలని యుగకర్త, ఆధునిక సాహిత్య జనకుడు అయిన గురజాడ అప్పారావుగారు సంకల్పించుకొన్నారు. అందుకే

గుత్తునా ముత్యాల సరములు
కూర్చుకొని తేటైన మాటల
కొత్త పాతల మేలు కలయిక
కొమెర్రుంగులు జిమ్మగా

అని ఆధునిక కవిత్వాన్ని ఆరంభించారు. సంస్కృత ఛందస్సులను త్రోసిరాజనికూడా ఛందస్సులను చేపట్టారు. గురజాడ తెచ్చిన విప్లవం భావ కవిత్వపు హయాంలోనూ, అభ్యుదయ కవిత్వపు ఆరంభంలోనూ ఫలించ లేదు. ఆశయాలు ఎంత ఉత్కృష్టమైనవైనా, మన కవులు చాలా మంది శబ్దాడంబరాన్ని వదిలించుకోలేక పోయారు.

## తెలుగులో ఆలోచనా

మాత్రా ఛందస్సులను కూడా విడిచిపెట్టి పూర్తి వచన కవిత్వను

ఆరంభించాకనే పాత వాసనలను మన మధ్య తరగతి కవులు ప్రక్షాళనం చేసుకొనడం ప్రారంభించారు. కొత్త కవిత్వానికి పాతబడ్డ మాటలు పనికి రావు. వాటిలో తమ నేర్పు చూపించదలుచుకొన్నంత కాలం పలుకుల పొందు వుండదు. అందుకే నేను త్వమేవాహం రాస్తున్న తొలిదశలోనే సమకాలిక భాషలోని అవ్యవస్థత తెలిసింది.

"నిర్దేశించిన భావాలను
వాక్యాలు బట్వాడా చెయ్యవు
పదే పదే వాగిన
గ్రామఫోను రికార్డుల మాదిరి
మాటలు ప్రేరణ చెయ్యవు"

....................

....................
"ఉద్దేశించిన భావాల ఆడబొమ్మలికి
వాక్యాలుగడ్డాలూ మీసాలూ పెడతాయి"

....................

....................
"ఒక పదంలో ఇముడవలసిన అర్థం
కొన్ని వాక్యాల విస్తీర్ణతను
దురాక్రమణ చేస్తుంది"

కవి ఎన్నో దృశ్యాలు చూస్తాడు. ఎన్నో శబ్దాలు వింటాడు. కళ్ళుంటే చూసెయ్యమని, వాక్కుంటే వ్రాసెయ్యమని చెప్పిన కవి తాను విన్నవి, కన్నవి విన్నవించగా మాటలకై వెదుకాడగబోతే అవి

పుంఖానుపుంఖంగా
శ్మశానాలవంటి నిఘంటువులు దాటి
వ్యాకరణాల సంకెళ్ళు విడిచి
ఛందస్సుల సర్ప పరిష్వంగం వదలి

వడిగా, వడివడిగా

వెలువడినై, పరుగిడినై నామెద నడుగిడినై

కానీ ఈ చెలరేగిన పరివర్తన మాత్రం "కలగాపులగపు విలయా వర్తపు బలవత్ ఝురవత్ పరివర్తన". అయితే పరివర్తనంటూ ఒకటి ప్రగతిశీలంగా ప్రారంభమైతే ప్రస్థానం విజయవంతమై సత్ఫలితాలు సంభ వించక మానవు.

తెలుగులో ఆలోచించి తెలుగులో రచించే ప్రజాకళారూపాలలో ఇప్పుడా సత్ఫలితాలను కొన్నింటిని చూస్తున్నాం.

# ఇంగ్లీషు జర్నలిజంలో తెలుగువారి ఘనత

సుప్రసిద్ధ పత్రికా సంపాదకుడూ, నిరంతర పాత్రికేయుడూ, బహు గ్రంథకర్తా శ్రీ ఎం. చలపతిరావుగారి మరణంతో దేశం ఒక గొప్ప జర్న లిస్టునూ, తెలుగువారు ఒక గర్వకారణాన్నీ కోల్పోయారు.

చలపతిరావుగారు కేవలం రాతలతో ఊరుకోక చేతలలో కూడా పాత్రికేయుడనిపించుకున్నారు. మేధావులు ట్రేడ్ యూనియన్ కార్యకలాపా లలో పాల్గొనడం నామోషీ అనుకొనే రోజుల్లో వర్కింగ్ జర్నలిస్టుల సంక్షే మం కోసం ఆయన పోరాటాలు సలిపారు. సంఘాన్ని నెలకొల్పారు. ఎన్నో సౌకర్యాలూ, సదుపాయాలూ కల్పించారు. ప్రజాహిత కార్యక్రమాలలో పాల్గొన్నారు.

చలపతిరావుగారు తెలుగువాడు కావడం కేవలం యాదృచ్ఛికం. ఆయన మాతృభాష ఏదైనా ఇంగ్లీషు జర్నలిజంలో ఎత్తులకు ఎదిగి, శిఖరం మీద తిష్టవేసుకోని కూర్చోగలరు. ఆయనస్వభావం అటువంటిది. ఆ కుశాగ్ర బుద్ధి అగ్రగామిగా తప్ప ఇంకో స్థానంలో వుండలేడు. ఇటువంటి వాళ్ళు వేళ్ళమీద లెక్కపెట్టగల సంఖ్యలోనే వుంటారు. అలా వున్నవాళ్ళలో కనీ సం అరడజనుమంది తెలుగువాళ్ళుకావటం మన అదృష్టం. ఈ సందర్భంలో ఇంగ్లీషు జర్నలిజానికి తెలుగువాళ్ళు చేసిన సేవను జ్ఞాపకానికి తెచ్చుకోవడం సముచితమే అనుకొంటాను.

## ముద్రశాలలు

ఆంగ్లేయులతో జర్నలిజం అనేది మనదేశానికి వచ్చింది. ప్రింటింగ్ ప్రెస్సుల స్థాపనవల్ల పుస్తక ప్రచురణకేకాక పత్రికా ప్రకాశకవృత్తి కూడా సాధ్యమైంది. మనదేశంలో ప్రింటింగు ప్రెస్సులు ఏ సంవత్సరాలలో మొద లుపెట్టినదీ చూడండి.

బొంబాయి -- 1674
మద్రాసు -- 1772
కలకత్తా -- 1779

అన్ని నగరాలలోకన్నా కలకత్తాలో 'బాసాహానా' లేటుగా వచ్చినా, అక్కడే మొదటి పత్రిక వెలువడింది. 1780లో కలకత్తా నగరంలో జేమ్ అగస్టస్ హిక్కీ అనే ఆంగ్లేయుడు 'బెంగాల్ గెజెట్' అనే పత్రికను ప్రారంభించాడు. ఈ భారతదేశంలోని ఈమొదటిపత్రిక స్థానిక జర్నలిజానికి నాంది పలికింది. ఇతరులు దీనిని అనుసరించారు. వివిధ రాష్ట్రాలలో, వివిధ భాషలలో పత్రికలు వెలువడ్డాయి. ఆనాడు కలకత్తా నగరం ఈస్టిండియా కంపెనీవారి రాజ్యానికి రాజధాని. సర్వసాధారణంగా రాజధానిలోని ఫ్యాషన్లనే ఇతరులు అవలంబిస్తారు అనుసరిస్తారు. కొన్ని సంవత్సరాలలో వన్నెలు దిద్దారు.

## మద్రాసులో

ఆదిలో దక్షిణ భారతానికి మద్రాసు ముఖ్య పట్టణం. బెంగాలులోని పత్రికలను చూశాక చెన్నపట్టణంలో కూడా పత్రికలను ప్రారంభించారు. 1785 అక్టోబరు పన్నెండో తేదీనాడు "మద్రాసు కోరియర్" అనే పత్రికను ప్రారంభించారు. ఒక్కొక్క ప్రతివెల రూపాయి. ఇది వారపత్రిక 1791 ఆగస్టు 3వ తేదీదాకా బుధవారాలనాడు ప్రచురణ జరిగేది. తరువాత గురువారానికి మార్చారు. ఇది ప్రభుత్వ ప్రకటనలన్నీ గుత్త పుచ్చుకొంది. దీనికి ప్రెసిడెన్సీలో తపాలా సౌకర్యాలన్నీ ఉచితంగా లభించేవి. ఈ లాభసాటి వ్యాపారాన్ని చూశాక ఇతరులు అనుసరించారు.

1795 సంవత్సరం జనవరి ఒకటో తేదీనాడు 'మద్రాస్ గెజిట్' అనే పత్రికను ప్రారంభించారు. కోరియర్‌లోనూ, గెజిట్‌లోనూ తమిళ భాషా ప్రకటనలు కూడా వేసేవారు. [తెలుగు ప్రకటనల గురించి పరిశోధనలు జరగలేదు] చెన్న రాజధానిలో ఎప్పుడైతే రెండు పత్రికలువెలువడడం ప్రారంభ

సామ్రాజ్యవాద ప్రభుత్వం ఉచిత తపాలా సౌకర్యాలను రద్దుచేసింది.

1816 దాకా భారతదేశంలో దేశీయులెవ్వరూ పత్రికాధిపతులుగాగాని, సంపాదకులుగాగాని లేరు. బెంగాలులో రాజా రామమోహనరాయ్‌గారూ, వారి మిత్రులూ తొలి దేశీయ పత్రికలను స్థాపించారు. మద్రాసులో కూడా దేశీయులు పత్రికా ప్రచురణకు పూనుకొన్నారు. 1844వ సంవత్సరానికి ముందు మద్రాసులో "నేటివ్ సర్క్యులేటర్" అనే ఇంగ్లీషు పత్రికను నారాయణస్వామి నాయుడు అనే తెలుగువాడు నడుపుతూ వుండేవాడు. ఇప్పటి దాకా లభ్యమౌతున్న ఆధారాన్నిబట్టి నారాయణస్వామి నాయుడే ఇంగ్లీషు జర్నలిజంలో ప్రవేశించిన మొదటి తెలుగువాడు. ఆయన మరుగున పడి పోయాడు. దానికి కారణం లేకపోలేదు.

## లక్ష్మీనరసు చెట్టి

ఆ రోజుల్లో మద్రాసులోని ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగాలలో గొప్పవెలుగు వెలిగిన తెలుగువాడు గాజుల లక్ష్మీనరసు చెట్టి వ్యక్తిస్వాతంత్ర్య ప్రచారకుడు, ప్రజాస్వాతంత్ర్య సంస్కర్త. చారిత్రక కారణాలవల్ల రాజకీయ సమరయోధుడు. ఇండియాలో వున్న 'ఈస్టు ఇండియా కంపెనీ' వారి ప్రభుత్వం ఇంగ్లండులోని దొరలకు కేవలం తాబేదారు ప్రభుత్వం మాత్రమే అని తెలుసుకొన్నాక అలజడులు, ఆందోళనలూ లేవదీసి ఇంగ్లండుకు మహాజర్లు పెట్టించి చాలా విజయాలు లక్ష్మీనరసు సాధించాడు. ఆంగ్లేయుల అక్రమాలను వారించడానికి ఆయన దేశీయులను కూడగట్టుకున్నాడు.

మద్రాసులో నేటివు సంఘాన్ని ఆయన స్థాపించాడు: దీనిలో ధనవంతులూ, వర్తకులూ, ఉద్యోగస్థులుకాని పెద్దమనుష్యులూ సభ్యులుగా చేరారు. తరచు సమావేశాలు జరిపేవారు. దేశీయ సమస్యలను చర్చించేవారు. తమ అభిప్రాయాలను ప్రజలకు తెలియజేసేవారు. మహాజర్ల ఉద్యమాన్ని నడిపారు. ఈ ఉద్యమాలకు విస్తృత ప్రచారంకావాలి. అందుకు ఆధునిక ప్రచార సాధనాలు అవసరం. అందుచేత లక్ష్మీనరసు ఒక పత్రికను పెట్టాలనుకొన్నాడు. కొత్త పత్రికను పెట్టడంకన్నా అప్పటికేవున్న పత్రికనుకొని నడ

వశం లాభదాయకమని వ్యాపారస్తుడైన లక్ష్మీనరసుకి తట్టింది. వెంటనే నారాయణస్వామి నాయుడు నడుపుతున్న 'నేటివ్ సర్క్యులేటర్' ను కొనేశాడు. ఆ పత్రికకు సొంత ప్రెస్సు వుండటమే ఆకర్షణీయమైన అంశం.

కొన్న పత్రిక పేరును లక్ష్మీనరసు మార్చేశాడు. దాని పేరు "క్రెసెంట్" 1844 అక్టోబరు 2వ తేదీనాడు మొదటి సంచిక వెలువడింది. ఆ రోజుల్లో 'రికార్డర్' అనే పత్రికను క్రైస్తవమిషనరీలు నడుపుతూ వుండేవారు. వాటిలో పడే వ్యాసాలకూ, చేసే ఆరోపణలకు క్రెసెంట్ లో జవాబులు ప్రకటించేవారు. లక్ష్మీనరసు తన పత్రికలో ఏయే వ్యాసాలు రాశాడో దాని పరిశోధనవల్ల తేలాలి. తనకు బహుముఖ వ్యాపకాలు వుండటంతో పత్రికకు సంపాదకునిగా లక్ష్మీనరసు ఒక తెల్లవాడిని నియమించాడు. హార్లీ అనే ఆంగ్లేయుడు తెలుగువాడు నడిపిన పత్రికకు తొలిసంపాదకుడు. ఉత్తరోత్తర క్రెసెంట్ పత్రికకు భారతీయులే సంపాదకులు. మైఖేలు మధుసూదనదత్తు క్రెసెంటు పత్రికకు సంపాదకునిగా పనిచేసినట్లు ఎక్కడో చదివాను. చెక్ చేయాలి.

## చింతామణి

పరరాష్ట్రాలలోని ప్రముఖులు తెలుగువారి ఇంగ్లీషు పత్రికలలో ఆదిలో పనిచేస్తే తెలుగు ప్రముఖులు పర రాష్ట్రాలకు వెళ్ళి పత్రికా సంపాదకులుగా పనిచేయడం చిర్రావూరియజ్ఞేశ్వరచింతామణిగారితో ప్రారంభమైంది. చింతామణిగారు 1880 లో జన్మించారు. స్వస్థలమైన విజయనగరంలోనే వారిలో ప్రాతికేయుని లక్షణాలు పొడచూపాయి. పట్టుమని పద్దెనిమిదేళ్ళ ప్రాయంలో ఆయన విశాఖపట్నంలోని "వైజాగ్ స్పెక్టేటర్" అనే పత్రిక సంపాదకులయ్యారు. నెలజీతం ముప్పయిరూపాయలు. (ఈనాటి ద్రవ్య మానం ప్రకారం మూడువేలకు మించే వుంటుంది.) పత్రికా ప్రపంచంలో కాళ్ళు నిలదొక్కుకొన్నాక చింతామణిగారు తాము నడుపుతున్న పత్రికను మూడువందలరూపాయలకు కొనివేశారు. దానిని తానుండు స్థలం విజయనగరానికి మార్చారు. 'ది హెరాల్డ్' అనే నూతన నామకరణం అచ్చి

రానట్లుంది. పత్రిక అప్పటికాలం బలికి బట్టకట్టలేదు.

1903లో చింతామణిగారు అలహాబాద్‌కు మకాం మార్చారు. పర రాష్ట్రాలలో ప్రతిభను రాణింప చేసుకున్నారు. ఆరాష్ట్రాన్నే స్వరాష్ట్రంకన్న ఎక్కువగా సేవించారు. అఖిల భారత ఖ్యాతిని ఆర్జించారు. ఆయన వల్ల "లీడర్" పత్రికకూ, ఆ పత్రికవల్లకూడా ఆయన ప్రఖ్యాతి ఇనుమడించింది. చింతామణిగారి విషయాలు ఇతర పాత్రికేయులను ఉత్తేజితులను చేశాయి. ఇంగ్లీషు జర్నలిజంలో చెయ్యి తిరుగుతున్న తెలుగువాళ్ళు పర రాష్ట్రాలకు వెళ్ళడానికి సంసిద్ధులయ్యారు. అలా వెళ్ళిన వారిలో కోటంరాజు పున్నయ్యగారు చెప్పుకోదగ్గవారు.

## పున్నయ్య, రామారావు

చీరాలలో పుట్టిన పున్నయ్యగారు మొదట బొంబాయిలో స్థిరపడ్డారు. కాశీనాథుని నాగేశ్వరరావుగారి పరిచయంతో అమృతాంజనం కంపెనీలో ప్రవేశించి "ఆంధ్రపత్రిక" ప్రారంభం నుంచే అందులో పని చేశారు. "ఆంధ్రపత్రిక" బొంబాయినుంచి మద్రాసుకు రాగానే పున్నయ్యగారుకూడా వచ్చారు. తెలుగు జర్నలిజంతోపాటు ఇంగ్లీషు జర్నలిజం కొనసాగించేవారు. "హ్యూమానిటీ" అనే పత్రికను నడిపారు. 1918 ప్రాంతంలో ఆయన కరాచీకివెళ్ళి స్థిరపడ్డారు. "న్యూటైమ్స్" అనే పత్రికకు సంపాదకులయ్యారు. తర్వాత "సింధ్ అబ్జర్వర్" అనే దినపత్రికకు సంపాదకులయ్యారు.

సంయుక్త రాష్ట్రాలలో చింతామణిగారికి ఎంత పేరూ ప్రతిష్ఠా వున్నాయో సింధురాష్ట్రంలో పున్నయ్యగారికి అంతటి ప్రజాభిమానం వుండేది. ఆయన నివసించిన పేటకు "పున్నయ్య పూర్" అని పేరు పెట్టారంటే ఆ ప్రజల ఆదరాభిమానాలు ఎలాంటివో తెలుస్తాయి. 1947లో దేశ విభజన జరిగేదాకా పున్నయ్యగారు కరాచీలోనే వుంటూ పత్రికా వ్యాసంగం నడిపారు. తర్వాత బొంబాయిలో స్థిరపడి అక్కడే కన్ను మూశారు.

పున్నయ్యగారి తర్వాత చెప్పుకోదగ్గ ఇంగ్లీషు జర్నలిజంలోని

తెలుగువెలుగు వారి సోదరుడు కోటంరాజు రామారావుగారు. ఈయన అంచె లంచెలుగాసాగి జవహర్‌లాల్ నెహ్రూగారి "నేషనల్ హెరాల్డు"కు ప్రధాన సంపాదకులుగా ప్రఖ్యాతులయ్యారు. జాతీయ సమస్యలన్నింటిమీద నిశితంగా, నిర్భయంగా, నిర్ద్వంద్వంగా సంపాదకీయాలు, వ్యాఖ్యానాలూ కురిపించేవారు. కోటంరాజు రామారావుగారి సాధనానికి ఎం. చలపతిరావుగారు వారసు లయ్యారు. నేషనల్ హెరాల్డ్‌కు చలపతిరావుగారి పేరు పర్యాయపదమైనది.

ఇంగ్లీషు జర్నలిజంలో చెయ్యితిరిగిన సిద్ధహస్తులు తెలుగువాళ్ళలో ఇంకావున్నారు. స్వరాష్ట్రాన్ని దాటని చంపూరు నరసయ్య స్వరాష్ట్రంలో వుంటూనే దేశవ్యాప్తంగా పేరుతెచ్చుకున్న ఖాసా సుబ్బారావు మొదలైన కీర్తిశేషులు వున్నారు.

విధిచేసిన వేళాకోళం ఏమిటంటే కోటంరాజు రామారావుగారు చలపతిరావుగారు ఒకలాగే దుర్మరణం చెందారు. రామారావుగారు రైల్లోంచి కిందపడి ప్రమాదవశాత్తు మరణించారు. చలపతిరావుగారు ముక్కూ మొహం ఎరగని టీ దుకాణంలో దిక్కులేని చావు పొందారు. అయితే, మహనీయులు మరణిస్తేనేం! చనిపోయిన క్షణం నుంచే మళ్ళీ బతుకుతారు.

# కర్రపెత్తనం - వెర్రితలలు - 1

నిన్నటి దాకా ఒక్క బీహారు రాష్ట్రంలోనే పోలీసులకు కోపం తెప్పిస్తే కళ్ళు పోతాయనుకునేవాళ్ళు: కానీ ఇవాళ మన ఆంధ్రప్రదేశ్‌లో ఆరెకులకు ఆగ్రహం తెప్పిస్తే ఒళ్ళు హూనం చేస్తారన్న సత్యం స్పష్టమైంది. ఒక నికర లక్షణం విశదమైంది.

కొన్ని వ్యాధులు వంశ పారంపర్యంగా వస్తాయి. కొన్ని జాఢ్యాలు జన్మతఃరావు. కొన్నిజబ్బులు గబ్బుకొట్టవు. కొన్నితెగుళ్ళు తెగ కంపు కొడతాయి. కొన్ని రుగ్మతలు ఒంటరిగా రావు. యుగ్మంగానే వస్తాయి. కొన్ని సాంక్రామికంగా ప్రాప్తిస్తాయి. కొన్ని సామూహికంగా విజృంభిస్తాయి. కొన్ని కిల్బిషాలు విషతుల్యాలు. కొన్ని రోగాలు రాజభోగాలు: రాజయోగాలకు ఘంటా పథాలు, మెత్తనివాణ్ణి చూస్తే మొత్తబుద్ధి అనే కండూతి దండనీతి మొండికెత్తినప్పుడు కాక మొదటినుంచీ వస్తున్న మేటితీట. రాజరికం పుట్టినప్పట్నుంచీ రక్షకభటుల రక్తంలో కొన్ని రోగ లక్షణాలు జీర్ణించుకు పోయాయి.

## దండనీతి

మనుధర్మశాస్త్రం ఇవాళ మనధర్మశాస్త్రం కాకపోయినా మనకు మన ప్రతినిధులు (!) రూపొందించిన రాజ్యాంగ చట్టం ఒకటి వున్నా అందులోని విధాయక సూత్రాలను మనం చూసీచూడనట్లు ఊరుకొంటాం. కొన్నిటిపట్ల కళ్ళు మూసుకొంటాం. పేరుకు ప్రజాస్వామ్యం అయినా నిజమైన స్వాములు పెత్తందార్లు మాత్రమే. పెత్తనం చేసేవాడి చేతిలో బెత్తం వుండాలి. దీన్నే సంస్కృతంలో దండం అంటారు. దండనీతిని మనం కర్రపెత్తనం అంటాం.

అన్నీ వేదాల్లోనే వున్నాయనే గట్టి నమ్మకం అన్ని విషయాల్లో వ్యక్తమైందో లేదోగాని దండం మటుకు వేదకాలంనాటి నుంచీవుంది. అయినా ఆ రోజుల్లో పశువులను తోలడానికి మాత్రమే ఆ బడితెను ఉపయోగించే వారు. దయ్యాలనూ భూతాలను వెళ్ళగొట్టడానికి భూతవైద్యుడికే దండం ఇచ్చేవారు. తర్వాత అది ఆయుధమైంది. ఉపనయనంలో వటువును దండాయుధపాణిని చేస్తారు. కుమారస్వాములందరూ దండాయుధపాణులే. శస్త్రంలేని వాణ్ణి గొర్రె కరుస్తుంది కనుక అందరూ చేపాటి కర్రలు పట్టుకోవచ్చుగాని రాజుగారికీ, రాజభటులకూ అలాగా జనం తెలుగుదండం పెట్టకపోతే వాళ్ళ నడుములమీద సంస్కృత దండం విరుగుతుంది. ప్రజలు భయపడినప్పుడే ప్రభుత్వాలు నిలుస్తాయి.

మనువు ఏనాడో చెప్పాడు:
తస్యార్థే సర్వభూతానాం
గోప్తారం ధర్మమాత్మజం
బ్రహ్మ తేజోమయం దండ
మసృజ త్పూర్వమీశ్వరః
తస్య సర్వాణి భూతాని
స్థావరాణి చరాణిచ
భయాద్భోగాయ కల్పం
స్వధర్మాన్న చలంతిచ

మనుధర్మశాస్త్రం 7-14-15

"ఆ రాజు సకల ప్రాణులను కాపాడడానికి ఉపయోగపడేటట్టున్నూ, ధర్మస్వరూపముగనున్నూ బ్రహ్మ తేజస్సు గలవానివిగా బ్రహ్మదేవుడు దండమును ఏర్పరిచాడు. ఆదండమునందు భయముచేత చరాచర భూతకోటి సమస్తం సుఖాన్ని పొందడమేకాక తమతమ ధర్మాలను విడవకుండా అనుష్ఠిస్తున్నాయి" అని శ్లోకాల అర్థం

దండశాస్తి ప్రజాస్సర్వా
దండ ఏవాభి రక్షతి
దండస్సుప్తేషు జాగర్తి
దండం ధర్మ విదుర్బుధా

(7-18)

## రాజ ధర్మాన్ని మాత్రమే

"దండమే సర్వ ప్రజలను ఆజ్ఞచేస్తూవున్నది. దండమొక్కటే రక్షిస్తూ వున్నది. నిద్రించువారి దగ్గర జాగరూకంగా వున్నది. కాబట్టి దండమునే ధర్మ స్వరూపంగా విబుధులు వచిస్తున్నారు" అని ఈ శ్లోకం వివరిస్తుంది. "దండ ఏవాభిరక్షతి" అంటే దేన్ని రక్షిస్తుంది? అని ప్రశ్నించుకొంటే ధర్మాన్ని అని అర్థం చెప్పినా అది సమధర్మాన్ని కాదు రాజధర్మాన్ని మాత్రమే రక్షిస్తుంది అని వ్యాఖ్యానించుకోవాలి.

వర్గ సమాజంలో పాలకవర్గాల ప్రయోజనాలనే ధర్మంగా పేర్కొంటారు. ఆ ధర్మాన్ని రక్షించడానికే దండాన్ని ప్రయోగిస్తారు. నిద్రలోకూడా ఈ ధర్మాన్ని శంకించకుండా దండం పాలితులను భయపెట్టే పని మెట్టుగా పాలకవర్గాలకు వుపయోగపడుతుంది.

సర్వదండ జితోలోకో
దుర్లభోహి శుచిర్నరః
దండస్యహి భయాత్సర్వం
జగద్భోగాయ కల్పతే (7-[illegible]

"దండన చేసినందువల్లి మాత్రమే లోకులు చక్కగా నడుచుకొంటారుగాని స్వభావంవల్ల శుభ్రంగా నడవరు. దండనకు భయపడి లోకమంతా సుఖాన్ని అనుభవిస్తూంది."

ప్రస్తుత వ్యవస్థలో దండనకు భయపడి ఎందరు ఎన్ని సుఖాలు అనుభవించేస్తున్నారో ఏయే విధాలలో చక్కగా, శుభ్రంగా నడుచుకొంటున్నారో వ్యాఖ్యానించక్కర్లేదు. వర్ణాశ్రమ *ధర్మాలను రక్షించడానికి ఒకనాడు దండాన్ని సృష్టించితే అదేధర్మం నేడు వర్గాశ్రయ ధర్మాలను రక్షిస్తూంది. ప్రతిపక్షులపట్ల క్రూరంగాను ఆశ్రితులపట్ల "అస్తినాస్తి"గాను ప్రస్తుత దండం ప్రయోగింప బడుతున్నట్టు గుడ్డివాళ్ళకు సైతం గోచరిస్తుంది. ఇది కౌటిల్యుని కాలంనుంచీ మనకు సంక్రమించిన కౌటిల్యం.

కౌటిల్యునిపూర్వాచార్యులు "లోకయాత్రను సక్రమంగా సాగించ దలచినరాజు ఉద్యతదండుడై వుండాలి. ఎందుకంటే ప్రాణులను వశపర్చు కోవడానికి దండం వంటి సాధనం ఇంకొకటిలేదు." అన్నారు. కౌటిల్యుడు "కాదు" అంటున్నాడు. దండము తీక్షణంగా వుండే పక్షంలో ప్రజలు ఉద్వేగాలకు గురి అవుతారు. దండం మృదువుగా వుండే పక్షంలో ప్రజలు రాజులను అవహేళన చేస్తారు. అందుచేత యథార్థమైన దండాన్ని మాత్రమే పూజించాలి. (ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారి కౌటిల్యుని అర్థశాస్త్రము పుట 10. షరా: 1923 ముద్రణకాదు. 1968 ముద్రణ)

రాజు ఉద్యత దండుడై వుండాలన్నారు. ఉద్యతం అంటే పూనినదీ, పైకెత్తబడినదీ,సిద్ధంగా వున్నదీ అని అర్థం, రెడీగావున్న దండాన్ని వడిగా, హడావిడిగా, జడిగావాడేయడానికి వీలవుతుంది. దండం లౌక్యంగా వుంటే ప్రజలు ఉద్వేగులవుతారని ప్రభువర్గాలకు తెలుసు, అయినా ఉద్వేగులవ వలసిన శ్రామికులు ఉద్వేగపడి ఉద్యమించనంతవరకూ ఏలినవారు ఎంత మాత్రం కలవరపడరు. శ్రామికులకు సంఘంలో జరిగే అన్యాయాలకు వాళ్ళ కర్మ, ప్రారబ్ధం కారణాలనే సిద్ధాంతాన్ని తొలిదగ్గర్నుంచీ నూరిపోశారు. కనుక ఈ జన్మకింతే అనుకొంటూ పూర్వం పడివుండేవారు. దోపిడీని శాస్త్రసమ్మతం చేశాక దాన్ని ఎదిరిస్తే దండధారులు చితకబాది, చావబాది చెవులు మూయవచ్చునని ఆ శాస్త్రమే చెప్తుంది.

## కర్మ సిద్ధాంతం

కర్మసిద్ధాంతాన్ని కష్టజీవులకు వొంట పట్టించాక మనసా, వాచా

కర్మాణా తప్పుచేసి ధర్మాన్ని అతిక్రమించవద్దని హితోపదేశం చేస్తారు మనస్సు చేత చేసిన పుణ్యపాపాల ఫలాలను ఈ జన్మలోగానీ వచ్చేజన్మలో గానీ మనస్సు చేత మాత్రమే అనుభవిస్తారట. వాక్కుచేత చేసే పుణ్యపాపాలు వాక్కుచేత, కాయంచేత చేసే వాటిఫలితాలు కాయంచేతనే ఖాయంగా అనుభవిస్తారట, (కర్మ కాయం చేతతప్ప చేయలేం.) ఈ కర్మ ఫలాన్ని మనుధర్మశాస్త్రం పన్నెండో అధ్యాయంలో పదిలపర్చింది.

మనుష్యుడు దేహంచేత చేయకూడని పనులు చేస్తే స్థావర జన్మాన్ని పొందుతాడట: అంటే చెట్టుగానో పుట్టగానో పుడతాడు, అదే మనుష్యుడు వాక్కుచేత అశుభ కర్మాలను చేసినట్టయితే పక్షిగానో, జంతువుగానో పుడతాడట. మనస్సుచేత పాపకర్మాలను చేస్తే అంత్యజునిగా పుడతాడట. (మను- 12-19)

కర్మ సిద్ధాంతాన్ని ఇంత కచ్చితంగా ప్రబోధించినా ఎవడు చేసుకొన్న పాపానికి వాడే పోతాడని పాలకులు ఊరుకోరు. శిక్షాస్మృతి ప్రకారం దండించవలసిన వాళ్ళని దండించి తీరుతారు. అసమానతలు ఆధారంగా ఏర్పడిన వ్యవస్థలో కొందరిని దండించకూడదు. వాళ్ళు అన్నిటికీ అతీతులు. మనుధర్మశాస్త్రం బ్రాహ్మణులకు దేశ బహిష్కార మొక్కటే దండనలని చెప్తుంది. మిగిలిన వాళ్ళకు మూడురకాల దండనలను విధిస్తుంది. మొదటిది వాగ్దండన, రెండోది మనోదండన, మూడోది కాయదండనం, (సన్యాసులు త్రిదండులు కనుక ఈ మూడు దండనలనూ వాళ్ళకు వాళ్ళే విధించుకొంటారు. అసమాన ధర్మశాస్త్రాలను వచించి, రచించి అమలుపరిచే ఆ గ్రాతి అగ్రవర్ణాలవాళ్ళ జోలికి, అంతిమాశ్రమాన్ని స్వీకరించిన వాళ్ళ

శాంతికీ ప్రభువులు పోరు.) అలగా జనంమీద వాగ్దండనం, మనోదండనం, కాయదండనం చెలాయించవచ్చు.

అపరాధులపట్లా అరి వర్గాలమీద రాజు ఇంకో మూడుదండనాలు విధించవచ్చు. వాటిని "వధోర్థహరణం చైవపరిక్లేశ స్త దైవచ" అన్నారు. వధించడం మొదటి దండోపాయం, ప్రాణంకన్నా ముఖ్యమైన విత్తాన్ని హరించడం రెండోదండోపాయం బాధించడం మూడో మార్గం.

చంపదగినయట్టి శత్రువు తనచేత
జిక్కనేని కీడు సేయరాదు
పొసగమేలు చేసి పొమ్మనుటే చావు
విశ్వదాభిరామ వినురవేమః

ఈ హితోపదేశాన్ని చెవిని పెట్టరు. చంపదగ్గ అపరాధం చేసి నా అభిమానవంతుల్ని చంపకుండా విడిచి పెట్టడమే చంపడంతో సమానమని భావించే రోజులు ఎప్పుడూ వుండవు. జీవనోపాధికి మూలమైన అర్థాన్ని హరించితే ప్రాణహరణం కన్నా చాలా ఎఫెక్టివ్. ఇంక సంక్లేశం కలిగిస్తే బుద్ధి వస్తుందని మన పూర్వులే కాదు సమకాలికులూ భావిస్తారు. "దండోదశ గుణోభవేత్" అనే న్యాయం (!?) "మర్దనం గుణవర్ధనం" అనే చికిత్స సూత్రం ఇప్పటికీ అమలు జరుపుతున్నారు.

దేహశుద్ధి చెస్తేనేగాని బుద్ధిరాదని దండనీతి మీద ఆధారపడేవాళ్ళు భావిస్తారు. దేహంలో దండించదగ్గ స్థానాలను ధర్మశాస్త్రమే ముక్తకంఠంతో ఆదేశిస్తుంది.

దశ స్థానాన్ని దండస్య

మనుస్స్వాయంబు వోబ్రవీత్

త్రిషు వర్ణేషుయానిస్యు

రక్షతో బ్రాహ్మణోవ్రజేత్

(మను—8-124)

సాక్షాత్తూ స్వాయంభు మనువు ఏం సెలవిచ్చాడంటే బ్రాహ్మణుని తప్పించి తక్కిన మూడు వర్ణాల వాళ్ళని పదిచోట్ల దండించవచ్చుట. బ్రాహ్మణుని మాత్రం దండన నుంచి రక్షించాలి. మన ధర్మశాస్త్రాలు పూర్వం బ్రాహ్మణ పక్షపాతాన్ని చూపెడితే, ఇప్పటి చట్ట నిర్మాతలు కొత్త అగ్రవర్ణాన్ని సృష్టిస్తున్నారు. ఎన్నికల కేసులో ఓడిపోయాక ఎమర్జన్సీ విధించాక దేశప్రధానిని ఏ విధమైన సివిల్, క్రిమినల్ చర్యలు శోకమండా రక్షించడానికి చట్టాన్ని మన కళ్ళముందు మార్చిపారెయ్యడం మనమే చూశాం. ఇవాళ మహారాష్ట్రలో శాసన సభ్యుల్నికూడా చట్టానికి అతీతుల్ని చేయడం కోసం చట్టాన్ని గతకాలపు అమలుదారీ షరతుతో మార్చడానికి చేస్తున్న విఫల యత్నాలుకూడా వీక్షిస్తున్నాం. అసమాన ధర్మశాస్త్రాలలో అన్ని కాలాలలోనూ అగ్రవర్ణాలవాళ్ళుగానీ అగ్రవర్గాలవారు గానీ ఉండితీరుతారు. ప్రజాస్వామ్యంలో చట్టంముందు సర్వులూసమానులేగాని కొందరు మరింత సమానులన్న హాస్యోక్తి ఈ వ్యవస్థలో స్వభావోక్తి.

## దండన స్థానాలు

నరేః స్వాయంభావు మనువు దండించదగ్గ పది స్థానాలను నిర్దేశించారని శాస్త్రం చెప్తూంది. ఆ పదీ ఏమిటంటే:

ఉపస్థ ముదరం జిహ్వా
హస్తా పాదౌచ పంచమం
చక్షుర్నాసాతి కర్ణౌచ
ధనం దేహస్త ధైవచ

(మను-8—125)

క్లేశం కలిగించవలసిన పది స్థానాలను పట్టికగా పొందుపరిస్తే కొట్టొచ్చినట్టు కనబడతాయి.

1. ఉపస్థ (మర్మస్థానం)

2. ఉదరం (కడుపు)

3. జిహ్వ (నాలుక)

4. హస్తా (చేతులు)

5. పాదా (కాళ్ళు)

6. చక్షు (కళ్ళు)

7. నాసా (ముక్కు)

8. కర్ణ (చెవులు)

9. ధనం (డబ్బు)

10. దేహం (ఒళ్ళు)

భూమి పుట్టినప్పట్నుంచీ కాకపోయినా భూమీశులు దండనీతిని చేపట్టిన నాటినించీ పాటుపడేవాళ్ళ లోటులేకుండా ఉత్పత్తి చేసేమేటి సంపద పూటుగా దోచుకొంటూ కడుపుకొట్టి, నోరునొక్కి, చేతులుకట్టి, కాళ్ళువిరక్కొట్టి, కళ్లుకప్పి, ముక్కునులిమి, చెవులుమూసి ఒళ్లు హూనం చేస్తూ శాస్త్రోక్తంగా పరిపాలించేస్తున్నారు. అయితే ప్రజలు లేనిదే ప్రభుత్వం వుండదు అని తెలుసుకున్న వాళ్లు కృష్ణదేవరాయలవారిలాగ "దండపారుష్యం" కూడదంటారు.

(ఆముక్తమాల్యద- 4-252)

"మనుదండధరాదులు....దండించియె ధర్మపరులన బరిగిరి.... అట్లాజ్ఞయిడ నంతిమంబగు నీయుగంబున యుగానుసారంబుగ, మితసారంబగు రాజలోకంబునకు శక్యంబు గాదుగదా!....కావున శ్రుత దృష్టంబు లుపేక్షింపక రక్షణ శిక్షణ లాచరించు...." అంటూ ఆముక్త మాల్యదలో రాయలవారు చక్కగా వక్కాణించారు. (అదే ఆశ్వాసములో 285వ నెంబరు వచనంలోని భాగాలు).

రక్షణ శిక్షణలలో రక్షణ అనేమాటకు ఇవాళ మనం శాంతిభద్రతలు అనే పదాలు వాడుతున్నాం. చట్ట ప్రకారం రక్షణ విధులు రక్షకభటులకు శిక్షణ బాధ్యతలు న్యాయస్థానాలకు మనం ఇచ్చాం. రక్షించేవాడి చేతికో లాఠీ ఇచ్చి కర్రపెత్తనం చేయమన్నాం. ఈ కర్రపెత్తనాల వెర్రితలలు వేస్తూంది. బహుముఖాలుగా సాగుతున్న ఈ ఉన్మాదం గురించి ఈ వ్యాసం ఆముఖం మాత్రమే.

# క్రూరపెత్తనం - వైరితలలు - 2

## దొంగా మనిషే!

ఆ విధంగానే పోలీసులు కూడా ప్రజలే ?

వాళ్ళకీ ఇల్లూ వాకిలీ, తల్లీ తోడూ పిల్లా పేకా వుండక తప్పదు. వాళ్ళకీ వ్యక్తిగత జీవనంలో కష్టసుఖాలూ, మంచిచెడ్డలూ ఇతరులకున్నట్టే ఈతిబాధలూ వుంటాయి. నిజ దారసుతోదర పోషణార్థమై కొందరు పోలీసు లవుతారు. కొందరు పాలకవర్గాల వారి భటవర్గంలో చేరుతారు. కోటి విద్యలూ కూటికోసమేగానీ అందరూ అన్నిరకాల కూళ్ళూ తినలేరు. పడుపు కూడూ, బిచ్చపు కూడూ కడు నీచమైనవే గాని ఆయుధోప జీవులు నెత్తుటి కూడు తినక తప్పదు. కత్తి పట్టినవాడు తన నెత్తురోడ్చకా తప్పదు. ఎవరి నెత్తురు చూడకా తప్పదు.

అనాదిగా మన ప్రపంచ చరిత్రలో ఆయుధోప జీవులే అధికార వర్గాలకు అండదండలు వుండేవారు. ఇప్పటికీ ఎప్పటికీ అంతే అని వర్గవ్యవస్థ వున్నంత కాలం చెప్పకోక తప్పదు- దేశ మేలే రాజుకు పూర్వం అష్టాదశ తీర్థుల అవసరం. అందులో సేనాపతి, దౌవారిక, నాయక, దండపాలుడు అనేవలుగురూ ఆయుధోపజీవులు. అంతఃపురాన్ని దౌవారికులు కాపాడేవారు. రాజుకు పద్దెనిమిది మంది తీర్థులేకాక వివిధ రాజకీయ, సైనిక, విద్యావిలాస వృత్తులలో వుండే డెబ్బది రెండు నియోగాలవాళ్ళు కూడా కొలువులో వుండేవారు. ఈ బాహ త్తరి నియోగులలో అంగరక్షకులూ, పురపాలకులూ, ఫణిహారులూ, బంట్లూ, కఠారికులూ, ఆయుధోపజీవులు, వీళ్ళలో బంట్లు అట్టడుగువాళ్ళు.

బంటు, బంట్రోతు, భటుడు అనే మాటలు నేడు రాతలో మాత్రమే వాడుతున్నాంకాని సంభాషణల్లో వ్యవహరించడంలేదు. ఇవాళ మన ఆఫీసుల్లో బంట్రోతులుండరు. వాళ్ళని "క్లాస్ ఫోర్ ఆఫీసర్ల"ని గౌరవించి పిలవడంలో తప్పులేదు. ఈ బంట్రోతుల్నే కొన్నాళ్ళ కిందటిదాకా "ప్యూన్" అని పిలిచే వాళ్ళం. ఈ "ప్యూన్" అన్న మాట చాలా విరివిగా ప్రచారంలో వుండేది గాని ఇది మన దేశీయం కాదు. ఇది పోర్చుగీసు మాట. మన దేశంలో వర్తక వ్యాపారాలు పెట్టుకున్న పాశ్చాత్యులలో బుడితకీచువాళ్ళ ప్రముఖులు. వాళ్ళ భాషలోని పదాలు మన భాషల్లో చేరిపోయాయి. ఆచార్య తూమాటి దొణప్ప "తెలుగులో బుడతకీచు నుడులు" అనే చక్కని పరిశోధన చేశారు.

బుడతకీచు భాషలోని సైనికసంబంధమైన పదాలుగా "అర్మదా, ఓతు, కపితాను, కమాను, కుమందను పటాలము, బత్తేరి, బారకాసు, బొంబాయు మయూరు (లు) సార్జంటు, సోల్దాదు మొదలగు" పదాలనే ఆచార్య దొణప్ప తమ వ్యాసంలో చూపించారు. (చూ॥ భాషాచారిత్రక వ్యాసావళి ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురణ-1972 పుట 255) ఎందువల్లనో "ప్యూన్" అనే మాట వారి దృష్టిలో పడలేదు.

తన "ఇంగ్లీషు తెనుగు నిఘంటు"లో బ్రౌన్ Peon అనే మాటకు కుండలీకరణాలలో (Portugueie for a foot soldier) అనే ఇంగ్లీషు వివరణ ఇచ్చి "బంట్రోతు, ప్యాదా, జవాను, దలాయతు" అని నాలుగు తెలుగు అర్థాలు చెప్పాడు. ఈ బిడతకీచు "ప్యూన్" అనే మాటనే కుంఫిణీవారు నేటీవులలో సాయుధభటులకు వాడేవారు. ఈప్యూనులు సిబ్బందిలో వుండేవారు. సిబ్బంది అనే పదానికి బ్రౌన్ దొర Rangers, Militia, ArmedPeons, Irregular Infantry, An establishment of clerk's, peons Etc అనే ఇంగ్లీషు అర్థాలను, కట్టుబడి వాండ్లు బంట్రోతులు అనే తెలుగు వివరణలు ఇచ్చాడు.

ఇవాళ మనం సిబ్బంది అంటే కచ్చేరి పరివారం అనే అర్థం విరివిగా చెప్పుకొంటున్నాం. అయితే కుంఫిణీ స్థానిక ప్రభువులను నిరాయుధుల్ని చేశాకగాని సిబ్బంది అంటే గుమస్తాల, బంట్రోతుల గుంపు అనే అర్థం రాలేదు. పద్దెనిమిది, పంథొమ్మిదో శతాబ్దాలలో ప్రతిచిన్న నాయకుని దగ్గరా పెద్ద సాయుధసేన వుండేది. ఇందులో కిరాయి సిపాయిలు, కూలిప్యూనులు వుండేవారు. వీళ్ళు ప్రజలను దోచుకుని బతికేవాళ్ళు.

"ప్రజలకు ఆనాడు భద్రతాభావం వుండేదికాదు. తమ అధికారం చెలాయించేందుకు గాను ప్రతి స్థానిక పాలకుడు పెద్ద సైనిక బలగాన్ని పెట్టుకొనేవాడు. చిన్న జమీందారు లేక పాళయగారు (రాయలసీమలో జమీందారుకు పర్యాయపదం) రెండు లేక మూడు వేలమంది సాయుధభటులను పోషించేవాడు. దత్తమండలాలు కంపెనీవారి అధికారంలోకివచ్చే సమయానికి అక్కడ యిలాంటి సాయుధభటులు దాదాపు 30 వేల మంది వుండేవారు. వీరుచేసే అత్యాచారాలకు అంతులేదు. దోపిడీలు, గృహదహనాలు, మానభంగాలు ఏవి జరిగినా అడిగే నాథుడే లేడు. బాధలకు తట్టుకోలేక గ్రామస్థులు తరచు గ్రామాలను వదలి పారిపోయేవారు. ఒక్కొక్కప్పుడు బలవంతుడైన జమీందారు పొరుగున వుంటే అతని రక్షణ కోరేవారు" అని చరిత్రకారులు చెప్తున్నారు. (విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌసు వారి "ఆంధ్రప్రదేశ్ దర్శిని" 1976-పుట 70)

గ్రామాలలో భద్రతా రాహిత్యం వుందిగానీ రాజధానిలో రక్షణ వుం డేదని భ్రమించకూడదు. కంపెనీ యుగంలోని ఏనుగుల వీరాస్వామిగారు తమ కాశీయాత్రలో హైదరాబాద్ నగరాన్ని కూడా చూశారు. తెలంగాణా లోని సంస్థానాలనూ చూశారు. హైదరాబాద్‌లోని కొల్లాపుర,వనపర్తి సంస్థా నాల వారు తరుచుగా తగువులాడి ఒకరి గ్రామాలను ఒకరు కొల్లపెట్టి రైతులను హింసించి గ్రామాదులు పాడుచేయుచున్నారు. ఈ లాగున కలహ ములు పొసగినప్పుడు న్యాయం విచారించి యొకరికొకరికి సమరాస పెట్టకుండా చందూలాల ప్రభృతులు ద్రవ్య కాంక్షచేత ఉభయులకున్ను కల హములు పెంచి వేడుకచూచుచున్నారు.(కాశీయాత్ర చరిత్రపుటలు 24,25).

చందూలాలంటే అప్పటి హైదరాబాద్ దివాన్. ఈయనగారుండే షహరు గురించి వీరాస్వామి అయ్యగారు ఇలా చెప్తున్నారు.

"హైదరాబాద్‌లో మనుష్యులందరున్ను ఆయుధపాణులై మెత్తని వానిని కొట్టి నరుకుతున్నారు. షహరులో చంపినా అడిగే దిక్కులేదు. వీదలు ఏ చెట్టు వేసినా వాటి ఫలమును క్షేమముగా ఆయుధాలే ఆభరణాలుగా నుంచు కొని దర్పమే శ్రేయస్సుగా భావించుకొనియుండే లోకులు అనుభవింప నీయరు. సాత్విక ప్రభుత్వముకల రాజ్యములో మొదిగిన వానికి ఆ షహ రులో ఉనికిన్ని ఆ రాజ్యసంచారమున్ను భయప్రదములుగా ఉంచున్నవి(కాశీ -పుట 36).

వీరాస్వామయ్యగారు సాత్విక రాజ్యం అని నిర్దేశించిన ప్రదేశం కంపెనీవారి పాలనలోవుండే చెన్న రాజధాని. ఈ ప్రెసిడెన్సీలో శాంతి భద్రతలున్నట్లు పైకి కనబడినా రైతులు పరరహితులుగానే రకరకాల దోపి డీలకు లోనయ్యేవారు. కూచిమంచి తిమ్మకవి చెప్పిన కుక్కుటేశ్వర శతకం లోని ఒక పద్యభాగం ఆ నాటి రైతులగోడును విశదపరుస్తుంది.

యెద్దుమందనుగూర్చి యొగసాయమిడితేను

తుదనది యధికారి దోసుకొనియె.
దావు దప్పులకంట దరమ కర్ప్చులకంట
కాను వీసములాగె కరణవయ్య
నల్లమ్మి వతకమ్మి సిల్లర దాసితే

.... .... ....

కళ్ళము కంకులు గాలిబట్టగాబోతె
చుట్టు బాపనోళ్ళు బతకనీరు.

(కుక్కుట నెం. 32)

స్వదేశీయులు ఇలాగ రైతును నతాయించుకొని తింటూవుంటే విదేశీ ప్రభువులు తమకు రావలసిన రెవిన్యూ మొత్తాన్ని చిత్రహింసలుపెట్టి వసూలు చేసేవారు. కుంఫిణీవారి కొలువులో 1828 నుంచి ఒక ముప్పయి సంవత్సరాలు వివిధ హోదాలలో పనిచేసిన స్మాలెట్‌దొర "మద్రాసు హెర్బర్ కమిషన్ నివేదిక—రెవిన్యూ వసూళ్ళలో బలత్కారాలు"అనే అధ్యాయాన్ని తన "మెద్రాస్, ఇట్స్ సివిల్ ఎడ్మినిస్ట్రేషన్...." అనే పుస్తకంలో స్పష్ట పరిచాడు.

కుంఫిణీ దొరతనంలో జిల్లా స్థాయిలో పోలీసుశాఖలోని సిబ్బంది విభాగంలో ఒక సర్దారూ, ఇదరు హావల్దారులు, ఇద్దరు నాయక్‌లూ, ముప్పయినలభై మంది ప్యూనులూ వుండేవారు. గార్డు సెక్షన్‌లో ఒక దఫేదారూ, పన్నెండు పదమూడుమంది దలాయతులూ, ఇరవై ముప్పయిమంది ప్యూనులూ వుండేవారు. జైలు సెక్షన్‌లో ఒక జైలరూ, ఒక లాన్స్ నాయక్ ఇరవైమూడు నుంచి ముప్పయినాలుగుమంది ప్యూనులూ వుండేవారు. తాలూకాస్థాయిలో తాణాదారీ సిబ్బంది ఉండేది. అందులో ఒక పోలీసు అమీన్, ఒక మద్దర్‌గర్, ఒక జమాదార్, ఒక హవల్దార్, ఒక నాయక్, ముప్పయి నుంచి యాభై మంది ప్యూనులూ వుండేవారు. గార్డు సెక్షన్‌లో ఒక గార్డు దఫేదారు క్రింద ముప్పయి నుంచి యాభై దాకా

ప్యూనులుండేవారు. (ఆర్.ఇ. ఫ్రయికెన్‌బెర్గ్ రాసిన గుంటూరు డిస్ట్రిక్ట్ 178-1848 అనే పుస్తకంలో ఒకటవ అనుబంధం).

ఇక గ్రామాలలో రక్షణ వ్యవహారాలూ, నేరపరిశోధన బాధ్యతలూ తలారులపై వుండేవి. ఈ తల్వారీ వ్యవస్థ ఇక్ష్వాకుల కాలంనుంచీ మన ప్రాంతాలలో వుంది. గ్రామాలలో తలవర, తలవరి, తలారి అని పిలిచినా రక్షణ నేరపరిశోధనలో చేసే మండలాధిపతిని "మహాతలవం" అని గౌర వించేవారు. ఈ పదం ఆ నాటి శాసనాలలో కనబడుతుంది. "మహా తల వర" అంటే నేటి కమీషనర్ ఆఫ్ పోలీస్ ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ అనే హోదాల వంటిది.

కాకతీయుల కాలంలోనూ, రెడ్డిరాజులకాలంలోను ఉన్నత సైనికాధి కారులూ, కటకపాలురూ ఉద్యోగ నిర్వహణలో ఎంత కర్కశులైనా కళా పోషణచేసినదాఖలాలువున్నాయి. ఓరుగల్లు నగరానికి ప్రతాపరుద్రుని కాలంలో "కమీషనర్ ఆఫ్ కంటోన్‌మెంట్" అనే ఈనాటి హోదాకు సమానమైన కటకపాలుడు గన్నయ్య నాయకుడు మారనగారి మార్కం డేయ పురాణం అంకితం పుచ్చుకొన్నాడు. ఉన్నతాధికారులు సంస్కార వంతులు, ఉత్తములూ కావచ్చునుగాని బెత్తాలవారు, గేటుకీపర్లుగా బందో బస్తు డ్యూటీలో నున్నవారు వచ్చినవాళ్ళెంత గొప్పవారైనా లక్ష్యపెట్టరు. కవిత్రయంలో ఒకరైన ఎర్రయ్యగారు తమ లక్ష్మీనృసింహావతారం అనే పురాణ కథలో చెప్పినదానినిబట్టి చూస్తే స్వర్గానికెళ్ళినా సవతిపోరు తప్పదు అన్నట్టు వైకుంఠంలోకూడా బిళ్ళ బంట్రోతుల అట్టహాసం వుంటుంది. విష్ణుమూర్తిని కొలచుకొందికి వచ్చిన దిక్పాలకులూ మొదలైనవారిని ఫణి హారు ఎలాగ సర్ది కూర్చోపెడుతున్నారో చూడండి.

అవసరం బిప్పుడు యగునంతదాకను
జగళమె నిలుడు దిక్పాలవరులు

సందడి సేయక యందరు నించుక
సేపు కూర్చుండుడు సిద్ధమునులు
దండియలును మీరు దడియంగ బడకయ
తకయటుపొందు గంధర్వముఖ్యు
లిందాక బొగడితి రించుకపడి ఇంక
జగడంబుమానుడు చరణేంద్రు
లనుచు సుద్ధతవేత్ర దండాభిరామ
హస్తులై పణిహారులం దంద నిలువ
నధికమైయొప్పు సమృద్ధి మాదిదేవు
భూరిమందిర తోరణభూమియందు.

(నృసింహ—1-80)

క్రీస్తుశకం 1300 ప్రాంతాలలో అంటే నేటికి ఆరువందల ఎనభై పైచిలుకు సంవత్సరాల కిందట వంటరెడ్ల పరిపాలనలో వున్న పణిహారులనే ఎర్రయ్యగారు వర్ణించారు. ఈ పణిహారులనే పడిహారులని కూడా పిలుస్తారు. ఇంటి వాకిలిని "పడికట్టు" అంటాం. వాకిలిముందు కాచుకు కూర్చోడాన్ని "పడిగాపులు" అని పేర్కొంటాం. రెడ్డిరాజుల కాలంలో దిక్పాలకులూ, సిద్ధమునులూ, గంధర్వులూ, చారణులూ మొదలైన వారి కలియకకు పడిగాపులుపడేవారని ఎర్రయ్యగారు చెప్తే దామర్ల వెంగళరాజు గారు 1620 ప్రాంతాలలో విశ్వామిత్ర, వాల్మీకిమొదలైనతాహతుగలవాళ్లను బెత్తాలవాళ్ళు ఎలా చెదరగొట్టారో బహుళాశ్వ చరిత్రలో ఇలా చెప్పారు!

ప్రభుగోష్ఠి వేగిరపడకు విశ్వామిత్ర వాల్మీకి వాటిలో పత్తుగాని
భారత ప్రపంచంబు హరియొక్క డడుగునో

జడియక యుత్తరం బిడుముపుల హ
యొక్కచో డర్యో క్తి ద్రొక్కడు పడుదీవు
తెచ్చుకొనే మమతున కిచ్చావత్సా
యొక్కొక్కరె ప్రసంగ మొసగెడుచో గొంద
రడ్డక్రలు వలపదగ్రు మూని
శాస్త్ర సాహిత్యములు మహిచాల జీత
మంచుగల గూరగంపలనే మన కబోద
రాయణ కవిత్వ సందర్భరసము విలుపు
మనుచు దేవరద్వారమపుడు దాటి

(బహుళ 1-110)

ఇది ద్వారకలో కృష్ణుణ్ణి సేవించుకొనడానికి వచ్చే వ్యాస వాల్మీకాది మహాత్ములకు జరిగే మర్యాద. సురలోకంలోనూ సుధర్మంలోనే కాక అసురుల ఆస్థానంలో కూడా ఇంకా పోతనగారి భాగవతంలోని ప్రహ్లాద చరిత్ర చదివితే హిరణ్యకశిపుని దర్బారులో మహా మహావాళ్ళను చారులు ఎలా హడలకొట్టేవారో తెలుస్తుంది. "కోలాహలము మాని కొలువుడు సురలార" అనే పద్యాన్ని ఒక్కసారి చూడుడి (సప్తమస్కంధంలో 101 వ నెంబరు పద్యాం)

అలనాటి వైకుంఠం ద్వారకానగరం వంటి మహా క్షేత్ర వైభవం మన ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ భవన ప్రాంగణాలకు కూడా వుంది. దిక్పాలసిద్ధముని సన్నిభులు మన న్యాయవాదులైతే వ్యాసవాల్మీకాది రచయితలు మన పాత్రికేయులూ అని భావించవచ్చు. అలనాడు సనకసనందనాదులను జయవిజయులు అడ్డికాపాలపాలయ్యారు. నేడు అసెంబ్లీ బందోబస్తు పోలీ

నులు న్యాయవాదుల్ని, పాత్రికేయుల్ని చితక బాదారుగానీ దోషులకు శిక్ష కన్న రక్షకే అవకాశాలు వున్నాయి.

ఈ "కర్రపెత్తనం—వెర్రితలలు" అనే శీర్షికకు రాసిన మొదటి వ్యాసంలో బ్రాహ్మణుడు ఏ తప్పుచేసినా దేశ బహిష్కారమే శిక్ష అని పూర్వులు ఆదేశించారని చెప్పాను. ఇవాళ ఉన్నత పోలీసాఫీసర్లు ఏ తప్పు చేసినా బదిలీ చేయడమే శిక్ష ?

మన ఉన్నతాధికార వర్గం నయా బ్రాహ్మణ్యం !

# గుండెలు బాదుకోవలసిన టెన్నిసన్

ఆంగ్లకవి లార్డ్ ఆల్ ఫ్రెడ్ టెన్నిసన్ (1809-1892) మన గురజాడ అప్పారావుగారికి వయసులో ఒక తరం పెద్దవాడైనా సమకాలికుడు కొన్ని విధాల పోలిస్తే సమ ఉజ్జీ అప్పారావుగారు కన్యాశుల్కం నాటకాన్ని ప్రదర్శనకోసం రాస్తున్నప్పుడు టెన్నిసన్ బతికేవున్నాడు. మొదటి కన్యాశుల్కంలో గిరీశం తాను రాసిన "ది విడో" అనే ఆంగ్ల పద్యాలను వెంకటేశానికి చెప్తాడు. వాటిని "రిఫార్మర్"లో అచ్చువేస్తే చూసి టెన్నిసన్ గుండెలు బాదుకొన్నాడని డబ్బీలు కొడతాడు. గిరీశం "ది విడో" పద్యాలు రాస్తున్నప్పుడు, అచ్చు వేస్తున్నప్పుడు అల్‌ఫ్రెడ్ టెన్నిసన్ బ్రతికే వున్నాడంటే మొదటి కన్యాశుల్కం రచనా కాలం నాటికి సజీవుడనే చెప్పాలి.

ఆల్ ఫ్రెడ్ టెన్నిసన్ 1892 అక్టోబరు ఆరవ తేదీ గురువారం నాడు మరణించాడు. కన్యాశుల్క రచనా, ప్రదర్శనా అంతకుముందే జరిగాయి. ఈ సంగతి నేను బంగోరె ప్రచురించిన మొదటి కన్యాశుల్కం పీఠికల్లో వెల్లడిచేశాను. (బలవన్మరణంతో చచ్చి ఏం సాధించాడో, ఎవరిని సాధించాడో గాని బంగోరె బతికున్నప్పుడు మొదటి కన్యాశుల్కం పాఠాన్ని బతికించాడు. సజీవుడుగా వుంటే, ఈ వ్యాసాన్ని చదివి ఎంత సంతోషించేవాడో! ప్చ్!)

### కొన్ని పోలికలు

ఆల్‌ఫ్రెడ్ టెన్నిసన్‌కూ అప్పారావుగారికీ వున్న పోలికలను చెప్పాలంటే చాలా వున్నాయి. టెన్నిసన్‌కు పేరు ప్రఖ్యాతులు తెచ్చిన ప్రసిద్ధ కావ్యం "ఇన్ మెమోరియం" అప్పారావుగారి అనన్య సామాన్య రచన కన్యాశుల్కం. ఈ రెండు మహా కావ్యాలను ఇద్దరు కవులూ మెరుగులు పెంచుకుంటూ పోయారు, తన ప్రాణ స్నేహితుడు ఆర్థర్ హాలం మరణిస్తే, టెన్ని

సన్ అతని సంస్మరణలో మొదటి కావ్యరచన చేశాడు, పదిహేడు సంవత్స రాలపాటు ఈ కావ్యాన్ని పెంచుకొంటూ పోయాడు. ముఖ పత్రంపైన కవి నామాన్ని చెప్పక పోయినా శైలినిబట్టి "సంస్మరణతో" అనే ఈ కావ్యాన్ని ఎవరు రాశారో సహృదయులు ఇట్టే పోల్చుకొని మెచ్చుకున్నారు.

అప్పారావుగారు తమ సుప్రసిద్ధనాటకం కన్యాశుల్కాన్ని ప్రదర్శన కోసం మొదట 1892లో రాశారు. తమ పోషకులు ఆనందగజపతి మహారాజు చేయించిన బాల్య వివాహాల లెక్కలు చూసి బాధపడి కన్యాశుల్క దురాచారాన్ని దుయ్యబడుతూ అప్పారావుగారు ఆ నాటకాన్ని రచించారు. సంఘంలోని అత్యధిక సంఖ్యాకులు నిరక్షరాస్యులైనప్పుడు నాటక ప్రదర్శన వల్లనే ప్రయోజనం సిద్ధిస్తుందని అప్పారావుగారు భావించారు.

అందుకే చాలా చాలా ప్రదర్శనలు జరిగిన తరువాత కూడా దాన్ని ప్రచు రించలేదు. నాటకాన్ని చూసి మెచ్చుకొన్న వాళ్ళు కోరగా, కోరగా అయిదేళ్ళ తరువాత 1897 లో మొదటిసారిగా పుస్తకరూపంలో కన్యాశుల్క నాటకాన్ని అచ్చు వేశారు. పదిహేను సంవత్సరాల పాటు మనస్సులో ఈ నాటకానికి సంపూర్ణ మహా కావ్యత్వం ఎలా మలచి తీసుకురావాలో ఆలోసిస్తూ తిరగరాసి. మెరుగుదిద్ది. 1910 లో మళ్ళా ప్రకటించారు.

## చిత్రిక పని

మొదట రాసిన రచనలు పెంచుకొంటూ పోవడం, తిరగ రాయడం సాహిత్య బాధ్యతలను దృష్టిలో పెట్టుకొన్న రచయితలకు ముఖ్య లక్షణం. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ ప్రబుద్ధాంధ్రలోను, ఇతర పత్రికలలోనూ ప్రచురించిన తమ కథలను ఎన్నింటినో పుస్తక రూపంలో ప్రచురిస్తున్నప్పుడు మార్పులు, చేర్పులు, పెంపుదలలు జరిగాయని చెప్తూ మరీ ప్రచురించారు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు సరేసరి. వ్రాస్తున్న పద్యాన్ని నెలలతరబడి చిత్రిక పట్టనిదే, నగిషీలు చెక్కనిదే ప్రచురించేవారు కాదు.

అయితే నిడివి మీద నిదానంగా తుడుపులతో, కొట్టివేతలతో, సవరణ లతో సాపు రాసినదే మహా కావ్యమవుతుందని భావించకూడదు. ఆవేశంలో అప్పటికప్పుడు ఉన్న పళంగా ఏకబిగిని రాసిన, పద్యాలెన్నో ప్రశస్తమై ప్రసిద్ధమైనాయి. ఆల్‌ఫ్రెడ్ టెన్నిసన్ రాసిన "ది చార్జ్ ఆఫ్ ది లైట్ బ్రిగేడ్" అనే ఖండకావ్యం ఆవేశంలో అప్పటికప్పుడు రాసినదే. 1854 డిసెంబరు మాసంలో "టైమ్స్" దినపత్రికలో ఒకహృదయవిదారకమైన యుద్ధవార్తను టెన్నిసన్ చదివాడు. బాలక్లావా యుద్ధంలో ఎవరో దారుణమైన పొరపాటు చేయడం వల్ల ఒక అశ్వికదళం వీరోచితంగా పోరాడి సంపూర్ణంగా నశించి పోయింది. టైమ్స్ పత్రికా విలేకరి కథనాన్ని చదివితే ఆ వార్త టెన్నిసన్ మనస్సును కలచి వేసింది. ఆవేశపూరితుడయ్యాడు. కూర్చున్న కుర్చీలోంచి కదలకుండా ఏకబిగిని ఒక ఖండకావ్యాన్ని రచించాడు.

డిసెంబర్ 9 వ తారీఖు "ఎగ్జామినర్" పత్రికలో దాన్ని వెనువెంటనే ప్రచురించాడు. (పత్రికా విలేకరుల కథనాలు ప్రబలంగా కొన్ని కావ్యాలకు ప్రోద్బలాలవుతాయి. కృష్ణా పత్రికలోని ఒక వార్తను చదివి నేను నా త్యాగమే ఊహాన్ని మొదలుపెట్టాను)

ఏకబిగి రచన

ఆల్‌ఫ్రెడ్ టెన్నిసన్‌లాగే గురజాడ అప్పారావుగారు కూడా కొన్ని పద్యాలను ఆవేశపూరితంగా ఒక్క "సిట్టింగ్" లో రాసి వుంటారు. (అలాగే చేసిన రచనల వివరాలు మనకు దక్కకపోవడం విచారకరం) ఆల్‌ఫ్రెడ్

టెన్నిసన్‌కీ అప్పారావు గారికీ మరికొన్ని పోలికలు వున్నాయి. టెన్నిసన్ తన "ఇన్ మెమోరియం" కావ్యాన్ని ఒక నూతన ఛందస్సులో రచించారు. ఇది నాలుగు పాదాల పద్యాల గుచ్ఛం.

ఈ ఛందస్సును తానే మొట్టమొదటి సారిగా కనిపెట్టానని టెన్నిసన్ చాలా మురిసిపోయాడు. మన అప్పారావు గారు ఒకానొక పార్శీగజల్ నడకను దృష్టిలో పెట్టుకొని ముత్యాలసరం అనే నూతన ఛందస్సును సృష్టించామని రాసుకొన్నారు.

అయితే ఆల్‌ఫ్రెడ్ టెన్నిసన్ తన వినూత్న సృష్టి అనుకొన్న ఛందస్సు అంతకుముందు వాడకంలో వున్నదే. టెన్నిసన్‌కు చాలా ప్రాచీనులు సర్ ఫిలిప్‌సిడ్నీ, బెన్‌జాన్సన్. మరీ ముఖ్యంగా చెర్‌బరీకి చెందిన లార్డ్ హెర్బర్టు అనే కవి ఈ ఛందస్సును ఎన్నడో చేపట్టాడు.

పాత ఛందస్సే

మన అప్పారావుగారి విషయంలోనూ ఇంతే. ఆయన రూపొందించిన ముత్యాలసరం జాతి జీవనంలో వున్న పాత ఛందస్సే. "గుమ్మడేడే గోపి దేవి" అనే ఆడవాళ్ళ పాటలోనే కాక కందుకూరి రుద్రకవి రాసిన "సుగ్రీవ విజయం" అనే యక్షగాన ప్రబంధంలో ఈ ఛదదస్సు కనబడుతుంది. రుద్రకవి కృష్ణరాయల కాలం నాటివాడు. ఎంతలేదన్నా గురజాడ అప్పారావు గారికి అయిదు వందల సంవత్సరాల పూర్వమే ముత్యాలసరం తెలుగువాళ్ళ దేశి ఛందస్సుగా జాతి జీవనంలో వున్నదే.

ఆల్‌ఫ్రెడ్ టెన్నిసన్‌కూ అప్పారావు గారికి వున్న ఇంకో పోలిక ఏమిటంటే ఇద్దరి పద్య రచనలనూ ఆనాటి సాహిత్య లోకంలోని ప్రబుద్ధులు

వెంటనే మెచ్చుకోలేదు. డ్యూక్ ఆఫ్ వెల్లింగ్‌టన్ మరణిస్తే టెన్నిసన్ ఒక "ఓడ్" కావ్యాన్ని రాశాడు. ఈ సంబోధనా గేయంలోని ఛందస్సును గాని విషయాన్ని ఆగాటి వాళ్ళు ఆదరించలేదు. అప్పారావుగారి ముత్యాల సరాలను ఛాందసులు మెచ్చుకోలేదు. అందు అప్పారావుగారు ఆవిలోనే ఇలాగా అన్నారు.

మెచ్చనంటావీవు నీ విక
మెచ్చకుంటే మించిపాయెను
కొయ్యబొమ్మలు మెచ్చు కళ్ళకు
కోమలుల సౌరెక్కునా ?

నిజమైన కొత్త కవిత్వాన్ని ఒక పట్టాన అందరూ ఆదరించకపోవడం ఒక నిజాన్ని నిరూపిస్తుంది. ప్రతి సరికొత్త కవీ పాఠక లోకంలో ఒక కొత్త అభిరుచిని మెల్లి మెల్లిగా కలిగించాలి. ఆ అభిరుచి మూలంగానే ఆ కవిత్వాన్ని చదివి ఆనదించడం జరుగుతుంది.

రాజాశ్రయం

ఆల్‌ఫ్రెడ్ టెన్నిసన్‌కూ అప్పారావుగారికీ రాజాశ్రయం లభించింది. 1845 లో ఆంగ్ల ప్రభుత్వపు ప్రధాని టెన్నిసన్‌కు ఏటా రెండు వందల పౌండ్లు పింఛను ఏర్పాటు చేశాడు. 1883 డిసెంబర్‌లో "దివాన్‌గిరీ" చెలాయిస్తున్న గ్లాడ్‌స్టన్ తన చిరకాల స్నేహితుడైన టెన్నిసన్‌కు లార్డు షిప్ అనే చిన్న జమీందారినీ. పెద్ద మొఖాసాను ఇప్పించాడు. మన అప్పారావు గారిని విజయనగరం సంస్థానం, రీవాసర్కార్ చాలా పోషించారు.

టెన్నిసన్ కేంబ్రిడ్జిలో 1981 దాకా చదువుకొన్నారు. కానీ డిగ్రీ తీసుకోలేదు. అయితే ఆక్స్‌ఫర్డు యూనివర్శిటీ మాత్రం 1855లో "డి.సి.యల్."

అనే డిగ్రీని ఇచ్చింది. టెన్నిసన్ రచించిన **Garath. Lynette** అనే రెండు కావ్యాల వ్రాత ప్రతులను ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయపు బోడిలియన్ గ్రంథాలయం భద్రపర్చింది. (బోడిలియన్ గ్రంథాలయంలో ఎవరెవరి రచనల వ్రాత ప్రతులూ, మొదటి ముద్రణలూ, ప్రదర్శన మంజూషలలో నిక్షిప్తం చేశారో చాలా ఓపికగా సోమసుందర్ మా పర్యటనలలో నోట్స్ చేశాడు.)

అప్పారావుగారి వ్రాతప్రతులను ఏ విశ్వ విద్యాలయం భద్రాపర్చాలని పూనుకోలేదు. అప్పారావుగారికి మద్రాసు విశ్వవిద్యాలయం ఫెలోషిప్పును ఇచ్చింది గానీ, ఆయన రాసిన డిసెంట్ పత్రం వ్రాత ప్రతిని జాగ్రత్తగా రికార్డులో వుంచిందో లేదో తెలియదు. అప్పారావుగారి డైరీలను, లేఖలనూ, అముద్రిత రచనలను సేకరించి భద్రపర్చాలనీ, ప్రచురించాలనీ ఒక్క కమ్యూనిస్టులే పట్టించుకొన్నారు. పాతికేళ్ళ కిందటే ఆరు సంపుటాలు ప్రచురించారు. [విశాలాంధ్ర ప్రచురణాలయం వారు ఆ రచనలను మళ్ళా కొత్తగా ముద్రిస్తున్నారన్న సంతోష వార్త ఈ మధ్యనే విన్నాను.]

అయితే, వ్రాత ప్రతులు చెల్లాచెదురయి పోతాయి. అవన్నీ ఒక్క చోటనే తన పూర్వీకుడు పుట్టినచోటనే వుండాలని లార్డు టెన్నిసన్ రెండు లక్షల పౌండ్లు పోతే పోయాయని లింకన్ కౌంటీ గ్రంథాలయానికే విక్రయించాడు.

బ్రిటన్‌లో టెన్నిసన్ పరిశోధనా కేంద్రం ఒకటి లింకన్ పట్టణం లోనే వుంది. టెన్నిసన్ వ్రాత ప్రతులను కొనాలని నిశ్చయించుకొన్నాక ఒక విజ్ఞప్తి చేశారు. నేషనల్ హెరిటేజ్ మెమోరియల్ ఫండ్ వారూ లింకన్ స్థానిక ప్రభుత్వం వారూ, పిలిగ్రిం ట్రస్టులనే ఇంకొక కేంద్ర ప్రభు

త్వపు ఫండ్‌వారు తలో యాభై వేల పౌండ్లు విరాళమిచ్చి లింకన్ కౌంటీ గ్రంథాలయానికి సహాయం చేశారు.

టెన్నిసన్ వ్రాత ప్రతులను ఖరీదు కట్టిన షరాబులు బ్రిటన్‌లో చాలా పేరుబడిన పుస్తక విక్రయ సంస్థల వారే. Sotheby అనే ఒక సంస్థా, Quaritch అనే మరొక సంస్థా ఉమ్మడిగా ఉల్లాకు వేశారు. కవుల లిఖిత ప్రతులకు ఖరీదు కట్టే షరాబులు వున్నందుకు సంతోషించాలి.

గిరీశం రాసిన 'ది విడో' పద్యాన్ని చదివి టెన్నిసన్ గుండెలు బాదు కొనడం జరగకపోయినాఇప్పుడు టెన్నిసన్ వ్రాతప్రతులు విక్రయ వార్తను విని "తెలుగు దేశం"లోని చాలామంది గిరీశాలు గుండెలు బాదుకోక తప్పదు.

## కవుల మ్యూజియంలో

విజయనగరంలో గురజాడ అప్పారావుగారి గృహాన్ని మన ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం జాతీయం చేసిందన్న వార్త పత్రికలలో చదవడమే తప్ప ఆ ఇంటిని ఒక మ్యూజియంగా మార్చే ప్రయత్నాలేమిటో తెలియడంలేదు. ఇప్పుడు మా ఇంగ్లండు పర్యటనలో నేనూ సోమసుందర్ రస్కిన్ మ్యూజి యం. వర్డ్సువర్తు మ్యూజియం చూస్తున్నప్పుడు కందుకూరి మ్యూజియం. గురజాడ మ్యూజియం మన ఆంధ్రులు ఏర్పరచుకోలేక పోయినందుకు కంట నీరు పెట్టుకొంటున్నాం. సిగ్గుపడిపోతున్నాం. "మనవాళ్ళు ఒట్టివెధవాయ లోయ్" అని గిరీశం ఊరికే అన్నాడా మరి?

మొన్న అగస్టు 13వ తేదీనాడు గార్డియన్ పత్రికలో టెన్నిసన్ వ్రాత ప్రతుల గురించి ఒక వార్త చదివాను. టెన్నిసన్ పుట్టి పెరిగిన "లింకన్" తాలూకా గ్రంథాలయం లక్ష ఏభై వేల పౌండ్లు చెల్లించి టెన్ని సన్ వ్రాత ప్రతులను కొనుక్కొంది. నిజానికి ఈ వ్రాత ప్రతుల బజారు ధర

మూడు లక్షల యాభై వేల పౌండ్లని అంచనా వేశారు. ప్రాచీన గ్రంథ విక్రేతల ద్వారా అమ్ముడు చేస్తే ఈ పెద్ద మొత్తం పెన్నిసన్‌కు ప్రస్తుతపు వారసుడైన లార్డు పెన్నిసన్‌కు వచ్చేది.

* — *

# బర్మింగ్‌హాంలో నా పరిశోధనలు

ఇక మీదట కొన్ని వారాల పాటు, బహుశా పదిహేను వారాల ఈ శీర్షిక క్రింద నేను రాసే వ్యాసాలు ఇంగ్లండు నుంచి పోస్టుచేస్తూ వుంటాను. నేనూ, సోమసుందర్ ప్రస్తుతం ఇంగ్లండులో పర్యటనలు చేస్తున్నాం. ఇప్పుడు బర్మింగ్‌హాంలో వున్నాం.

నేను ఎక్కడ వున్నా, నా పరిశోధనలకు ఆస్కారం వుంటుందేమో అని వాకబు చేస్తాను. రాగానే అది చేశాను. మా ఇంగ్లండు పర్యటనకు ఒక ప్రణాళికగా రూపొందించి, మమ్మల్ని పిలిపించి మాకు ఆతిథ్యం ఇస్తున్న డాక్టర్లు శ్రీ చావరాల బాబూరావుగారూ, శ్రీ జమలాపురం హరగోపాల్ గారూ బర్మింగ్‌హాంలో పరిశోధనా సౌకర్యాలు కొన్ని వుండవచ్చు నన్నారు. వీరు మెడికల్ డాక్టర్లు. సాహిత్యంపైన అభిమానం మెండుగావున్నా పరిశోధ నల గురించి అనుభవం పరిమితం. బర్మింగ్‌హాం ఇంగ్లాండులోని పెద్ద నగ రాలలో ఒకటి. అందుచేత సలపూర్ణమైన సౌకర్యాలు వుంటాయనే నమ్మకం నాకు కలిగింది.

బర్మింగ్‌హాంలో ఒక సెంట్రల్ లైబ్రరీ వుంది. ఆగస్టు 8 వ తేదీ, మంగళవారం నాడు ఈ కేంద్ర గ్రంథాలయంలో డాక్టర్ బాబూరావుగారు

నన్ను విడిచి పెట్టారు. ఇది చాలా పెద్ద లైబ్రరీ. మద్రాసులోని కన్నెమరా కన్నా కొన్ని విషయాలలో పెద్దదని చెప్పవచ్చు.

## గ్రంథాలయం వింతలు

గ్రంథాలయంలోనికి అడుగు పెట్టగానే ఒక ప్రవేశ పత్రం ఒకొక్కరికి ఇస్తారు. మనకు కావలసిన గ్రంథాన్ని ఎంచుకొని దాని వివరాలు ఒక ఫారం పైన వ్రాసి ఉద్యోగికి మన ప్రవేశ పత్రంతో పాటు ఇవ్వాలి ఫారాన్ని. ప్రవేశ పత్రాన్ని తమ దగ్గర వుంచుకుని గ్రంథాలయ వుద్యోగులు మనం కోరిన గ్రంథాన్ని తీసి ఇస్తారు. దానితో మన పని తీరిపోయాక గ్రంథాన్ని వాపసు చేశాక మన ప్రవేశ పత్రాన్ని మనకు తిరిగి ఇస్తారు. మళ్ళీ కొత్త గ్రంథం తీసుకుంటున్నప్పుడు ఇదే రీతిని అవలంబించాలి. మన చేతిలో గ్రంథం వున్నప్పుడు మన దగ్గర ప్రవేశ పత్రం వుండదు. ప్రవేశపత్రాన్ని మనం గేటు దగ్గర సమర్పించకపోతే గ్రంథాలయంనుండి నిష్క్రమించలేం. ఏ పాఠకుని దగ్గరా ప్రాచీన గ్రంథాలూ, ప్రవేశపత్రం ఏక కాలంలో వుండడానికి వీలులేదు.

బర్మింగ్‌హాం కేంద్ర గ్రంథాలయం ఎనిమిది అంతస్తుల భవనం. ఒకొక్క అంతస్తులో కొన్ని కొన్ని విభాగాలున్నాయి. మనకు కావలసిన గ్రంథాలు ఏ అంతస్తులో వుంటాయో విభాగ సూచికను చూసుకొని అక్కడకు వెళ్ళవచ్చు. ఏ అంతస్తులోకైనా కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళక్కర్లేదు. కదిలే మెట్ల సౌకర్యం వుంది. ఎగువకు ఒక ప్రక్క, దిగువకు ఒక పక్క కదిలే మెట్ల మర పట్టెడి తివాసీ లుంటాయి. అరేబియన్ రాత్రుల కథల్లో ఎగిరే తివాసీలు కల్పనే కావచ్చు గాని ఈ ఆధునిక యుగంలో ఎక్కడానికి

దిగడానికి వీల్తైన మరణవాసీ పట్టైన మెట్లు సునాయాసంగా మనల్ని ఒక అంతస్తు నుంచి వేరొక అంతస్తుకు నిలుచున్న పాళంగా తీసుకువెళతాయి.

భారతదేశంలో నేడు సర్ థామస్ మన్రో పైనా, కర్నల్ కాలిన్ మెకంజీ పైనా చార్లెస్ ఫిలిప్ బ్రౌనుపైనా విపులమైన పరిశోధనలు ఇంతకు ముందు చేశాను. అయినా బ్రిటన్‌లో ఇంకా చేయవలసిన పరిశోధనలు బోలెడువున్నాయి. బర్మింగ్‌హాంలో ఈ పరిశోధనలు మళ్ళా మొదలు పెట్టాను.

సార్ థామస్ మన్రో ఇంగ్లండులో పుట్టినా, మన తెలుగుగడ్డ మీద చనిపోయాడు. చార్లెస్ ఫిలిప్‌బ్రౌను మనదేశంలోనే (కలకత్తాలో పుట్టినా తన స్వదేశంలో మరణించాడు) మన్రో లాగే మెకెంజీ కూడా భారతదేశంలో మరణించాడు. ఈ ముగ్గురు తెలుగు రైతులకూ, తెలుగు సాహిత్యానికీ చేసిన ఉపకారాలు ఇన్నీ అన్నీ కావు. తమ సమకాలికులు భారతదేశాన్ని దోచుకొని స్వదేశానికి పోతూవుంటే-ఈ తెల్లదొరలు మన సంస్కృతిని తవ్వి మన అలకెత్తారు. తమ స్వంత డబ్బును వేలలెక్కలో ఖర్చుపెట్టి, గొప్ప గ్రంథ సంచయనాన్ని పోగుచేసి మనకు ఇచ్చిపోయారు.

నేను మన్రో, మెకంజీల జన్మస్థలాన్నీ, బ్రౌను సమాధిని ఇక్కడ చూడదలుచుకున్నాను. ప్రయాణపు తొందరలో వీటి వివరాలను నా సొంత గ్రంథాలయం నుంచి తెచ్చుకోలేకపోయాను. అందుకే మొదట బర్మింగ్‌హాం కేంద్ర గ్రంథాలయంలోని వాటిని మళ్ళీ సేకరించవలసి వచ్చింది. భౌగోళిక చారిత్రక గ్రంథాల విభాగం ఈ గ్రంథాలయంలోని నాలుగో అంతస్తులో వుంది. పరిశోధనా పద్ధతుల్లో- నిష్ణాతులైన వారికి ఆ వివరాల సేకరణ

గొట్టినపిండి ఆధునిక సౌకర్యాలున్న గ్రంథాలయంలో అయితే అన్నీ తేలికగా జరిగిపోతాయి. చారిత్రక విభాగంలో ప్రఖ్యాత పురుషుల జీవిత చరిత్రలన్నీ ఒక నిఘంటువులో వుంటాయి. దీనిని "డిక్షనరీ ఆఫ్ నేషనల్ బయోగ్రఫీ" అంటారు. మన్రో, మెకంజీ, బ్రౌనుల జీవిత చరిత్రలు సంగ్రహంగా వుండే సంపుటాలను తీసుకొని ఆ వ్యాసాలకు ఆధారాలను సూచించే జ్ఞాపికలను నోటు చేసుకొన్నాను. ఈ ఆధార గ్రంథాలు లైబ్రరీలోని ఇతర విభాగంలో వుంటాయని తెలుసుకొని ఆ అంతస్తుకు వెళ్ళాను.

## బ్రౌన్ విశేషాలు

ఉదాహరణకు బ్రౌను దొరగారి సంగ్రహ జీవిత చరిత్రలో ఆయన మరణించినప్పుడు "టైమ్సు" పత్రికలోనూ ఎథీనియం పత్రికలోనూ రాయల్ ఏషియాటిక్ సొసైటీవారి వార్షిక నివేదికలోనూ సంస్మరణ వ్యాసాలు ప్రకటితమై వున్నాయని తెలిసింది. ఎథీనియం, రాయల్ ఏషియాటిక్ సొసైటీ వారి పత్రికలు ఆరో అంతస్తులో వున్న లాంగ్వేజి అండ్ లిటరేచర్ (ఎల్. ఎల్.) విభాగంలో వున్నాయి.

అక్కడకు వెళ్ళి ఆ ప్రాచీన గ్రంథాల వివరాల కాగితం హారాలనూ, నా ప్రవేశ పత్రాన్ని ఇచ్చాను. ఆ విభాగంలోని పాకటుక ఉద్యోగి ఆ గ్రంథాలను నాకు ఒక్క నిముషంలో తీసుకొచ్చి ఇచ్చాడు. నాకు కావలసిన వివరాలు ఏ పుటల్లో వున్నాయో గుర్తు పెట్టుకొన్నాను.

నేను సమగ్ర ఆంధ్ర సాహిత్యం రచించే తొలి రోజుల్లో అయితే గుర్తుపెట్టుకొన్న పుటలలోని విషయాలన్నీ కూర్చొని గంటల తరబడి కాపీ చేసుకొనేవాడిని. ఇప్పుడు ఆధునిక సౌకర్యాలున్న గ్రంథాలయాలలో ఆ శ్రమ తప్పించారు. గుర్తుపెట్టుకున్న పుటల ఫోటో కాపీలను పేజీకి పది పెన్నీల

చొప్పున చెల్లించి తీసుకోవచ్చు. ఆరో అంతస్తులోని ఈ గ్రంథాలను అయినా ఆరో అంతస్తులోని ఫోటో కాపీ యంత్రం దగ్గరకు తీసుకెళ్ళి చాలా పుటల నకళ్ళను తీసుకో గలిగాను. యంత్రం ఎలా పని చేస్తుందో తెలుసుకొన్నాక ఎవరికి వారే కావలసిన నకళ్ళను తీసుకోవచ్చు.

గ్రంథంలో మనకు నకలు కావలసిన పుటను యంత్రంలో ఒక అద్దం మీద తలకిందులుగా పెట్టాలి. పది పెన్నీల నాణాన్ని కిందనున్న 'స్లాట్'లో పడేశాక మీటనొక్కితే ఆ పుటకి నకలు తయారై పక్కనున్న సొరుగులో పడుతుంది. ఎన్ని పుటల నకళ్ళు కావలసివస్తే అన్ని పుటలు మార్చుకొంటూ పది పది పెన్నీల నాణాలను నిలువు చీలుడు బెజ్జంలో పడేస్తూ తీసుకోవచ్చు. 1885 మే నెల రాయల్ ఏషియాటిక్ సొసైటీ వారి పత్రిక అనుబంధంలో బ్రౌను దొరగారిమీద ఒక వ్యాసముంది. 15వ పుటనుండి ఇరవయ్యో పుట దాకా వున్న ఈ వ్యాసం ఆరు పేజీల నకళ్ళను తీసుకొన్నాను.

అలాగే 1885 జనవరి మూడోతేదీ ఎథీనియం పత్రిక(నెం. 2084)లో ఆర్. యం. మాక్డోనాల్డ్ బ్రౌను దొరగారిమీద రాసిన వ్యాసం నకలుకూడా తీసుకొన్నాను. పది నిమిషాలలో పని అయిపోయింది. గ్రంథాలను మళ్ళీ ఒక అంతస్తుపైకి వెళ్ళి వాపసుచేసి నా ప్రవేశ పత్రాన్ని తీసుకొన్నాను.

“టైమ్స్” పత్రిక పాత సంచికలు ఇంకో విభాగంలో వున్నాయి. ఈ విభాగాన్ని సోషల్ సైన్స్ (ఎస్ ఎస్) అంటారు. అక్కడకు వెళ్ళి ఒక ఫారంమీద నాకు 1884 డిసెంబర్ ఇరవయ్యో తేదీ “టైమ్స్” పత్రిక కావాలని కోరుతూ రాసి ఇచ్చాను. నా ప్రవేశ పత్రాన్ని తీసుకొని ఆ సంవత్సరం నవంబరు, డిసెంబరు మాసాల పత్రికల పుటలన్నీ చిత్రీకరణం చేసిన ఒక మైక్రోఫిల్మ్ రోలును నాకు ఇచ్చారు. ఒక చదువుడు బల్ల దగ్గరకు తీసుకొని

వెళ్ళి అద్దం తెరవున్న యంత్రానికి ఆ మైక్రో ఫిలిం చుట్టను అమర్చి నాకు కావలసిన పేజీలు వచ్చేదాకా, ఎడిటింగ్ రూంలో ఫిల్మును వయిండ్ చేసి నట్టు, తిప్పాను. కావలసిన పుట రాగానే అందులో కావలసిన భాగాన్ని అద్దం తెరమీద చదువుకొన్నాను. దీని నకలు కూడా సంపాదించవచ్చును గాని ఇది కొంత ఖైముపట్టే విధానం పైన ఆధారపడి వుంటుంది.

## సులభతరమైన పరిశోధనా రీతులు

భారతదేశంలో నాలుగు రోజులు పట్టే పరిశోధన ఇక్కడ బర్మింగ్ హాంలో నాలుగు గంటలలో చేయగలిగాను. ఈ లెక్క చూసుకొంటే నేను ఇంగ్లండులో వుండబోయే మూడు, నాలుగు నెలలలో ఎంతో సాహిత్య పరిశోధన చెయ్యడానికి ఆస్కారం వుంది. బర్మింగ్‌హాం కేంద్ర గ్రంథాలయానికి 8వ తేదీ మంగళవారంనాడు వెళితే అంతకుముందు రోజే కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో సందర్శించాను. ఎనిమిది గంటల పాటు వివిధ భవనాలను చూశాను. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలోని ప్రాచ్యభాషల శాఖకు ఒక ప్రత్యేక గ్రంథాలయం వుంది. అందులో నేను చూసి నోట్సు రాసుకోవలసిన గ్రంథాలు ఎన్ని వున్నాయో అన్నింటిని ఒక్కసారి పరికించవచ్చాను. మళ్ళీ వెళ్ళి తీరుబాటుగా అక్కడ పరిశోధనలు చేయాలి. భవనాలు చూడవలసిన యాత్రిక ధర్మం మళ్ళా నిర్వర్తించవ నక్కర్లేదు కనుక. ఏడెనిమిది గంటలు కేంబ్రిడ్జి ప్రాచ్యశాఖ గ్రంథాలయంలోనే పరిశోధనా వ్యాసంగంలో గడప వచ్చు. అలాగే ఆక్స్‌ఫర్డు, లండన్ యూనివర్శిటీలలోను బ్రిటిష్ మ్యూజియం గ్రంథాలయాలలోను ఎంతో పరిశోధనచేయవలసిన అగత్యం వుంది.

ఇక్కడ గ్రంథాలయాలలోనేకాక గ్రంథ విక్రయ శాలలలో కూడా కొంత పరిశోధన చేశాక నాకు కావలసిన కొన్ని ప్రాచీన ప్రచురణలు పున ర్ముద్రణ పొందాయో, లేనో నా ప్రచురణ కర్తలు ఎవరో ప్రస్తుతపు ధరలు

ఎంతో కూడా తెలుస్తూంది. ఉదాహరణకు రాబర్టు బ్రియిఫాల్ట్ ఒక గొప్ప గ్రంథాన్ని రాశాడు. దాని పేరు "మదార్స్" ఇది మూడు సంపుటాల బృహద్గ్రంథం. దీనిని అమెరికాలో పునర్ముద్రించారు. మూడు సంపుటాల వెల 115 డాలర్లు. ఈ మూడు సంపుటాల సంక్షిప్త సంపుటం కూడా ఒకటి వుంది. దాని ధర సుమారు ఆరు డాలర్లు.

ఈ వివరాలన్నింటినీ గ్రంథ విక్రయశాలలోని ఒక ఉద్యోగి చాలా ఓపికగా కేటలాగులు సంప్రదించి నాకు ఇచ్చాడు. ఆక్స్ఫర్డు యూనివర్శిటీ ప్రెస్‌వారు పూర్వం "ది ఇంగ్లీషు ఫ్యాక్టరీస్ ఇన్ ఇండియా" అనే గ్రంథాన్ని పలు సంపుటాల్లో ప్రచురించారు. ఇది చాలాకాలం కిందట జరిగింది కిందటి శతాబ్దంలో ప్రచురించిన సంపుటాలను ఆక్స్‌ఫర్డు వారు పునర్ముద్రించారు. ఇవి కూడా ప్రస్తుతం పాతబడిపోయాయి. ఈ పుస్తకాల వివరాలను గ్రంథ విక్రయశాల ఉద్యోగి ఎన్ని కేటలాగులు తిరగేసినా, నాకు చెప్పలేకపోయాడు. తన చిరునామా ఫోను నెంబరూ నాకు ఇచ్చాడు. నాకు కావలసిన వివరాలను సేకరించిన తాను తర్వాత నేను ఫోను చేస్తే చెప్తానన్నాడు.

ఇంగ్లండులో దిగిన రెండు మూడు రోజుల్లో ఇన్ని సౌకర్యాలు నా పరిశోధనా వ్యాసంగానికి కనబడుతూ వుంటే ఎంతో ఉత్సాహంగా వుంది. నా సమగ్ర ఆంధ్ర సాహిత్యం ఈ సౌకర్యాలు లేకనే పూర్వం ఆగిపోయింది. కుంఫిణీ యుగం గురించి ఎన్నెన్నో ఆధారాలున్నాయని నాకు తెలుసు అయితే అందులో చాలా గ్రంథాలు ఇంగ్లీషులోనే వున్నాయని వాటి నకళ్ళను భారత దేశానికి తెప్పించుకోవడం చాలా వ్యయప్రయాసలతో కూడుకొన్న పని అని కూడా తెలుసు ఇప్పుడు "ఇంగ్లండులోని తెలుగు క్లబ్బు" వారి పుణ్యమా అని సీమలోనే తెలుగు సాహిత్య పరిశోధనలు ప్రారంభించగలిగాను. ఈ మిత్రులకు నేనే కాక తెలుగు సాహిత్య పాఠకలోకం కూడా చాలా ఋణపడక తప్పదు.

చివర చివర్న ఒక చిన్న హెచ్చరిక పెద్ద క్షమాపణ నా పాఠకులకు

చెప్పుకోవాలి. నేను ఈ వ్యాసాలను ఇంగ్లండు నుంచి వ్రాసి పంపుతున్నాను. తంతి తపాలా సౌకర్యాలు ఎంత అధునికమైనా, ఎంత వృద్ధిచెందినా కొంత లేటు జరగవచ్చు. పోస్టులో కొన్ని వ్యాసాలు గల్లంతు కావచ్చును. అందు చేత, ఈ వ్యాసాలు వారం వారం ధారవాహికంగా వెలువడకపోతే నా పాఠ కులు పరిస్థితులను అర్థం చేసుకొని నన్నూ, సంపాదకుని క్షమిస్తారని ఆశిస్తున్నాను.

(బర్మింగ్‌హాం 10-8-83)

# కొలనుసీమ: కవుల కోనసీమ- 1

బ్రిటన్‌లో 'లేక్ డిస్ట్రిక్' అనే మండలం ఒకటి వుంది దీనినే నేను 'కొలను సీమ' అని పిలుస్తున్నాను. ఇది తొమ్మిది వందల చదరపుమైళ్ళ భూభాగం. చాలా అందంగా, వసంతంతో పచ్చగా. కన్నుల పిండుగా వుంటుంది. కనుచూపు మేరంతా కొండలతో, లోయలతో, ఎత్తయిన చెట్లతో, అతి-చిన్న గడ్డిపూలతో చూడ ముచ్చటగా వుంటుంది. చిన్నా పెద్దా అన్నీ కలిసి ఈ సీమలో ఇరవై కొలనులు వుంటాయి. దీనిని 1951 "నేషనల్ పార్క్"గా ప్రభుత్వం ప్రకటించింది. కిందటి శతాబ్దంలో ఇది సుప్రసిద్ధరచయితలు నివసించిన ప్రఖ్యాత మండలం.

ఈ లేక్ డిస్ట్రిక్టును ప్రస్తుతం కంబ్రియా అని పిలుస్తున్నారు. కాని ఇది మూడు పరగణాలను కలగలిపి ఏర్పాటు చేసిన జిల్లా, కంబర్‌లాండ్, వెస్టుమోర్‌లాండ్, లాంకషైర్ జిల్లాలోని ఫర్నెస్ తాలూకాను ఏకంచేసి ఈ విహారమండలాన్ని రూపొందించారు. వసంత కాలంలో ఈ సీమను లక్షలాది విహార యాత్రికులు సందర్శిస్తారు. ఈ సీమలో నివసించిన కవులను, రచయితలను సంస్మరించుకొంటారు. వాళ్ళ పురాతన గృహాలను చూస్తారు. ఆయా రచయితల పేరిట నెలకొల్పిన మ్యూజియములను శ్రద్ధగా [illegible]

మరీ చూస్తారు. ఇక్కడ ఏమేమి చూడాలో ఎక్కడెక్కడికి వెళ్ళాలో తెలియజేసే సమాచార కేంద్రం కూడా ఒకటి వుంది.

## కలకలలాడే స్థలం

బ్రాక్‌హోల్ (Brockhole) అనే ముప్పయి ఎకరాల ఉద్యాన వనంలో నేషనల్‌పార్క్ 'విజిటర్ సెంటర్' అనే పెద్ద భవనం వుంది. అందులో రోజూ పొద్దున్న పదకొండుగంటలకు, మధ్యాహ్నం రెండున్నర గంటలకు 'లేక్‌డిస్ట్రిక్ట్ పరిచయం' అనే డాక్యుమెంటరీ చిత్రాలను ప్రదర్శిస్తారు. ఈ కొలనుసీమ చరిత్రతో వివిధ విషయాల ప్రసక్తులూ ఇందులో వుంటాయి. భూగర్భఖనిజశాస్త్రం దగ్గర్నుంచి వర్డ్స్ వర్తుకవిదాకా అనేక విషయాలపై ప్రసంగాలు ఫిలిం ప్రదర్శనలు ఇక్కడ జరుగుతాయి. వివిధ సముచిత గ్రంథాలూ కరపత్రాలూ, మ్యాపులూ, పిక్చర్స్ పోస్టుకార్డులూ మొదలైనవి అమ్మే సమాచార కేంద్రం ఎప్పుడూ విహార యాత్రికులతో కలకలలాడుతూ వుంటుంది.

బ్రాక్‌హోల్ సమాచార కేంద్రం అసిస్టెంట్ డైరెక్టర్ పేరు మిస్టర్ రోనాల్డ్‌శాండ్స్. ఈయన ఈకేంద్రాన్ని మేము సందర్శించినప్పుడు పరిచయ చలనచిత్రాన్ని ప్రదర్శిస్తూ అనేక విషయాలను అందరికి తెలియజేశాడు. ప్రదర్శన తర్వాత ఏమైనా ప్రశ్నలు వేస్తే ప్రత్యేకంగా వ్యక్తిగతంగా వివరణలు ఇస్తానన్నాడు నేను అంతకు ముందే ఈ కొలనుసీమ గురించి చాలా సమాచారం సేకరించి చదివాను. ఈ సీమలో ఆంగ్లకవి ఆల్‌ఫ్రెడ్ టెన్నిసన్ బస చేసినచోటు ఎక్కడ అని రోనాల్డు గారిని అడిగాను. 'మైర్ హౌస్' అనే ప్రదేశంలో అని చెప్పిదాని గురించి ఒక కరపత్రాన్ని ఇచ్చాడు.

## చలన చిత్రం

నా కుతూహలాన్ని గమనించి నావిషయంలో రోనాల్డుబాండ్స్ కుతూహలాన్ని ప్రకటించాడు. నా విజిటింగ్ కార్డు ఇచ్చాను. నా గురించి విన్నాక వెంటనే స్నేహ హస్తం కలిపాడు. రోనాల్డుబాండ్స్ విలియం వర్డ్స్‌వర్త్‌పై ఒక చిన్న పుస్తకం రాశాడు. ఇది ఎన్నో వర్ణ చిత్రాలతో కూడుకొన్న జీవిత చరిత్ర నేను అంతకుముందే మరొకచోట వర్డ్స్‌వర్త్‌పై ఒక పుస్తకం కొన్నాను. దాని ధర కొంచెం ఎక్కువే. అయినా ఆ పుస్తకం బదులు తన పుస్తకాన్ని నాకు ఆటోగ్రాఫ్ చేసి ఇచ్చి వెలలో వున్న తేడాను మనవరా ఇప్పించేశాడు. నాకు టైం వుంటే వర్డ్స్‌వర్త్‌పై డాక్యుమెంటరీ చిత్రాన్ని ప్రదర్శింపజేస్తానన్నాడు. నాతో వచ్చిన సోమసుందర్, డాక్టర్ చాపరాల బాబూరావు గారూ, వారి భార్య డాక్టర్ భారతీ కుమారి శాంతి డాక్టర్ విశ్వేశ్వరరావు (విష్ణు) గారూ, వారి భార్య డాక్టర్ గౌరీ అప్పటికే దగ్గర్లో వున్న పూలతోటలు చూడడానికి వెళ్ళారు. వాళ్ళను పిలుచుకువచ్చి వాళ్ళతో కలసి వర్డ్స్‌వర్త్ చలనచిత్రం చూశాను. ఇది చూడడం చాలా ప్రయోజనకారి అయింది. మేము ఆ మధ్యాహ్నమే వర్డ్స్‌వర్త్ నివసించిన డోవ్‌కాటేజ (కపోత కుటీరం) సందర్శించడానికి వెళ్తున్నాం.

## సాహిత్యాశ్రమం

బ్రిటన్‌లోని కొలనుసీమకు వర్డ్స్‌వర్త్ (1770- 1850) వల్ల పేరు ప్రఖ్యాతులు ఇనుమడించాయి. ఈ సీమలో గ్రాస్‌మియర్ అనే కొండగుట్టపై వున్న చిన్న కుటీరంలో 1799 క్రిస్మస్ రోజున తన చెల్లెలు డొరోతీతో పాటు ప్రవేశించాడు. పూర్వం ఈ కుటీరం ఒక పాంథశాలగా, పానశాలగా వుండేది. అప్పుడు దానికి పేరు ప్రఖ్యాతులు లేవు. టౌన్ ఎండ్ (ఊరి కొస) అని దీన్ని పిలిచేవారు. ఖాళీగా వున్న ఈ కుటీరాన్ని వర్డ్స్‌వర్త్ తీసుకొని

ఇంటిలో ఎనిమిది సంవత్సరాలపాటు నివసించాడు. ఆ రోజుల్లో ఈ కుటీరం కిటికీలలోంచి గ్రాస్‌మీర్ కొలను కనబడుతూ వుండేది. ఇప్పుడు కొత్తగా ఈ శతాబ్దంలో కట్టిన ఇళ్ళు అడ్డు వస్తున్నాయి. వర్డ్స్‌వర్త్ ఈ కుటీరంలో ప్రవేశించిన మూడేళ్ళకి 1802 లో పెళ్ళి చేసుకున్నాడు. హార్ట్‌లీ కోల్‌రిడ్జు (1796-1841) రాబర్టు సౌతీ (1774-1843) థామస్ డిక్విన్సీ [1785- 1859] సర్ వాల్టర్‌స్కాట్ (1771-1832) మొదలైన సాహితీవరులందరికీ ఈ కపోత కుటీరంలోని వర్డ్స్‌వర్త్ ఆతిథ్య మిచ్చాడు.

కొలనుసీమలోని గ్రాస్‌మీర్ వర్డ్స్‌వర్త్‌ని ఆకర్షించడానికి చాలా కారణాలున్నాయి. అతడు కంబర్ లాండ్‌లోనే పుట్టి పెరిగాడు. కొండలూ గుట్టలూ, కొలనులూ, బయళ్ళు తిరగడం అంటే అతనికి చిన్నప్పట్నుంచీ ఇష్టం. సంతోష సంభ్రమాలు చెట్టపట్టాలు వేసుకొనే ఈ సీమలోనే అందమూ, అమిత భయమూ ఆతన్ని సరిసమానంగా పెంచాయి. మన్యం పల్లెసీమను విడిచిపెట్టి పట్నపు కేంబ్రిడ్జికి వెళ్ళినా అతని జన్మస్థలం జ్ఞాపకాలతోనే నిండివుండేది. అతని ప్రాణమిత్రుడూ తోటి కవి అయిన శామ్యూల్ టైలర్ కోల్‌రిడ్జుకి తన సంస్థల సౌందర్యాలను చూపిస్తున్నప్పుడు కోల్‌రిడ్జు వెంటనే గ్రాస్‌మీర్‌ను చూసి ఆకర్షితుడు కావడం వర్డ్స్‌వర్త్ గమనించాడు. అక్కడే నివసించాలని అప్పటికప్పుడు నిర్ణయం తీసుకొన్నాడు చెల్లెలు డరోతీకి ఆ విషయం ఒక ఉత్తరంలో రాశాడు.

## వర్డ్స్ వర్త్, కోల్ రిడ్జ్

శామ్యూల్ టైలర్ కోల్‌రిడ్జు (1772-1834) మొట్టమొదట వర్డ్స్‌వర్త్‌ను 1797లో కలుసుకొన్నాడు. ఇద్దరూ కవిత్వం గురించి చాలా చర్చించుకొన్నారు. ప్రకృతి సత్యాలకు పరమ విధేయంగా వుంటూ సహృదయుడైన పాఠకుడిలో సానుభూతిని ప్రభావితంచేసే ప్రబలమైన శక్తి కవిత్వానికి వుందని గుర్తించారు. భావనల రంగులు మారుస్తూ వైచిత్రిని సృష్టించే

శక్తి కవిత్వానికి వుందని కూడా గుర్తించారు. 'లిరికల్ బేలడ్స్' అనే పేరుతో గేయగాథలు రాయాలని నిర్ణయించుకొన్నారు. కోల్‌రిడ్జ్ మానవాతీత పాత్రలను తీసుకొని భావనా బలంతో విశ్వాసనీయమైన చిత్రణలు చేయాలని వర్డ్స్‌వర్త్ దైనందిన జీవితను విషయాలను తీసుకొని వాటికి వైచిత్రినీ వైశేషి కాకర్షణనూ భావశబలత వల్ల తీసుకురావాలనీ నిర్ణయించుకొన్నారు. 1798 లో 'లిరికల్ బేలడ్స్' ప్రథమ ముద్రణ జరిగింది. ఇవి ఇంగ్లీషు సాహిత్యంలో ఉత్తరోత్తరా విప్లవాత్మకమైన మార్పులను తీసుకు వచ్చాయి.

వర్డ్స్ వర్త్ కపోత కుటీరంలో నివసిస్తున్నప్పుడు. కోల్‌రిడ్జు తన నివాస గృహాన్ని కెస్విక్‌లోని గ్రేటాహాల్‌కి మార్చుకొన్నాడు. ఇద్దరి ఇళ్ళకు మధ్య పదమూడు మైళ్ళ దూరంవున్నా నిత్యం రాకపోకలు జరుగుతూ వుండేవి. కవులిద్దరే కాక వర్డ్స్‌వర్త్ చెల్లెలు డరోతీ కూడా ఈ పదమూడుమైళ్ళు నడుస్తూ వుండేది. నాలుగున్నర గంటల్లో ఈ దూరాన్ని వారు సునాయాసంగా నడిచేవారు. డరోతీ తన అన్నగారి రచనలకు సాఫు వ్రాసేది మార్పులు కూర్పులు, చేర్పులు సలహాలుగా చెప్పేది.

## ఆనాటి విమర్శలు

కపోత కుటీరంలో వున్నప్పుడే వర్డ్స్‌వర్త్ రెండు సంపుటాలలో తన కవితా ఖండాలను ప్రచురించాడు (1807). వీటిలో కొన్ని నేడు సుప్రసిద్ధాలయిపోయినా ఆనాటి విమర్శకులు అట్టే పట్టించుకోలేదు. బైరన్ అప్పుడు యువకుడు అతడు వర్డ్స్‌వర్త్ పద్యాలన్నీ చెత్త అన్నాడు. రాబర్టు సౌతీ (భావి ఆస్థాన కవి) కొన్ని రాజకీయ గీతాలను మెచ్చుకొన్నా చంద్రుణ్ణి నక్షత్రాలనూ చూసే దూర్బిణీ లోనే గడ్డిపువ్వుల్నీ మంచి చెడ్డల్నీ వర్డ్స్‌వర్త్ చూడ్డాన్ని హర్షించలేదు సేద్యగాడు. దేశదిమ్మరీ మొదలైన అధ్యమైన

అలగా జనం జీవితాలలో ఉదాత్తభావాలూ, తాత్త్వికచింతన చేయదగ్గ విషయాలూ వర్డ్స్‌వర్త్ గమనిస్తున్నందుకు సౌతీ చీవాట్లు పెట్టాడు. జీవిత సత్యాలనూ, ప్రకృతి దృశ్యాలనూ చిత్రించే వర్డ్స్‌వర్త్ కవిత్వంలోని ప్రగతిశీలత, క్రాంతి మస్తృత తర్వాత చాలాకాలం దాకా సాహితీ ప్రపంచం గుర్తించలేదు.

తన కాలంనాటి విమర్శకులు ఎంతదుయ్యబట్టినా వర్డ్స్‌వర్త్‌కి తన కవిత్వం పట్ల, దాని ఔన్నత్యంపట్లా అచంచల విశ్వాసాలు వున్నాయి. ఛాందస కబంధహస్తాల నుంచి అప్పుడప్పుడే కవిత్వం విముక్తమవుతోంది.

విలియంబ్లేక్ (1757-1827) "ఇసుక రేణువులో ఒక ఇలాతలాన్నీ అడవి పువ్వులో ఒక అమరధామన్నీ దర్శించగలనన్నాడు.

"అశ్రుజలధికి చాలలోతున
అణగి వుండే భావ నిధులను
హీన పుష్పపు కదలికలచే
ఏను వీక్షింతునా"

అంటూ వర్డ్స్‌వర్త్ ప్రకటించాడు. కపోత కుటీరంలో జీవిస్తున్నప్పుడే అతడు కవిత్వానికి నిర్వచనం ఇచ్చాడు అది విశ్వ విఖ్యాతమైంది.
**"Poetry is the spontaneous overflow of powerful feelings it takes its origin from emotion recollected on tranquity"**

అన్నారు. ప్రశాంతిలో జ్ఞాపకం చేసుకొనే ఆవేశం నుంచి కవిత్వం ప్రభవిస్తుందన్నా అది శక్తివంతమైన భావాల సద్య స్రవంతి.

"హరివిల్లు" కవిత

నింగిలో హరివిల్లు చూస్తే

పొంగి పోవును నాదు హృదయము
నీను పుట్టిన ఘడియలోనే
ఇంద్రచాపము చూసి మురిసితి
ప్రౌఢ నిర్భర వయస్సంపున
ప్రాయ మెంతయు వ్రాలిపోయిన
నేను పొందెదనొకే స్పందన
లేనిచో మరణించనీయుడు,
శిశువు తానే మనిషి జనకుడు
వినువు నిజముగ నరుని జనకుడు"

ఇటువంటి గీతాలను వర్డ్స్ వర్తు కపోత కుటీరంలో వుంటున్నప్పుడే రచించాడు. మన ఒకనాటి ఒకానొక అభ్యుదయ కవి తన "శైశవ గీత"లో "ఆకసమున హరివిల్లు విరిస్తే అది మీకేనని ఆనందించే బుడతల్లారా" అని రాయడం గమనించ దగ్గది. అతనికి పేరు ప్రఖ్యాతులను తీసుకువచ్చిన "ది ప్రిల్యూడ్" (ప్రస్తావన) అనే కావ్యాన్ని అతడు ఇక్కడే పూర్తిచేశాడు. 1808 లో వర్డ్సువర్తు కపోత కుటీరాన్ని విడిచిపెట్టాడు. అతన్ని ప్రగతిశీల భావాలూ, విప్లవాత్మక చింతనలూ విడిచిపెట్టాయి. జీవితంలో సౌఖ్యాలూ, సౌకర్యాలూ లభించడం ప్రారంభించాక వర్డ్సువర్తు పూర్తిగా మారిపోయాడు. ఆంగ్లికన్ టోరీలను బలపర్చసాగాడు. రిఫార్మ్ బిల్లును ప్రతిఘటించాడు. లేక్ డిస్ట్రిక్టులో రైలు మార్గాన్ని వేసినందుకు చాలా బాధపడ్డాడు. ఎందుకంటే కొలను సీమకు ఆ రైళ్ళు రోజూ విరక్షరాస్య జన సందోహాన్ని నిమిషాల మీద తీసుకు వచ్చేస్తున్నాయనే కారణం వల్లనట.

వర్డ్సువర్తులో మార్పు

ఒకనాడు ఫ్రెంచి విప్లవం పట్ల వర్డువర్తుకి సానుభూతి ఉండేది. అయితే "హింస పెరిగినందువల్ల" విప్లవం పట్ల విముఖత చూపించాడు. సమాజాన్ని బలవంతంగా మార్చలేమని భావించాడు. 1804 లో బోన పార్టీ తన్ను తాను చక్రవర్తిగా ప్రకటించుకొన్నాక వర్డ్సువర్తు పూర్తిగా మారి

పోయాడు. క్రమేణా కట్టుదిట్టమైన వ్యవస్థను అభిమానించ సాగాడు. పదవు లను పొందాడు. చిట్టచివరకు "ఆస్థాన కవి" స్థానాన్ని అలంకరించాడు. "సాధారణ జీవనం— ఉన్నత భావనం" పూర్వం ప్రబోధించిన కవి "దగలా గిగలా ధరించి రాణి గారిచ్చే విందులకుకూడా వెళ్ళేవాడు. [మన శ్రీనాధుడు] విజయనగరంలో రాజ దర్శనం కోసం "కొల్లాయుంచితి, కోక జుట్టితి మహా కూర్పాసమున్ దొడితిన్" అనే పద్యం జ్ఞాపకం వస్తుంది]

1808 లో వర్డ్సువర్తు కపోత కుటీరాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయినా గ్రాస్‌మీర్‌లో దానిని అతని జ్ఞాపకార్థం అతని జీవిత కాలంలో ఎలావుందో అలాగే ఆనాటి వస్తు సామాగ్రితో భద్రపరుస్తున్నారు. 1890 నుంచి దానిని ప్రజలు సందర్శించే ఏర్పాట్లు చేశారు. వాస్తవానికి వర్డ్సువర్తు జన్మించిన గృహాన్ని 1938 లో నేషనల్ ట్రస్టువారు కొన్నారు. ఇది "కాకర్ మౌత్" అనే గ్రామంలో వుంది. ఈ విశాలమైన ఇంటి ముందు భాగంలో 17 కిటికీలు వున్నాయి. ఈ ఇల్లు డెర్‌వెస్టు నదీ తీరాన వుంది.

వర్డ్సువర్తు జన్మించిన గృహాన్నే కాక అతడు 1813 నుంచి 1850లో చనిపోయే దాకా నివసించిన రైడర్‌మౌంట్ గృహాన్ని కూడా "వర్డ్సువర్తు ట్రస్టు" వారు కొన్నారు. ఈ భవనం చుట్టూ నాలుగు ఎకరాల తోట వుంది. ఈ ఇంట్లో వర్డ్స్‌వర్త్ వాడిన వస్తు సామాగ్రివుంది. వర్డ్స్‌వర్త్ ఆస్థానకవితా పున్నప్పుడు విక్టోరియా మహారాణి ఆయనకు బహూకరించిన చిత్రపటాలు ఈ ఇంటోన్లే వున్నాయి. వర్డ్స్‌వర్త్ చెల్లెలు డరోతీ చిత్రపటం కూడా ఇక్కడ తప్ప మరెక్కడా లేదు.

మ్యూజియం

వర్డ్స్‌వర్త్తుకు సంబంధించిన గృహాలను యాత్రికులు సందర్శించ డానికి చాలా సౌకర్యాలను చాలా సౌకర్యాలను ఏర్పాటు చేశారు. అతను రైడర్ మవుంట్ గృహంలో చనిపోయినా అతణ్ణి అక్కడికి రెండు మైళ్ళ దూరంలో వున్న గ్రాస్‌మీర్ చర్చి ప్రాంగణంలో సమాధి చేశారు. వర్డ్సువర్తు పేరు చెప్పగానే గ్రాస్‌మీర్, అక్కడ వున్న దోవ్ కాటేజీ అందరికీ జ్ఞాపకం వస్తాయి. అందుకనే కపోత కుటీరానికి కొన్ని గజాల దూరంలోనే వర్డ్సువర్తు

మ్యూజియాన్ని నిర్మించారు. ఇది నిజంగా సందర్శించవలసిన ప్రదేశం.

వర్డ్స్ వర్తు మ్యూజియంలో అడుగుపెట్టినదగ్గర్నుంచిమళ్ళీ బయటకు వచ్చేదాకా అతని జీవిత విశేషాల చిత్రాలేకాక ఆ శతాబ్దంలో కొలనుసీమ లోని సాధారణ జనుల జీవన విధానాలను చిత్రించేవి. కళ్ళకు కట్టేటట్టు "లైఫ్" సైజు మానవ విగ్రహాలతో నిండిన ఆనాటి సామాన్య గృహ దృశ్యాలను కూడా చూడవచ్చు. వర్డ్సువర్తు పద్యాలలోని వర్ణనలను బట్టే ఈ "సజీవ" దృశ్యాలను పునర్నిర్మించారు. మ్యూజియమంతా హడావిడిగా చూడాలన్నా రెండు గంటలు పడుతుంది. నిదానంగా పుస్తకాలలోని ముద్ర ణలు, వాటి వ్రాతప్రతులు, వగైరాలు చూడాలంటే ఒక రోజు చాలదు.

కొలనుసీమలోని ఒక్క వర్డ్సువర్తు కపోత కుటీరం గురించి, అతని మ్యూజియం గురించి చెప్పడానికే ఒక వ్యాసం పట్టింది. ఈ సీమలో వున్న ఇంకొక మ్యూజియం గురించి ఈ సీమను సందర్శించిన ఇతర సాహితీ మూర్తుల గురించి ఇంకొక వ్యాసంలో విశదపరుస్తాను.

# కొలనుసీమ: కవుల కోనసీమ -2

క్రిందటి వ్యాసంలో బ్రిటన్‌లోని కొలను సీమ (లేక్ డిస్ట్రిక్ట్స్)వర్డ్స్‌వర్త్ వల్ల ప్రసిద్ధమైనదని రాశాను. ఆ సుందరమైన పరగణాలో గ్రాస్‌మీర్ వద్ద వర్డ్స్‌వర్త్ కపోత కుటీరం (డోవ్‌కాటేజ్)లో నివసించేచినట్టూ ఆ ప్రదేశాన్నే ఎన్నుకొనడానికి కారణం శామ్యూల్ టైలర్ కోల్‌రిడ్జ్ (1772-1834) అని కూడా రాశాను.

కోల్‌రిడ్జ్ ఆంగ్ల సాహిత్యాన్ని ఒక మలుపుతిప్పిన కవి. అనేక మందిని ప్రభావితుణ్ణి చేసిన ప్రతిభావంతుడు. 1793 లోనే కవిత్వం వ్రాయడం ప్రారంభించాడు. "మార్నింగ్ క్రానికల్" అనే పత్రికలో 1793 నుంచి 1795 దాకా తన కవితలు ప్రచురించాడు. వర్డ్స్‌వర్త్‌తో కలిసి ఆంగ్లసాహిత్యంలో క్రొత్త పోకడలు తీసుకురావడానికి 1598 లో "లిరికల్ బేలడ్స్" కవితలను రచించాడు. అయితే అంతకుముందే 1796 లో "వివిధ విషయాలపై పద్యములు" అనే పేరుతో ఒక కవితా సంకలనాన్ని ప్రచురించాడు. దీనిలో చార్లెస్ లాయిడ్, చార్లెస్ లాంబ్ (1775-1834) అనే కవుల పద్యాలు కూడా వున్నాయి. ఆనాటి కవులు తమ రచనలను పుస్తక రూపంలో తెచ్చేటప్పుడు సంయుక్త గ్రంథంగా తెచ్చేవారు.

## కోల్‌రిడ్జ్

కోల్‌రిడ్జ్ కొలను సీమలోని కెస్విక్ గ్రామంలో 1800 నుంచి నివసించసాగాడు. వర్డ్స్‌వర్త్‌కూ, అతని చెల్లెలు డరోతీకీ సాధ్యమైనంత సమీపంగా వుండాలన్న కోరికతోనే కోల్‌రిడ్జి కెస్విక్‌లో కాపురం పెట్టాడు. అతని భార్యపేరు 'సారా' ఈమె చెల్లెలు ఎడిత్‌నే రాబర్ట్ సౌతీ (1774-1843) అనే సుప్రసిద్ధ కవి పెళ్ళి చేసుకున్నాడు. సౌతీ కూడా కెస్విక్‌లోనే కాపురం పెట్టాడు. ఇతణ్ణి కూడా 'కొలనుసీమ కవికులం'లో ఒకణ్ణిగా పరిగణించేవారు. 1813 లో సౌతీ ఆంగ్ల ప్రభుత్వ ఆస్థాన కవిగా నియమితుడయ్యాడు. 1843లో చనిపోయేదాకా ఆ పదవిలో మూడు దశాబ్దాలపాటు వున్నాడు. (ఆ తర్వాత వర్డ్స్‌వర్త్ ఆస్థాన కవిగా నియమితుడయ్యాడు. సమకాలికులు సౌతీని మెచ్చుకొన్నా సౌతీని తర్వాత తరాలు పట్టించుకోలేదు. కూల్‌రిడ్జ్‌ని మాత్రం చరిత్ర జ్ఞాపకం పెట్టుకుంటుంది. అతని ఏన్‌షెంట్ మెరినర్ (ప్రాచీన నావికుడు) సుప్రసిద్ధ కావ్యం 'కుబ్లాఖాన్' అనేది అతని అసంపూర్ణ కావ్యం ఇది పూర్తి కాకపోవడానికి ఒక కథ వుంది.

## కలలో కవిత

'కుబ్లాఖాన్' కావ్యాన్ని కోల్‌రిడ్జి స్వప్నంలో రాశాడట ఆ రచన రెండు మూడు వందల పాదాల కవిత. కల నుంచి తెలివి రాగానే కోల్‌రిడ్జ్ ఆ కావ్యాన్ని కాగితంమీద పెట్టడానికి ప్రారంభించాడట కానీ దురదృష్టవశాత్తు రచన చేస్తున్నప్పుడు ఎవరో కార్యవశాత్తూ వచ్చి పిలిచారు. ఒక గంటసేపు కవిగార్ని కబుర్లలో దింపాడు. వచ్చినవాడు వెళ్ళిపోయాక కోల్‌రిడ్జ్ మళ్ళా రచనను ఉపక్రమించాడు. అయితే కల గన్న కవిత్వాన్ని మరచిపోయాడు. అందుచేత ఈ కావ్యంలోని ఏభై నాలుగు పాదాలే మిగిలాయి. కోల్‌రిడ్జ్‌ని

మూడు గంటల గాఢనిద్రలో ముంచి స్వప్నంలో సాహిత్య రచన చేయించి నది 'నల్లమందు' మహిమ తప్ప మరేది కాదు.

కోల్‌రిడ్జ్ నల్లమందు తినడానికి 1797 నుంచి అలవాటు పడ్డాడు. దాని వల్ల అతని ఆరోగ్యం దెబ్బతింది. ఆత్మీయులతో మనస్తాపాలు వచ్చాయి. కోల్‌రిడ్జ్ 'ది ఫ్రెండ్" (నేస్తం) అనే వారపత్రికను పెడతానన్నాడు. వర్డ్స్‌వర్త్ తన స్నేహితుడు పెట్టబోయే పత్రికకు తోడ్పడాలని పలుకుబడిగల పెద్దలందరికి ధనసహాయం కోరుతూ ఉత్తరాలు రాశాడు. సర్‌వాల్టర్ స్కాట్, లార్డ్‌లోన్స్‌డేల్ మొదలైనవారు చందాలు కట్టారు. కోల్‌రిడ్జ్ ఎంత కాలమైనా ఆ పత్రికను ప్రారంభించలేదు. వర్డ్స్‌వర్త్‌కి స్నేహితుల ముందు పరువుపోయింది. ముఖం చెల్లలేదు. కోల్‌రిడ్జ్ 1890 లో 'ది ఫ్రెండ్' పత్రికను ఎట్టకేలకు ప్రారంభించి ఇరవై ఎనిమిది సంచికలను ప్రచురించాడు. అయితే ప్రాణస్నేహితుడైన వర్డ్స్‌వర్త్‌తో విభేదాలు వచ్చి విడిపోయాక గాని ఇది జరగలేదు. కోల్‌రిడ్జ్ నల్లమందు వ్యసనానికి భార్య సారా కూడా విసిగిపోయి అతణ్ణి విడిచిపెట్టింది.

మరో నల్లమందు భాయీ

వర్డ్స్ వర్త్‌కి మరో నల్లమందు భాయీ కూడా ప్రగాఢమైన స్నేహం వుంది. అతని పేరు థామస్ డిక్వెన్సీ (1785-1859) ఇతడు వర్డ్స్‌వర్త్‌ని, కోల్‌రిడ్జిని అభిమానించే కవి-రచయిత. తన అభిమానులు, ఆచార్యులు అయిన ఆ ఇద్దరి కవుల సాన్నిహిత్యంలో వుండడానికి డిక్వెన్సీ కొలనుసీమకు 1809 లో వచ్చి స్థిరపడ్డాడు. 'ది వెస్ట్‌మోర్‌లాండ్ గెజిట్' అనే పత్రికకు సంపాదకత్వం వహించాడు. డిక్వెన్సీకి కూడా నల్లమందు పరమ వ్యసనమైంది. వర్డ్స్‌వర్త్‌కి, ఇతనికీ చెడిపోయింది. డిక్వెన్సీ 1821 లో లండన్‌కి వెళ్ళిపోయాడు. ఆ సంవత్సరమే "ది కన్ఫెషన్స్ ఆఫ్ ఎన్ ఇంగ్లీష్ ఓపియం ఈటర్" అనే స్వీయ చారిత్రాత్మక రచన రెండు భాగాలుగా ప్రచురించాడు. ఈ నల్లమందు భాయీ వెల్లి 'తింపులు' చాలా ప్రఖ్యాతమైన రచన

డిక్వెన్సీ పేరు చెప్పగానే ఇతని ఇరవై నాలుగు సంపుటాల రచనలలో "కన్ఫెషన్స్ (వెల్లడింపులు)" వెంటనే జ్ఞాపకం వస్తాయి. అయితే డి-క్వెన్సీ "రికలెక్షన్ ఆఫ్ ది లేక్ పోయిట్స్" (కొలను కవుల జ్ఞాపకాలు) అనే గ్రంథం కూడా రాశాడు. ఇందులో కోల్‌రిడ్జ్, వర్డ్స్‌వర్త్, సౌతీ కవిత్రయం గురించి వివరాలూ, విమర్శలూ విపులంగా వున్నాయి. సమకాలీన సాహిత్య చరిత్రకు పనికివస్తాయి. ఇవి మొదట వ్యాసరూపంలో 1839-40 మధ్య టైట్స్ మేగజైన్‌లో పడ్డాయి. గ్రంథ రూపంలో ఈ శతాబ్దంలోనే వచ్చాయి. మూడు నాలుగు ముద్రణలు వెలువడ్డాయి.

తన నల్లమందు వ్యసనం నుంచి డిక్వెన్సీ బయటపడ్డాడు గాని కోల్‌రిడ్జు దానిని విడిచి పెట్టలేదు అయితే స్నేహితులు అతని వ్యసనాన్ని అదుపులో పెట్టారు. అందువల్లనే కోల్‌రిడ్జు కవిగా విమర్శకునిగా కవి జీవితాల రచయితగా చరిత్రలో నిలబడ్డాడు. 18 వ శతాబ్దపు చాందస శృంఖలాల నుంచి ఆంగ్ల సాహిత్యాన్ని విడిపించినవాళ్ళలో కోల్‌రిడ్జు ముఖ్యుడు. ఆంగ్ల వాఙ్మయంలో భావ కవిత్వాన్ని ప్రారంభించిన కవులలో అతడు ఆద్యుడు. సుందరమైన భావాలూ సున్నిత మైన అనుభూతులూ ఉద్వేగం విలాసం మొదలైనవన్నీ కొలనుసీమ కవుల వల్ల ముఖ్యంగా కోల్‌రిడ్జు నాయకత్వం వల్లా ఆంగ్ల సాహిత్యంలో మళ్ళా చోటు చేసుకొన్నాయి. 19 వ శతాబ్దం అన్ని రకాలుగా విప్లవాత్మకమైనది.

## రస్కిన్

19 వ శతాబ్దంలోనే మరొక మేధావి కొలనుసీమలో నివాసం ఏర్పరచు కొన్నాడు. అతనిపేరు జాన్‌రస్కిన్ (1819-1900) వర్డ్స్‌వర్త్ నివసించిన గృహాలను భద్రపరచి అతని పేరిట ఒక మ్యూజియమును కొలను సీమలో నెలకొల్పినట్టే జాన్ రస్కిన్ గృహాన్ని భద్రపరచి అతని పేర

ఒక మ్యూజియమును ఆంగ్లేయులు అత్యంత శ్రద్ధా భక్తులతో కొలనుసీమలో నెలకొల్పాడు. వర్డ్సువర్తు గ్రాస్‌మీర్ కొలను దగ్గర డోవ్‌కాటేజీలో నివసిస్తే జోన్‌రిరస్కిన్ కోనిస్టన్ సరసిదగ్గర బ్రాంట్‌వుడ్‌లో నివసించాడు. రస్కిన్ 1819 లో జన్మించినా తన యాభై మూడువయేట 1372లో గాని కొలనుసీమకు వచ్చి స్థిరపడలేదు. ఆరపై ఎనిమిదేళ్లు ఇక్కడే మహోన్నత మైన జీవితాన్ని గడిపి మరణించాడు.

జాన్ రస్కిన్ లండన్‌లో ఐశ్వర్యవంతుడైన వర్తకుల ఇంట్లో జన్మించాడు. అతని తండ్రి వైన్ పానీయ వర్తకుడు. స్పెయిన్‌లో తయారయ్యే ద్రాక్షసారాన్ని దిగుమతిగా చేయడమే గాక తరచుగా స్పెయిన్‌కూ యూరోపులోని ఇతర దేశాలకూ వెళుతూ వుండేవాడు. తనతోబాటు తన భార్యా బిడ్డలను తీసుకువెళుతూ వుండేవాడు. అందుచేత జాన్‌రస్కిన్‌కు బాల్యంనుంచే యూరోపులోని ప్రసిద్ధ భవనాలతో, వాటిలోవున్న శిల్పాలతో చిత్రాలతో, కళా సంపదతో ప్రగాఢమైన పరిచయం ఏర్పడింది అతని విద్యాభ్యాసమంతా తల్లిదండ్రులవల్లా ప్రయివేటు మాష్టర్ల వల్ల జరిగింది.

## బైబిల్ పారాయణం

జాన్ రస్కిన్ మత ప్రబోధకుడై చర్చి సేవలో స్థిరపడి ఏనాటికైనా బిషప్పు కావాలని అతని తల్లిదండ్రులు ఆశించారు. రోజూ ఇంట్లో రస్కిన్ తల్లి అతనిచేత బైబిలు క్రమానుగత ప్రతిని పారాయణం చేయించేది. బైబిల్ అంతా దమారమూ అతనికి కంఠోపాఠం రస్కిన్ తల్లి అతనికి చిత్రకళను కూడా నేర్పింది. బైబిల్‌లోని బావార కన్నా భాష రస్కిన్‌కు బాగా వచ్చింది. అది పూర్తిగా వంటబట్టింది. అందుకే అతని రచనల్లో అ సారళ్యం కనబడుతూ వుంటుంది. తల్లి నేర్పిన చిత్రకళలో ప్రావీణ్యం సంపాదించినా తల్లిదండ్రులు ఆశించిన చర్చి సేవను రస్కిన్ పూర్తిగా

తోసి పుచ్చాడు. దేన్ని తాను తిరస్కరిస్తున్నాడో రస్కిన్‌కు బాగా తెలుసు. మత ప్రభావం నుంచి బయట పడడంవల్లనే జాన్ రస్కిన్‌కు పంధొమ్మిదో శతాబ్దపు మేధావులలో చాలా చెప్పుకోదగ్గవాడు కాగలిగాడు.

1834లో రస్కిన్ రచనలు పత్రికల్లో అచ్చుపడసాగాయి. 1835లో బ్లాక్‌వుడ్స్ మేగజైన్‌లో టర్నర్ అనే చిత్రకారుడిని దుయ్యబడుతూ ఎవరో విమర్శకులు విరుచుకు పడ్డారు. జాన్ రస్కిన్‌కు కోపం వచ్చింది. టర్నర్‌ను సమర్థిస్తూ వ్యాసం రాశాడు ఇది అతని చిత్రశిల్ప కళా గ్రంథ రచనలకు నాంది అయింది. ప్రాచీన చిత్రకారుల కన్నా ఆధునికులు అధికులే అని రుజువు చేశాడు పదిహేడు సంవత్సరాలు యూరప్‌లో విరంతర పర్యటన జరిపి అక్కడి శిల్ప సంపదను వీక్షించి, పరీక్షించి, సమీక్షించి మోడరన్ పెయింటర్స్ (ఆధునికచిత్రకారులు) అనే అయిదు సంపుటాలను రచించాడు. ఆధునికచిత్రకారులను వెనకేసుకురావడంతో పాటు ఆధునిక మార్గాలన్నింటినీ ప్రతిఘటించసాగాడు.

## ఆ ర్థి క సి ద్ధా ం తా లు

జాన్‌రస్కిన్ ఉపన్యాలిస్తూ ఇంగ్లండ్ అంతటా తిరిగారు. కలవారి వాణిజ్యాభివృద్ధితో పాటు లేనివారి కడగళ్ళను కళ్లారా చూశాడు. శ్రామికులను ఆనాటి ఆర్థిక విధానం పీడించటానికి కారణాలను తెలుసుకున్నాడు. ఆ విషయమై లోతుగా ఆలోచించాడు. "పొలిటికల్ ఎకానమీ ప్రాథమిక సూత్రాలు అనే వ్యాస పరంపర రాయడం ప్రారంభించాడు. వాటిని "కారన్‌వాల్ మేగజైన్‌లో 1860నుంచే ప్రచురించసాగారు. థాకరే [1811–63] అప్పుడు దానికి సంపాదకుడు. నాలుగు వ్యాసాలు అచ్చుపడగానే వ్యాపార రంగంలోని ప్రముఖులకు గంగవెర్రులు పుట్టాయి. జాన్‌రస్కిన్ తన వ్యాసాల్లో అప

పులో లేని ఆర్థిక, పారిశ్రామికాభివృద్ధిని విమర్శిస్తూ తీవ్ర శైలిలో హూంకరించాడు. ఆనాటి ఇంగ్లండులో వుండే దోపిడీ మార్గంలో రెండు చేతులా సొమ్ము చేసుకుంటున్న వాణిజ్య సామ్రాజ్యాధిపతులకు ఒక రాలుగాయి రాతగాడు తమ్ము విమర్శించడం సహించలేక పోయారు. అందుచేత ఆ వ్యాసాల ప్రచురణ అంతటితో ఆపమని థాకరేని అతని యజమానులు ఆజ్ఞాపించారు. జాన్‌రస్కిన్ ఎవరూ తన నోరు నొక్కలేరని, కాలాన్ని ఆపలేరని తన వ్యాస పరంపరను "ఫ్రేజర్స్ మేగజైన్" లో ప్రచురించ సాగారు. అయితే ఆరు వ్యాసాల ప్రకటన తర్వాత మళ్ళా పూర్వపు గతే పట్టింది. పత్రికాధిపతులు వ్యాస ప్రకటనను ఆపివేయమని సంపాదకుడ్ని ఆదేశించారు. కారన్‌హిల్ మేగజైనులో పడిన వ్యాసాలు "అన్ టు ది లాస్ట్" అనే పేరుతో గ్రంథ రూపంలో వచ్చాయి. (1862) ఫ్రేజర్ పత్రికలోని వ్యాసాలు కూడా గ్రంథ రూపంలో వెలువడ్డాయి. (1872) "అన్ టు ది లాస్టు" లో రస్కిన్ పెట్టుబడిదారీ విధానాన్ని ఒక కోణంలోంచి చూశాడు. జీతాల గురించి, వాటిని చట్టరీత్యా నిర్ణయించడం గురించి నిరుద్యోగ నిర్మూలన గురించి, సమ్మెల గురించి చర్చించాడు. ఆర్థిక సమస్యలు విషమించినప్పుడు యజమానుల దృక్పథం ఒక రకమన్నీ పనివాళ్ళ దృక్పథం వేరొక రకమనీ ఏ రాజకీయ శాస్త్రమైనా వాళ్ళను కలపలేదని భావించాడు. రస్కిన్ ఇలా ఊహిస్తున్న కాలంలోనే అంతకుముందే ఆర్థిక విధానాల పైన సమగ్ర పరిశోధనలు జరిపి కమ్యూనిస్టు మానిఫెస్టోను కారల్‌మార్క్స్ తనమిత్రుడు ఏంగిల్స్‌తో కలిసి రచించి సక్రమ శాస్త్రీయ సామ్యవాద మార్గాన్ని సూచించ గలిగాడు. ఒక నూరేళ్ళ కాలంలోపునే మార్క్సిజం వల్ల ప్రపంచంలోని మూడవ వంతు భాగంలో సోషలిస్టు రాజ్యాలు వెలుస్తాయని ఆనాటి ఆర్థిక వేత్తలు ఊహించలేక పోవడం లోక విదితం.

## ఆశయాలు, ఆచరణ

ధనవంతులు తమ సంపదలో కొంత భాగాన్ని కనీసం పదో వంతును ధర్మకార్యాలకు వెచ్చించాలని జాన్‌రస్కిన్ ప్రబోధించారు. తన ఉపదేశాలను తాను ఆచరించడమే కాక తన శిష్యుల చేత ఆచరింప చేశాడు. జాన్ రస్కిన్ ఆక్స్‌ఫర్డు విశ్వ విద్యాలయంలో లలిత కళల ప్రొఫెసర్‌గా 1869 నుంచి పని చేశాడు. కోలనుసీమలో స్థిరపడినా రచనా వ్యాసంగం, ఆచార్యత్వం కొనసాగించాడు.

కొలనుసీమలోని కోనిస్టన్ వద్ద వున్న బ్రాంట్‌వుడ్‌లో రస్కిన్ వున్నంత కాలం అక్కడికి ఎందరెందరో ప్రముఖులు వచ్చేవారు. అటువంటి వారిలో చార్లెస్ డార్విన్ ఒకరు. చరిత్రకారుడు జేమ్సు ఫ్రౌడే [1818— 94] కూడా రస్కిన్ ఇంటికి వచ్చాడు. రస్కిన్ రచనల వల్ల టాల్‌స్టాయ్, మహాత్మాగాంధీ ప్రభావితు లయ్యారు. "మన కాలంలోనే ఒక్క ఇంగ్లండులోనే కాక అన్ని కాలాలలోనూ, అన్ని దేశాలలోను గొప్పగా గుర్తించదగ్గ మహా మనిషి జాన్‌రస్కిన్" అంటూ టాల్‌స్టాయ్ రాశాడు. అతడు హృదయంతో ఆలోచించే వ్యక్తి అని. అతడు చెప్పినవి కేవలం తన కాలంలో తాను చూసినవి భావించినవి కాక భావికాలంలో అందరూ ఆలోచించేవి అభిలాషించేవి" అని కూడా టాల్‌స్టాయ్ చెప్పాడు. దక్షిణాఫ్రికాలో వున్నప్పుడు గాంధీజీ యువకుడుగా రస్కిన్ వల్ల ప్రభావితుడై "అన్ టు దిలాస్ట్" గ్రంథాన్ని గుజరాతీ భాషలోనికి అనువదించాడు.

శాస్త్రీయ పాశ్చాత్యవాదం ముందు రస్కిన్ బోధనలు చాలా పేలవంగానే కనబడతాయి. కాని తన కాలంలోని పెట్టుబడిదారీలను తన రచనలతో

హడలగొట్టిన జాన్‌రస్కిన్ చరిత్రలో నిలిచిపోయే వ్యక్తి. అందుకే అతడు బ్రాంట్‌వుడ్‌లో నివసించిన గృహాన్ని అతని జ్ఞాపకార్థం ఒక ట్రస్టు వారు శాశ్వతంగా భద్రపరుస్తున్నారు.

మ్యూజియం

వర్డ్స్‌వర్త్ కొన్నాళ్ళు కాపురం చేసిన కపోత కుటీరాన్ని సందర్శించడానికి వెళ్ళినప్పుడే నేను నా సహచరులతోపాటు, రస్కిన్ గృహాన్నీ మ్యూజియమునూ తీరుబాటుగా చూశాను. కోనిసన్ సరస్సుకు తూర్పు గట్టున మ్యూజియం వుంటే పడమటి గట్టున గృహం వుంది.

మ్యూజియంలోనూ. గృహంలోనూ ఆనాటి వస్తుసామగ్రిని, పుస్తక సంపదాన్ని నిక్షిప్తం చేశారు. రస్కిన్ వేసిన చిత్రాలను భద్రపరిచారు. వ్రాత ప్రతులనేకాక అవి వ్రాయడానికి ఉపయోగించిన బాతుకలాలను కూడా ప్రత్యేకమైన పేటికల్లో దాచారు. రస్కిన్ గృహంలో అతని తల్లి దండ్రుల చిత్రపటం. రస్కిన్ చిత్రపటం (జార్జి రిచ్మండ్ వేసినది) వున్నాయి. రస్కిన్ గృహం పదహారు యకరాల సంక్షేత్రంలో వుండేది. అతను దానిని కొన్న ప్పుడు రస్కిన్ చుట్టాలు దానిని 500 ఎకరాలకు పెంచారు. రస్కిన్ చని పోయిక అతని బంధువులు ఆయన ఎన్నోళ్ళో శ్రమపడి సంపాదించిన కళా ఖండాలను అమ్మివేయసాగారు. రస్కిన్ పట్ల ఎంతో అభిమానం గల జాన్ హోవర్డు వైట్‌హవుస్ అనే ఆయన (1896 లోనే బర్మింగ్‌హాం రస్కిన్ సొసైటీ స్థాపించినవాడు.) 1932 లో బ్రాంట్ వుడ్‌ను కొని ఉత్తరోత్తరా దానిని జాతికి సమర్పించాడు.

మన దేశంలోనూ వున్నారు కళాపోషణ చేసేవారు. రాజపోషకులూ, మహారాజపోషకులూ పోయినా ప్రజా ప్రభుత్వాలు జాతి గర్వించదగ్గ కళా

కారుల గృహాలను మ్యూజియంలుగా మార్చి వారివారికి సంబంధించిన సమస్త వస్తుసామగ్రిని పుస్తక సంచయాన్ని వివిధ ప్రదేశాల నుంచి సేకరించ లేవాః పోషలిస్టు వ్యవస్థ వచ్చేదాకా కళాపోషణ బదులు 'కలాపోసన' మాత్రమే జరుగుతుంది.

# షేక్ స్పియర్ పుట్టిన వూళ్ళో ......

మా పెద్ద బాబాయి పుట్టి పెరిగిన ఇళ్ళలోనూ, వీధుల్లోనూ నేనూ పుట్టి పెరిగాను. రాచకొండ విశ్వనాథశాస్త్రి చదువుకొన్న చోటే నేనూ చదువు కొన్నాను కాశీపట్నం రామారావు మాస్టారు చదువు చెప్పే కాన్వెంటు నాకు తెలుసు. విజయనగరంలో గురజాడ అప్పారావుగారు నివసించిన ఇల్లూ నడి చిన రోడ్లూ నాకు తెలుసు. ఆయన పాఠాలు చెప్పిన కాలేజీలో ఉత్తరోత్తరా కృష్ణశాస్త్రిగారూ, కొడవటిగంటి కుటుంబరావు గారూ చదువుకొన్నట్టే నేను చదువుకొన్నాను. అయ్యకోనేటి గట్టున శ్రీరంగం నారాయణబాబు కూర్చొనే 'గుమ్చీ'లో నేనూ కూర్చొని అతని విజమైన వచన కవిత్వం నెమరువేసుకొన్నాను. చాగంటి సోమయాజులు కథలు రాసిన గదిలో కూర్చొని విశ్వ సాహిత్యంలో మంచి కథలు బోలెడు చదువుకొన్నాను. చోణంకి అప్పలస్వామిగారు చదువుచెప్పిన లైబ్రరీలోంచి ఎన్నో పుస్తకాలు తీసుకొని చదివాను ఇందరు సాహితీ మూర్తుల స్వస్థలాలూ వాటి విశేషాలు నా జీవితకాలంలో నాకు మరపురాని అనుభవాలను కలిగించినట్టే ఇప్పుడు నా బ్రిటన్ పర్యటనలో కౌలనుసీమలోనే కాక బక్కింగ్ హాంషైర్‌లోని మిల్టన్ కుటీరం ఎయిర్ షైర్ లోని రాబర్టుబర్న్స్ జన్మస్థలం వార్విక్ షైర్ షేక్స్పియర్ స్వస్థలం నాలో ఎన్నో పాతజ్ఞాపకాలనూ, కొత్త విషయా లను కెరటాలు కెరటాలుగా రేకెత్తిస్తున్నాయి.

## జన్మ స్థల సందర్శన

షేక్స్పియర్ జన్మస్థలాన్ని నేను ఇప్పటికి ఒక్కసారి కాదు, మూడు సార్లుచూశాను. ఇంకో రెండుసార్లయినా చూడాలని వుంది. ఈ సంవత్సరం ఆగస్టు 11 వ తేదీ నాడు ఆక్స్‌ఫర్డు వెళ్ళి తిరిగివస్తూ మహాకవి జన్మస్థలం దగ్గర ఆగాం (ఆ వూరు మీరగానే మేము బర్మింగ్‌హాం రావాలి) సాయంత్రం 7 గంటలయింది మనదేశంలో నాలుగు గంటలకి ఎంత ఎండా వెలుతురూ ఉంటాయో అంత చక్కగా వుంది. నదీతీరాన పార్కులో షేక్స్పియర్ విగ్రహం వుంది. ఆ మహాకవి జీవితాన్ని ఎన్నికోణాల నుంచి చూశాడో అన్ని కోణాలనుంచీ ఆ విగ్రహాన్ని తనివితీరా చూడాలనిపించింది. ఉన్నత శిలావేదిక పైనవున్న ఆ విగ్రహం ఆకుపచ్చగా, వెచ్చగా, అనవరతం ఆలోచనా మగ్నమై వుంటుంది. ఆ విగ్రహానికి నాలుగు దిక్కులా ప్రదక్షిణ క్రమంలో ప్రిన్స్ హాల్, హేమ్లెట్, లేడీ మేగ్బెత్ ఫాల్‌స్టాఫ్ కాంస్య విగ్రహాలున్నాయి.

ఆ ఆగస్టు సాయంకాంపు మృదులా దీపకాంతిలో, ఏవన్ నదీతీరాన బాన్రూప్ వుద్యానవనాలలో వున్న ఆ మహోన్నత పీఠంపైన ఆసీనుడైన ఆలోచనామూర్తిని అన్ని కోణాలలోంచి వీక్షిస్తున్నప్పుడూ అతని చుట్టూరా వున్న నాలుగు విగ్రహాలను చూస్తున్నప్పుడూ అతని నాటకాలలోని పంక్తులూ సానెట్లలోని చరణాలూ, జీవితంలోని విశేషాలూ జ్ఞప్తికి వచ్చాయి. ఎదుటనే రాయల్ షేక్స్పియర్ కంపెనీ వారి నాటకశాల వుంది. ఆ ఆవరణలోనూ పక్కనేవున్న రెండు ఫర్లాంగుల రోడ్డు మీదా కార్లు వున్నాయి. ఆ ఆగస్టు పదకొండో తారీఖున ఆ నాటక శాలలో సాయంత్రం 7-30 గంటలనుంచి "కామెడీ ఆఫ్ ఎర్రర్స్" ప్రదర్శిస్తున్నారు. 'హవుస్ ఫుల్' టిక్కెట్లు కనీసం ఒక నెలాళ్ల ముందుగా బుక్ చేయించుకోవాలి. ఆగస్టు 1వ తేదీ నుంచి 1984 జనవరి 28వ తేదీ దాకా అన్నెల్ల పాక రోజులపాటు ఆ నాటకశాలలో

ఏ రోజు ఏ నాటకం వేస్తారో ముందుగానే మడతల కరపత్రంలో ప్రకటిస్తారు. ఆ సాయంత్రం మనసులోనే కామెడీ ఆఫ్ ఎర్రర్ మననం చేసుకొంటూ తిరుగు ముఖం పట్టాం.

**జూలియస్ సీజర్ నాటకం**

మళ్ళీ సెప్టెంబరు 19వ తేదీనాడు షేక్స్పియర్ జన్మస్థలానికి వెళ్ళాం. ఈసారి నాటకానికి టిక్కెట్లు బుక్ చేయించుకొన్నాం. ఆ నాటి నాటకం జూలియస్ సీజర్ (ఈనాటకంలోని కొంతభాగాన్ని నేను ఎస్.ఎల్.ఎల్.సీ లో పాఠ్య భాగంగా చదువుకొన్నాను). ఈ విషాదాంత నాటకాన్ని షేక్స్పియర్ క్రీస్తుశకం, 1599 లో రాయగా మొట్టమొదటిసారి ఆ సంవత్సరమే ప్రదర్శిం చారు.(ఈ నాటకాన్ని 1623లో పుస్తక రూపంలో ప్రకటించారు)నాటక ప్రారం భానికి ముందుగానే ప్రోగ్రాం పుస్తకాన్ని కొన్నాం ఇది ఆర్టుపేపర్ మీద ఫుల్ స్కేప్ సైజులో ఎన్నో ఛాయ చిత్రాలతో ప్రకటించిన పద్నాలుగు పుటల పుస్తకం వ్యాపార ప్రకటనలు పోగా. ఇందులో నాటక కంపెనీ చరిత్ర, నాటక పాత్రల చరిత్ర దానిపై కారల్ మార్క్స్ దగ్గర్నుంచీ హెరాల్డ్ విల్సన్ ఇనాక్ పనాక్ మొదలైన వారి వ్యాఖ్యాలు, నాటక రచనకు నేపథ్యం, నాటక ప్రదర్శనలో నిర్వహణలో పాల్గొన్నవాళ్ళ సచిత్ర సమాచారం వున్నాయి.

నన్నూ సోమసుందర్నీ ఈ నాటకానికి తీసుకెళ్ళి డాక్టర్ చాపరాల బాబూరావుగారు టెలిఫోన్ పైన టిక్కెట్లు బుక్ చేశారు. కనుక నాటకశాల వారు మాకు కేటాయించిన సీట్లు ఎక్కడున్నాయో, ఎలావున్నాయో మాకు ముందుగా తెలియలేదు. వెయ్యి మంది కూర్చొని వీక్షించే ఈ నాటకశాలలో పన్నెండున్నర పౌండ్ల నుంచి రెండు పౌండ్లదాకా ఎనిమిది తరగతుల టిక్కె ట్లున్నాయి. అంటే 'ఎ' తరగతి టిక్కెట్లు రమారమి రెండు వందల రూపా యలూ చివరి క్లాసు ముప్ఫయి మూడు రూపాయలని చెప్పాలి. మాకు తలా మూడున్నర పౌండ్ల టిక్కెట్లే దొరికాయి (అంటే మనిషికి యాభై ఆరు రూపాయలన్నమాట). బాల్కనీలో పైడు సీట్లుమాత్రం లేటు బుక్కింగ్ వల్ల దొరికాయి. ప్రదర్శన బాగా రక్తికట్టడంవల్ల అసౌకర్యమైన ఆసనాలపై

కూర్చున్నామన్న భావం నాటకం ప్రారంభంలోనూ నాటకాంతంలోనూ తప్ప మాకు కలగలేదు.

ఈ సంవత్సరం ఆగస్టు నుంచి వచ్చే యేడు జనవరిదాకా ఈ నాటకాన్ని వివిధ తేదీలలో ముప్పయియేడు సార్లు ప్రదర్శించడానికి కంపెనీవారు నిర్ణయించుకున్నారు. సెప్టెంబరు 19వ తేదీనాడు మేము చూసిన ప్రదర్శన ఈ సీజన్‌లోని పదకొండవ ప్రదర్శన దీనికి రాన్ డేనియల్స్ దర్శకత్వం వహించాడు. సీజర్ పాత్రను జోసఫ్ ఓకోనోర్ బ్రూటస్ పాత్రను సీజన్ మెక్‌ఎనెలీ, కేషియస్ పాత్రను ఎమ్రీస్ జేమ్స్ చాలా సమర్థంగా నటించారు. డేవిడ్ స్కాఫీల్ అనే నటుడు మార్క్ ఆంథొనీ పాత్రను గాయకత్తెలా బాగా పోషించినా కేషియస్ ముందూ బ్రూటస్‌ముందూ రాణించలేక పోయాడు. (సినిమాలో రిచర్డు బర్టన్ నటన చూశాక ఎవరు ఆంథొనీ పాత్రను వేసినా సూర్యుని ముందు దివిటీలాగే కనబడతారు) చిన్నా పెద్దా వెరసి ముగ్గురు పాత్రధారులు నటించిన ఈ నాటకం మూడు గంటలసేపు సాఫీగా సాగిపోయింది. (మధ్య పదిహేను నిముషాల విరామం వుంది)

మామూలు పోజుల్తో బాటు నేను "బిఫోర్ ది కర్టెన్ రెయిజెస్" అనే కరపత్రాల వరుసలో ఇరవయ్యో నెంబరు కరపత్రం ఒకటి సంపాదించాను. (ఖరీదు ఇరవై పెన్నీలు). ఈ నాలుగు పేజీల సమాచార కరపత్రంలో గడచిన మూడు వందల సంవత్సరాలలో జూలియస్ సీజర్ నాటక ప్రదర్శనల చరిత్ర సంక్షిప్తంగా వుంది. 1613 నుంచి 1881 దాకా వచ్చిన ముఖ్య ప్రదర్శన వివరాలు ఒక పుటలో వుంటే 1889 నుంచీ షేక్‌స్పియర్ జన్మ స్థలంలోని ప్రదర్శనల వివరాలు ఇంకో పుటలో వున్నాయి.

## నాటకాలపై విశేషం

షేక్‌స్పియర్ 1616 లో కీర్తిశేషుడయ్యాడు. అతని స్వస్థలంలో

అప్పుడు నాటక ప్రదర్శనలు ఇవ్వడం చట్టవిరుద్ధం. ఇది ఆ తర్వాత 150 సంవత్సరాలదాకా కొనసాగింది. మహాకవి మరణించిన ఇరవై సంవత్సరాలకే అతని స్వగ్రామవాసులు "షేక్‌స్పియర్ మావూరు వాడే సందోయ్" అని సగర్వంగా చాటుకొనేవారు గాని అతని నాటకాన్ని ఒకటైనా ఆడిగాని, ఆడించి గాని పుణ్యం కట్టుకోలేదు. 1769 లో షేక్‌స్పియర్ నాటకాలవల్ల పేరు ప్రఖ్యాతులను గడించుకొన్న మహానటుడు డేవిడ్ మహాకవి స్థలంలో పండుగలు జరిపించాలనుకొన్నాడు. సృష్టిగా ఆహార పదార్థాలూ పూటుగా పానీయాలూ ఆర్భాటంగా బాజా భజంత్రీలూ అన్నీ ఆ పండుగలో వున్నాయి గాని షేక్‌స్పియర్ నాటకాలను ప్రదర్శించాలన్న ఇంగితం ఎవరికీ లేకపోయింది. మరో వంద ఏళ్ళకు గాని షేక్‌స్పియర్ స్వస్థలంలో శాశ్వత నాటకశాలను నెలకొల్పాలనే సదుద్దేశం గ్రామవాసులకు కలగలేదు.

1961 లో షేక్‌స్పియర్ త్రిశతజయంతి జరిపారు. అప్పుడు స్థానికంగా సంబరాలు జరిపారు. ఇందుకు రాజధాని అభ్యంతరం చెప్పిన గ్రామవాసులు లెక్కపెట్టలేదు. పన్నెండు రోజులపాటు ఉత్సవాలు జరిపారు. మామూలుగా నాలుగు ప్రక్కల నాటకశాలలలోకాక పన్నెండు పక్కల నాటకశాలలో షేక్‌స్పియర్ నాటకాలు ఆరింటిని ఆడించారు. ఈ ప్రప్రథమ స్థానిక మహోత్సవాలను ఆ వూళ్ళో సారాబట్టీ యజమాని జరిపించాడు. ఈయన కొడుకే చార్లెస్ ఎడ్వర్డు ఫ్లవర్ 1875 ఒక కమిటీని స్థాపించి మహాకవి స్మారక భవనాన్ని నిర్మించి నాటకాలు ఆడించడానికి ఇరవై వేల పౌండ్ల నిధి కోసం ఏర్పాట్లు చేశాడు. అనుకొన్న విరాళాలు రాకపోతే, పాపం, చాలా వరకు ఆ మొత్తాన్ని తానే స్వయంగా భర్తీ చేశాడు. అంతేకాక నదీతీరాన రెండెకరాల భూమిని కూడా దానం చేశాడు. ఇక్కడే "షేక్‌స్పియర్ మెమోరి

యల్ అసోషియేషన్" లాభాల కోసంకాక శాస్త్రాలను, కళలనూ ప్రోత్స హించడానికి స్థాపించి కంపెనీల చట్ట ప్రకారం రిజిస్టర్ చేశారు.

థియేటర్ ప్రారంభోత్సవం

1879 లో షేక్స్పియర్ మెమోరియల్ థియేటర్ ప్రారంభోత్సవం జరిగింది. విక్టోరియా యుగంలోని గోథిక్ శిల్ప రీతుల్లో ఈ భవనాన్ని నిర్మించారు. "మచ్ ఎడూ- ఎబౌట్ నథింగ్" అనే నాటకాన్ని మొట్టమొదట ప్రదర్శించారు. నాటి నుంచీ ఈ నాటకశాలలో ప్రదర్శనలు అవిచ్ఛిన్నంగా జరుగుతూనే వచ్చాయి. నాటకశాలకు అనుబంధంగా ఒక శాశ్వత చిత్ర పట మందిరాన్ని గ్రంథాలయాన్నీ నెలకొల్పారు. 1888లో ఆస్కార్ వైల్డు వీటిని సందర్శించి "కడు సుందరమైన భవనం. ఇంగ్లండ్‌లో బహు కాలానికి ఇటువంటి ముచ్చటైనది నిర్మించారు అని మెచ్చుకొన్నాడు. 1926 లో ఈ భవనం అగ్ని ప్రమాదం వల్ల చాలా భాగం కాలిపోయింది. అప్పుడు బెర్నార్డుషా ఇలా రాశాడు "అగ్ని ప్రమాదానికి స్ట్రాట్ ఫర్డు గ్రామ వాసులు లను అభినందించాలి. పందొమ్మిదో శతాబ్దంలో పరమభ్రష్టుగా ముదనష్టంగా కట్టిన భవనాలలో ఆ స్మారక భవనం ఒకటి."

ఆస్కార్ వైల్డు అంత ప్రశంసించిన బెర్నార్డుషా ఇంత తిట్టిపోసిన థియేటర్ కాలిపోయినా అదృష్టవశాత్తూ చిత్రపటాలూ, శిల్పాలూ గ్రంథాలూ ఏమాత్రం చెడకుండా దక్కాయి. 1922 నాటికే జాతీయస్థాయిని అందుకున్న నాటకశాలను అగ్ని ప్రమాదం తర్వాత కొత్త ప్లానుతో మళ్ళా కట్టదలిచారు. దానికి ఆరేళ్ళ పట్టింది. ఈ ఆరేళ్ళపాటు స్థానిక సినిమా హాలులో నాటక ప్రదర్శనలను ఇచ్చేవాడు.

అది నుంచీ షేక్స్పియర్ స్మారక చిహ్నాలను నెలకొల్పడానికి పాటుపడుతున్న ప్లవర్ కుటుంబంలోని వారే మళ్ళీ కొత్త థియేటర్ నిర్మాణానికి నడుం కట్టారు. ఈసారి అమెరికన్లు ఆర్థికంగా చాలా బాగా ఆదుకొన్నారు. 1932 లో భవనం పూర్తయింది. ఆ యేడు ఏప్రిల్ 23వ తేదీనాడు [అది షేక్స్పియర్ జన్మ దినం అని రివాజు] ప్రిన్స్ ఆఫ్ వేల్స్

కొత్త నాటకశాలకు ప్రారంభోత్సవం జరిపాడు. [ఈయనే ఉత్సరోత్తరా రాజ్యం త్యాగం చేసిన డ్యూక్ ఆఫ్ విండ్సర్] ఇది వేయిమంది ప్రేక్షకులు కూర్చోవడానికి వీలుగా కట్టినశాల షేక్స్పియర్ నాటకాలలో ప్రముఖమైన హెన్రీ ది ఫోర్తు నాటకం ప్రథమ భాగాన్ని మేటనీ మేళలోనూ ద్వితీయ భాగాన్ని సాయంత్రం ప్రయత్నించారు. ఈ షేక్స్పియరు మెమోరియల్ థియేటర్ను 1961 నుంచి రాయల్ షేక్స్పియరు థియేటరు అని పిలవాలని ప్రీవీ కౌన్సిల్ శాసించింది.

— చిత్రపటాల గేలరీ —

ఈ థియేటర్‌ను ఆనుకొనే చిత్రపటాల గేలరీని నెలకొల్పారు. ఇందులో 237 ప్రదర్శన వస్తువులు వున్నాయి. వివిధ శతాబ్దాలలో వివిధ చిత్రకారులు చిత్రించిన షేక్స్‌పియర్ చిత్రాలు, శిల్పులు మలచిన పాలరాతి విగ్రహాలూ, కాంశ్య విగ్రహాలూ, కొన్ని డజన్లు వున్నాయి. వీటిలో లూయీ ఫ్రాంకస్ రూబిలోక్ ( 1695 - 1762 ) చెక్కిన శిల్పం ప్రాచీనం (నెంబరు 207) జార్జి రోమెనీ (1734-1802) చిత్రించిన శైశవ దశలోని షేక్స్‌పియర్ చిత్రం ఒకటి. ప్రాచీనం అని చెప్పాలి (నెంబరు 95) అంజలికా కాఫ్ మన్ ( 1741 - 1807 ) చిత్రించిన ఐడియల్ పోర్ట్రెయిట్ ఆఫ్ షెక్స్పియర్ కూడా ప్రాచీనమే (నెంబరు 3 ). ఇవాళ మహాకవి శిల్పాలూ, చిత్రపటాలూ ఇన్ని కుప్పలు తెప్పలుగా ఉన్నా అతను బతికున్నప్పుడు ఏ ఒక్కడూ అతని రూపు రేఖల్ని చిత్రించలేదు. అన్నీ అతని కీర్తిప్రతిష్ఠలు ఇనుమడించాక రచించినవే.

అయితే షేక్స్‌పియర్‌కు చెందిన చిత్రాలమా శిల్పాలనేకాక అతని నాటకాలలోని వివిధ ప్రముఖ దృశ్యాలు ప్రదర్శనలను చూసో, లేక ఊహించో దేశదేశాల ప్రసిద్ధ చిత్రకారులు చిత్రించిన పటాలుకూడా ఈ గేలరీలో వున్నాయి.వివిధ శతాబ్దాలలో ప్రముఖ నటీనటుల ఆహార్యం లోని భాగమైన దుస్తులను ఇప్పటికీ చెక్కుచెదరకుండా ఇక్కడ గాజు గదులవంటి విలువపెట్టెలో భద్రపరిచారు. డెవిడ్‌గారిక్ మొదలుకొని సర్ లారెన్స్ అలీవర్ దాకా ప్రముఖ నటులు ధరించిన వివిధ పాత్రల చిత్రాలు కూడా వున్నాయి.

ఇంతటి మహత్తర చరిత్రగల రాయల్ షేక్స్‌పియర్ కంపెనీకి ఏడులక్షల పౌండ్ల అప్పులు వున్నాయి. ఏటా ఈ సంస్థకు మూప్పై ఆరు

లక్షల గ్రాంటు ప్రభుత్వంనుంచి వస్తుంది. వచ్చే సంవత్సరం వల్ల తొమ్మిది లక్షల పౌండ్ల విరాళం కేటాయించారు. రాయల్ షేక్స్పియర్ కంపెనీ లాగే రాయల్ ఓపెరాహౌస్ అనే సంస్థకూడా స్వయం ప్రతిపత్తిగల కళాత్మకమైన కంపెనీ. దీనికికూడా పదకొండు లక్షల అరవై వేల పౌండ్ల నష్టం కనబడుతూంది. ఈ జాతీయ సంస్థలగురించి విచారణ జరపమని లోగడ ఫిబ్రవరి మాసంలో ప్రభుత్వం ఒక కమిటీని నియమించింది.

— క్లయన్ ఫ్రీస్లీ నివేదిక —

ఆ కమిటీ అధ్యక్షుడు క్లయిన్ ఫ్రీస్లీ తన నివేదికను ఇటీవలే ప్రకటించాడు. రాయల్ ఓపెరా హౌస్ని, రాయల్ షేక్స్పియర్ కంపెనీ జాతీయంచేసి మధ్యవర్తిన ప్రమేయం లేకుండా ప్రభుత్వమే ధన సహాయం చేయాలని సిఫార్సు చేశాడు. ఈ సలహాని అందరూ ఖండించారు బ్రిటన్‌లోని ఆర్ట్స్ కౌన్సిల్ అధ్యక్షుడు సర్ విలియమ్స్ రీస్‌మోగ్ చాల తీవ్రంగా తన అభ్యంతరాన్ని తెలియచేశాడు. ఏ దినపత్రికకైనా ప్రత్యక్షంగా ప్రభుత్వ నిధులను ఇవ్వడం ఎంత తగనిపనో కళాత్మకమైన సంస్థలకు కూడా సూటిగా తనంతటతానే ద్రవ్యాన్ని ఇవ్వడం సర్కారువారికి కూడ నిషిద్ధి బి. బి. సి. వంటి సంస్థల గవర్నర్లు ఎలాగైతే సృజనాత్మక వ్యక్తులు స్వాతంత్ర్యాన్ని సంరక్షిస్తున్నారో అలాగే ఆర్ట్స్ కౌన్సిల్ కూడా ప్రదర్శన కళల స్వేచ్ఛను పరిక్షిస్తుంది" అని నిర్ద్వంద్వంగా చెప్పాడు.

ఈ విషయమై టైమ్స్ పత్రిక కూడా ఫడింగ్ ఫర్ ది ఆర్ట్స్" అనే హెడ్డింగు పెట్టి ద్వితీయ సంపాదకీయం వ్రాసింది. నేషనల్ మ్యూజియంలను గవర్నమెంటు స్వయంగా తన ధన సహాయంతో నడపడం భావ్యమే. అయితే సృజనాత్మక ప్రదర్శనీయ కళలకు పరోక్షంగా ఇంత

వరకూ ధన సహాయం చేస్తోంది. ఆర్ట్ కౌన్సిల్ ద్వారా ఈ ధనాన్ని పన్నెండు వందల సంస్థలకు పంచిపెడుతున్నారుగానీ నాలుగు పెద్ద కంపెనీలు విరాళంలోని మూడో వంతును పుచ్చుకొంటున్నాయి. పదకొండు వందల తొంభై ఆరు సంస్థలకు మిగతాది పంచిపెట్టాలి. కామన్స్ కమిటీ వారి సిఫార్సు ప్రకారం నాలుగు బడా సంస్థలను ఇద్దరు ముగ్గురు వ్యక్తుల చేతిలో పెట్టి ప్రభుత్వమే నడిపితే చాలా అనర్థాలొస్తాయి అని టైమ్స్ పత్రిక సంపాదకీయంలో స్పష్టం చేసింది.

నేషనల్ మ్యూజియంలను నడపడంలో "పొలిటిక్స్" ఏమీ ప్రవేశించ లేదు. సృజనాత్మక ప్రదర్శనీయ కళలమీద పెత్తనం వహించేవారు, ప్రభుత్వానికే జవాబుదారులైతే బోలెడు రాజకీయాలు రాజుకుంటాయి. అందుకే పెత్తందారులను దూరం చేయాలని ప్రజలూ కళాకారులూ ప్రయత్నిస్తున్నారు. మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలాగే ఈ ఆంగ్ల ప్రభుత్వం కూడా ఖచ్చితమైన పొదుపు చర్యలకు పూనుకొని కళలను ఈ విధంగా 'కరుణించడం' వల్ల విశ్వవిఖ్యాతమైన రాయల్ షేక్స్పియర్ కంపెనీకి కూడా అగచాట్లు వచ్చిపడే సూచనలు కనబడుతున్నాయి. అలాంటిదేం జరగకూడదని ఆశిద్దాం.

షేక్‌స్పియర్ పుట్టిన వూళ్ళో ఈ థియేటరూ, గేలరీలు మాత్రమే కాక ఇంకా చాలా వున్నాయి. అందుకే సెప్టెంబరు 19వ తేదీనాడు నాటకశాలలో జూలియర్ సీజర్ నాటకాన్ని చూశాక బర్మింగ్ హాం వెళ్ళిపోయి మళ్ళా అయిదు రోజులకు సెప్టెంబరు ఇరవై నాలుగో తారీఖున స్ట్రాట్‌ఫర్డ్ అన్ ఏవన్‌కు బయలుదేరాం. "మళ్ళాగా ఎందుకోసం" అని కొందరు ప్రశ్నించారు నేను మా పెద బాబాయిలాగ.

వేళకాని వేళలలో
లేనిపోని వాంఛలతో
దారికాని దారులలో

కానరాని కాంక్షలతో
దేనికొరకు పదే పదే
దేవులాడుతవ్ ?

అని నన్ను నేను ప్రశ్నించుకోను. ఇది దేశంకాని దేశం అని నేను ఎన్నడూ అనుకోవడంలేదు. నా కాంక్షలన్నీ కానవచ్చే కాంక్షలవు తున్నాయని నాకు తెలుసు. షేక్ స్పియర్ పుట్టిన గ్రామంలో నేను నేను దేని కొరకు దేవులాడెనో అవన్నీ తెలుసుకోగలగాను. శతాబ్దాలు గడుస్తున్నా గతంలోనికి నిష్క్రమించకుండా వర్తమానంలోనే వర్ధిల్లుతూ భవిష్యత్తులోనికి పయనిస్తున్న అనన్యసామాన్య కీర్తిశేషుని స్వగ్రామంలో అతని స్ఫూర్తిని, అతని సామాజిక ప్రవృత్తిని సాహిత్య దీప్తిని విబుధ వాదులవల్ల విన్నంత కన్నంత తెలియవచ్చినంత తేటపర్చుకొని ఆకళించు కోగలిగాను. మాటలపై వెతుక్కోకుండా నా విన్నవి కన్నవి వేరే విన్నవించుకొంటాను.

÷ × +

# ప్రప్రథమ భారత భాగ్యవిధాత

ఈ వ్యాసాన్ని సెప్టెంబర్ 27వ తేదీ తెల్లవారుఝామున రాస్తు న్నాను. ఈ తేదీ చాలా ప్రాముఖ్యమున్న తేదీ. ఇది చరిత్రలో చెరిగిపోని దినం ఈనాడు.ఇదే బ్రిటన్‌లో సరిగ్గా నూటయాభై సంవత్సరాల క్రిందట ఒక ప్రఖ్యాత భారతీయుడు కాలధర్మం చెందాడు. కలకాలం నిలిచి పోయేటట్టు తన వారసత్వాన్ని మానవ జాతికే ఇచ్చిపోయాడు. అతడు మనుషులలో అనన్య సామాన్యుడు. మనీషులలో మహమ్మద్ సమానుడు ఆయన పేరు రాజారామమోహనరాయ్.

....రాయ్ 150వ వర్ధంతి....

రాజారామమోహనరాయ్‌ని ఇవాళ ప్రపంచమంతా జ్ఞాపకం చేసు కొంటున్నది గాని, ఆంధ్రులెప్పుడు అతణ్ణి మరచిపోలేరు వీర పూజలో ఆంధ్రులదే అందెవేసిన చెయ్యి. తెలుగు దేశంలో వున్నంత "రామ మోహన్" నామధారులు మరెక్కడా లేరేమో? ఆంధ్రులపై అతని ప్రభావం ఒక చెరగని ముద్ర. అందుకే అతని నూటయాభయ్యో వర్ధంతి నాడు ఇక్కడ బ్రిస్టల్ పట్టణంలో అతని సమాధి ముందు ఆంధ్రులు శ్వేత పుష్పాలు సమర్పించి శ్రద్ధాంజలి ఘటించడం జరిగింది.

ఒక్క ఆంధ్రులేకాదు. భారతీయులేకాదు బ్రిటన్‌లోని "బ్రిస్టల్ ఇండియన్ అసోసియేషన్" వారే కాదు అనేకులైన ఆంగ్లేయ విధ్యాధికులు బ్రైతం ఆయనకు అయిదు రోజుల నుంచి అంజలి ఘటిస్తున్నారు. ఆయన పుట్టి కన్నుతెరపించిన భారత దేశంలో ఎన్ని సంస్మరణ సభలు జరిగినా ఆయన మెట్టి కన్ను మూసిన బ్రిటన్‌లోని ఇన్ని రోజులు ఆ మహనీయుని

స్మారక సమావేశాలే కాక ఎనలేని ఎగ్జిబిషన్ ఒకటి ఏర్పాటు చేసి ఆ చిరస్మరణీయుణ్ని చేతులారా నమస్కరించి అతని జీవితాన్ని పునశ్చరణ చేసుకొనడమే చాలా గొప్పవిషయం.

బ్రిటన్‌లో ఎన్ని సంఘాలున్నా బ్రిస్టల్ పట్టణంలో ప్రత్యేకంగా "బ్రిస్టల్ ఇండియన్ అసోసియేషన్" అనే సంఘం ఒకటి వుంది. ఈ సంవత్సరం రాజారామమోహన్‌రాయ్ నూటయాభయ్యవ వర్ధంతిని జరపాలని సుమారు ఏణ్ణర్ధం కిందటే బ్రిస్టల్‌లోని ఇండియన్ సంఘంవారు ప్రయత్నాలు ప్రారంభించారు. ఈ సంవత్సరం ఫిబ్రవరి నెలలో రాజా రామామోహన్‌రాయ్ కమిటీ ఒకటి స్థాపించారు. దీనికి భూపేంద్రలూథర్ అధ్యక్షుడు - శ్రీమతి బి. యమ్ డాష్కర్స్ కార్యదర్శి. ఈ కమిటీలో చిత్తశుద్ధి, కార్యదీక్ష, నిజాయితీగల సభ్యులు ఫిబ్రవరి నుంచి ఏడు నెలలపాటు ఎంతో శ్రమపడితే ఎనిమిదో నెల సెప్టెంబరులో ఒక వారం రోజులపాటు సంస్మరణ సభలూ, సమావేశాలు సాధ్యమైనాయి. మన దేశంలోలాగే ఇక్కడకూడా ప్రభుత్వాధికారులకు ఈ సభల ప్రాముఖ్యాన్ని ముందే ఎంతో నచ్చచెప్పవలసి వచ్చింది. సదరు అధికారులను ప్రత్యక్షంగా కలుసుకొని రామమోహన్‌రాయ్ అంటే ఎవరో. ఆయన చేసినకృషి ఏమిటో వివరించవలసి వచ్చింది. మన దేశానికి ఈ దేశానికి తేడా ఒక్కటే ప్రయవేటు సంస్థలుచేపట్టే కార్యక్రమాల ప్రాముఖ్యం తెలుసుకొన్నాకచేయవలసినంత సహాయాన్ని అధికారులు చేస్తారు. మన దేశంలో ప్రభుత్వస్థాయిలో వీటికి అథారిటీ వుండడంవల్ల ప్రయరిటీ వుంటుంది.

బ్రిస్టల్ పట్టణంలో బహుళ సంస్కృతులు సహజీవనం చేస్తున్నాయి. అందుచేత ఇక్కడ "మల్టీకల్చర్ ఎడ్యుకేషన్ సెంటర్" అనే సంస్థ ఒకటి వుంది. ఈ సంస్థవారు సెప్టెంబరు ఎనిమిదో తేదీనాడు రోజు రోజంతా అక్కడి టీచర్ల కోసం ఆసక్తిగల ఇతరుల కొసం రాజారామమోహన్‌రాయ్ జీవిత వివరాల గురించి సంచలనాత్మక కార్యక్రమాలు నడిపించారు.

... ఛాయా చిత్రాల ప్రదర్శన ...

సెప్టెంబరు ఇరవై మూడో తారీఖునాడు బ్రిస్టల్ మ్యూజియంలో ఏర్పాటుచేసిన ప్రత్యేక ప్రదర్శనాన్ని ప్రాచ్యకళల క్యూరేటర్ ఆహ్వానితులైన అతిథులకు పరిచయం చేశారు ఈ ప్రదర్శనానికి "రామమోహన్ రాయ్ అతని జీవితం కృషి నిర్మాణం" అని పేరు పెట్టారు. ఇందులో రామమోహనరాయ్ జీవితకాలంలో సమకాలికులు వివిధ పౌరాణిక సాంఘిక విషయాలపై చేసిన వర్ణచిత్రాలూ, వివిధ వయస్సులో రాయ్ చిత్రపటాలూ ఆనాటి వస్తుసామగ్రి దేవతా విగ్రహాలూ రాయ్ సంతకంతో వున్న ముద్రితాముద్రిత గ్రంథ పరిచయమూ, తత్కాలపు వార్తాపత్రికలలో రాయ్‌కి సంబంధించిన కత్తిరింపుల ఎనార్జిమెంట్లూ వగైరాలూ వున్నాయి. చిత్రపటాలలో సహగమన దురాచారాన్ని చిత్రించేవీ, విడి ప్రశాస్త్ర ప్రమేలా దే దృశ్యాలు మొదలైనవి కూడా వున్నాయి. వస్తుసామగ్రిలో కలకత్తా కాళిక ముందు నోరులేని మూగజీవాలను బలి చేస్తున్నప్పుడు నరికే బలికత్తి కూడా వుంది. ఛాయా చిత్రాలలో రాయ్ బ్రిస్టల్‌లో నివసించిన గృహమూ వారి ప్రథమ సమాధీ చూపించేవి కూడా వున్నాయి.

ఈ ప్రత్యేక ప్రదర్శనంలో చూపించడానికిగాను చిత్రాలనూ వస్తువులనూ గ్రంథాలను ఏష్మోలియన్ మ్యూజియం నుంచి ఇండియా ఆఫీసు లైబ్రరీ నుంచి మాంచెస్టర్ కాలేజి నుంచి ఆక్స్‌ఫర్డు నుంచి, విక్టోరియా ఆల్బర్టు మ్యూజియం నుంచి సమీకరించారు. తేనెటీగలు ఎన్నెన్నో పువ్వుల నుంచి సంగ్రహించిన మధువులతోగాని పట్టు పెట్టలేవు బ్రిస్టల్‌లోని భారతీయులు మధుకరులై మరచిపోలేని మధుర దీక్షతో తేనె పట్టులాంటి ఈ ప్రత్యేక ప్రదర్శనం ఏర్పాటు చేసినందుకు ఎంతో అభినందించాలి.

ఈ ప్రత్యేక ప్రదర్శనాన్ని సెప్టెంబరు ఇరవై నాలుగో తేదీ శని వారం నాడు పురజనులకోసం బ్రిస్టల్ మ్యూజియం ఆర్ట్ గేలరీలో ఆవిష్క

రించారు. ఇంతటి అపురూప సమీకరణాన్ని అశేష ప్రజలు వీక్షించా లన్న వుద్దేశంతో ఈ ప్రదర్శనాన్ని సెప్టెంబరు 24వ తేదీ నుంచి నవం బరు 19వ తేది దాకా అంటే ఇరవై ఆరు రోజులపాటు నడుపుతున్నారు. "రామమోహనరాయ్ ఎవరు?" ఆయన బ్రిస్టల్‌లో ఎందుకున్నాడు? అతని నూటయాభయ్యవ వర్ధంతిని మేమెందుకు జరుపుతున్నాం" అనే ప్రశ్నలతో మొదలు పెట్టే ఒక కరపత్రాన్ని వేసి అందరికీ ఉచితంగా ఇస్తున్నారు. ఇందులో రాయ్ సంక్షిప్త జీవిత చరిత్రను పొందుపర్చారు.

రాయ్ సంక్షిప్త జీవిత చరిత్రనైనా భారతీయ పాఠకులకు ఈ వ్యాసంలో చెప్పడం తల్లి పుట్టింటి సంగతులు మేనమామకు చెప్పడంలాగ ఒకనాడైతే నిజమే కావచ్చునుగాని ఇప్పుడిప్పుడే ఆ సామెతను నిజం చేయవలసి వస్తుంది.

—రాయ్ జీవిత చరిత్ర—

రాయ్ 1770లో వంగ రాష్ట్రంలోని కులీన బ్రాహ్మణ కుటుంబంలో పుట్టాడు. అరబ్బీ పారశీక సంస్కృత భాషలు క్షుణ్ణంగా అభ్యసించాడు. వంగ సాహిత్యాన్ని కాచి వడబోశాడు. ఆంగ్ల భాషను అధ్యయనం చేశాడు. చిన్నప్పుడే ముస్లిములతో కలసి చదువుకొనడంవల్ల ఇస్లాం మతంలోని ఏకేశ్వరో పాసనను గ్రహించాడు. ఆంగ్లేయులతో సంచ రించడంవల్ల క్రైస్తవ మత సిద్ధాంతాలను ఆకళింపుకొన్నాడు బైబిల్ మూల పాఠంలో ఏముందో తెలుసుకొనడానికిగాను హీబ్రూ, గ్రీక్, లాటిన్ భాషలలో కరతలా మలకం చేసుకొన్నాడు.

బహుభాషా పాండిత్యం వల్ల దృక్పథం ఎప్పుడు విస్తరిస్తుంది. అన్యమత గ్రంథ పఠనంవల్ల సమన్వయలకు బుద్ధి కలుగుతుంది. జాతిలో జాఢ్యంగా మారిన మౌఢ్యాన్ని తొలగించడానికి సంఘాన్ని సంస్కరించి

సన్మార్గంలో పెట్టాలనిపిస్తుంది. తల్లి గురువులు చెప్పే దొల్ల బోధనలను ఖండించాలనిపిస్తుంది. సమాజంలోని జడత్వాన్ని వెడలకొట్టడానికి నడుం కట్టాలనిపిస్తుంది. అనిపించినవన్నీ రాయ్ ఆచరణలో పెట్టాడు. వంగ భాషలోనూ, పారశీ భాషలోనూ పత్రికలు పెట్టాడు. సనాతనవాదులతో సమరం చేశాడు. ఉపనిషత్తులనూ, బ్రహ్మ సూత్రాలనూ సామాన్య ప్రజలకు అందుబాటులో వుండాలని అనువాదం చేశాడు. వాణిజ్యంలో రాణించడంవల్ల ధనం పుష్కలంగా వుంటే చేయదలచుకొన్నవన్నీ తాను చేయడమేగాక ఇతరులకు పెట్టుబడులు కూడా పెట్టాడు. మత సంబంధమైన కరపత్రాలను ముద్రించి జాతి జనులకు ఉచితంగా పంచి పెట్టాడు.

## —సహగమన నిషేధం—

రాయ్ తన జీవితకాలంలో ఎన్ని చేసినా సహగమనాన్ని నిషేధింప చేసిన మహనీయునిగా అతణ్ణి చరిత్ర జ్ఞాపకం పెట్టుకొంటుంది. 1829 డిసెంబర్ నాల్గవ తేదీనాడు తూర్పు ఇండియా కంపెనీ గవర్నరు జనరల్ విలియం బెంటిక్ సహగమనాన్ని నిషేధిస్తూ శాసనం ప్రకటించినా ఛాందస కుటిల బ్రాహ్మణులు దాన్ని రద్దు చేయమని లండన్‌లోని ప్రివీ కౌన్సిల్‌కు పిటిషన్ పెట్టుకున్నారు. భారత దేశంలో తాను పడిన శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరు కాకుండా వుండాలని ప్రివీ కౌన్సిల్ ముందు వాదించడానికి రామమోహనరాయ్ నిశ్చయించుకొన్నాడు. సరిగ్గా అదే సమయానికి మొగల్ చక్రవర్తి రెండవ అక్బర్ షా తన ప్రతినిధిగా రాయ్‌ని లండన్ పంపాలని వాంఛించాడు. అందుకోసం రాయ్‌కి "రాజా" అనే బిరుదాన్ని ఇచ్చాడు. (ఈ బిరుదాన్ని ఆంగ్ల ప్రభుత్వం మొదట గుర్తించలేదు.

(శేషం)

## —ఇంగ్లండ్ పర్యటన—

1831 ఏప్రిల్ ఎనిమిదో తేదీనాడు రాజారామమోహన్‌రాయ్ ఇంగ్లండ్‌లో అడుగు పెట్టాడు. అతని వెంట అతని దత్త పుత్రుడు రాజారామ్ వున్నాడు. ఈ కుర్రాడు పుట్టుకవల్ల ముసల్మాన్ కావచ్చునని చరిత్రకారులు భావిస్తున్నారు. రాజా సిబ్బందిగా ఒక కూలీ, ఒక వంట బ్రాహ్మణుడూ కాక రెండు గోవులు కూడా ఓడ నుంచి దిగడం జరిగింది. వచ్చిన దగ్గర్నుంచీ రాజా కంపెనీవారితో ఆంగ్ల ప్రభుత్వంతోనూ తనతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్న ఆంగ్ల మిత్రులను కలుసుకొన్నాడు. భారతదేశపు ఆర్థిక సాంఘిక ధార్మిక పరిస్థితులపై సెలక్ట్ కమిటీ ముందు సాక్ష్యం ఇచ్చాడు. రాజా ప్రభావం వల్లనే అని చెప్పలేంగాని ప్రివీ కౌన్సిల్ ఎట్టకేలకు ఛాందసుల అర్జిని కొట్టి పారేసింది.

భారతదేశంలో వున్నప్పుడు రాజా మొదట ఆత్మీయ సభను స్థాపించి దానిని బ్రహ్మ సమాజంగా మార్చాడు. ఇది కొత్త మతంలాగా కనబడ్డా, హిందూ మతంలోని నూతన శాఖే అని చెప్పాలి. ప్రతి మతంలోనూ వివిధ శాఖలు వుంటాయి. క్రైస్తవ మతంలోని పలు శాఖలలో ఒకటైన "యూనిటేరియన్" శాఖ తన అభిప్రాయాలకు దగ్గర్లో వున్నదని భారత దేశంలో వున్నప్పుడే రాజా గ్రహించాడు. ఆ శాఖ ప్రచారకులతో సంబంధాలు పెట్టుకొన్నాడు. లండన్‌లో ఆ శాఖ వ్యక్తులను కలుసుకొని వివిధ విషయాలు చర్చించారు.

బ్రిస్టల్ పట్టణంలో డాక్టర్ లాంట్ కార్పెంటర్ అనే వ్యక్తి మత ప్రచారమే కాక విద్యారంగంలో కృషిచేస్తూ వుండేవాడు అయనను కలుసుకొని ఆ విద్యా విధానాలను ఆకళించుకోవాలని రాజా 1833 సెప్టెంబరు అయిదో తేదీనాడు బ్రిష్టల్‌కు వచ్చాడు. స్టేపిల్‌టన్ గ్రోవ్‌లోవున్న

బీచ్ హౌస్‌లో అనే భవనంలో బస చేశాడు. (ఒకటో నెంబరు చిత్రం చూడండి) మేడమీద కుడిచేతి పక్కగదిలో నివసించాడు. (ఇది గేటుకు ఎగువన కంచెపైనవున్న గది.)

లివిన్స్ మీడ్ [Lewins Mead]లోవున్న యూనిటేరియన్ సభా వేశ గృహంలోని ప్రార్థనలలో పాల్గొని ప్రవచనం చేశాడు. ఈ విష యాన్ని శాశ్వతంగా జ్ఞాపకం పెట్టుకొనడానికి అక్కడ ఒక ఫలకాన్ని భద్రం చేశారు. (రెండవ నెంబరు చిత్రం చూడండి)

రాజా బసచేసిన బీచ్ హౌస్ డాక్టర్ లాంట్ కార్పెంటెరుగారి శిష్యురాలు మిస్ కేథరిన్ కేసెన్ స్వగృహం. రాజా లండన్‌కి వచ్చిన రెండో ఏడాదిలోనే 1832లో అతని తైల వర్ణ చిత్రాన్ని హెచ్. పి. బ్రిగ్స్‌చేత మిస్ కేథరిన్ కేసెన్ వేయివించింది. (మూడో నెంబరు చిత్రం చూడండి) ఈ చిత్రమే విశ్వవిఖ్యాతమైంది. నేపథ్యంలో ఒక గుడీ, ఒక మసీదూ వున్నాయి.

రాజా దుస్తులు మొగలు దర్బారు దుస్తులు కాళ్ళకి ఆంగ్లేయుల మేజోళ్ళు జోళ్ళూ వున్నాయి. చేతిలోవున్న పుస్తకం బైబిల్ కావచ్చు (ఈ చిత్రాన్ని 1832లో వేయించినా 1841లో మిసికేసెన్ బ్రిస్టల్ మ్యూజియానికి బహూకరించింది) రాజా చిత్రంలో కన్నా లావుగానే వుండేవాడట. ఈ చిత్రం అయినా వచ్చులేదు.

## —రాయ్ నిర్యాణం—

బ్రిస్టల్ రాజా పన్నెండు రోజులు చాలా చురుకుగా కార్యక్రమాలలో పాల్గొన్నాడు. పదమూడో రోజున సెప్టెంబరు 17వ తేదీనాడు మెదడు పొరల వాపువల్ల తీవ్రమైన జ్వరం వచ్చింది.(మెనింజైటిస్‌ను ఆ రోజుల్లో బ్రెయిన్ ఫీవర్ అనేవారు) అందువల్ల పరిస్థితి విషమించింది. సెప్టెంబరు 27వ తేదీ తెల్లవారుఝామున రాజా నిర్యాణం చెందాడు. ఆయన శరీరాన్ని అతను బసచేసిన బీచ్ హవుస్ వున్న స్టేపిల్టన్ గ్రోవ్ లోనే నిశ్శబ్దంగా నిర్మాంత్రికంగా సమాధి చేశారు. రాజా మరణ వార్త ప్రపంచమంతా వ్యాపించి ఎందరినో దుఃఖ సముద్రంలో ముంచింది.

రాజా మరణించిన ఏడాది దాటాక మూడునెల్లకి (1834 డిసెంబర్ 11వ తేదీనాడు) మిస్ కేసెన్ కూడా చనిపోయింది. ఇల్లు వారసులకి దక్కింది. సమాధి కేవిధమైన లోపం జరగలేదు. 1840లో ద్వారకానాథ్ ఠాకూర్ (రవీంద్రనాథ్ ఠాకూర్‌గారి తాతగారి) ఇంగ్లండ్‌కు వచ్చి బ్రిస్టల్‌లోని సమాధిని సందర్శించాడు. అప్పుడే ఒక సంస్మరణ కమిటీని ఏర్పాటు చేశారు. బ్రిస్టల్ పట్టణానికి శివార్లలో వున్న ఆర్నోస్ వేల్ శ్మశాన వాటికలో కొంత స్థలాన్ని కొన్నారు. (లాట్ నెంబరు నాలుగు సెల్వోర్ ఎల్) అక్కడికి 1843 మే ఇరవై తొమ్మిదో తేదీనాడు రాజా భౌతిక కాయమున్న పేటికను తరలించి తిరిగి భూస్థాపితం చేశారు. అక్కడ మండపంలాటి ఒక మందిరాకారంలో సంస్మరణ చిహ్నాన్ని నిర్మించారు. (నాలుగో నెంబరు చిత్రం చూడండి) అప్పటి నుంచి ఆర్నోస్‌వేల్ శ్మశాన వాటిక ఒక యాత్రా స్థలమైంది.

ఇన్ని కారణాలవల్ల, ఇంతటి చరిత్ర వుండడంవల్లనే బ్రిస్టల్ పట్టణంలో "రామమోహన్‌రాయ్ అతని జీవితం, కృషి-నిర్యాణం" అనే పేరుతో ప్రదర్శనం ఏర్పాటు చేశారు. సెప్టెంబరు 24వ తేదీనాడు ఆవిష్కరించారు. ఆ సాయంత్రం భారతీయ శాస్త్రీయ సంగీత నాట్యాల కార్యక్రమాన్ని ఏర్పాటు చేశారు. ఆ మర్నాడు వెవిన్స్‌మీడ్‌లోని యూనిటేరియన్ సమావేశ గృహంలో సంస్మరణ ప్రార్థనలు జరిపించారు

—సంస్మరణ సభ—

సెప్టెంబరు 26వ తేదీనాడు మధ్యాహ్నం ఒక గంటసేపు రాయ్ జ్ఞాపకార్థం భారతీయ సంగీతం కార్యక్రమాన్ని నడిపారు. నాలుగు గంటల నుంచి ఆరు గంటలదాకా సంస్మరణ సభను జరిపారు. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో సంస్కృత శాఖలో బోడన్ ప్రొఫెసర్ డాక్టరు ఆర్. గోమ్ బ్రిచ్ అధ్యక్షతలో ప్రముఖులు ప్రసంగ వ్యాసాలు చదివారు. ఇండియా ఆఫీస్ లైబ్రరీకి చెందిన డాక్టరు రిచర్డ్ బింగిల్ 'ఇంగ్లండ్‌లో రామమోహన్‌రాయ్' అనే వ్యాసం చదివారు. బ్రిస్టల్‌లోని మల్టికల్చరల్ ఎడ్యుకేషన్ సెంటర్‌కు చెందిన శ్రీమతి క్లారా కాంప్‌బెల్, బ్రిస్టల్‌తో యూనిటేరియన్లతో "రామమోహన్‌రాయ్ సంబంధం" అనే వ్యాసం చదివింది. రైన్ తీరాన వున్న మ్యాక్‌కేవెల్ విశ్వవిద్యాలయం "రెలిజియస్ స్టడీస్" శాఖలోని డాక్టరు డెర్మోట్ కిల్లింగ్లీ "హిందూ ప్రత్యర్థులతో రామ్‌మోహన్‌రాయ్ వివాదాలు" అనే అంశంపై వ్యాసం చదివారు.

ఈ కార్యక్రమాల గురించి ముందుగానే తెలుసుకొని నేనూ, సోమసుందరం "మా సారధి మా పచిష్టుడు, మానెయ్యం" డాక్టర్ వాసరాల బాబూరావుగారూ సెప్టెంబరు 26వ తేదీనాడు బ్రిస్టల్ వెళ్ళాం సరాసరి అర్నోస్ వేల్ శ్మశాన వాటికకు వెళ్ళాం మా శ్రద్ధాంజలిని ఘటించాం. ఆ తర్వాత మ్యూజియమ్‌కు వెళ్ళి శ్రద్ధగా, ప్రదర్శనను చూశాం అటు పిమ్మట సంస్మరణ సమావేశంలో ప్రసంగ వ్యాసాలు విన్నాం. ఆ సభలో మండలి కృష్ణారావు, విశ్వనాథ శ్రీకృష్ణదేవరాయలు, లవణం డాక్టరు పగడాల రామకృష్ణారావు ఆయన సతీమణి డాక్టరు వసుంధర (న్యూయార్క్‌లో వైద్యులు) మొదలైన ఆంధ్రులు కూడా వున్నారు.

సెప్టెంబరు 27వ తేదీనాడు పొద్దుట 10.30 గంటలకు ఇండియన్ హై కమీషనరు సయ్యద్ మహమ్మద్‌తో కలిసి బ్రిస్టల్ లార్డ్ మేయర్ ఆర్నోస్ వేలలోని రాజారామమోహనరాయి సమాధి సందర్శన కార్యక్రమం వుంది. తరువాత సివిల్ రిసెప్షన్ సంస్మరణ ప్రసంగ వ్యాసాల కార్యక్రమం వున్నాయి.

ఈ చివరిరోజు కార్యక్రమంలో మేము పాల్గొనలేకపోయాం. సెప్టెంబరు 27వ తేది సాయంకాలం నాలుగు గంటలకు మార్క్సిస్టు మేధావి చరిత్రకుడు, కళలనూ, కవిత్వాన్ని శాస్త్రీయసామ్యవాద దృక్పథంలో వ్యాఖ్యానించిన ఆచార్యుడు, ప్రొఫెసరు జార్జి థామ్సన్‌గారిని కలుసుకోవ డానికి పది రోజులు ముందుగానే ఏర్పాటుచేసుకోవడంవల్ల బ్రిస్టల్ నుంచి బర్మింగ్ హాంకి వచ్చేశాం జార్జి థామ్సన్ బర్మింగ్ హాంలోనే వుంటారు. ఆయన గ్రీక్ నాగరికతపై ఇప్పటిదాకా ఇతరులు చేసిన సిద్ధాంతాలను పూర్వపక్షంచేసి, ఒక శాస్త్రీయ దూవ కల్పన ప్రతిపాదించారు.

నవభారత జాతీయతకు రూపకల్పన చేసి మన పునర్వికాసానికి పూనుకొని దోహదం చేసిన మహనీయుణ్ణి పరదేశంలో స్మరించుకొనే అవకాశాన్ని బ్రిస్టల్ భారతీయులూ, వారి ఆంగ్ల మిత్రులూ కలిగింప చేశారు. రామమోహన్‌రాయి జ్ఞాపకాలను భారతీయులు శాశ్వతంగా నిక్షిప్తం చేసుకొంటారు గాని బ్రిస్టల్ భారతీయులు ఏర్పాటు చేసిన ప్రత్యేక ప్రదర్శనలోని ప్రతి ఒక్క చిత్రానికీ చాయా చిత్రానికి వస్తువులకూ నకళ్ళు సంపాదించి మన దేశంలోని ముఖ్య నగరాలలో శాశ్వత ప్రదర్శనలను నెలకొల్పడం మన కనీస కర్తవ్యం. రాజారామమోహన్ రాయి నిజంగా ప్రప్రథమ ఆధునిక భారత భాగ్య విధాత.



# బ్రిటన్‌లో వామపక్ష పత్రికలు

వార్తమీద ప్రపంచం ఆధారపడి వుంటుంది. వార్తంటే నేడు కబురు, సమాచారం, వర్తమానం, న్యూసు అనే అర్థాలు మనం చెప్పు కొంటాం. ఆది కాలంలో ఆర్యావర్తంలో వార్త అంటే "ఏకానమీ" అనే వ్యవహరించేవారు. ధర్మార్థ కామాలను త్రయి అంటారు. ధర్మం యుగధర్మం, అర్థం తత్కాలపు ఆర్థిక విధానం, కామం ఆ నాటి చట్టం అంగీకరించే వాని వయసులలో వాళ్ళు జంట కట్టడం అనే కలకాలం అర్థం చెప్పకోవాలి. ధర్మం కామం రెండూ అర్థం మీదనే ఆధారపడివుంటాయి. ఆర్థిక విధానాలను బట్టి యుగ ధర్మాన్ని వివిధ రాజ్యాలు నిర్వచనం చేస్తాయి. దాన్ని అమలు పర్చడానికి మార్గాలు వేస్తాయి. ప్రకటనలు చేస్తాయి.

## —భారత పత్రికలు—

పూర్వం చిన్న చిన్న గ్రామాలలో, చిన్నసైజు పట్టణంలో కూడా గ్రామాధికారులు నిర్ణయాలను ప్రజలకు తెలియజేయడానికి "దండోరా" వేసేవారు. ఇప్పుడు అధికార నిర్ణయాలను ప్రజలకు పత్రికా ముఖాన తెలియచేస్తున్నారు. ప్రచార సాధనాలు వృద్ధి చెందాక రేడియో, టెలి విజన్ సినిమా స్లయిడ్స్ ప్లేకార్డ్ ప్రకటనలు వివిధ రూపాలను సంతరించు కొంటున్నాయి. విన్నమాటనే పూర్వం విశ్వశించేవారు. నేడు అచ్చు పడ్డ అక్షరాలను చాలా మంది గుడ్డిగా నమ్మేస్తూ వుంటారు. వార్తా పత్రిక లలో వచ్చేవన్నీ వాస్తవాలే అని ప్రజానీకంలోని అధిక సంఖ్యాకులు అనుకొంటే ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు.

మద్రాసు వంటి మహా నగరాలలో రిక్షా వాళ్ళూ, టాక్సీ వాళ్ళూ ప్రొద్దుటా, సాయంత్రం పత్రికలు చదువు కోవడం పరిపాటే ఆంధ్ర దేశంలోని వివిధ నగరాలలో కూడా పత్రికలు బహుళ ప్రచారాన్ని పొందుతున్నాయి. మద్రాసులోని పత్రికలు కొన్ని డి.యం.కె. పత్రికలు మరికొన్ని ఏ డి.యం.కె. పత్రికలు వాళ్ళ వాళ్ళ పార్టీ అభిమానులు బట్టి జన సామాన్యం పత్రికలు కొనుక్కొని చదువుకొని, చదువుకొన్న ప్రతి అక్షరాన్ని గట్టిగా నమ్మేస్తారు. ఇతర పార్టీలకు కూడా పత్రికలు వుంటాయి. ఇది ఏ భాషలోనైనా, ఏ దేశంలోనైనా జరుగుతున్న వాస్తవమే.

పత్రికలు చదవడం అన్నది అలవాటు చేసుకొంటే అది ద్వితీయ ప్రకృతిగా మారుతుంది. తెల్లారిలేవగానే మార్నింగ్ పత్రికలలో ఇష్టమైనదేదో ఒకటి విద్యాధికులు చదువంచే దైనిక వ్యాపారం మొదలవుతుంది.కొందరు పొద్దున్నే రెండు, మూడు పత్రికలు కూడా చదువుతారు. నామట్టుకు నేను మద్రాసులో రోజుకు ఆరు దిన పత్రికలు చదువుతాను. ప్రజాశక్తి. ఆంధ్రజ్యోతి నాకు ఏ రోజు పత్రికలు ఆ రోజు పోస్టులో వస్తాయి. ఇండియన్ ఎక్స్‌ప్రెస్, హిందూ, ఈనాడు పత్రికలు పొద్దుటే మా వీధి చివర పేపర్ల కొట్టులో కొనుక్కుంటాము. సాయంత్రం "న్యూస్ టు డే" అనే దిన పత్రికను చదువుతాను.

ఇప్పుడు బర్మింగ్‌హాంలో నాకు ఏరోజైనా "టి.వి.ఏ.ఎం." అనే శీర్షికతో 'గుడ్ మార్నింగ్ బ్రిటన్' అనే వార్తా కార్యక్రమంతో ప్రారంభమవుతుంది. ఈ టి.వి. ప్రోగ్రాం పొద్దుట 6 గంటల 25 నిముషాలకు ఆరంభం అయితే దినపత్రిక (టైమ్స్) పొద్దుట ఏడున్నర దాటాకగాని రాదు. టి.వి.లో శ్రవణ నయనేంద్రియతో తెలుసుకొన్న వార్తలనే పత్రికలలో నయనేంద్రియంలో విపులంగా చదువుకోవడం జరుగుతోంది. రోజుకు ఆరు పత్రికలు చదివి వివిధ దృక్పథాలను

పత్రికలు చదివే అవకాశాలు వున్నాయి. రోజూ సాయంత్రం "బర్మింగ్ హాం ఈవెనింగ్ మెయిల్" అనే పత్రిక నాకు ఆతిథ్యం ఇస్తున్న డాక్టరు జమలాపురం హరిగోపాల్‌గారి ఇంటికి వస్తుంది. నేను నగరంలోని సిటీ సెంటరుకి వెళ్తున్నప్పుడల్లా "గార్డియన్" పత్రికను తరచుగా "టెలిగ్రాఫ్" పత్రికను అప్పుడప్పుడు కొంటూ వుంటాను.

—బ్రిటన్ పత్రికలు—

బ్రిటన్‌లో టైమ్స్, గార్డియన్ టెలిగ్రాఫ్ అనే మూడు పత్రికలే ప్రొద్దుటవచ్చే ముఖ్య దిన పత్రికలు "టైమ్స్" పత్రిక మన హిందూ పత్రికలాంటిది. "టెలిగ్రాఫ్" పత్రిక కన్సర్వేటివ్ భావాలను ప్రతిఫలిస్తూ వుంటుంది. 'గార్డియన్' పత్రిక లిబరల్ భావాలను అర్థం పడుతుంది. ముఖ్యవార్తలకు పతాకశీర్షికలు పెట్టడంలోనే ఆయా పత్రికలు పైఖరులు తెలుస్తాయి. సంపాదకీయాల్లో రాజకీయ ధోరణులు స్పష్టమవుతాయి.

బ్రిటన్‌లో సాయంకాలం వెలువడే పత్రికలు కనీసం అయిదు ముఖ్యమైనవి వున్నాయి. మార్నింగ్ పత్రికలు మన దేశంలోలాగే డెమ్మీ సైజులో వుంటాయి. (బహుశా బ్రిటన్ నుంచి మనం మన దిన పత్రికలను డెమీ సైజులో ప్రచురించడం నేర్చుకొన్నాం కాబోలు.) బ్రిటన్‌లో ఈవెనింగ్ పత్రికలలో మాత్రం 'అఫ్ డెమీ' సైజులో వుంటాయి. [మన దేశంలో బ్లిట్జ్ కరెంటు, పత్రికల సైజులాగ] సాయంకాలం పత్రికలలో 'సన్' అనే పత్రిక సర్క్యులేషన్ చాలా విస్తారం. దీని మూడవ పేజీలో విధిగా ఒక నగ్న చిత్రం చాలా పెద్ద సైజులో వుంటుంది. 'స్టార్' అనే మరో పత్రిక కూడా లోపల పేజీల్లో (బహుశా

నాలుగో పేజీలో అని జ్ఞాపకం) "సన్" లాగే ఒక దిశమొల సుందరి బొమ్మ ప్రకటిస్తుంది. ఈ రెండు ప్రజారంజకమైన సాయంసమయ పత్రికలు కాలక్షేపం బఠాణీలవంటి వార్తలు కూడా వుంటాయి.

## —పత్రికల సరళి—

బ్రిటన్‌లో ఇతర ఈవెనింగ్ పత్రికలు కూడా వున్నాయి. డెయిలీ మెయిల్ పత్రిక, లిబరల్ పత్రిక "డెయిలీ మిర్రర్" లేబరు పత్రిక, "డెయిలీ ఎక్స్‌ప్రెస్" కన్సర్వేటివ్‌ల పత్రిక, పాఠకులు వారివారి పార్టీ అభిమానులు, అభిరుచులను పురస్కరించుకొని ఈ పత్రికలను కొనుక్కుంటూ వుంటారు. ఈ జాతీయ స్థాయి పత్రికలే కాక స్థానిక పత్రికలు కూడా చాలా వున్నాయి. నేను బర్మింగ్‌హాం శివార్లలో హాలీవుడ్ అనే గ్రామంలో వున్నాను. ఈ గ్రామం చుట్టుపక్కల వైతాల్, రెడ్డిచ్ అనే శివారు గ్రామాలు వున్నాయి. వైతాల్ అండ్ హాలీవుడ్ ఇండికేటర్ అనే పత్రిక ఒకటి వుంది. మన చరిత్రను కైఫీయతుల పేరిట రాయించిన కాలిన్ మెకంజీ పుట్టిన స్టోర్నొవే అనే రేవు పట్టణానికి వెళ్ళాను. అక్కడ "స్టోర్నొవే గెజిట్" అనే వార పత్రిక ఒకటి వుంది.

బ్రిటనులో జాతీయ స్థాయి పత్రికలుగాని స్థానిక పత్రికలుగానీ వ్యాపారస్తులు నడుపుతున్న పత్రికలే వ్యాపారం కోసం నడుస్తున్న పత్రికలే కొన్ని పత్రికలు కేవలం ఇక్కడి రాజ కుటుంబం గురించి స్కాండల్స్ కాపీలు ప్రకటిస్తూ "సెన్సేషన్" పుట్టిస్తూ వుంటాయి. వామ పక్షంమీద విరుచుకు పడుతూ వుంటాయి. ఈ మధ్య బ్రిటిష్ లేలాండ్

కార్ఖానాలో పదముగ్గురు శ్రామికుల్ని బర్తరఫ్ చేశారు. వాళ్ళు తప్పుడు అర్జిలతో అబద్ధాలు చెప్పి ఉద్యోగాలలో చేరారన్న ఆరోపణతో వాళ్ళని డిస్మిస్ చేశారు. ఆ పదముగ్గురూ ఆ పరిశ్రమ శ్రామిక సంఘాల్లో ప్రముఖ స్థానాలకు ఎన్నిక అవడమే వాళ్ళ ఉద్యోగాల ఉద్వాసన నకుదారి

తీసింది. ఈ "ఎర్రవాళ్ళ కుట్ర" గురించి మార్నింగ్ : త్రికలూ ఈవె
నింగ్ పత్రికలు కూడా వివరంగా రాశాయి. చాలా వర యజమానుల
పక్షపు వార్తలనే ప్రచురించాయి.

—వా మ ప క్ష ప త్రి క లు—

శాస్త్రీయ సామ్యవాదాన్నే మతంగా అభిమతంగా ..సుకొనే నాకు
సహజంగానే శ్రామికులు పత్రికలు ఈ విషయం గురించి ఏం రాశాయో
చదవాలన్న తహ తహ నిజం తెలుసుకోవాలనే ఆకాంక్ష పెరిగాయి.
బ్రిటన్‌లో శ్రామకుల పత్రిక డెయిలీ వర్కరు వుండేదని పూర్వం
తెలుసు. ఇప్పుడు డెయిలీ వర్కరు పత్రిక లేదు. శ్రామికుల పత్రికగా
"మార్నింగ్ స్టార్ అనే పత్రిక ఒకటే ప్రస్తుతం లభ్యమవుతూ వుంది.
ఈ పత్రిక తలకట్టు తోట "ఇన్‌కార్పరేటింగ్ ది డెయిలీ వర్కరు" అనే
చిన్న వివరణ కూడా రోజూ వుంటుంది. అంటే "డెయిలీ వర్కరు"
ఈ పత్రికలో విలీనమైందన్నమాట. ఇది కమ్యూనిస్టు పక్షం వహించే
పత్రికే కాని కమ్యూనిస్టుల యాజమాన్యంలో వున్న పత్రిక కాదు.

1950లో అంటే ముప్పయి మూడు సంవత్సరాల క్రిందట
బ్రిటన్‌లో కమ్యూనిస్టు పార్టి సభ్యత్వం ఏభై వేలు, ఇప్పుడు పార్టీ
సభ్యత్వ సంఖ్యను 15,891 అని టైమ్స్ పత్రికలో జాన్ వితెరో అనే
విలేకరి రాశాడు. (ఆగస్టు 24వ తేదీ సంచికలో పార్టిస్ ఎట్ వర్క్-
ఆన్ ది లెఫ్టవింగ్" అనే వ్యాసంలో జాన్ వితెరో వెల్లడించాడు)
మార్నింగ్ స్టార్ సర్క్యులేషన్ దైనికంగా ముప్పయివేలు. టైమ్స్‌వంటి
వ్యాపార పత్రికలు రోజూ ఇరవైనాలుగో లేక ఇరవైఆరు పుటల సంచి
కలను ప్రకటిస్తే మార్నింగు స్టార్ పత్రిక కేవలం ఆరు పుటల సంచికనే
సాధారణంగా ప్రచురిస్తుంది. (టైమ్స్ పత్రిక వెల ఇరవై పెన్నీలు,
మార్నింగు స్టారు వెల ఇరవై అయిదు పెన్నీలు) అయినా శాస్త్రీయ
సామ్యవాదాన్ని విశ్వశించేవారు. మార్నింగ్ స్టారు పత్రికను కొని చదువు
కొంటా..

కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ గ్రేట్ బ్రిటన్ (సి.పి.జి.బి.) కార్యనిర్వాహక వర్గానికి మార్నింగు స్టారు యాజమాన్యానికి ఇటీవల అభిప్రాయ భేదాలు వచ్చాయి. ఈ శ్రామిక పత్రికను "పీపుల్స్ ప్రెస్ ప్రింటింగు సొసైటీ (సి.పి.పి.యస్.) వారు ప్రచురిస్తున్నారు. కమ్యూనిస్టులేకాక కమ్యూనిస్టేతర సంస్థలూ వ్యక్తులూ ఈ సొసైటీలో షేరు హోల్డర్ గా వున్నారు. పీ పీ పి ఎస్. స్వయం ప్రతిపత్తిగల సంస్థకనుక దాని షేరు హోల్డర్లు పార్టీ విధానాలకు విరుద్ధమైన నిర్ణయాలను తీసుకొనవచ్చన సంగతి కమ్యూనిస్టు పార్టీకి తెలుసు మార్నింగు స్టారు పత్రిక యాజమాన్యానిక్ సి.పి.జి.బి. స్టాలినిస్టు కార్యవర్గం సభ్యులకూ పొసగడంలేదన్న సంగతి పెట్టుబడీదారీ పత్రికలో బయట పెట్టడమే కాక పార్టీ కూడా గుర్తించింది. సి.పి.జి.బి. 38వ కాంగ్రెస్‌లో చర్చించవలసిన తీర్మానాల ముసాయిదాను ఎగ్జిక్యూటివ్ కమిటీ తయారుచేసి చిట్టచివర "పీపుల్ ప్రెస్ ప్రింటింగు సొసైటీతో కమ్యూనిస్టు పార్టీ సంబంధం అనే శీర్షికతో నూటపదహారు పంక్తులు తీర్మానాన్ని ప్రకటించింది. పార్టీ కాంగ్రెస్ నవంబరు 12, 13, 14. 15 తేదీల్లో లండన్ షర్ హాంలేన్ హాలులో జరుగబోతున్నది.)

మార్నింగు స్టారు కాక కమ్యూనిస్టు పార్టీకి ఒక మాస పత్రిక వుంది, దాని పేరు "కమ్యూనిస్టుఫోకస్" ఇది కేవలం పార్టీకి పత్రిక పార్టీ వ్యవహారాల పత్రిక "మార్క్సిజం టు డే" అనే ఇంకొక మాస పత్రిక కూడా కమ్యూనిస్టు పార్టీ ప్రకటిస్తూంది. ఇది సైద్ధాంతిక చర్చా వేదిక అని పత్రిక పేరు క్రింద ప్రకటన వుంది. ఈ సంవత్సరం అగస్టు సంచికలో 48 పుటలు వున్నాయి. సంపాదక లేఖల్లో గాంధీ ప్రభావాన్ని సమర్థిస్తూ ఒక ఉత్తరం కూడా వుంది. గాంధీ సమకాలిక ప్రభావం కేవలం మధ్య తరగతికే పరిమితం కాదని లేఖ రచయిత "స్టైవెన్సన్" సివాపి బస్ పగారా రాశాడు. గాంధీ ప్రబోధించిన ధర్మకర్తృత్వవిధానం ఎప్పటికైనా అమలు జరుగుతుందని లేఖ రచయిత అన్నాడు. ఇటువంటి

ఉత్తరాలను కూడా "మార్క్సిజం టు డే" పత్రిక ప్రచురిస్తూంది కనుక ఇది పూర్తిగా సైద్ధాంతిక చర్చా వేదిక అని నిరూపించుకొంటున్నది. "మార్క్సిజం టు డే" ఒక్కటేకాక "వరల్డ్ మార్క్సిస్టు రివ్యూ" అనే మరొక పత్రిక శాంతి సోషలిజం సమస్యల పత్రిక ఒకటి వుంది. యాభై దేశాలలోని పార్టీల నుంచి ఈ పత్రిక సంపాదకవర్గాన్ని రూపొందించారు ఇది కమ్యూనిస్టుల శ్రామికుల సైద్ధాంతిక సమాచార పత్రిక.

మన దేశంలోలాగే బ్రిటన్‌లో కూడా కమ్యూనిస్టు ఉద్యమంలో చాలా చీలుదారులు వున్నాయి. "రివల్యూషనరీ కమ్యూనిస్టు పార్టీ" అనే ఒక గ్రూపు "ది నెక్స్టుస్టెప్" అనే పత్రికను ప్రచురిస్తుంది. "ప్రిపేరింగు ఫర్ పవర్" అనే కరపత్రంలో ఈ పార్టీ తన కార్యక్రమాన్ని వివరించింది. "లేబర్ బ్యూరోక్రసీ నుంచి శ్రామిక వర్గం అత్యంత తొందరగా విముక్తి పొందాలి. "ప్రస్తుత నాయకత్వానికి ప్రతికూలంగా శ్రామిక వర్గం ఏకం కాలేదు." "భావికాలపు పార్టీని నిర్మించడానికి ఇదే తరుణం" అనే నినాదాలను ఈ రివల్యూషనరీ కమ్యూనిస్టు పార్టీ ఎలుగెత్తి పలుకుతుంది.

బ్రిటన్‌లో స్టాలినిస్టు పంథాను అనుసరించే కమ్యూనిస్టులు వుంటే ట్రాట్స్కీ పంథాలను అనుసరించేవారు కూడా వున్నారు. ఒక గ్రూపువారు "సోషలిస్టు యాక్షన్" అనే పత్రికను ప్రచురిస్తున్నారు. లేలాండ్ ఫ్యాక్టరీ నుంచి ఉద్యోగాలు ఊడిన పదముగ్గురు కార్మికుల పక్షాన ఈ పత్రిక పోరాడుతున్నది.) ఒకానొక ఒకనాటి మన అభ్యుదయ కవి చెప్పినట్టు "పెట్టుబడికి కట్టుకథకు పుట్టిన విషపుత్రిక"లలాంటి ఫ్లీట్ స్ట్రీట్ పత్రికలపై పోరాటం సాగించాలని సోషలిస్టు యాక్షన్ పత్రిక ప్రబోధిస్తుంది

బ్రిటన్‌లో ఇంకా మరికొన్ని వామపక్ష పార్టీలూ పత్రికలూ వున్నాయి. మిలిటెంట్ అనే గ్రూపులో మూడువేల నుంచి ఆరువేల

దాకా అభిమానులు వున్నారు. వీరు మిలిటెంట్ అనే వారపత్రికను ప్రచురిస్తున్నారు. సర్క్యులేషన్ 35,000 నుంచి 40,000 దాకా వుందని వాళ్ళు అంటున్నారు. త్వరలోనే రెండేళ్ళలోపున్న దినపత్రికగా దీనిని మార్చాలను కొంటున్నారు. ఈ గ్రూపు లేబరు పార్టీతో 1950 నుంచి సహకరిస్తుంది. (ఒకప్పుడు కాంగ్రెస్ పార్టీలో కాంగ్రెస్ సోషలిస్టులుగా మన కమ్యూనిస్టులు పనిచేయడంఇది గుర్తుచేస్తుంది). ఈ మిలిటెంట్ గ్రూపువారు ప్రచారసాధనాలను జాతీయం చేయాలంటారు. దేశంలో వున్న రెండువందల గుత్తవ్యాపారాలనుకూడా జాతీయం చేయాలంటారు

"మిలిటెంట్" పార్టీవాళ్ళు లేబర్‌తో సహకరిస్తే "సోషలిస్టు వర్కర్స్ పార్టీ" వాళ్ళులేబరు పార్టీ అంటే చీదరించుకుంటారు. వీళ్ళ పార్టీలో నాలుగువేలమంది సభ్యులున్నారు. సగంమంది చాల చురుకుగా పనిచేస్తూవుంటారు. "సోషలిస్టు వర్కర్" అనే పత్రికను వీళ్ళు నడుపుతున్నారు. ఇది వారపత్రిక. ఒకప్పుడు దీనికి నలభై వేల సర్క్యులేషను వున్నా ఇది పదిహేను వేలకు తగ్గిపోయింది.

బ్రిటన్‌లో వున్న ఇంకొక తీవ్రమైన అతివాద పార్టీ ఒకటివుంది. దాని పేరు "వర్కర్స్ రివల్యూషనరీ పార్టీ" దీనిలో నాలుగు వందల మందే సభ్యులున్నారట. అయితే వెయ్యిమంది సభ్యులుండవచ్చునట. వీళ్ళ పత్రిక పేరు "న్యూస్‌లైన్" ఇది దైనిక పత్రిక. రోజూ అయిదు వేల కాపీలు అచ్చువేస్తున్నా సగం మాత్రమే అమ్ముడవుతాయని పరిశోధకులు చెప్తున్నారు.

"సోషలిస్టు ఆర్గనైజర్" అనే పత్రిక ఒకటి ట్రాట్స్కీ పథాను అనుసరించేది వుంది. ఈ గ్రూపు సభ్యత్వం ఏడు వందల ఏభైమందే "సోషలిస్టు యాక్షన్" పత్రికనుప్రచురించే సోషలిస్టులగు అనే గ్రూపులో 650 మందే సభ్యులున్నా చాలా చిత్తశుద్ధితో పార్టీ పనిని చేస్తారు.వేరు.

బర్మింగ్‌హాం కేంద్రి గ్రింథాలయానికి వెళ్ళి వస్తున్నప్పుడు ఈ గ్రూప్రి వారు నడిపే బర్మింగ్‌హామ్సులదయ బుక్‌షాప్ అనే గ్రంథ విక్రయశాలకు వెళ్ళివస్తూంటాను కమ్యూనిస్టుపార్టి వారికి వేరే పుస్తకాలషాపు వుంది. దానిపేరు "కీబుక్స్" అంటారు, నాకు కావలసిన పుస్తకాలు కొన్ని ఇక్కడ దొరికాయి

బ్రిటన్ లో కమ్యునిస్టు ఉద్యమం ఇన్ని చీలికలు కావడం ఇన్ని పత్రికలు ప్రచురించడం మన దేశంలోని పరిస్థితులను జ్ఞాపకం చేస్తూంది, "ప్రపంచ కార్మికులారా ఏకంకంకి" అన్న నినాదానికి ముందు "ప్రపంచ కమ్యూనిస్టులారా ఏకంకండి" అనే నినాదం ముఖ్యమనిపిస్తోంది. ఎందుచేతనంటే ఏ శాస్త్రీయ సామ్యావాద వర్గానికైనా ధ్యేయం ఆర్థిక విధానమైన వార్తను మార్చడమే సమసమాజ స్థాపనే కనుకనే.

# లంకలో దొరికిన రామాయణం

నేను లండన్‌లోని బ్రిటిష్ గ్రంథాలయంలో సమగ్ర ఆంధ్ర సాహిత్యం కుంపిణీ యుగంకోసం చాలా పరిశోధనలు చేశాను. గ్రేట్ రసెల్ స్ట్రీట్‌లో బ్రిటిష్ మ్యూజియం వుంది. ఆ భవనాలలో విశ్వ విఖ్యాతమైన గ్రంథాలయం ఒకటి వుండేది. అయితే చోటుచాలని కారణంగా ఈ గ్రంథాలయంలో ప్రాచ్య గ్రంథాలన్నింటిని గ్రేట్ రసెల్ స్ట్రీట్‌కి వెనుక అయిదారు వీధుల తర్వాత వున్న స్టోర్ స్ట్రీట్‌లోకి తరలించారు. అక్కడ ఓరియంటల్ రీడింగ్ రూం అనే పేరుతో ప్రాచ్య పఠన మందిరం వుంది. ప్రాచ్య భాషా సాహిత్యాలపై పరిశోధనలు చేసేవారు అక్కడే గంటల తరబడి, రోజులతరబడి కృషిచేస్తూ వుంటారు. నవంబరు 12వ తేదీనాడు ఆ పఠన మందిరంలో పరిశోధనలు చేయడానికి తాత్కాలిక అనుమతి పత్రాన్ని తీసుకొన్నాను. నవంబరు 13వ తేదీనుంచి అక్కడ పరిశోధనలు చేశాను.

## —: తెలుగు పుస్తకాలు :—

ప్రాచ్య పఠన మందిరంలో చాలా తెలుగు పుస్తకాలున్నాయి. బ్రిటిష్ మ్యూజియం గ్రంథాలయంలో "ముద్రితాంధ్ర గ్రంథాల" కేటలాగును 1912లో ఎల్. డి. బార్నెట్ దొరగారు ప్రచురించారు. ఇది తెలుగు పరిశోధకు లందరూ చూడవలసిన గ్రంథం. వీలయితే దీని ప్రతిని తమ గ్రంథాలయంలో వుంచుకోవలసిన గ్రంథం. నేను దీనిని కన్నెమరా గ్రంథాలయంలో యిరవై సంవత్సరాల క్రిందట నా సమగ్ర ఆంధ్ర సాహిత్య రచనా కాలంలో చాలా సార్లు సంప్రదించాను. తరువాత 1973 లో

ఎమ్మెస్కో-వారి అరుదు పుస్తకాల అమ్మకం విభాగంలో 125 రూపాయలు పెట్టి ఒక ప్రతిని కొనుక్కొన్నాను. ఇది బాండ్ పేపర్ సైజులో 443 పుటల పుస్తకం. 19వ శతాబ్దిలో అచ్చయిన చాలా అరుదు పుస్తకాల వివరాలు యిందులో వుంటాయి.

ఈ కేటలాగులోని పాత గ్రంథాలేకాక ఆధునికుల గ్రంథాలు కూడా ఈ ప్రాచ్య పఠన మందిరంలో వున్నాయి. అవి కార్డు ఇండెక్సులలో కనబడతాయి. వ్యవధి చాలక అన్నీ నేను పరిశీలించలేదు. 1930లలో తెలుగులో వెలువడిన సామ్యవాద సాహిత్యం గురించి మాత్రం కొన్ని గ్రంథాలను పరిశీలించాను. మహాప్రస్థానము రచనకు పూర్వమే ఉన్నవ లక్ష్మీనారాయణగారు ఆంధ్ర సామ్యవాద సాహిత్యానికి పునాదులు వేశారు. బ్రిటిష్ గ్రంథాలయ ప్రాచ్యపఠన మందిరంలో వున్న అధునికుల గ్రంథాలలో నా పుస్తకాలు కొన్ని వున్నాయి. ఈ సంగతి నాకు ఆచార్య జి. యన్. రెడ్డిగారు మునుపే చెప్పారు. సోమసుందర్ పుస్తకాలు కూడా కొన్ని వున్నాయి. ఈ విషయం నేను అతని దృష్టికి తెచ్చాను. నాతో బ్రిటన్‌కు తీసుకు వెళ్ళిన గ్రంథాలను నేను బ్రిటిషు గ్రంథాలయానికి బహూకరించాను. సోమసుందర్ చేత అదే చేయించాను.

నేను కుంఫిణీ యుగం ఆకరాలకోసం ఎక్కువ కాలాన్ని వినియోగించాలనుకొనడంవల్ల ప్రాచ్య పఠన మందిరంలోని వ్రాత ప్రతులపై దృష్టి కేంద్రీకరించాను, ఇవి ఎక్కువగా లేవు. ఒక పాతిక మాత్రమే వున్నాయి. వ్రాత ప్రతుల జాబితాను చదవగానే సంతోషం కలిగింది. ప్రాచీనుల రచనలే కాక ఆధునికుల స్వహస్త లిఖిత గ్రంథాలు కూడా వున్నాయి. (పుస్తకాల కాల్ నెంబర్లతో సహితం) వాటి వివరాలు చూడండి.

13819 పురివండా పులివంజా

13967 మహాప్రస్థానం

13987 సిరిసిరి మువ్వలు

13988 ప్రాసక్రీడలు

13989 లిమరుక్కులు

ఈ పుస్తకాలను తెప్పించి చూశాను. "సిరిసిరి మువ్వలు" అని అట్టమీద రాసున్న పుస్తకంలో లిమరుక్కులు వున్నాయి.

లిమరుక్కులని రాసున్న గ్రంథంలో సిరిసిరిమువ్వ పద్యాలు వున్నాయి. ఈ పొరపాటును నేను గ్రంథాలయం అధికారులకు తెలియజేశాను. "కరక్షన్ స్లిప్స్"ను రాసి యివ్వమన్నారు. వెంటనే రాసి యిచ్చాను. బైండింగులను మారుస్తామన్నారు.

పై పుస్తకాలు కాక, భమిడిపాటి అనంత నారాయణ రచించిన "తెలుగు సాహిత్యంలో కల్లోల దశాబ్దం 1965 - 1975" అనే గ్రంథం తాలూకు వ్రాతప్రతి కూడా బ్రిటిష్ గ్రంథాలయం ప్రాచ్య పఠన మందిరంలో వుంది. ఫుల్ స్కేపు సైజు రూళ్ళ పుస్తకంలో రచన (ఫొటోలతో సహా) కనబడుతుంది. ఈ పుస్తకం రచనా కాలం 8-6-1974 నుంచి 15-8-1976 అనే వివరణ కూడా గ్రంథంలో వుంది. ఈ పుస్తకం తాలూకు కాల్ నెంబర్‌ను క్రమక్కూడా తనకు తెలియపరచమని గ్రంథకర్త గూటాల కృష్ణమూర్తిగారికి రాశాడట. అస్వస్థతవల్ల ఆయన ఆపని చేయలేక పోయారు. నాదగ్గర కాల్ నెంబర్ వివరాలు వున్నాయి. కనుక గ్రంథకర్తకు తెలియజేయ మన్నారు.

(అనంతంగారూ! మీరు ఈ వ్యాసం చదువుతూవుంటే నోటు చేసుకోనండి. మీ పుస్తకం కాల్ నెంబర్ TELL-MSS-C R. 13748. మీ చిరునామా తెలియక పత్రికా ముఖాన తెలియచేస్తున్నా.)

—: విక్రమార్కుడి కథలు :—

కుతూహలంకొద్దీ ఈ ఆధునిక గ్రంథాలను నా టేబిల్‌వద్దకు తెప్పించుకొని చూశానుగానీ 19వ శతాబ్దములోని వ్రాత ప్రతులను ప్రత్యేకించి చూడదలచుకున్నాను. "ది స్టోరీ ఆఫ్ విక్రమార్కుడు" అనే గ్రంథం పేరు ఒకటి కనిపించింది. ఇది రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారి విక్రమార్కుడి కథల వ్రాతప్రతి అయివుంటుంది. పుస్తకాన్ని తెప్పించాను గురుమూర్తి శాస్త్రిలవారి దస్తూరి, సంతకాన్నీ, రచనా కాలాన్ని తెలుసుకో వచ్చునని పొంగిపోయాను. 19వ శతాబ్దంలో తెలుగు వచన రచనకు ప్రారంభకులు రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారే (1770 - 1837) ఈయన ఫోర్టుసెయింట్ జార్జి కళాశాలలో ఆంధ్ర ప్రధానోపాధ్యాయుడు. విక్రమార్కుడి కథలు 1819 లో మొదటిసారి అచ్చుపడింది. 1828, 1850, 1858 సంవత్సరాలలో యింకో మూడు ముద్రణలు పొందింది. వావిళ్ళవారు దీనిని చాలాసార్లు తర్వాత ముద్రించారు. అచ్చుపడిన పుస్తకమే అయినా వ్రాత ప్రతిని చూస్తే కలిగే ఆనందం వేరు.

—: తీరా తెరచి చూస్తే :—

తీరా పుస్తకాన్ని తెరచి చూస్తే లోపల విక్రమార్కుడి కథ లేదు. అట్టమీద మాత్రం విక్రమార్కుడి కథ అనే వుంది. లోపల రంగనాథ రామాయణం వుంది. (ఈ పుస్తకాన్ని 1819 ఆగస్టునెల ఏడో తేదీనాడు విలియం. బి. పాలిగ్జెర్ అనే దొర బ్రిటిష్ గ్రంథాలయానికి బహూకరించాడు). అట్టమీద ఒకపేరూ. అట్టలమధ్య గ్రంథం మరొకపేరూ అని తెలుసుకున్న వెంటనే యింకొక కరక్షన్ స్లిప్ చేసి భారతీయ భాషలకు సంబంధించిన ఉద్యోగి శ్రీమతి సిపాలిపేతోష్‌కు యిచ్చాను. ఆమె "విక్రమార్కుడి కథ" అనుకొన్నది రంగనాథ రామాయణమైతే, రంగ

నాథ రామాయణమని పేరున్న పుస్తకం విక్రమార్కుడి కథ అవుతుందేమో, దయచేసి రంగనాథ రామాయణం చూసిపెట్టండి ” అని చెప్పింది.

బ్రిటిష్ గ్రంథాలయం ప్రాచ్యపఠన మందిరంలో ఇంకొక రెండు రంగనాథ రామాయణ ప్రతులున్నాయి. OR5397 నెంబరుగల ప్రతిని తెప్పించి చూశాను. ఇది బాల, అయోధ్య కాండలున్న గ్రంథం. దీనిని 1890 జూన్ నెల పదిహేనో తేదీనాడు జి. ఇ. హే. అనే దొరగారి దగ్గర గ్రంథాలయంవారు కొన్నారు. అయితే ఈ వ్రాతప్రతి లేఖన కాలం మాత్రం బాల కాండ 1844 సంవత్సరం మార్చి నెల 10వ తేదీ వరకూ; అయోధ్యకాండ అదే సంవత్సరం మే నెల 25వ తేదివరకూ అని గ్రంథం లోపల వున్న వివరణ బట్టి తెలుస్తూంది. ఈ పుస్తకాన్ని అచ్చు వేయించదలచుకున్నారో, ఏమో ముఖపత్రం యిలా వుంది.

రంగనాథ విరచితంబైన ద్విపద రూపముగా రాయబడిన :

బాలకాండలో ప్రధానమైన

కథలను గురించిన

దశరథ యాగమున్ను

రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల జననం

విశ్వామిత్ర యాగరక్షణమున్ను

తాటకి మర్దనమున్ను

విశ్వామిత్రుని యాగమున్ను, సీతాకళ్యాణము

పరశురాముని భంగము

అయోధ్యా ప్రవేశమున్ను

మొదటిదైన కథలో ప్రథమకాండయం దిమడ్చబడినది 1844 సంవత్సరం నవంబరు నెల 10వ తేదీ యందు సమాప్తము.

ఈ గ్రంథములో విషయసూచిక చాలా వివరంగా వుంది. లేఖకుని పేరు ఎక్కడా కనపడలేదు. విషయసూచికలో కథల పేర్లు, అవి ఏ పుటల్లో వుండేది వివరించారు.

—: తాళపత్ర గ్రంథం :—

పై రంగనాథ రామాయణ భాగము కాక OR 8841 నెంబరు గల మరొక రంగనాథ రామాయణముకూడా ఆ గ్రంథాలయంలో వుంది. ఇది తాళపత్ర గ్రంధం. ఆకులు అరచేయి అంత వెడల్పు, మూరెడు పొడుగూ వున్నాయి. గ్రంథాన్ని పరిశీలించాను. సమగ్రంగా వుంది. ఈ తాళపత్ర గ్రంథానికి చాలా చరిత్ర వుంది. 1883 సం॥ఆగస్టు నెలలో హార్సీ అనే దొర గారు ఒక యాదస్తు వ్రాసి అందులో ఈ గ్రథం చరిత్రను పొందుపరిచారు. ఈ యాదస్తును మడిచి ఒక కవరులో పెట్టి గ్రంథాన్ని కట్టిన గుడ్డ మూటలోనే భద్రపరిచారు. ఇదే లంకలో దొరికిన రామాయణం. హార్సీ దొరగారి యాదస్తు ఇంగ్లీషులో వుంది. దాని అనువాదాన్ని చూడండి :

("తెలుగు భాషలో వున్న రామాయణ ప్రతి అని విశ్వసిస్తున్న) ఈ వ్రాతప్రతి ముత్తుస్వామి సొత్తు. సింహాళంలో వున్న కాండీ దేశానికి రాజుననే బిరుదును ధరించవని ఈయనను ఇంగ్లీషువారు ఆశపెట్టారు. ఇతనిని రాజుగా ప్రకటించి బ్రిటిష్ సేనాధిపతి మేజర్ డేవీ ఆధిపత్యాన బ్రిటిష్ సైన్యాల రక్షణతో ఈయనను తన రాజధానికి తీసుకు వెళ్ళారు.

ఇంతగా ఈయనను గుర్తించితే యితగాడు నీచంగా తన ప్రత్యర్థికి లొంగి పోయాడు. ఆ ప్రత్యర్థి ఇతగాడిని తక్షణం సంహరించాడు.

"బ్రిటిష్‌వారి సైన్య సహాయంతో కాంౘీకి వెడుతున్నప్పుడు ముత్తు స్వామి తనతో తీసుకు వెళ్ళిన కొన్ని వస్తువులలో ఈ గ్రంథం ఒకటి. కాండియన్లలో ఒకడైన యితని సైనాతీ ఎవరో ఈ గ్రథాన్ని అపహరించి ముప్పయి సంవత్సరాలు దాచిపెట్టాడు. తన విరోధిని చంపి కాండియన్ రాజు రాజ్య మేలిన పన్నెండు సంవత్సరాలలో ఈ గుట్టు బయట పడితే రాజాస్తిలో కొంత దాచిపెట్టిన నేరానికి ఈ గ్రంథం స్వాధీన కర్తకు చావు మూడుతుంది. బ్రిటిషు వారు రాజ్యాన్ని చేపట్టినతరువాత గ్రంథ స్వాధీన కర్త నిజం వెల్లడించడానికి భయపడ్డాడు, ఏమంటే ముత్తుస్వామిని, ఆయ నకు మద్దతుగా వచ్చిన బ్రిటిషు సైన్యాలనూ ఊచకోత కోస్తున్నప్పుడు అక్కడే వున్న కొద్దిమందిలో తానొకడ్ని అని చెప్పుకోలేక.

"ఈ గ్రంథం అస్తిత్వం గురించి నాకు ఆకస్మికంగా తెలిసింది. ఇది సింహళ భాషలో వున్న గ్రంథమనుకొని గ్రంథ స్వాధీన కర్తవద్దకు నమ్మకస్తుడైన ఒక మనిషిని పంపాను. గ్రంథాన్ని దాచిపెట్టవలసిన అవసరం లేదని నచ్చచెప్పమన్నాను. గ్రంథాన్ని అమ్మదలచుకొంటే కొంటానన్నాను. విక్రయానికి ఇష్టపడకపోతే కనీసం చూడనివ్వమన్నాను. ఆ స్వాధీన కర్త సంతోషంగా అంగీకరించాడు. స్టాంపు పేపర్లమీద గ్రంథ విక్రయాన్ని మా యిద్దరి పేర్లతో లిఖించితే కొంటానని చెప్పాడు. తీరా కొన్నాక నాకుగాని, అతనికిగాని తెలియని భాషలోవున్న గ్రంథాన్ని నేను స్వాధీనం చేసుకున్నట్టు తెలుసుకున్నాను."

ఈ గ్రంథ చరిత్రనంతా తన యాదస్తులో పొందుపరుస్తూ ఆ తాళ పత్ర ప్రతిని బ్రిటిషు గ్రంథాలయానికి హార్బీదొర యిచ్చేశాడు. లంకలో

దొరికిన ఈ రంగనాథ రామాయణం చాలా ప్రశ్నలకు ఆస్కారం మవుతూంది. ఎవరీ ముత్తుస్వామి? అతడు తెలుగువాడా? కాకపోతే తెలుగు రంగనాథ రామాయణం అతనిదగ్గర ఎందుకుంది. దీనిని అతడు పారాయణ చేస్తున్నాడా? లేకపోతే తనతోపాటు తీసుకువెళ్ళిన కొద్ది వస్తు సామాగ్రిలో దీనినికూడా ఎందుకుంచాడు? ఇతని కాలం ఏమిటి?

ఈ ప్రశ్నలలో ఆఖరి ప్రశ్నకు సమాధానం దొరుకుతుంది. సింహళాన్ని 1505లో పోర్చుగీసువాళ్ళు చూశారు. 1517లో కోట కట్టుకొన్నారు. రాజ్యాన్ని స్వాధీన పర్చుకొన్నారు. 140 సంవత్సరాలు పాలించారు. వారి తరువాత డచ్చివారు ఇంకో 140 సంవత్సరాలు పాలించారు. డచ్చివారిని ఓడించి, ఇంగ్లీషువారు 1796 లో రాజ్యాన్ని ఆక్రమించారు. అప్పుడు కాండీలో స్థానిక రాజు ఒకడు వుండేవాడు. 1802 లో చేసుకొన్న సంధి ప్రకారం సింహళం బ్రిటిషువారి పరమైంది. 1803 లో కాండీపై ఇంగ్లీషు వారు దురాక్రమణ చేసి స్వాధీన పర్చుకొన్నారు. యుద్ధ విరమణకు కాండీ రాజు ఇంగ్లీషువారిని ఒప్పించాక, ఆయుధ విసర్జన చేశాక కుంపిణీ సైన్యాలను ఊచకోత కోశారు.



హార్బీ దొరగారి యాదస్తులో ఈ ఊచకోత ప్రసక్తి ఉంది, అంటే ముత్తుస్వామిని అతని విరోధి సంహరించడం 1803 లో జరిగి వుంటుంది. 1815 దాకా ఆ విరోధి పాలించాడు. హార్బీ చెప్పిన పన్నెండు సంవత్సరాల కాలం దీనికి సరిపోతుంది.



ముత్తుస్వామి కాల నిర్ణయం జరిగినా, అతని చరిత్ర ఏమిటో భావి పరిశోధనవల్లగాని తేలదు. ఎవరైనా పరిశోధకులు ఈ బాధ్యతను స్వీకరిస్తే నేను నా ఇతర సాహిత్య వ్యాసంగం చేసుకోగలను. ఇప్పటికి మనకి తెలిసినదల్లా లంకలో ఒక రామాయణం దొరికిందనే.